వాగ్గేయకార రత్న

# శ్రీముత్తుస్వామి దీక్షితులు



పరిశోధకుడు

## నిరాఘాటం శ్రీరామకృష్ణశాస్త్రి

శ్రీ గురుభ్యో నమః

"వాగ్గేయకారరత్న"

# శ్రీ ముత్తుస్వామి
# దీక్షిత కృతి మణిదీపిక

(సవ్యాఖ్యానము)



దీక్షిత కృతి మణిదీపిక
దీక్షతో పఠియింపగలుగు ధీవర్యులకున్
అక్షయ సౌఖ్యము గురుగుహ
వీక్షణమున రక్షణమ్ము వేవిధములుగా.

పరిశోధకుడు :

సంగీత సాహిత్యశాస్త్ర విశారద, వాయులీన విద్యాభూషణ

**నిరాఘాటం శ్రీ రామకృష్ణశాస్త్రి,**

రేపల్లె.

శ్రీముఖ కార్తీక పూర్ణిమ.

ప్రతులు : 1000



తిరుమల - తిరుపతి దేవస్థానం ధర్మప్రచారక సంఘము
వారి ద్రవ్య సహాయమున ముద్రించబడినది.

వెల 125/-

ప్రాప్తిస్థానము :
ఎస్. ఎ. ఆర్. శాస్త్రి,
పనోరమ ట్రావెల్స్, 30-15-111 ఎ,
మల్లెలమాన్షన్స్, డాబాగార్డెన్స్,
మెయిన్‌రోడ్, విశాఖపట్నం-530 020.

ముద్రణ :
వాణీ ఆర్ట్ ప్రింటర్స్,
మాజేటి నాగేశ్వరరావు వీధి,
షరాఫ్‌బజారు,
తెనాలి - 522 201.

శ్రీదేవీ గానకళా తేజస్వి

1762  1827

## శ్రీ శ్యామశాస్త్రి

శ్లో॥ కమలాపుర జాతాయ । గానశాస్త్ర కళావిదే ।
వీణావాదనలోలాయ । నమః శ్రీ శ్యామశాస్త్రిణే ॥

(2) కామాక్షీ ప్రియపుత్రాయ । శ్యామాంగాయ మహాత్మనే ।
విశ్వనాథ తనూజాయ । నమః శ్రీ ... ... ॥

(3) సంగీతస్వామి శిష్యాయ । స్వరరాగ సుధాబ్ధయే ।
మాతృభాషాభిమానాయ । నమః శ్రీ .... .... ॥

(4) తంజాపుర నివాసాయ । నిత్య తృప్తాయధీమతే ।
చక్రరాజ మనస్కాయ । నమః శ్రీ .... .... ॥

(5) ఆనందభైరవీ రాగ । రసానంద స్వరూపిణే ।
శ్రీ దేవ్యాకృతిస్తోత్రాయ । నమః శ్రీ .... .... ॥

(6) దేవీగానాఽమృతానంద । మత్త చిత్తాత్మరూపిణే ।
స్వర్ణ దేవీ సమర్చాయ । నమః శ్రీ .... .... ॥

(7) పరదేవీ కృపాప్రాప్త । నిత్యానంద రసాత్మనే ।
పరమార్థాను చింతాయ । నమః శ్రీ శ్యామశాస్త్రిణే ॥

(8) శ్రీభైరవీ గుణ రాగ । రచనాకృతిశాలినే ।
ధ్యానయోగవరిష్ఠాయ । నమః శ్రీ .... .... ॥

(9) బ్రహ్మానంద స్వరూపాయ । పరాశక్తి రతాయచ ।
ఆత్మానందానుభూతాయ । నమః శ్రీ .... .... ॥

(10) కామాక్షీపాదమంజీర । నిక్వాణక్వణమోదినే ।
ఆనందరస పూర్ణాయ । నమః శ్రీ .... .... ॥

(11) శ్యామకృష్ణేతి ముద్రేణ । శ్యామలా గుణవర్ణినే ।
రామ కృష్ణాంతరంగాయ । నమః శ్రీ శ్యామశాస్త్రిణే ॥

## రామ నామ గాన తపస్వి

1767  1847

# శ్రీ త్యాగరాజు

(1) కావేరీ తీరవాసాయ । కారుణ్యామృత వర్షిణే ।
రామబ్రహ్మ తనూజాయ । త్యాగరాజాయ తే నమః ॥

(2) రామకృష్ణ యతిశ్రేష్ఠ । శిష్యాయ గుణ మూర్తయే ।
రామచంద్ర సుభక్తాయ । త్యాగరాజాయ తే నమః ॥

(3) కమలాపురవాస శ్రీ । త్యాగరాజ కృపాత్మనే ।
వేదశాస్త్ర ప్రవీణాయ । త్యాగరాజాయ తే నమః

(4) నాదామృతరసానంద । భక్తి చిత్తాయ యోగినే ।
రామరత్న ప్రకాశాయ । త్యాగరాజాయ తే నమః ॥

(5) ఇహ భోగ విరక్తాయ । రామార్చనరతాయచ ।
తిరువాడీ నివాసాయ । త్యాగరాజాయ తే నమః ॥

(6) పంచనదపురీవాస । పరమేశపదార్చనే ।
చిత్తాయ గురుభక్తాయ । త్యాగరాజాయ తే నమః ॥

(7) షణ్ణవతి మహాకోటి । రామమంత్ర జపాత్మనే ।
రామ సేవాంతరంగాయ । త్యాగరాజాయ తే నమః ॥

(8) రామాఽస్థాన కవీశాయ । రామరాజ్య ప్రభావినే ।
ఆనందరసపూర్ణాయ । త్యాగరాజాయ తే నమః ॥

(9) వాల్మీకి శుక ప్రహ్లాద । నారదాంశజ సద్గురోః ।
రామపాదాబ్జ భృంగాయ । త్యాగరాజాయ తే నమః ॥

(10) స్వరార్ణవ సముద్భూత । స్వరరత్న ప్రకాశినే ।
సంగీతశాస్త్ర బోధాయ । త్యాగరాజాయ తే నమః ॥

(11) సర్వసంగపరిత్యాగ । సన్యాసాశ్రమధారిణే ।
అద్వైతాఽమృత తత్త్వాయ । త్యాగరాజాయ తే నమః ॥

శ్రీ గురుగుహ మనస్వి

1775  1835

## శ్రీ ముత్తుస్వామి దీక్షితులు

(1) కమలాపురవాసాయ । వేదశాస్త్ర కళాత్మనే ।
రామస్వామి తనూజాయ । నమః శ్రీ ముత్తుస్వామినే ॥

(2) శ్రీ చిదంబరనాథస్య । శిష్యాయాఽమిత తేజసే ।
గుహానుగ్రహపాత్రాయ । నమః శ్రీ .... .... ॥

(3) పాదుకాంత సుదీక్షాయ । పరాతత్త్వ ప్రబోధినే ।
సుబ్బమాంబా కుమారాయ । నమః శ్రీ .... .... ॥

(4) శ్రీ మహాగణనాథస్య । మూలతత్త్వ ప్రకాశినే ।
ఓంకారనాద బోధాయ । నమః శ్రీ .... .... ॥

(5) శ్రీచక్రరాజ సక్తాయ । కమలామాతురర్చనే ।
సిద్ధాయ, పరిపూర్ణాయ । నమః శ్రీ .... .... ॥

(6) వాగ్దేవీ కృపయాప్రాప్త । దివ్యవీణాధరాయచ ।
వాగ్గేయకార రత్నాయ । నమః శ్రీ .... .... ॥

(7) సుబ్రహ్మణ్యషడక్షరీ । మహామంత్ర రతాత్మనే ।
కావేరీతీరవాసాయ । నమః శ్రీ ముత్తుస్వామినే ॥

(8) నవగ్రహ కృపాపూర్ణ । కృతికారాయ ధీమతే ।
మంత్రోపాసన నిష్ఠాయ । నమః శ్రీ .... .... ॥

(9) షడంగ యోగరాజాయ । అద్వైతాఽమృతవర్షిణే ॥
సామ గాన ప్రపూర్ణాయ । నమః శ్రీ .... .... ॥

(10) అంతఃకరణ శుద్ధాయ । శిష్యహృత్తాపహారిణే ।
సర్వశాస్త్ర ప్రబోధాయ । నమః శ్రీ .... .... ॥

(11) సోమస్కంద సుభక్తాయ । సచ్చిదానందమూర్తయే ।
చిత్కళా చిత్త సద్మాయ । నమః శ్రీ ముత్తుస్వామినే ॥

రామకృష్ణ కృతం స్తోత్రం । యే పఠన్తి ముదా సదా ।
తేప్రాప్నువన్తి ధర్మం చ । యోగం సౌఖ్యం యశోధ్రువమ్ ॥

ఇతి శమ్

# కృతికర్త మాతాపితరులు

***************



నిరాఘాటం సత్యనారాయణశాస్త్రి

**1902 1972**



కాశీఅన్నపూర్ణమ్మ

**1907 1989**

అన్నపూర్ణమ్మ సత్యనారాయణాఖ్య
నలరు పూజ్యులు తల్లిదండ్రులకు పుత్ర
శిష్య ధర్మాన కృతి సరసీరుహామును
అంకితము జేతు జన్మ ధన్యమ్ముగాగ.

# కృతికర్త



విభవ వత్సర, అధిక శ్రావణ బహుళ నవమి గురువారం
దిః **9-8-1928** కృత్తికానక్షత్ర తృతీయ చరణమున జననము.

సంగీత సాహిత్యశాస్త్ర విశారద, వాయులీన విద్యాభూషణ

## నిరాఘాటం శ్రీ రామకృష్ణశాస్త్రి, డిప్లొమ.

ప్రిన్సిపాల్ :

**శ్రీ సత్యవాణి సంగీత విద్యానిలయం**

రేపల్లె.

# తొలిపలుకు

శ్లో॥ నిరాఘాటాన్వయే జాతం । గాన విద్యా కళానిధిమ్ ।
సత్యనారాయణాభిఖ్యం । వందేఽహం పితరం గురుమ్ ॥

శ్లో॥ అనంత గంభీర సిద్ధోస్సమానం । అనేకజన్మార్జిత పుణ్యలబ్ధమ్ ॥
సాహిత్య సంగీత కళాస్వరూపం ।
ఉపాసనీయం పురుషార్థదం, శమ్ ॥

ఎందరో మహానుభావులు. అందరు వందనీయులు. లోకములో ఎందరెందరో మహానుభావులు సాహిత్య సంగీత కళా శారదాదేవిని సేవించి, సత్సంప్రదాయములను నెలకొల్పి, కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి కాలగర్భమున కలసిపోయిరి. వారిలో లబ్ధప్రతిష్ఠులు కొందరు. చరిత్ర ప్రసిద్ధులు కొందరు. తెరమరుగున పడినవారెందరో! కాని పరిశోధనల వలన, పరిశీలనలవలన, పురాతన చారిత్రిక సంస్కృతి, సంప్రదాయములు బయలు పడుచుండును.

ఈనాడు పరిశోధనలవలన ఎన్నో పురావస్తు, నిక్షేప, చరిత్రలు శతాబ్దాల నాటివి వెలుగులోనికి వచ్చుచున్నవి. ఐదు శతాబ్దముల నాటి అన్నమయ్య రచనలు నాలుగు దశాబ్దముల క్రిందట వెలుగులోనికి వచ్చుట గమనించుచున్నాము. అటులనే నేను పరిశోధన చేసిన "శ్రీ ముత్తుస్వామి దీక్షిత కృతిరచనా దక్షత" కృతి మణిదీపిక గ్రంథమునుగూర్చి చరిత్ర మరుగునపడిన కొందరు ప్రముఖ విద్వాంసుల పరిచయ సంప్రదాయములను తెలియజేయుట ధర్మము.

గురు, శిష్య, వంశ, పరంపరానుగతముగ, అనుశ్రుతముగ, లభ్యమైన విద్యలు లోక ప్రసిద్ధిని గాంచుట సహజము. 18, 19 వ శతాబ్దములలో జన్మించిన విద్వాంసులెందరో! ఈ నా తొలిపలుకున నాకు తెలిసిన, నేనెరిగిన కొందరు విద్వాంసులను, కొన్ని గ్రంథము

లను, మా పెద్దల పలుకులను ఆధారము చేసికొని వ్రాయుచుంటిని. ఇందు స్వ విషయముతో, గురు పరంపరను తెలియజేయక తప్పదు. విజ్ఞులు మన్నింతురుగాత.

ఈ విషయమున నాకు లభించిన కొన్ని గ్రంథములు. 1900 లలో సుబ్బరామ దీక్షితులు ముద్రించిన "సంగీత సంప్రదాయ ప్రదర్శిని", 1953 న శతావధాని, ఆంధ్ర జయదేవ అని పేరుగాంచిన చెల్లా పిచ్చయ్య శాస్త్రిగారు. రచించి ముద్రించిన శ్రీ వారణాసి రామసుబ్బయ్యగారి జీవితచరిత్రను, 1947 న తెనాలిలో సీతారామ గాన సభను ప్రారంభించి, తమిళ, ఆంధ్ర విద్వాంసుల నెందరనో ఆహ్వానించి గౌరవించిన, శ్రీ నారుమంచి సుబ్బారావుగారు ముద్రించిన తెలుగు విద్వాంసులు అను గ్రంథముల సహాయమున వ్రాయు చుంటిని.

18, 19 వ శతాబ్దముల విద్వాంసులు. శ్యామశాస్త్రి 1762-1827, త్యాగయ్య 1767-1847, ముత్తుస్వామి దీక్షితులు 1775-1835, నారుమంచి జానకిరామయ్య 1823, నిరాఘాటం శేషయ్య 1835-1935, నిరాఘాటం కృష్ణయ్య (తోడి కృష్ణయ్య) 1845-1890, నందిగామ వెంకన్న 1852-1996, గరికపర్తి కోటయ్యదేవర 1853-1927, సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రి 1860 - 1917, పాపట్ల లక్ష్మీకాంతయ్య 1877-1921, నారుమంచి సీతారామయ్య 1877-1943, పురాణం కనకయ్య 1879 - 1943, రాజనాల వేంకటప్పయ్య 1860, పర్వతనేని వీరయ్యచౌదరి 1881-1971, వారణాసి రామసుబ్బయ్య 1882-1911, నిరాఘాటం రామకోటయ్య 1882-1964, పారుపల్లి రామకృష్ణయ్యపంతులు 1883-1951, చావలి వేంకటసుబ్బయ్య 1881-1945, హరి నాగభూషణం 1884 1959, పిరాట్ల శంకరశాస్త్రి 1884-1957, బలిజేపల్లి సీతారామయ్య 1885, తాడిగడప శేషయ్య 1895-1950, చల్లా పిచ్చయ్యశాస్త్రి 1880, నిరాఘాటం సత్యనారాయణ

శాస్త్రి 1902-1972. ఇటువంటి వారెందరో తెలుగు సీమకు వన్నె దెచ్చిన విద్వన్మణులు. శిష్యపరం పరాభివృద్ధి యొనర్చినవారు. గురుతుల్యులు.

గురుపరంపర : త్యాగయ్యగారి శిష్యులు వీణె కుప్పయ్యర్. వారి శిష్యులు పట్నం సుబ్రహ్మణ్యయ్య, వారి శిష్యులు రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారు (పూచి శ్రీనివాసయ్యగారు), వారి శిష్యులు వారణాసి రామసుబ్బయ్యగారు, వారి శిష్యులు మా పెదతండ్రి గారైన నిరాఘాటం రామకోటయ్య, తాడిగడప శేషయ్యగార్లు. నిరాఘాటం శేషయ్య, తోడి కృష్ణయ్యగార్లు మాకు తాతగార్లు. నిరాఘాటం శేషయ్యగారి కుమారులు వేంకటప్పయ్య, రామకోటయ్య ఆంజనేయశాస్త్రి, సత్యనారాయణశాస్త్రి. మాపితృ సోదరులు.

మా తల్లిదండ్రులు అన్నపూర్ణమ్మ, సత్యనారాయణశాస్త్రి. గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకా, పేటేరు గ్రామ నివాసము. మా తండ్రి, మా మాతామహులైన చావలి వేంకట సుబ్బయ్యగారి వద్ద సంగీత స్మార్తములు నేర్చిరి. మా తాతగారు (మాతామహులు) ద్రాక్షారామమున ఈమని అచ్యుతం గారివద్ద సంగీతము నభ్యసించిరి. మా నిరాఘాటం వంశము గత నాలుగు తరముల నుండి సంగీత, సాహిత్యముల ప్రసిద్ధి గన్నది. ది. 9-8-1928 న విభవ, అధిక శ్రావణ బహుళ నవమి గురువారం కృత్తికానక్షత్రమున నేను జన్మించితిని. మా తల్లిదండ్రులు నా పది సంవత్సరములలోపలనే, పురాణోక్త, వేదోక్త సంగీత, సాహిత్య, జ్యోతిషాది విద్యలనెన్నో నేర్పి, నన్ను తీర్చిదిద్దిన గురుదేవులు. మా తండ్రి వాయులీనమున, గాత్రమున మంచి మనోధర్మము కలిగి, ప్రక్క-వాద్యము వాయించుటలో కీర్తిగడించి, అనేకులకు ఉచితముగ భోజనముపెట్టి, విద్యనేర్పిన సద్గురువులు, సదాచార పరాయణులు.

1940 నుండి నన్ను తమ వెంట గొనిపోయి, అనేక కార్యక్రమ ములందున, పలువురు పెద్దలతో పరిచయమొనర్చిరి. 1943 న మహాలక్ష్మితో వివాహమొనర్చిరి. నేను మా తాతగారివద్దను, ముళ్లపూడి నారాయణశాస్త్రి, చిట్టి పురుషోత్తమయాజి శర్మగార్లవద్ద సంస్కృతము నభ్యసించితిని. 40 సంవత్సరములు అనేక పురాణములు ప్రవచన మొనర్చితిని. మా తండ్రివలన సంగీత, సాహిత్య, మంత్ర, జ్యోతిష, స్మార్తాదివిద్యలును, మా తల్లివలన పురాణ, ధర్మ, న్యాయ శాస్త్రాదుల పరిచయభాగ్యము కలిగినది. 1958న ఆంధ్ర యూనివర్శిటీ డిప్లొమ,జంత్ర గాత్రముల నుత్తమశ్రేణిలో నుత్తీర్ణుడనై రాజమండ్రిలో టి.టి.సి. ని, మెట్రికుృలేషన్ పూర్తిచేసితిని. 1955 నుండి ఆకాశవాణి విజయవాడలో వైలెన్ సోలోను, పురాణ ప్రవచనాది కార్యక్రమముల పాల్గొనుచుంటిని. 1960 నుండి శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహస్వామి వారి దేవస్థాన విద్వాంసునిగా నిర్ణయించి గౌరవించుచుండిరి. 1975 నుండి, 1985 వరకు రేపల్లె అయోవా గరల్సు హైస్కూలులో సంగీతోపాధ్యాయునిగా ఉద్యోగ మొనర్చితిని. 1958 లో శ్రీ సత్యవాణీ సంగీత విద్యా నిలయమును స్థాపించి, శతాధికులకు సంగీతమును నేర్పుచుంటిని. 50 సంవత్సరములు ఆసేతు హిమాచలము అనేక గాన కచేరీలు, హరికథలు, భరతనాట్య, నాటక రంగములలో వాయులీన సహకారమును, 1955 నుంచి, భక్త శబరి, జయదేవ, జగద్గురు శంకరాచార్య, త్యాగరాజాది భక్తుల చరిత్రలు హరికథా గానములు సలుపుచుంటిని. పైన ఉదహరించిన 55 సంవత్సరముల నా అనుభవమే శ్రీ దీక్షితుల రచనలను పరిశోధన చేయుటకు తోడ్పడినది.

<u>పరిశోధనావకాశములు</u> : శ్రీ వారణాసి రామసుబ్బయ్యగారు బొంబాయి నుంచి తెచ్చిన శార్ఙ్గదేవ విరచిత "సంగీత రత్నాకరము" నాకు లభించుట, మరియు మా పెదతండ్రి రామకోటయ్యగారు, 1921 నుండి మద్రాసులో మ్యూజిక్ ఎకాడమీ సభ్యులుగా నుండి,

చతుర్దండి ప్రకాశిక, సంగీతసుధ, సంగీత సారామృతాది అనేక గ్రంథములు నాకొసంగుట మరియొక అదృష్టము. సద్గురుసేవ, సద్గ్రంథ పఠనము, సదాచారము, సన్మిత్ర సంబంధము, సచ్చింతన అనేకానేక శాస్త్రముల, పెద్దల పరిచయ విశేషమే నన్నీ బృహత్తర గ్రంథ రచనకు దోహద మొనర్చినవి.

సంగీత త్రిమూర్తులనేక శాస్త్రముల సిద్ధ పురుషులు. అందున దీక్షితులు, సంస్కృత, సంగీత, సాహిత్య, మంత్ర, తంత్ర, యోగ, జ్యోతిష, వేదాంత, సంప్రదాయోపాసనలయందు సుప్రసిద్ధులు. అందుకే వీరి రచన నారికేళపాకము. దీక్షితులు, వారి తండ్రి తెనుగు భాషా, కవిత్వ రచనాలక్ష్య లక్షణములు తెలిసినవారు గావుననే యతి, ప్రాస, అనుప్రాస, అంత్యప్రాస, వృత్యనుప్రాసాలంకారాదులతో రచించగలిగిరి. తండ్రి తెనుగున "వేంకటకృష్ణ" ముద్రతో రచించిన వాగ్గేయకారులు. కావున పై శాస్త్రములలో కొంతైనా పరిచయము, పరిశ్రమ కలిగినవారలే గుర్తించగలరు. నా చిన్ననాడే దీక్షితుల రచనలు నన్నాకర్షించినవి. తెనుగు కృతులే తప్పులుగా వినపడుచున్న ఈరోజులలో సంస్కృత రచనల విషయమును గురించి చెప్పవలసినదేమున్నది ?

150 సంవత్సరములు గడచినను, తెనుగున దీక్షితుల రచనలు పూర్తిగ ఎవ్వరును పరిశోధన ప్రచురణ సలిపియుండలేదు. ఆ భాగ్యము నాకు లభించుటకు, దీక్షితులకు, నాకును ఏదియో తెలియని అనుబంధము కలిగియుండును. "కారణం వినాన కార్యసోత్పత్తిః". శ్యామశాస్త్రి గురువు సంగీతస్వామి. త్యాగయ్యగారి గురువు రామకృష్ణానందయతి. ఎవరో ? ఎక్కడివారో? చరిత్ర తెలియదు. ఇక దీక్షితుల గురువు శ్రీ చిదంబరనాథ యోగిని గురించి పరిశీలనల వలన తేలిన విషయము.

మా అమ్మగారి జనకులు చావలి వేంకటసుబ్బయ్యగారు. వారి తండ్రి శివయ్య. వారి తండ్రి బ్రహ్మీభూత చిదంబరనాథేశ్వరులు.

వారు యోగ, మంత్ర, సంస్కృతముల సిద్ధులు, తూము నరసింహ దాసుగారి స్నేహితులు. వారిని గురించి మా మాతామహుల తల్లి వెంకమ్మగారు. అనగా చిదంబరనాథుల కోడలు. మా తాతమ్మగారు నా చిన్ననాడు చెప్పిన మాటలు. ఆమె మామగారు మూడు పర్యాయములు రామేశ్వరంనుండి, కాశీవరకు కాలినడకన సంచారము చేసినట్లు, త్యాగయ్యగారిని చూచి మాట్లాడినట్లు వారు చెప్పేవారు. చివరకు వారు కాశీలో సిద్ధినందినట్లు పలికిన మాటలు గుర్తుచేసు కొనుచూ, ఒకనాడు నేను నిత్యతర్పణము చేయుచుండగా, మాతా మహం, మాతుఃపితామహం, మాతుఃప్రపితామహం కౌండిన్యస గోత్రం, వేంకటసుబ్బేశ్వర, శివేశ్వర, బ్రహ్మీభూత చిదంబర నాథేశ్వరం, వసు, రుద్రాదిత్యరూపం అని తర్పణచేయు సమయమున యోచించగా, దీక్షితుల గురువులు వీరే అయియుండురేమోనని వారి వయస్సును, కాలమును పరిశీలించగా తేలినది. మరియొక విశేషము దీక్షితులకు తండ్రియే గురువు. నాకు తండ్రియే గురువు. అదియును గాక ఇరువురము కృత్తికానక్షత్ర జాతకులమగుట యొక అనుబంధము.

ఈ గ్రంథమున దీక్షితుల రచనలు 475 కృతులకు, అందలి భావార్థములను గుర్తించి అర్థము తెలుసుకొని గానము చేయగలందు లకై, కృతికి తగిన విధముగ వ్యాఖ్యానములను మూలతత్త్వములను, సంప్రదాయశాస్త్ర విషయములతో రచించితిని. 175 రాగముల మూర్ఛనలను, 175 కృతులకు సంప్రదాయప్రదర్శినినుండి స్వరసహిత ముగా, ఏర్చి కూర్చి ముద్రించితిని. ఈ నా తొలిపలుకులను సహృదయతతో పఠించి, గంథమందలి విషయములను గ్రహించి, సంగీత సంప్రదాయములను గుర్తించి, గురుగుహానుగ్రహమును గాంచి తరించ గలరని మదినెంచి, ఈ కృతిని మా మాతాపితరుల కంకితమిడి నా జన్మ ధన్యతగావించు కొంటిని.

సుజనవిధేయుడు

నిరాఘాటం శ్రీరామకృష్ణశాస్త్రి

'Mahamahopadhyaya'
*Dr. Nookala Chinna Satyanarayana,*
Principal : S.V. Music College,
TIRUPATI. Date : 11-10-'93

Sangeetha Vidwan Sri Niraghatam Sri ramakrishna Sastry Garu is a violinist of a high order. His father and forefathers are great musicians. It is a great "Paramapara' Vidwan Sri Ramakrishna Sastry gari's son, a business magnate, is a musician, and his daughter Kum. Chiranjeevi 'Sravanthi' is a promising dancer with remarkable talent.

Sri Ramakrishna Sastry garu is not only a musician, composer and a violinist, but a great scholar in Samskritam and in Telugu also. Above all he is a 'Parama Nishtika' and 'Karmishti' and a Srividya Upasaka. He is a pious man to the core. As a man he is very modest with so much of humility.

He has written a great book Captioned as "**Deekshita Krithi Rachana Dakshata**". It is a unique and unpresidented book.

Sri Ramakrishna Sastry garu has commented and explained in detail and in depth the inner meanings and aspects of Musical, literal, mystic, yogic, ashtrology, Monoism. The 6 different inter religious disciplines and Ganapathya, Shaiva, Aaishnava, Soura, Shakteya and Kowmara, in Deekshitan's compositions.

Sri Sastry garu has given an authentic notations as for 175 Krithis of Deekshitar in this book as a separate chapter named as 'Krithi Manideepika'.

This book of Sastry garu is a research oriented, monumental book. It will be a reference book for all musi-

cians, music lovers, and especially for research scholars for their Ph. D. degrees.

Sri Sastry garu is the pride of our nation and 'Andhra Jathi'.

Any amount of commendations and congratulations are not enough for the monumental work that Sastry garu has bestowed on our Indian community.

He will remain in the Dhruva star in the skies of music. His name goes in the history of music.

I pray the Lord Sri Venkateswara Swamy and Sri Padmavathi Amba to bless him and his family members, with every thing such as health, wealth, prosperity, long lives and happiness.

I deem it a proud privilege to write these few words of appreciation for Sri Sastry garu and his work, being an intimate friend and wel-wisher of Sri Sastry garu and his members of his family.

**Nookala Chinna Satyanarayana.**



# ఆమోదము

బ్రహ్మశ్రీ నిరాఘాటం శ్రీరామకృష్ణశాస్త్రి గారితో నాకు వయొలిన్ విద్వాంసులుగా పరిచయమున్నది. వారికి సంస్కృత భాషతో, ఆధ్యాత్మిక విషయములతోను పరిచయ, పరిశ్రమలున్నాయి. ఈ రెండింటిని వీరిప్పుడు సార్థకపరచుకొన్నారు. లోగడ శ్రీ త్యాగరాజ స్వామి కృతులకు అర్థవివరణాదులు. కీ॥ శే॥ కల్లూరి వీరభద్రశాస్త్రులు గారు మొదలగువారు వ్రాసియున్నారు. సంగీత త్రిమూర్తులలో, ఒకవిధముగా, ప్రముఖస్థానం వహించిన ముత్తుస్వామి దీక్షితులవారి కృతులకు సమగ్ర వివరణము ఇంతవరకు నాకు తెలిసినమేరకు ఎవరును చెయ్యలేదు.

ప్రస్తుతం శ్రీరామకృష్ణశాస్త్రిగారు మహోత్కృష్టమైన పని చేసినారు 475 దీక్షితులవారి కృతులకు అర్థ, భావ, విశేషాంశములు చక్కగా వివరించినారు. అంతేగాక 175 కృతులను సుబ్బరామ దీక్షితుల సంప్రదాయ ప్రదర్శినిని అనుసరించి స్వరలిపిని అధునాతన పద్ధతితో సమకూర్చినారు. భావార్థములు తెలియగోరువారికి, ఇటు కృతి పాఠము చేయగోరువారికిని, ఉభయతారకమగు పనిని చేసినారు. ఇది సర్వజనోపయోగమయిన సంగీతసేవ అని నేను స్థాలీపులాక న్యాయముగా లేఖద్వారా తెలిపితిని.

సంగీత విద్వాంసులు, తత్త్వజిజ్ఞాసువులును, శ్రీశాస్త్రిగారు చేసిన ఈ దీక్షిత కృతి నీరాజనమును, ఆమూలాగ్రముగా చదివి, వారి ప్రయత్నమును సార్థకపరచి అందలి తత్త్వమును గ్రహించి దీక్షితులవారి ఇష్టదైవమగు, గురుగుహానుగ్రహమునకు పాత్రము లగుదురని ఆశాసించుచున్నాను.

ఇట్లు

"గానకళాప్రపూర్ణ" సంగీత సాహిత్య కళానిధి,

**నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులు**

15 - 8 - '90 విజయవాడ.

# కృతజ్ఞత

శ్రీ దీక్షితుల రచనలు పరిశోధన చేయుటకు ప్రోత్సహించిన, విశాఖ మ్యూజిక్ ఎకాడమీ వారికి, దీక్షిత కృతిమణిమాల D.K.M నాగరలిపిలోని 15 వాల్యములను చూచుటకొసగి సహకరించిన మద్రాస్ మ్యూజిక్ ఎకాడమీ లైబ్రరీవారికి, ఆర్థిక సహాయ మొసర్చిన తిరుమల - తిరుపతి దేవస్థానంవారికి, అభిమానముతో విరాళ మొసగిన, బంధు, మిత్ర, అభిమాన వర్గమునకు, అమూల్య మైన అభిప్రాయ మొసగిన, శ్రీ నూకల చిన సత్యనారాయణగారికి, ఈ నా గ్రంథమును చూచి, ఆమోదమును తెలియజేసిన, శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యుల వారికి, ఈ గ్రంథ రచనకు తగిన సలహాలను, సహకార మందించిన, సహృదయ మిత్రులకు నా కృతజ్ఞతలు ఈ వ్రాతప్రతిని, సూక్ష్మదృష్టితో పరిశీలించి, సరిచూచిన మా తమ్ముడు చి॥ నిరాఘాటం శ్రీమన్నారాయణమూర్తికి, సకాల ములో ఓర్పు, నేర్పుతో సర్వాంగసుందరముగా ముద్రించి అందించిన వాణీ ఆర్టు ప్రింటర్సు, తెనాలి. వారికి, శ్రీ గణేశ గురుగుహ దేవతాను గ్రహమున సమస్త శుభములు కలుగుగాత!

ఇట్లు

కృతికర్త

# మానవ లక్షణము

శ్లో॥ ద్వి విధాః మానవాస్సంతి
మధులిణ్మక్షికా వివ
మధులిట్ సుగుణాన్ గ్రాహ్యాః
దుర్గుణాన్ మక్షి కాదయః॥

# విషయసూచిక

# కృతుల పట్టిక

## కృతికర్తదంపతులు



### అశీఃపూర్వక నవరత్నమణిమాల

నీటుగ జంత్ర గాత్రముల నేర్పరియై బహుశాస్త్ర విద్యలన్
సాటి బుధాళి మెచ్చ, నయసంపద, శ్రీమహాలక్ష్మిగూడి బల్
మేటియనంగ, బంధుజనమేలును గోరెడి దంపతుల్ నిరా
ఘాటము రామకృష్ణులను గాచుత! శ్రీపతి, శ్రీగిరీశులున్ ॥

శ్రీరామకృష్ణశాస్త్రిని
కారుణ్యాకరులు, భక్తకల్పతరువులౌ
"గౌరీశంకరు"లోముత
శ్రీరంజిల నిష్టకామ్య సిద్ధిఫలింపన్

శ్రోతలు సెహబాసను, సం
గీతము, సాహిత్యములలో, కీర్తింపగజాల్
గాతల మదిరంజిల, ధీ
చాతురి "కృతి" "రామకృష్ణశాస్త్రి" రచించెన్

"దీక్షిత కృతి మణిదీపిక"
వీక్షించి, లిఖించి, చదివి, వినుచు ప్రజలకున్
అక్షయ సిరిసంపదలిడి
రక్షించుత శ్రీవిభుండు, రంజితమతియై

ధీరుడు మాతామహునిలో
జేరిన సద్విద్యలెల్ల జేకొనుధిషణుం
డా "రామకృష్ణశాస్త్రి"ని
కూరిమి భవుడోముగాత, కోర్కెలుదీరన్

తండ్రి గురువునోట తనయుండు సంగీత
శాస్త్ర మర్మమెరిగి సభలలోన
వాయులీనవాద్య వైశిష్ట్యుడై దిశల
కీర్తిగాంచె "రామకృష్ణశాస్త్రి"

విమల వాయులీన విద్యావిభూషణుం
డనగ దివ్యయశమునందు "రామ
కృష్ణశాస్త్రి" నమిత కృపజూచి శ్రీవిభుం
డోముగాత, సౌఖ్యమొసగి సతము

పరమ భాగవతులు పాహి శంకరయంచు
కథలు చెప్పుతరిని, కనుచెమర్చ
భక్తిసుధను గ్రోలు పగిది, "శ్రీరామకృ
ష్ణాఖ్యశాస్త్రి" తన్మయత్వమొందు

పెద్దలైనవారి, ప్రీతి గన్గొనుభక్తి
భావమొప్పదనరు, పండితుడగు
రామకృష్ణశాస్త్రి లలితకళలెరింగి
తనర నోముగాత దైవమెపుడు.

"సహజకవి"
పోతూరి రాధాకృష్ణమూర్తి
సజ్జాపురిపాలెం.

ఈ గ్రంథముద్రణకు ఉత్సాహముతో చేయూతనొసగి సహకరించిన బంధుమిత్ర కళాభిమాన వర్గము.

| | | |
|---|---|---|
| 1. శ్రీ నిరాఘాటం అచ్యుతరామశాస్త్రి | | |
| „ వరలక్ష్మి | విశాఖపట్నం | రు. 5000/- |
| 2. శ్రీ మల్లెల విశ్వేశ్వరరావు | | |
| „ సీతామహాలక్ష్మమ్మ | „ | రు. 1116/- |
| 3. మల్లెల వీరరాఘవశర్మ, ఉమ | „ | రు. 1116/- |
| 4. చావలి గణపతిశాస్త్రిగారి భార్య | | |
| „ లక్ష్మీకామేశ్వరమ్మ | పేటేరు | రు. 1116/- |
| 5. పాలపర్తి వేంకటేశ్వర్లుగారి భార్య | | |
| „ సుశీలమ్మ | „ | రు. 1000/- |
| 6. మునగాల బాపారావుగారి భార్య | | |
| „ సీతారామమ్మ | రేపల్లె | రు. 1116/- |
| 7. ద్రోణావఝుల పూర్ణచంద్రబాబు | | |
| „ లక్ష్మీజ్ఞానప్రసూనాంబ | „ | రు. 1116/- |
| 8. కొట్టు వేంకటేశ్వరరావు | | |
| „ విజయ | విశాఖపట్నం | రు. 1116/- |
| 9. నిరాఘాటం పాండురంగస్వామి | | |
| „ భ్రమరాంబ | బాపట్ల | రు. 1116/- |
| 10. కోట వేంకటేశ్వర్లు, దవనం | తెనాలి | రు. 1116/- |
| 11. జొన్నలగడ్డ రత్తయ్య | | |
| „ సత్యవతి | విజయవాడ | రు. 1116/- |
| 12. మొదలి వేంకటేశ్వర్లు | | |
| „ కళ్యాణిసావిత్రి | నెల్లూరు | రు. 1116/- |

13. కంతేటి సుబ్బరాయశర్మ
,, శేషుకుమారి రేపల్లె రు. 1116/-

14. రూపాకుల మురళీమోహన్
,, వరలక్ష్మి విశాఖపట్నం రు. 1116/-

15. నిరాఘాటం హనుమచ్ఛాస్త్రి
,, శ్యామల రేపల్లె రు. 1116/-

16. నిరాఘాటం రామకోటిప్రసాద్
,, రామలలిత విశాఖపట్నం రు. 1116/-

17. శ్రీ యాదవేని అశ్వత్థనారాయణశర్మ కర్నూలు రు. 516/-

18. యెండూరి పిచ్చయ్యగారు రేపల్లె రు. 516/-

19. మద్ది శ్రీరాములుగారు ,, రు. 500/-

20. యెండూరి సుబ్బారావుగారు ,, రు. 516/-

21. ఆకుల పూర్ణచంద్రరావు
S/o సత్యనారాయణ ,, రు. 500/-

22. ఆకుల వేంకటేశ్వరరావు ,, రు. 516/-

23. శ్రీ సీతారామ మందిర నిర్వహణ
కమిటీవారు తెనాలి రు. 501/-

24. నూతిరాజ గోపాలకృష్ణమూర్తి
,, సుశీల ధూళిపూడి రు. 516/-

25. నందిపాటి శ్రీరామ మోహనరావు
,, అంజనాసరస్వతీ విజయవాడ రు. 501/-

26. నందిపాటి నారాయణరావు
,, కుసుమకుమారి ,, రు. 501/-

27. డాక్టర్ వ్యాకరణం వేంకటరావు
,, వి.యస్. లక్ష్మిరావు తెనాలి రు. 558/-

28. బొలిశెట్టి రాధాకృష్ణమూర్తి రేపల్లె రు. 301/-

ఓమ్

"వాగ్గేయకారకరత్న"

# శ్రీ ముత్తుస్వామి దీక్షితులు చారిత్రిక నేపథ్యము

క్రీస్తుశకం 1530 నుండి 1572 వరకు తంజావూరును పాలించిన 'చెవ్వప్పనాయకుడు' మొదటి నాయక మహారాజు. ఆయన కుమారుడు అచ్యుతప్పనాయకుడు, 1577 నుండి 1614 వరకు చోళ మండలమును పాలించెను. అతని ఆస్థానమున మంత్రిగా నుండి, గాయత్రీ మంత్రోపాసనచే సావిత్రీ దేవ్యనుగ్రహపాత్రులైనవారు గోవింద దీక్షితులు.

వీరు కర్ణాటక స్మార్త బ్రాహ్మణులు. ఆశ్వలాయన సూత్రీకులు. వాసిష్ఠస గోత్రజులు (విజయ నగరమును పాలించిన నాయకవంశస్థుల వలన రాచరికమును పొందిన తెలుగు నాయక రాజులు దక్షిణాపథమును పాలించిన కాలము)

అచ్యుతప్ప నాయకుడు మంత్రి గోవిందదీక్షితులు, ఇరువురును శస్త్రమందును, శాస్త్రమందును, యుద్ధమందును, యాగమందు సమర్థులై యుండిరి. ఆనాడు ఉత్తమ శ్రోత్రియులకు, కావేరీ తీరమున గల పుణ్య క్షేత్రములలో, అనేక దానధర్మములు, కావింపబడినవి. మాన్యములు, అగ్రహారములు నీయబడినవి. పంచనదక్షేత్రము మొదలు మాయూరము వరకును, వృద్ధాచలము మొదలు రామేశ్వరము వరకును గల దివ్య దేవాలయ పునరుద్ధరణము జరిగినది. అనేక కళలును పోషించబడినవి.

శ్రీ గోవింద దీక్షితుల భార్య "నాగమాంబ" వీరికి ఇరువురు కుమారులు, జ్యేష్ఠుడు యజ్ఞనారాయణ దీక్షితులు, కనిష్ఠుడు 'వేంకటమఖి'

అచ్యుతప్పనాయకుని అనంతరము ఆయన కుమారుడు 'రఘునాథనాయకుడు. 1614 లో పట్టాభిషిక్తుడయ్యెను.

గోవింద క్షితులు సంగీత శాస్త్రకోవిదులు. రఘునాథాంకితముగా ''సంగీత సుధా నిధి'' యను లక్షణ గ్రంథమును రచించిరి. ఆ నాడు చోళమండలమును పాలించిన మహారాజులు ఆంధ్రులయిన కారణమున, ఆంధ్రభాషను అచటివారెల్లరు నభ్యసించిరి. గోవింద దీక్షితులు సంస్కృతాంధ్ర పండితులు. ''ఆంధ్రత్వమాంధ్రభాషాచనాల్పస్యతపసఃఫలమ్'' అను నానుడి జగద్విదితమైనది.

గోవింద దీక్షితుల జ్యేష్ఠ కుమారుడు యజ్ఞనారాయణ దీక్షితులు ''సాహిత్యరత్నాకరము, రఘునాథ భూపతి విజయము, రఘునాథ విలాసము''అను నాటకములను రచించెను. గోవింద దీక్షితులు మంత్రియై, మహారాజుచే కుంభకోణమున షోడశలింగములను, అనేక దేవాలయాలను పునరుద్ధరింపజేసిరి.

(2) వేంకట మఖి

గోవింద దీక్షితుల ద్వితీయ పుత్రుడు ''వేంకట మఖి'' వీరి అసలు పేరు ''వేంకటేశ్వర దీక్షితులు'' అన్నగారైన యజ్ఞనారాయణ దీక్షితుల శిష్యుడు వేంకట మఖి, ఔత్తరాహుడు, వాగ్గేయ కారుడైన ''తానప్పాచార్యుల''వద్ద తండ్రియాజ్ఞచే సంగీత శాస్త్ర లక్ష్య. లక్షణములను నేర్చిరి. తమ గురువునుగూర్చి, ఆరభిరాగమున '' గంధర్వ జనతాఖర్వ దుర్వార గర్వభంజనురే '' అని ఒక గీతమునందు పేర్కొనిరి.

అప్పయ్య దీక్షితుల సోదరుడైన ''అచ్చా దీక్షితుని'' మనుమడగు ''నీలకంఠ దీక్షితులు'' ఈ వేంకటమఖి శిష్యుడు.

వేంకటమఖి, రఘునాధ నాయకుని కుమారుడైన 'విజయరాఘవ' భూపాలుని ప్రేరణచే ''చతుర్దండి ప్రకాశిక'' యను లక్షణ గ్రంధమును రచించిరి. ఆ గ్రంధ మందు వీణ, శ్రుతి, స్వర, మేళ, రాగ, ఆలాపన, ఠాయ, గీత, ప్రబంధ, తాళము లను పది ప్రకరణములు గలవు.

ఈ వేంకటమఖియే రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగములకు శ్లోకరూపముగా లక్షణములను, గీతములను, శుద్ధ, వికృతి, భేదములను, 72 మేళకర్తల విభాగమును, కటపయాది, సూత్రానుసారముగా నామము

లను కల్పించి, 1660 నాటికి కర్ణాటక సంగీతముయొక్క లక్షణమును ఒక క్రమపద్ధతికి తీసికొని వచ్చిరి. కర్ణాటక సంగీతమున "వేంకటమఖి" సంప్రదాయమనురీతి ఏర్పడినది. వీరు చేసిన సంగీత సేవ అపూర్వము. 72 మేళకర్తల మూర్ఛనలకాధారముగా శ్లోకములు, లక్షణ గీతములు రచించిన లాక్షణికుడు.

## (3) రామస్వామి దీక్షితులు

శ్రీ రామస్వామి దీక్షితులు, వేంకటమఖి సంప్రదాయమునకు చెందినవారు. క్రీ. శ. 1735న జన్మించిరి. ద్రావిడ బ్రాహ్మణులు అపస్తంబ సూత్రులు, శ్రౌతరాహులు, కాశ్యపస గోత్రజులు. తండ్రి వేంకటేశ్వర దీక్షితులు. తల్లి భాగీరథమ్మ.

రామస్వామి దీక్షితుల ఏడవ సంవత్సరమున కాంచీ మండలము, గుఱ్ఱపు దాడి వారికలహములతో నుండుటచే, ఆ ప్రాంతమును వదలి తల్లిదండ్రులతో మధ్యార్జున సమీపముననున్న 'గోవింద పురము'ను చేరిరి. అచట క్రమాంతస్వాధ్యాయ మొనర్చిరి.

గోవింద పురముననున్న కాలమున, రామస్వామి దీక్షితుల తల్లిదండ్రులు ఇరువురును ఆరుమాసముల వ్యవధిలో గతించిరి. తరువాత వీరు సంస్కృతాంధ్రములను బాగుగ నేర్చిరి. సహజ గాత్ర ధర్మము కలిగినందున రామస్వామి దీక్షితులు, తంజపురి ప్రభువుల మన్ననలందిన తెనుగు బ్రాహ్మణుడు, విద్వాంసుడైన "వీరభద్రయ్య"గారి వద్ద రెండు సంవత్సరములు సంగీతము నభ్యసించిరి. వీరభద్రయ్యగారు సంస్కృతాంధ్రముల బహుముఖ ప్రజ్ఞాశాలి, సంగీత లక్ష్యలక్షణవేత్త, వాగ్గేయకారుడు. అట్టి సద్గురువువద్ద రామస్వామి దీక్షితులు రక్తిరాగములు, దేశీయ రాగముల యందు కీర్తనలు, రాగాలాపన, స్వర కల్పన, పల్లవిజ్ఞానము వరకు నభ్యసించిరి. అటుపైన "మాయూరవము"నకు వచ్చి ఇంకనూ విద్యాభివృద్ధిని గురించి యోచించుచుండగా, ఎవరో ఒక ముదుసలి వచ్చి "మధ్యార్జునమునకేగుము" నీ కోర్కె నెరవేరునని పలుకగా, అటనుండి మధ్యార్జునము చేరిరి.

మధ్యార్జునమున, నిత్యాగ్నిహోత్రి, వేంకటమఖి మేనమామకు మనుమడునైన శ్రీ వేంకట వైద్యనాథ దీక్షితులను సందర్శించి. వారివద్ద నొక్క సంవత్సరం వీణెనభ్యసించుచు, చతుర్దండి ప్రకాశికలోని రాగాంగ ఉపాంగాది లక్షణములను గ్రహించి గురువనుగ్రహమునంది, మరల తంజావూరు జేరి, రాజసభలో గౌరవ సన్మానములనంది, మరల "మాయూరం" చేరిరి.

ఒకనాడు "తిరువారూరులోని" శ్రీ త్యాగరాజేశ్వర స్వామి బ్రహ్మోత్సవములు జరుగుట విని, దర్శించ కుతూహలురై, తిరువారూరుచేరి శ్రీ కమలాంబా, త్యాగరాజేశ్వరుల సేవించిరి. ఆ సమయమున దర్శనార్థమై విచ్చేసిన, "అమరసింహ" మహారాజుపై రాగమాలికను రచించి, గానమొనర్చి వారిచే సన్మానములనందిరి. రామస్వామి దీక్షితులు, అచట కొంతకాలము నివసించిరి. తిరువారూరులోనుండగా శ్రీ త్యాగరాజేశ్వరుడు ఒకనాటి రాత్రి స్వప్నమున దర్శన మొసగి, ఉత్సవ సమయములలో, ఏ యే వేళల ఏ యే రాగములనాలపించవలెనో, నిర్ణయింపుమని పలుకగా రామస్వామి దీక్షితులు అచటి నాదస్వర విద్వాంసులకు, త్యాగరాజస్వామి ఆనతి ప్రకారం, ఆయా రాగములను ఏర్పాటు చేసిరి. నాటి నుండి నేటికిని, "తిరువారూరు" నందు, స్వామి సేవలు జరుగుసమయముల, ఆయా రాగములనే నాదస్వర విద్వాంసులు వాయించుట ఆచారముగనున్నది.

రామస్వామి దీక్షితుల భార్య 'సుబ్బమ్మ' వీరికి 40 సంవత్సరముల వరకు సంతానము కలుగలేదు. వీరు ధర్మపత్నితో 'శ్రీ వైద్యనాథస్వామి' కోవెలకేగి, అచటనున్న 'ముద్దుకుమారస్వామి'ని, బాలాంబికను కొంత కాలము సేవించిరి. ఆస్వామి యనుగ్రహమున 'సుబ్బమ్మ' గర్భమును ధరించినది. మరల వారు తిరువారూరు చేరిరి.

క్రీ॥ శ॥ 1775 మన్మధనామ సంవత్సరమున ఈ పుణ్య దంపతులకు ఒక కుమారుడు కలిగెను. ఆ శిశువునకు "ముద్దుస్వామి" యని పేరిడిరి. మరల కొంత కాలమునకు మరియొక కుమారుడు కలిగెను. ఆ బాలునకు "చిన్నస్వామి"యని పేరిడిరి. అటుపైన మరియొక కుమారుడు కలిగెను. అతనికి 'బాలస్వామి'యనియు, ఒక ఆడపిల్ల కలుగగా ఆమెకు 'బాలాంబ' యని పేరు పెట్టిరి. జ్యేష్ఠుడైన ముద్దుస్వామి పేరు క్రమముగా "ముత్తుస్వామి"గా మారెను. ఈయనయే ఘన ప్రధాన వాగ్గేయకారుడు.

ముత్తుస్వామి దీక్షితులు తిరువారూరులోనే క్రమాంత స్వాధ్యాయ మొనర్చిరి. కావ్యనాటకాలంకారములు, కౌముది చదువుచూ తండ్రివద్ద సంగీతమునభ్యసించిరి. చిన్నస్వామి, బాలస్వామియు చదువుచుండిరి.

ఒకనాడు తిరువారూరు శ్రీత్యాగరాజస్వామి సందర్శనార్థము విచ్చేసిన ముద్దుకృష్ణ మొదలియార్ అను ప్రభువు రామస్వామిదీక్షితుల యోగ్యతను గుర్తించి సన్మానించి సకుటుంబముగా తమగ్రామమైన 'మణలి'కి గొనిపోయిరి. మొదలియార్ కొన్ని సంవత్సరములు ఆ కుటుంబమును పోషించిరి. తరువాత 'ముద్దుకృష్ణ మొదలియార్' కుమారుడు 'వేంకట కృష్ణుడు' అను 'చిన్నయామొదలియార్' రామస్వామిదీక్షితులు రచించిన 108 రాగతాళమాలికనువిని కనకాభిషేకమొనర్చిరి.

ఆ సమయముననే మొదలియార్ వేంకటమఖి మనుమడగు గోవింద దీక్షితులను కూడా నాదరించిరి. అప్పుడు రామస్వామి దీక్షితులు వారిని చతుర్దండిప్రకాశిక గ్రంధమును చూపుమనగా, గోవింద దీక్షితులు మేము చెప్పిన మూర్ఛన ఏ రాగమో చెప్పిన చూపెదమనిరి. గోవింద దీక్షితులు యిచ్చిన మూర్ఛనను తీసుకొని, రామస్వామి దీక్షితులు 'మొదలియార్' రచించినట్లుగా తాను రచించి, 'నన్ను పరీక్షింపనేలా' అను పదమును, అందు చివరి స్వరమున మూర్ఛనను ఇమిడ్చి తన కుమారులు ''చిన్నస్వామి, బాలస్వామి'' చేత పాడించిరి. గోవింద దీక్షితులువిని, మేమిచ్చిన రాగమేయని మీరును వేంకటమఖి శిష్యులేయని పొగడిరి.

కొన్నిరోజులకు చిన్నస్వామికి కనులు కనుపడకుండ పోయినవి. అప్పుడు రామస్వామి దీక్షితులు తిరుపతిచేరి శ్రీ వేంకటేశ్వరుని ''మనసా వేరితరులదలచక'' యని 48 రాగములలో మాలికను ఇంకా దయరాకున్న అను కృతిని ''వేగవాహిని'' రాగమున రచించి, 45 రోజులు శ్రీ వేంకట రమణుని సేవించగా, చిన్నస్వామికి కనులు వచ్చినవి. వేంకటేశ్వరనామములలో ''నేత్రహీనాక్షిదాయినే నమః'' అను నామము కలదు. రామస్వామిదీక్షితులు శ్రీ చిదంబరనాధస్వామి వలన శ్రీవిద్య నుపదేశమందిరి.

రామస్వామి దీక్షితులు నిత్యము ''గీత గోవింద'' కావ్యమందలి అష్టపదులను గానము చేయుచుండెడువారు. వీరు మీనాక్షీదేవిపై 44 రాగ

ముల మాలికను రీతిగౌళ, హిందోళ, మనోహరి, పూర్ణచంద్రిక రాగములలో చౌకవర్ణములను శంకరాభరణమున, తానవర్ణమును, అనేక కీర్తనములు "వేంకటకృష్ణ" యను ముద్రతో తెనుగున రచించిన వాగ్గేయకారుడు. వీరి రచనలు పరిశోధనాత్మకముగా నుండును. హంసధ్వని రాగమును కల్పించి, ఆ రాగములో ప్రబంధమును రచించి ప్రసిద్ధినందిరి. వీరి రచనా వైశిష్ట్యమును భాషా సౌలభ్యమును తెనుగునగల పాండిత్యమును తెలియ జేయుటకై ఉదాహరణముగా తోడిరాగమందలి సాహిత్యమును స్వరాక్షర ముగా చౌకవర్ణమును గమనించగలరు.

ప॥ సరిగానిదానిపామరిని నీపదసమాగమ మాగనీ గనీనిసా॥

అ॥ గరిమ మదారి పదారి సదారి గమపద నీదాని గాని దానిపసగని॥

చ॥ మరిమరిగని సాగనిపని దగదని మానిగాని గానిమ్మని గాదా॥
మరీనీపధమమనిగామరీనిగా। మణలి వేంకటకృష్ణ కృష్ణేంద్రదనాతో॥

అచ్చ తెనుగున రాగమాలికలు, పదవర్ణములు, అనేక కృతులు అపురూప రాగములు రచించిన లక్ష్యలక్షణవేత్త శ్రీ రామస్వామి దీక్షితులు. ఇట్టి మహాప్రతిభా సంపన్నులైన వాగ్గేయకారుల కుమారులే ముత్తుస్వామి దీక్షితులు.

తండ్రి గొప్ప గాయకుడై, వాగ్గేయకారులైనచో, వారి వంశమున నుద్భవించిన కుమారులు, శిష్యులు విద్వాంసులు, వాగ్గేయకారులు అగు టలో నాశ్చర్యమేమి?

వీరు చివరి కాలమున తిరువారూరుచేరి 1817వ సంవత్సరము ధాత నామ సంవత్సర మాఘ కృష్ణ చతుర్దశి మహా శివరాత్రి దినమున శివ సాయుజ్యమందిరి.

# శ్రీ ముత్తుస్వామి దీక్షితుల జీవితోదంతము

ఉ॥ కన్నది భారతీసతి, యకల్మషచిత్తుల, దైవభక్తిసం
పన్నుల, శ్యామశాస్త్రి, బుధవందితు త్యాగయు, ముత్తుసామినిన్।
యెన్నగ నంబికారఘుకులేశ్వర, షణ్ముఖపాదభక్తులన్
పన్నుగ దివ్యశక్తియుతవర్తుల, గానకళాత్రిమూర్తులన్॥

కర్ణాటక సంగీత చరిత్రలో 18, 19 శతాబ్దములు స్వర్ణ యుగమని చెప్పవచ్చును. ముఖ్యముగా సంగీత త్రిమూర్తులుగా ప్రసిద్ధినందినవారు శ్యామశాస్త్రి, త్యాగయ్య, ముత్తుస్వామి దీక్షితులు. శ్యామశాస్త్రి 1763 నుంచి 1827 వరకు, త్యాగరాజు 1767 నుంచి 1847 వరకు, ముత్తుస్వామి దీక్షితులు 1775 నుంచి 1835 వరకు నుండిరి. వీరు ముచ్చురు తిరువారూరు అను గ్రామమున జన్మించిరి. సంగీతమునే ప్రధానముగా స్వీకరించిరి. మహాత్ములైన 1) సంగీతస్వామి 2) రామకృష్ణానందయతి 3) చిదంబర నాథ యోగుల పాదసేవచే మంత్రోపదేశములనందిరి. దైవానుగ్రహ పాత్రులైరి. అనేక కృతులు రచించిరి. మహిమాన్వితులై, సంగీతము సకలార్థసిద్ధిదమని చాటి, జగద్విదితయశః కాయులై, చిరంజీవులైరి. సంగీతవిద్యాగురువులుగ నేటికిని పూజింపబడుచున్నారు. అందు శ్రీశ్యామ శాస్త్రి రచనకదళీపాకము. శ్రీ త్యాగరాజు రచన ద్రాక్షాపాకము. శ్రీముత్తు స్వామి దీక్షితుల రచన నారికేళపాకముగా లోకమున వాసిగాంచినవి.

ముఖ్యముగా సంగీతగాయకలోకానికి ఈ ముచ్చురి జీవిత చరిత్రలు రచనలు నిత్యపఠనీయములు, మననీయములు, ఉపాసనీయములు. శ్రీ శ్యామశాస్త్రి, త్యాగరాజుల చరిత్రలు ఆంధ్రదేశమున ప్రఖ్యాతిగాంచినవి. శ్రీ ముత్తుస్వామిదీక్షితుల చరిత్ర, రచనలు ఆంధ్రదేశమున బహుళప్రచార మునకు రాలేదు.

దీక్షితులవారి జీవితోదంతమున వారు ఏయే సమయములలో ఏయే కృతులు రచించిరో, వారి రచనలు ఎన్నియో, వారి రచనా వైశిష్ట్యమును సాకల్యముగ తెలుపుట ధర్మమని వారి జీవితోదంతమును తెలియజేయుచున్నాను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు, 1775న రామస్వామి దీక్షితులు, సుబ్బమాంబలకు 'ముద్దుకుమారస్వామి' యనుగ్రహమున 'తిరువారూరు' లో మన్మథనామ సంవత్సర, ఫాల్గుణ మాసమున, కృత్తికా నక్షత్రమున జన్మించిరి. తండ్రివద్ద కావ్యనాటకాలంకార, వ్యాకరణ శాస్త్రములు, వేదాధ్యయనము, సంగీతము, జ్యోతిషములను నేర్చిరి. వీణెను బాగుగా నభ్యసించిరి. జ్యోతిషశాస్త్రమున కృత్తికా నక్షత్ర జాతకుని లక్షణములు ఈ విధముగా చెప్పబడినవి.

శ్లో॥ తేజస్వీ నీతిమాంశ్చైవ బహుభుగ్జనవల్లభః।
గంభీరః కుశలోమానీ వహ్నినక్షత్ర జన్మచః॥

వీరిపేరు ముద్దుకుమారస్వామియే ముత్తుస్వామిగా మారినది. దీనికి ఒక కారణమును చెప్పుదురు. ఒకనాడు స్వప్నమున రామస్వామి దీక్షితులకు అమ్మవారు 'బాలాంబిక' ముత్యాలహారము నొసగినదని తమిళమున ముత్తు అనగా ముత్యమని యుండుటచేత ముత్తుస్వామి యనియు, వీరి వంశమున 'దీక్షితులు'అనుపేరు అనూచానముగా వచ్చుటచే వీరికి ముత్తుస్వామిదీక్షితుల నామము స్థిరమైనది.

'పరిపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః' అనినట్లు వీరికి వేదశాస్త్ర సంగీత జ్ఞానముతోబాటు కవిత్వముకూడ నలవడినది.

వీరి చిన్నతనమున తండ్రిగారు కొంతకాలము 'మణలి'లో నుండుటచే వేంకటకృష్ణ మొదలియార్ తరచు వీరిని గౌరవించుచుండెడివారు. శ్రీ వేంకటకృష్ణ మొదలియార్ ఆనాడు ''మద్రాస్ జార్జి'' కోటలో నుండి ప్రభుత్వముచేయుచున్న ''ఈస్టు ఇండియా కంపెనీ'' వారివద్ద ''దుబాసి'' (ద్విభాషి)గా నుండిరి. ఆ మొదలియార్ మద్రాస్ కోటకు వెళ్ళునప్పుడు తనవెంట ముత్తుస్వామి దీక్షితులను, వారి సోదరులను తోడ్కొని పోవుచుం

డెడివారు. ఆ సమయమున దీక్షితులు, వారి సోదరులు పాశ్చాత్యుల "బ్యాండ్" సంగీతమును విని, వారి సంప్రదాయమును సంచార రాగ విశేషములను బాగుగా అర్థముచేసుకొనిరి. ఆనాటి "కర్నల్ బ్రౌన్" అను ఆంగ్లేయుని కోరికపై కొన్ని ఇంగ్లీషు నోటు స్వరములకు సంస్కృత సాహిత్యమును కూర్చిరి. అందు "గాడ్ సేవ్ ది కింగ్" అనునది. ఈ నోటు స్వర సాహిత్యములు షుమారు 35 వరకు రచించిరి. పాశ్చాత్యుల పరిచయమున వారు ఉపయోగించు "ఫిడేలు" పూర్వము లఘువీణె, కచ్ఛపివీణె యనబడుదానిని సంపాదించి దీక్షితులవారు తమ కనిష్ఠ సోదరుడు బాల స్వామిదీక్షితులతో సాధన మొనర్పజేసి కర్ణాటక సంగీతమునకు సహకార వాద్యముగ నుపయోగపరచి కర్ణాటక సంగీతమున ఫిడేలునకు వీణతో సమానస్థానమును కలుగునట్లొనర్చిరి.

వీరు 'మణలి'లో నుండగా యాత్రార్థమై చనుదెంచిన "శ్రీ చిదంబర నాథస్వామి" మణలికిరాగా, రామస్వామి దీక్షితులు తమ గురువును కొంత కాలము తమవద్దనుంచుకొని కుమారులతో శుశ్రూషయొనర్చిరి. వీరి చరిత్రలో మరియొక విశేషముగలదు. ముత్తుస్వామిదీక్షితులకు తండ్రియే విద్యా గురువు. కాని మంత్రోపదేశ గురువు తండ్రికి, తనకు ఒక్కరే యగుట విశేషము. రామేశ్వర సందర్శన మొనర్చి, తిరిగి కాశికివెళ్ళుచు, మణలి చేరిన శ్రీ చిదంబరనాథయోగి కొంతకాలమటనుండి కాశికి బయలుదేరిరి. రామస్వామిదీక్షితులు, వారి కుటుంబమువారు యోగికి సాష్టాంగ ప్రణామ మొనర్చిరి. వారిని ఆశీర్వదించి, చిదంబరనాథస్వామి, రామస్వామీ! నాదొక కోర్కెయున్నది తీర్చుమన్నారు. ఆమాటకు రామస్వామిదీక్షితులు ఆజ్ఞాపించుడన్నాడు. అప్పుడాయోగి పుంగవుడు వయసున పెద్దవాడను, ఈ వయసులో పాదచారినై ఒంటరిగ కాశికి వెళ్ళజాలనేమో? నాతో సహ వాసిగ ముత్తుస్వామిని పంపించమన్నారు. ఆమాట విన్న రామస్వామి చాలాకాలమునకు కలిగినసంతానము. అందుచేను జ్యేష్ఠుని ఎలాపంపుటయా యని సంశయించిరి. ఈనాటి ప్రయాణసౌకర్యములు ఆనాడులేవు. 'కాశికి పోయినవాడు, కాటికి పోయినవానితో సమానమనెడివారు'. కాలినడకన దుర్గమారణ్యపర్వతగమనము. ఏమి చెప్పుటకు తోచనిస్థితిలో నుండగా, వేంకటకృష్ణ మొదలియార్ గమనించి దీక్షితులవారు? సంశయించకుడు.

ఆనాడు విశ్వామిత్రుని వెంట రాముని పంపుటకు దశరథ మహారాజు సంశయించి, తరువాత వశిష్ఠుని మాటతో కౌశికుని వెంట పంపలేదా; తిరిగి కళ్యాణమూర్తులై రాలేదా; కనుక సందేహించక గురుదేవులవెంట పంపుడు' అనిరి. ఆమాటలు వినిన రామస్వామిదీక్షితులు సంతసించి సంశయము వీడి ముత్తుస్వామిదీక్షితులను గురువుగారివెంట కాశికి ప్రయాణముచేసి పంపిరి. గురుదేవునితో బయలుదేరిన ముత్తుస్వామిదీక్షితులు తమ ప్రయాణములో ఎన్నో దేశములు, వివిధ భాషలు మాట్లాడు ప్రజలను, రకరకముల వేషములు, సంప్రదాయములుగల ప్రాంతములు చూచుచు, గురువుగారి వలన అనేక విషయములడిగి తెలిసికొనెను. కొంతకాలమునకు గురుశిష్యులిరువురు క్షేమముగా పరమపవిత్రమైన వారణాశికి చేరిరి. కాశిలోనొక శుభ సమయమున గురువులవలన శ్రీ విద్యామంత్రోపదేశమందిరి. నిత్యము గంగాస్నానము విశ్వేశ్వర సందర్శనము మంత్రానుష్ఠానము సద్గురు పాదసేవ గురుబోధనలతో ఐదువర్షములు శీఘ్రముగా గడచెను. ఆ సమయమున ఉత్తరభారత సంగీత సంప్రదాయ లక్షణములను గ్రహించిరి.

ఈ విధముగా 5, 6 సంవత్సరములు గురుసేవలో కాలము గడచుచుండనొకనాడు శ్రీ చిదంబరనాథస్వామి దీక్షితులనుగాంచి, నాయనా ! మనము విడిపోవు సమయమాసన్నమైనది నీకు తల్లిదండ్రులను చూడవలెననిలేదా ? యన ముత్తుస్వామి, గురుదేవా ! పవిత్ర క్షేత్రము, గంగాస్నానము, ఆదిదంపతుల సందర్శనము గురుపద సేవ ఇంతకన్న మానవ జీవితమునకు కావలసినదేమున్నది. అని గురుపాదములనుబట్టి మిమ్ముల ను విడచియుండలేనని బాధపడిరి. ఈ విధముగా మాటలాడుచు, ఇరువురు గంగానదీ సమీపమునకు చేరిరి. అప్పుడు శ్రీ చిదంబరనాథస్వామి ముత్తుస్వామీ ? ఈ రోజున గంగలో కొంచెము ముందుకేగుము. నీ కాలికి ఏది తగులునో దానిని తీసికొనిరమ్మనిపలుకగా, అటులనేయని కొంచెము లోని కేగగా, దీక్షితుల పాదములకేదియో తగులగా దానిని పైకితీసి చూచిరి. అదియొక వీణ. దానిపై దేవనాగర లిపిలో "రామ" అని వ్రాయబడి యున్నది. దాని "యాళి" ముఖము పైకి తిరిగియున్నది. దానిని తెచ్చి గురువునకు చూపగా, చిదంబరనాథస్వామి సంతసించి, ఆశీర్వదించి ఆ వీణను దీక్షితులకొసగి ఇది గంగాదేవీప్రసాదము. వాగ్గేయకారుడవు

వైణికుడవై రాణించగలవు. అని చివరిమాటగా పలికి, యోగి గంగాస్నాన మునకై వెడలియందు మునిగిరి. మునిగిన గురువుగారు ఎంతవరకు పైకి లేవనందున ముత్తుస్వామిదీక్షితులు అటనున్న కొందరిచే వెతికించి, భౌతిక కాయమును వెలుపలకుతీయించి, గురువియోగమునకు విచారించి, గంగ యొడ్డుననున్న ''హనుమాన్‌ఘాట్''లో సమాధిచేయించిరి. ఈ విధముగా గురు ఋణముదీర్చి కొన్నిరోజులటనుండి గురువియోగముచే బరువెక్కిన గుండెతో గంగలోలభించిన వీణతో తమ తల్లిదండ్రులనుచూచు తలంపుతో ఒంటరిగ కాశినుండి బయలుదేరిరి. కొన్ని నెలలు ప్రయాణమొనర్చి 'మణలి'కి చేరిరి. వీరు మణలి చేరుసమయమున తల్లిదండ్రులు, సోదరులు తిరువారూరులో నుండిరి. ఆ విషయమును తెలిసికొని తిరువారూరుకు పయనమై మార్గ మధ్యమున తనకిష్టదైవమైన శ్రీ సుబ్రహ్మణ్య క్షేత్రమగు ''తిరుత్తణి'' చేరిరి. అట చిన్నకొండ పైనున్న ఆలయమునకేగుచు ఈ విధముగనాలోచించిరి. మా తలిదండ్రులు శ్రీ బాలాంబికాదేవిని మండల దీక్షతో సేవించి సంతానమును పొందిరి. నేనును ఆదేవీతనయుని షణ్ముఖుని నలుబది దినములర్పింతునని తలంచి స్వామిసన్నిధిని 'షడక్షరీ మహామంత్రానుష్ఠానము, అర్చన, సంకీర్తనలు సల్పుచు నుండిరి.

నలుబదియవదినము మధ్యాహ్న సమయమున ముత్తుస్వామిదీక్షితులు కన్నులుమూసికొని ధ్యాననిష్ఠలోనుండగ, నొక వృద్ధుడు వచ్చి, ''ముత్తుస్వామీ'' యని పిలిచి నోరుతెరువుమనిరి. దీక్షితులు కన్నులుతెరచిచూడ దివ్యతేజోమూర్తి. వృద్ధుడు ''నేను ఈ ప్రాంతమునకు క్రొత్తవాడను, నా పేరు ఇతనికెటుల తెలిసినది?'' అని తలంచుచు నోరు తెరచిరి. ఆ వృద్ధుడు నీ నోటిలో నేనేమియుంచితినో కన్నులు మూసికొని చెప్పుమనెను. ముత్తుస్వామికన్నులుమూసికొని, నోటిలో వేసినది 'పటికబెల్లా'మని పలికిరి. కనులు తెరచి చూడ వృద్ధుడు కానరాడయ్యెను అంత దీక్షితులు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామియే యీ విధముగాననుగ్రహించెనని తలచి, గురువనుగ్రహము, స్వామియనుగ్రహముకలిగినందున కానందించి, కొన్ని కృతులు రచించిరి. వానిని ''తిరుత్తణి'' కృతులందురు. శ్రీ నాథాదిగురుగుహో జయతి, శ్రీ బాలసుబ్రహ్మణ్యాగచ్ఛ, మానసగురుగుహరూపం, శ్రీ గురుణా గురుగుహాయ, గురుగుహాదన్యం, శ్రీగురుగుహస్య దాసోఽహం, గురుగుహస్వామిని, శ్రీ గురుగుహమూర్తే యని అన్ని విభక్తులలో రచించి కీర్తించిరి.

అప్పటికి దీక్షితులవారి వయస్సు 25 సంవత్సరములని తెలియుచున్నది. నాటినుండి అనర్గళకవితావాహిని పెల్లుబికినది. 8 విభక్తులలో ఎనిమిది కృతులు రచించిరి. తిరుత్తణికి 50 మైళ్ళలోనున్న తిరుపతిని చేరి, తన సహోదరునకు నేత్రములొసగిన శ్రీ వేంకటేశ్వరునిపై కాఫీ రాగమున, ''వేంకటాచలపతే నినునమ్మితి''యని మణిప్రవాళకృతిని తెనుగు, తమిళము, సంస్కృత పదములతో రచించి కీర్తించిరి. అటనుండి శ్రీ కాళహస్తి చేరి హుసేనిరాగమున ''శ్రీ కాళహస్తీశ'' ''జ్ఞానాంబికే''యని సేనావతి రాగమున కృతులు రచించి గానమొనర్చిరి.

శ్రీ ముత్తుస్వామిదీక్షితులవారికి చిన్నతనముననే వివాహము జరిగినది. కాని వీరి చరిత్రలో ఇరువురు భార్యలున్నటుల తెలియుచున్నది. ఇరువురు భార్యలున్నను, గృహస్థ జీవితమునందు కాలమును గడుపక, తీర్థయాత్రలు, పుణ్యక్షేత్ర సందర్శనములతో నిష్కామయోగిగ జీవితాంతము గడపిరి.

శ్రీ కాళహస్తి నుండి కంచి క్షేత్రమును చేరిరి. ఈ మధ్యలో తల్లిదండ్రులను, సోదరులను కలిసికొని వారితో కంచియందు నాలుగు సంవత్సరములుండిరి. ఆ సమయమున ప్రతినిత్యము శ్రీ కామాక్షీ ఏకామ్రేశ్వరుల సందర్శనమొనర్చుచు, 'ఏకామ్రనాథం భజేఽహం' 'ఏకామ్రేశ్వర నాయకీం' 'నీరజాక్షి కామాక్షీ' 'కంజదళాయతాక్షీ' మొదలైనవి 14 కృతులను రచించిరి. మరియు కంచిలోని కైలాసనాథేశ్వరునిపై 'కైలాసనాథం' 'కైలాస నాథేన'యని కీర్తించిరి. విష్ణుకంచి యందలి వరదరాజస్వామిని గాంచి ''వరదరాజ ముపాస్మహే'' యని సారంగరాగమున కొనియాడిరి.

దైవతత్వమును తెలిసిన నిజభక్తునకు దైవభేదభావముండదు. శ్రీ త్యాగరాజు 'తనదైవమని,అన్యదైవమని తనలోనెతానె తారతమ్యమెంచి, పెనువాదతర్కములు జేసిజేసి ఘనమైన పాపమును బెంచుచుండె' జన్మమెందుకు అని చల్లని మలయమారుతరాగమున తెలియజేసినట్లుగానే శ్రీ దీక్షితులవారు కూడ శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణాపత్యాది భేదము లేక సర్వదేవతలపై కృతులు రచించిరి.

శ్లో॥ ఆకాశాత్పతితంతోయం యథాగచ్ఛతిసాగరం।
సర్వదేవనమస్కారః కేశవంప్రతిగచ్ఛతి ॥

అని చెప్పినవిధముగా యథార్థతత్వముసెఱిగిన మహాత్ములకు సర్వం బ్రహ్మమయముగా గోచరించును. అటువంటివారే సిద్ధపురుషులు. అందు వలననే త్యాగయ్య, దీక్షితులు, పురందరదాసాదులు ఆ యా దేవతా మూర్తుల రూప, గుణ, లక్షణ, సౌందర్యాదులను వర్ణించి, ఆనందించి, తరించిరి, అద్వైతసిద్ధాంత తత్వమును అనుభవము చేసికొనినవారగుటచే తాముచూచిన ప్రతి క్షేత్రముననున్న దేవతామూర్తులను కీర్తించి తమ కవితావాణిని పునీతము చేసికొనిరి.

ఆ సమయమున కంచిలోనున్న మహానుభావులు శ్రీ ఉపనిషద్బ్రహ్మేంద్రస్వామివారు విద్వాంసులు, రామభక్తులు. వారు జయదేవుని గీత గోవిందమునందలి అష్టపదులవలె రామునిపై 'రామాష్ట'పది యను పేరున రచించిరి. దీక్షితులవారి భక్తి, పాండిత్యములను విని స్వామి తమ ఆశ్రమమునకునాహ్వానించగా దీక్షితులవారు అచటికేగి యతీశ్వరుల సందర్శనమొనర్చి, నమస్కరించి, రామాష్టపదినిచూచి వారి అజ్ఞచే రాగతాళము లనుకూర్చి గానమొనర్చిరి.

అంతియేకాదు "సాధూనాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనమ్" అన్నట్లు శ్రీ స్వామివారి సేవాభాగ్యమున దీక్షితులవారికి రామ భక్తి కలిగి రామతత్వమును గుర్తించి రామచంద్రునిపై కొన్ని కృతులను రచించిరి. "రామచంద్రేణ సంరక్షితోఽహం" "మామవరఘువీర" "రామంచంద్రం భావయామి" యని కీర్తించిరి.

4 సంవత్సరములు కంచిలోనుండి మరల తిరువారూరునకు పయనమయిరి. మార్గమధ్యమున అరుణాచలం (తిరువణ్ణామలై) చిదంబరాది క్షేత్రములసందర్శించుచు, ఆయా దేవతలపై 'అరుణాచలనాథం స్మరామి' చిదంబరనటరాజుని "ఆనందనటనప్రకాశం" "శివకామేశ్వరీం" అని గోవిందరాజస్వామినిగాంచి "గోవిందరాజముపాస్మహే" 'గోవిందరాజేన' యని రచించిరి.

చిదంబరమునుండి "వైదీశ్వరన్" కోవెలకువెడలి అటనున్న వైద్యనాథ, బాలాంబిక, ముత్తుకుమారస్వాముల పై కృతులు రచించిరి. కానడలో "బాలాంబికాయాః పరం నహిరే" మనోరంజనిలో "బాలాంబికే పాహి" శాంతకళ్యాణిలో "భజరే చిత్త బాలాంబికాం" అఠాణాలో "వైద్యనాథం" ముత్తుకుమారస్వామి పై అసావేరిలో "కుమారస్వామినం" కాంభోజిలో "శ్రీ సుబ్రహ్మణ్యాయ నమస్తే" సురటిలో "బాల సుబ్రహ్మణ్యం భజేఽహం" నాగస్వరావళిలో "శ్రీవల్లీ పతే పాహిమాం" రేగుప్తిలో "శరవణ భవ గురుగుహ" అని అనేక కృతులు రచనచేసిరి.

అట నుండి "మయూరము" చేరి పురాతనమైన శివాలయమును సందర్శించి, మయూరనాథస్వామిని, అభయాంబికాదేవిని గాంచి కొంత కాలమటనుండి ఆ దేవతల పై కళ్యాణిలో "అభయాంబా జగదంబా" శహనలో "అభయాంబాం భక్తిం" యదుకులకాంభోజిలో "అభయాంబికాయై" కేదారగౌళలో "అభయాంబికాయా" భైరవి "ఆర్యాం అభయాంబాం" శ్రీరాగమున "శ్రీ అభయాంబ నిన్ను" అని తెనుగున కేదారలో "అంబికాయా అభయాంబికాయాః" చామరంలో "సదాశ్రయే అభయాంబికే" తోడిలో "దాక్షాయణీ అభయాంబికే" ధన్యాసిలో "మయూరనాథమని శం భజామి" అని అన్ని విభక్తులతో నుతించిరి.

మయూరమునుండి తిరువారూరు చేరి. అచట చాలాకాలముండిరి. తిరువారూరును కమలాపురము, శ్రీ పురమని పిలుతురు. ఆ తిరువారూరు సంగీత త్రిమూర్తులకు జన్మస్థలము. ఆ క్షేత్రమున శివుని నామము "శ్రీ త్యాగరాజేశ్వరుడు, జగదంబ నీలోత్పలాంబ, ఏకవింశతి గణపతులు" అందు ముఖ్యమైనవి షోడశగణపతులు, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి మరియు అట 1) సదాచలేశ్వర 2) హాటకేశ్వర 3) వల్మీకలింగేశ్వర 4) ఆనందేశ్వర 5) సిద్ధీశ్వరులను ఐదు ప్రసిద్ధ శివాలయములు గలవు. ఆయా దేవతల పై అనేక కృతులు రచించిరి.

శాక్తేయ సంప్రదాయానుసారము, శ్రీ కమలాంబానవావరణ కృతులు, నీలోత్పలాంబా కృతులు, త్యాగరాజనవావరణ కృతులు మరియు ఆ ఆలయమున తాంత్రికపద్ధతిలో, ఆగమ సంప్రదాయానుసారము ప్రతిష్ఠించబడిన షోడశ గణపతుల పై కృతులు రచించిరి. ఈ రచనలన్నియు శ్రీవారి పాండితీ ప్రతిభను చాటుచున్నవి.

సంగీత, మంత్ర, తంత్ర, భక్తి, అద్వైత తత్వాది విశేషములతో కూడియున్నవి. వాని వివరణము, రచనా వైశిష్ట్యమును, ఆయా కృతుల యొక్క వ్యాఖ్యానమున విశేషముగా గమనించదగును.

శ్రీ ముత్తుస్వామిదీక్షితులు ఆ సేతుహిమాచలము పర్యటనచేసి పుణ్య క్షేత్రములను సందర్శించిరి. తాము దర్శించిన స్వాముల పై కృతి రచన లు సలిపి కీర్తించుట దీక్షితులవారి స్వభావము.

స్వామిమలై ''మన్నారుగుడి'' నాగపట్టణము, తిరుచునాపల్లి, శ్రీరంగము, జంబుకేశ్వరము, మొదలైనక్షేత్రములలో ''స్వామినాథ'' శ్రీ బాలసుబ్రహ్మణ్యం, శ్రీ విద్యారాజగోపాలం, శ్రీ రాజగోపాలబాల, రాజ గోపాలం, నాగపట్టణమున కాయారోహణస్వామి, నీలాయతాక్షి, సౌందర రాజు పై, జంబూపతే, యని జంబుకేశ్వరుని, శ్రీ మాతశ్శివే, రంగనాయ కం, శ్రీరంగపురవిహార, శ్రీ భార్గవి, అని రచించిరి. అటనుండి ''కేవ ళూరు'' చేరి అక్షయలింగస్వామి పై శంకరాభరణమున అక్షయలింగవిభో అని రచించిరి.

ఇక్కడ ఒక విచిత్ర చరిత్రగలదు. దీక్షితులవారు ''కేవళూరు'' చేరుసరికి ఆలయార్చకుడు తలుపులుమూసి వెళ్ళుచుండెను. దీక్షితులు, అయ్యా! తిరువారూరు నుంచివచ్చితిని దర్శనార్థమై అని కోరగ, అర్చ కుడు ''స్వామి ఎక్కడికిపోడు రేపు దర్శనంచేసికొనమనినాడు''. అప్పుడు దీక్షితులు ముఖమంటపమందు కూర్చొని ''అక్షయలింగవిభో'' ''స్వయం భో'' అని కృతిని ఆశువుగా రచించి గానముచేసిరి. వారి గాత్రమాధుర్య మునువిని గ్రామస్థులు, భక్తులు చేరిరి. అర్చకుడుకూడ వినుచూ అచటనే యుండెను. కృతి పాడుట పూర్తి అయినది. అందరూ చూచుచుండగనే ఆలయపు తలుపులు తెఱచికొనినవి. స్వామిదర్శనమైనది. అందరునాశ్చర్య పడిరి. అర్చకుడు పశ్చాత్తప్తుడై క్షమాపణ కోరెను.

''క్రియాసిద్ధిస్సత్వే భవతిమహతాంనోపకరణే'' మరల తిరువారూరు చేరిరి. దీక్షితులవారి ప్రతిభనువిని, అచటికి సమీపమునసున్న 'ఇళిక్కరై' గ్రామ మిరాసీదారుడైన ''వైద్యలింగమొదలియార్'' తమ గ్రామమున కాహ్వానించిరి. అటకేగి దీక్షితులు అచటనున్న ''కాశీవిశ్వేశ్వర, విశాలాక్షి,

అన్నపూర్ణ, కాలభైరవుల'' పై కృతులు రచించి పాడిరి. అవి విని మొదలియార్ కనకాభిషేకమొనర్చి తనపైనొక కృతిని రచించుమనగ, మానవులను కీర్తించుటకిచ్ఛగించక, 14 రాగములతో ''శ్రీ విశ్వనాథం'' అని మాలికను కూర్చి, మొదలియార్ తృప్తికై ''వైద్యలింగ భూపాలరక్షక'' అని కూర్చి పాడిరి. ఈ విధముగా ఎన్నియో కృతులు రచించిరి.

## -: గార్హస్థ్య జీవిత విశేషము :-

పూర్వ వాగ్గేయకారులు, విద్వాంసులు, అర్థార్జన పై మనసునుంచక పరమార్థార్జనయే లక్ష్యముగా నుండెడివారు. పురందరదాస రామదాసాదులు శ్రీ త్యాగయ్య యదృచ్ఛాలాభ సంతుష్టులై, రాజులనాశ్రయించక, రామచంద్రునాశ్రయించి తరించిరి. శ్రీ శ్యామశాస్త్రి, కామాక్షీ పాదసేవనమే జీవనముగ గడపినవారు.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు కనకాభిషేకములు, రాజ సన్మానములు పొందిరి. అయిననుధనార్జనమే ప్రధానమనుభావము కలవారుకారు. నిత్యం శిష్యులకు విద్యనేర్పుచు, రచనలు చేయుచు, జీవితమును తీర్థయాత్రలతోనే గడపిరి. ఇందుకు నిదర్శనము ఈ సన్నివేశమే.

ఒకనాడు వీరి యింటిలో వంటకు భోజనపదార్థములేమియులేవు. దీక్షితులవారి భార్యకు భర్తతో చెప్పుటకు ధైర్యముచాలలేదు. వీరి శిష్యులలో దేవదాసి ''కమలమ్మ'' అనునామెకలదు. దీక్షితులు శిష్యులకు పాఠములు చెప్పుచుండిరి. భార్య కమలమ్మను లోనికి పిలిచి, ఇంటిలోని పరిస్థితినితెల్పి, నీవీరోజు ఏమైన సహాయము చేయగలవా ? యన నామె ''అమ్మా! మీరు బాధపడకండి. నాకు ఆభరణములున్నవి. అవి అమ్మి నా గురుదేవులకు బాధకలుగకుండ సేవించుకొందును.'' అని అన్నది. ఆ మాటలు వినిన దీక్షితులు లోనికేగి, భార్యతో శిష్యులకు భోజనము పెట్టి విద్యనేర్పవలసినదానికి బదులుగా వారు నన్ను పోషింపవలసిన దుస్థితి కలిగినదా ? కమలమ్మా ! నీవెంతకాలము మమ్ము నీ ఆభరణములమ్మి పోషింపగలవు ? అందరిని భరించువాడు ఆ సర్వేశ్వరుడే అని పలికి త్యాగరాజేశ్వరుని కోవెలకేగి, యదుకుల కాంభోజిలో 'త్యాగరాజంభజరేరేచిత్త'

అని గానముచేసి యింటికిచేరిరి. ఇంతలో ఒక సత్రపు యజమాని రెండెడ్ల బండిపైవస్తూ సంబారములన్నియు తీసుకొని వారింటికి వచ్చి, అయ్యా! మా సత్రమునకు 'రాజోద్యోగి' మకాముకై వత్తురని కబురురంపుటచే నివి అన్నియు సిద్ధపరచితిమి. కాని వారు ఇప్పుడు వచ్చుటలేదని తెలిసినది. ఈ వస్తువులన్నియు వృధాయగునని మీవంటివారికొసగిన సద్వినియోగ పడునని తెచ్చితినని ఇచ్చి వెడలిపోయెను. అప్పుడు దీక్షితులు ఆనంద పారవశ్యమున, దైవలీలలను గుర్తించి సాళగభైరవి రాగములో "త్యాగ రాజేనసంరక్షితోహం" అని గానమొనర్చి తమ కృతజ్ఞతను తెలియజేసిరి.

దీక్షితులవారి శిష్యులలో "శుద్ధమద్దళతంబియప్ప" యనునతడు శూలనొప్పితో బాధపడుచుండెను. వైద్యమున వ్యాధి కుదరలేదు. జ్యోతిష్కులు గురు, శనుల గ్రిహచారము బాగుగాలేదుగాన జప, దాన, శాంతులు చేసికొనుమని పల్కిరి. అదివినిన దీక్షితులవారు, అఠాణారాగమున "బృహస్పతే తారాపతే" యనియు యదుకులకాంభోజిలో "దివాకరత నూజం" అనియు కృతులను రచించి అతనికి నేర్పి, ప్రతినిత్యము యీ కృతులు గానముచేయుమనిరి. ఆ మాటప్రికారము అతడు గానముచేయుగా కొలది దినములలోనతని శూలనొప్పి మందులు లేకయే తగ్గి ఆరోగ్య వంతుడయ్యెను. అటుపైన దీక్షితులు లోకోపకారార్థమై నవగ్రిహకృతులు సూళాది సప్తతాళములలో రచించిరి. వీని వివరణ కృతివ్యాఖ్యానమున గాననగును.

1827 వ సంవత్సరమున తండ్రి రామస్వామి దీక్షితులు, తల్లి భాగీరథమ్మ గతించిరి. అప్పటికి దీక్షితులవారికి 50 సంవత్సరములు నిండినవి తల్లిదండ్రులు గతించిన వెనుక కొందరు వీరిని మధురలో నివసింపుడని కోరిరి. అప్పుడు తన సోదరులైన చిన్నస్వామిని, బాలస్వామిని మధురకుపంపి, తాను "తంజావూరు సోదరుల కోరికపై తంజావూరులో నివాసముండిరి." తంజావూరులోనున్న సమయమున శ్రీ శ్యామశాస్త్రిని కలసికొనిరి. ఇరువురకు స్నేహమేర్పడినది. శ్యామశాస్త్రిగారి కుమారుడు "సుబ్బరాయశాస్త్రి దీక్షితులు" వారి శిష్యుడై సంగీతము నభ్యసించిరి. ఆ సమయమున బృహదీశ్వరునిపైన, బృహన్నాయకిపైనను షుమారు 20 కృతులు రచించిరి.

ఒకనాడు దీక్షితులవారు తంజావూరు సమీపముననున్న "తిరువయ్యారు" వెడలిరి. తిరువయ్యారును పంచనదక్షేత్రమందురు. కావేరీ తీరమునగల తిరవయ్యారునుజేరి పంచనదీశ్వరుని దర్శించి, నాటరాగమున "పరమేశ్వర జగదీశ్వర" యని "ప్రణతార్తిహరం నమామి" యని నాయకి రాగమున రచించిపాడి, ధర్మసంవర్ధనినిగాంచి మధ్యమావతి రాగమున "ధర్మసంవర్ధిని దనుజసమ్మర్దిని" యని గానముచేయుచుండగ త్యాగయ్యగారి శిష్యులువిని, తమ గురువుగారింటికి నాహ్వానించిరి. ఆనాడు త్యాగయ్యగారింట "రామాయణపారాయణము" పరిసమాప్తి యగుటచే విశేషముగ పూజలు సలిపి రామస్వామికి పట్టాభిషేకవేడుకను జరుపుచుండిరి. దీక్షితులవారిరాకను గమనించిన త్యాగయ్యగారు ఆనందముతో నాహ్వానించి గౌరవించిరి. కొలువుదీరిన పట్టాభిరాముని తాగయ్యగారు, శిష్యులు "కొలువైయున్నాడే" యని గానమొనర్చ, దీక్షితులవారినికూడా గానముచేయుడని కోరగా వెంటనే మణిరంగు రాగమున "మామవ పట్టాభిరామ" అని రచించి గానమొనర్చిరి.

దీక్షితులవారి చిన్నభార్య ఆభరణములపై నాశకలిగి భర్తతోనొకనాడు, నాథా! శరభోజి మహారాజులకు మీయందత్యంత గౌరవముకలదు కదా? వారిసందర్శనము చేయరాదా? యనినది. ఆ మాటలతో నామె మనోభావమును గుర్తించిన దీక్షితులు లలితరాగమున "హిరణ్మయీం లక్ష్మీం సదాభజామి హీనమానవాశ్రయంత్యజామి" అని లక్ష్మీదేవిని ప్రార్థించిరి. నాటిరేయి భార్యకు మహాలక్ష్మి సకలాభరణభూషితయై స్వప్నమున దర్శనమొసగి నీ భర్తయే నా స్వరూపుడు అని పలికెను. మరునాడు స్వప్నవృత్తాంతమును తెలిపి మన్నింపుడని వేడెను. అప్పుడు ధన్యాసిలో "మంగళదేవతయా త్వయాబహుమానితోఽహం" అనియు, మాధవమనోహరి రాగమున "మహాలక్ష్మి కరుణారసలహరి" యనియు ధ్యానించిరి.

మధురలో తనసోదరుడు 'చిన్నస్వామిదీక్షితులు' మరణించినవార్త దెలిసి బాలస్వామిని చూడదలచి "రేవూరు సుబ్రహ్మణ్య" మను శిష్యుని వెంటనిడుకొని మధురకు బయలుదేరిరి. మార్గమధ్యమున, వేగవతీ నదీ తీరమునగల విఘ్నేశ్వరుని గాంచి "ఏకదంతంభజేఽహం" అని ధ్యానిం

చి మధురజేరిరి. అప్పటికి తన సోదరుడు బాలస్వామి రామేశ్వరం వెడలి నట్లువిని కొన్నిరోజులు మధురలోనుండిరి. ఆ సమయమున మీనాక్షీదేవి పై అనేక కృతులు రచించిరి. 'కాదంబరీప్రియాయై, మీనాక్షిముదందేహి' యని మొదలగు పదికృతులు సుందరేశ్వరుని పై ''సోమసుందరేశ్వరం, పాలయమాం పార్వతీశ, సుందరేశ్వరాయ'' యని రచించిరి.

మధుర సమీపమందలి పుష్పవనీశ్వరుని ''సారససౌవీర''అని కొని యాడిరి. అటనుండి రామేశ్వరము బయలుదేరిరి. మార్గమధ్యమున అళ గక కోవెలనుగాంచి సుందరరాజస్వామిని ''సుందరరాజం'' అని రామ క్రియలో కీర్తించి రామేశ్వరంచేరిరి. అట ''రామనాథం భజేఽహం''అని యు, దర్భశయనమున ''శ్రీరామం రవికులాబ్ధిసోమం''యనియు కొని యాడిరి.

బాలస్వామిదీక్షితులకు రామేశ్వరమున యెట్టయపురం మహారాజుతో పరిచయమేర్పడినది. వారియాహ్వానమున, ఆస్థాన విద్వాంసునిగా నియ మింపబడి మహారాజుతో యెట్టయపురము వెడలినట్లు, రామేశ్వరమున ముత్తుస్వామిదీక్షితులకు తెలిసినది. సోదరునిచూచుటకై యటనుండి యెట్టయపురమునకు పయనమయిరి. దారిలో ''సాత్తూరు'' లోని వేంకటే శ్వరుని సందర్శించి మేఘరంజనిలో ''శ్రీ వేంకటేశ్వర యాదవభూపతి మాశ్రయేఽహం''అని గానమొనర్చి వెడలుచుండిరి. ఆ ప్రాంతమంతయు వర్షములులేక, పంటలులేక, త్రాగుటకు నీరులేక కరువుతో బాధపడుచున్న ప్రజలనుగాంచి శ్రీ దీక్షితులు వెంటనే అమృతవర్షిణి రాగమున ''ఆనందా మృతకర్షిణి అమృతవర్షిణి హరాదిపూజితే భవాని సలిలంవర్షయ వర్షయ'' అని గానమొనర్చిరి. వెంటనే ఆకాశము మేఘావృతమై వర్షముకురిసినది.

యెట్టయపురముజేరి సోదరునిగాంచెను. చాలాకాలమునకు కలిసికొనిన సోదరులగుటచే బాలస్వామి అన్నగారిని కొంతకాలము తమవద్దనుంచుకొని రాజదర్శనము చేయించిరి. ఆ సమయముననే బాలస్వామికి వివాహము జరిగినది. యెట్టయపురమున నుండుటకు దీక్షితులవారు నిశ్చయించుకొని తిరువారూరునుండి తమవస్తువులను తెప్పించుకొని యటనుండిరి. ఆ సమ యమున తిరుచూరులో సుబ్రహ్మణ్యేశ్వరునిపై ''శ్రీ సుబ్రహ్మణ్యోమాం రక్షతు'' ''శ్రీ సుబ్రహ్మణ్యేన సంరక్షితోఽహం'' అనియు కంక శైల

స్వామిపైన, తిరునల్వేలిలోని శాలివాటీశ్వరునిపైన, కాంతిమతీదేవిపైన కృతులు రచించిరి. శబరమలై వెడలి అయ్యప్పస్వామినిగాంచి వసంత రాగమున ''హరిహరపుత్రం శాస్తారం'' అనియు, గురువాయూరులోని శ్రీకృష్ణునిపై ''శ్రీకృష్ణంభజమానస'' అనియు కృతులు రచించిరి. ఈ విధముగా తాము సందర్శించిన ప్రతిమూర్తిపై కృతులు రచించి గాన మొనర్చి ఉత్తర, దక్షిణ భారతదేశమునంతయు సంచరించి అనేక సంప్రదాయములను గమనించి, శిష్యులకు విద్యాదానమొనర్చి, రాజాస్థానముల సన్మానములనందిరి.

## -: అంతిమయాత్ర :-

1835వ సంవత్సరము, ఆశ్వీయుజ బహుళ చతుర్దశి నరకచతుర్దశి నాడు ముత్తుస్వామి దీక్షితులవారు మామూలుగా లేచి కాలకృత్యములు దీర్చుకొని అనుష్ఠానమొనర్చబోవు సమయమున యెట్టయపురం మహారాజు భయాందోళనలతోవచ్చి దీక్షితులవారి దర్శనముచేయ ''ఎందుకు భయపడుచున్నారన'' గాంగేయుడను నా భద్రగజము పిచ్చిదై గజశాల నుండి గొలుసులనుతెంచుకొని స్మశానవాటికకువెడలి ఘీంకరించుచున్నది. ఎవ్వరిని దరికిరానీయుటలేదు. అనివలుక రాజా! నీ కుటుంబమున కేమియు హానిజరుగదు. అని రాజును పంపిరి. తాను అనుష్ఠానము ప్రారంభించుచుండగా అన్నపూర్ణాదేవి తేజోమూర్తియై దర్శనమొసంగినది.

అదిగమనించి నవావరణాయుత శ్రీ చక్రార్చనమొనర్చి, పున్నాగవరాళిరాగమున ''ఏహి అన్నపూర్ణే సన్నిధేహి సదాపూర్ణే చిదానందవిలాసిని''యని గానమొనర్చిరి. శిష్యులనుపిలచి ''మీనాక్షి మేముదందేహి'' యను కృతిని గమకక్రియ రాగమున పూర్తిగా గానముచేయుడనిపలికి, తాను పద్మాసనాసీనులయిరి. తానుకూడా గానమొనర్చుచు, ''మీనలోచని పాశమోచని''యని కనులుమూసికొని 'భవపాశమోచని, శివేపాహి'యని చేతులు జోడించిరి. కనులనుండి ఆనందాశ్రువులు రాలుచున్నవి. శిష్యులు గానముచేయుచుండిరి. అంతలో శ్రీ ముత్తుస్వామిదీక్షితుల బ్రహ్మకపాలము భేదింపబడి జీవాత్మ అనంతాకాశములో పరమాత్మయందైక్యానుభూతి పొందినది.

ఈ సన్నివేశమున గమనించవలసిన విశేషమొకటియున్నది. గాంగేయమను గజము పిచ్చిదై స్మశానంలో ఘీంకారము చేయుటయన, "నిషాదం బృంహతేగజః" సప్తస్వరములలో నిషాదము ఏనుగు ఘీంకారమువలెనుండును. సప్తస్వరములలో నిషాదము ఏడవది. షట్చక్రములపై ఏడవచక్రము సహస్రారము ఆ ఘీంకారమునకు గుర్తు. మహాత్ముడైన సిద్ధుడు సహస్రారమును భేదించుకొని వెడలు సమయమాసన్నమైనదని రాబోవు విషాదమును నిషాదధ్వనితో సూచించినది. అది గురించిన దీక్షితులవారు తన స్థితిని గమనించి దేవినర్చించి గమకక్రియ రాగమున కృతిని ఆలపించుచు కుండలినీశక్తియొక్క గమనమునకు శ్రమలేకుండ ఊర్ధ్వముఖముగా పయనింపజేసి, భవపాశమోచనియని పరాశక్తిలో మనసులయింపజేసి భవపాశమును త్రెంచి, "నసపునరావర్తతే" యనిన విధముగా తిరిగి జన్మలేనిస్థితినిబొంది చిరంజీవియైనట్లు మనకు తెలియుచున్నది.

పిమ్మట యెట్టయపురం మహారాజు రాజలాంఛనములతో దీక్షితులవారి భౌతికదేహమునకు అంత్యక్రియలు జరిపించిరి.

## -: శ్రీ దీక్షితులవారి రచనావైశిష్ట్యము :-

కర్ణాటక సంగీతమున రచనలుచేసినవారిలో ప్రథముడు, మహాకవి జయదేవుడు. 12వ శతాబ్దమున జయదేవ మహాకవి అష్టపదులను పేరున గీతగోవిందకావ్యమును రచించిరి. అంతకుపూర్వము ఏవిధముగా గానము చేయువారో మనకు తెలియదు. శార్ఙదేవుడు, అహోబలుడు, సోమనాథాదులు లక్షణగ్రంథములనే రచించిరిగాని, వారిగ్రంథములలో వారికి పూర్వపు వాగ్గేయకారుల రచనలు యేమియు గోచరించవు. గాన జయదేవుని కాలమునుండియే లక్ష్యరూపమును గుర్తించనగును.

వేంకటమఖి కాలమునకు లక్షణగీతములు, వర్ణములు, దరువులు మొదలైన రచనలు బయలువడినవి. 15వ శతాబ్దమున "కర్ణాటక సంగీత పితామహుడని" బిరుదుగాంచిన 'పురందరదాసు' గీతములు, కీర్తనలు రచించిరి. 16వ శతాబ్దమున నారాయణతీర్థులవారు "శ్రీకృష్ణలీలాతరంగిణి"

యనుదానిని సంస్కృతమున తరంగములనుపేర రచించిరి. అవి భజనల యందు, భరతనాట్యములయందు నుపయోగింపబడినవి. ఆ శతాబ్దముననే భద్రాచలరామదాస కీర్తనలు, క్షేత్రయ్య పదములు వ్యాప్తిగాంచినవి. 17, 18వ శతాబ్దముల నుండి కృతి, కీర్తన, రాగమాలికలు, పదవర్ణములు, పల్లవులు మొదలగు రచనలు వెలుగులోనికివచ్చినవి.

కృతియను పదము మొదట ఒక కవి రచించిన గ్రంథమును ఒకరికి అంకితమిచ్చుటను కృతినిచ్చుట యందురు. ఒకరిని కొనియాడుటను కీర్తించుట ఈ విధముగా కృతి, కీర్తనయను పదములు వచ్చినవి. సంగీతమున లక్ష్యలక్షణవేత్తలైన వాగ్గేయకారులు కృతి, కీర్తనలకు నియమ నిబంధనలనేర్పరచిరి. అందు కీర్తనలక్షణము పల్లవి, అనుపల్లవి, కొన్ని చరణములుండవలెను. అనుపల్లవి లేకున్నను చరణములన్నియు ఒకేపద్ధతిలో గానముచేయుట యాచారము. అందు భావమే ప్రధానముగాని సంగీతమునకంతప్రాధాన్యతలేదని తెల్పిరి. ఇక కృతిని గురించి,

కృతికి=పల్లవి, అనుపల్లవి ఒకటి లేక రెండు చరణములు యుండవలెనని సంగీతమునకు ప్రాధాన్యతనిచ్చి, సంగతులతో రాగసంచారభావములననుసరించి ఒకచోటనిలిపి (నెరవుచేసి) ప్రస్తరించి, స్వరకల్పనచేసి పాండిత్యప్రతిభను ప్రదర్శించుటకు తగినవిధముగా గానము చేయబడు రచనను కృతియనిరి. ఈ కృతి రచనలో పల్లవి, అనుపల్లవులు ఒకేరకమైన యతి ప్రాస నియమములతోను, చరణము రెండు పాదములు గాని నాలుగు పాదములు కలిగి ఒకే యతిప్రాస నియమములలో నుండవలెనని నిర్ణయించిరి. రామదాస, పురందరదాసాదుల కాలమువరకు భక్తితో సాహిత్య రచనాభావరాగములను అనుభవించుచు గానము చేసెడివారు. తరువాత కాలమున కృతియొక్క ఆకృతి వివిధ పద్ధతులతో విస్తరించినది రానురాను కృతులకు, పల్లవి, అనుపల్లవి, చరణములతోబాటు చిట్టస్వరము మధ్యమకాల సాహిత్యము, స్వరసాహిత్యము, శోల్ కట్టుస్వరము, అంత్యమిత్రము, స్వరాక్షర సాహిత్యము, అంత్యప్రాస, అనుప్రాస అనునవి కృతికి రక్తిని కలుగజేయు ప్రక్రియలుగ రచనలలో చోటుచేసుకున్నవి.

దీక్షితులవారి రచనలు ఎక్కువ కృతులు విళంబిత కాలమునందుండుటచేత వీరి రచనలలోని అంత్యమిత్రములు మధ్యమకాలసాహిత్యములు

మొదలగునవి ఉత్సాహపరచుచుండును. రాగసంచారములు, విశేషసంచారగమకాదులు కలిగి విద్యార్థుల నుండి విద్వాంసుల వరకు మనోధర్మ, గాత్రధర్మ, వాద్యధర్మములకు శ్రుతిలయప్రతిష్ఠతను చేకూర్చునవిగనున్నవి.

ఇక సాహిత్యపరముగ గమనించిన సంస్కృతభాషలోని పదభావ గుంభన, అంత్యప్రాస నియమములు, అనుప్రాసలు, వృత్త్యనుప్రాసలు, బాహ్యాంతరార్థబోధకములు, మంత్ర, తంత్రోపాసనాయుతములు, బీజాక్షరములతో, మంత్రశాస్త్రసంబంధ శబ్దజాలములతో కూడియుండుటచే జపతపానుష్ఠాన తత్పరులతో సమానశక్తి సాధనాసంభరితమైనవి. సర్వశక్తి సమన్వితములు. మరియొక విశేషమేమన రాగనామమును భావయుతముగ కూర్చుటయేగాక, ఆయా రాగతాళములు, ఆయా దేవతాప్రీతికరమైనవిగా ధ్వనించునట్లుగ ఏర్చికూర్చి రచించుటయే శ్రీ దీక్షితులవారి రచనలలోని వైశిష్ట్యము, ప్రత్యేకత, అన్నియు గూఢార్థసంభరితములు అందును సంస్కృత భాషామయమగుటచే కాలమును బాగుగనిలిపి, రాగ సంచారాది లక్షణములను గురుముఖముగ నభ్యసించి సాధనచేసి స్వాధీనపరచుకొనిన విద్వాంసులే, ఈ కృతులను గానముచేయుగలరు. తక్కినవారికి దుస్సాధ్యములు. అందువలననే దీక్షితులవారి రచనలు కొందరు మాత్రమే కొన్ని కృతులు మాత్రమే గానముచేయుచుండుటచే తగినంత ప్రచారమునకు రానికారణముగా వచ్చును. గాన విద్వాంసులకు మంత్రోపాసనా పద్ధతిలో ఒక్కొక్క కృతిని ఆయా దేవతామంత్రానుష్ఠానముగనెంచి అందలి సాహిత్య రాగ, తాళ, భావములను గుర్తెఱింగి గానముచేయువారికే వారి రచనా వైశిష్ట్యము గోచరించును.

## -: సంగీతసమన్వయము :-

మనము లోకములో మూడువిధములైన సంగీతములను వినుచుందుము ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడు ప్రాంతములలో పాడబడు సంగీతమును దక్షిణభారతసంగీతము, కర్ణాటకసంగీతము (*South Indian Music*) అందురు. మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, వింధ్యపర్వతములకు ఉత్తరప్రాంతముల పాడబడు సంగీతమును ఉత్తరభారత సంగీతము,

హిందుస్థానీ సంగీతము *(North Indian Music)* అని యందురు. పాశ్చాత్యదేశములలో గానముచేయబడు సంగీతమును పాశ్చాత్య సంగీతము *(Wetern Music)* అని అందురు.

కర్ణాటక సంగీతమును నారదగానమనియు, హిందుస్థానీ సంగీతమును హనుమద్గానమని యందురు. సంగీతమునకు 'శ్రుతిర్మాతాలయఃపితా' శ్రుతిలయలు తల్లిదండ్రులు. ఏ సంగీతమునకైనను సప్తస్వరములే ఆధారము. ఆలాపన, సంచార సంప్రదాయముల భేదము గోచరించును. కర్ణాటక సంగీతమున లయను ప్రధానముగాచేసికొని గాయకులు తాళము వేయుచు, తన మనోధర్మ పాండిత్యము గాత్రధర్మమునననుసరించి, జనరంజకముగ గానముచేయుదురు. హిందుస్థానీ సంగీతమున శ్రుతినే ప్రధానముగ చేసికొని గాత్రమనోధర్మానుసారముగ లయను క్రమముగ పెంచుకొనుచు విలంబిత, మధ్య, ద్రుతలయలలో గానము చేయుదురు. సహకారవాద్యములు వేరు వేరుగానుండును. కర్ణాటక సంగీతమున వీణ, వైలెన్, మృదంగము, ఘటం, కంజిర, మోర్సింగ్ అనునవి. హిందుస్థానీ సంగీతమున హార్మోనియం, తబల, సారంగ, దిల్‌రుబ, మొదలైనవి. శ్రుతికి తంబురను సర్వులు నుపయోగించుచుందురు. అయితే తంబుర నిర్మాణములు వేరు. పనసకఱ్ఱతో తయారుచేయు తంబురలు కర్ణాటక సంగీతమున, సొరకాయతో తయారుచేయు తంబురలు ఉత్తరభారత సంగీతమున నుపయోగింతురు. పాశ్చాత్య సంగీతమున పియానా, బ్యాండుకు సంబంధించిన వాద్యములతో కొంతమందికలసి మంద్ర, మధ్య, తార స్థాయిలలో సమాన నిష్పత్తిలోగల స్వరముల కూర్పుతో గానము చేయుదురు.

శ్రీ ముత్తుస్వామిదీక్షితులవారు ముందు కర్ణాటకసంగీతమునునేర్చిరి. పిమ్మట గురువుతో ఉత్తర భారతదేశమున 6 సంవత్సరములు సంచారమొనర్చి హిందుస్థానీ సంగీత సంప్రదాయమును గ్రహించిరి. మఱియు 'మణలి'లోనున్న సమయమున వేంకటకృష్ణమొదలియార్‌వెంట మద్రాస్ వెళ్ళుచు పాశ్చాత్యుల బ్యాండ్ వాద్య సంచార విశేషములను, పద్ధతులు గ్రహించి ఆ పాటలకు నోటు స్వరసాహిత్యములు రచించిరి.

అందువలన శ్రీముత్తుస్వామిదీక్షితులు త్రివేణీసాగరసంగమమువలె మూడు రకముల సంగీత సంప్రదాయానుసారముగ కర్ణాటకసంగీతమున వేంకటమఖి సంప్రదాయానుసారము 72 మేళకర్తలయందునను, జన్య రాగములందునను మరియు హిందుస్థానీ సంప్రదాయానుసారం జంఝూటి ఫరజు, జుజావంతి, యమన్‌కళ్యాణి, సారంగ, బృందావనసారంగ మొదలగు రాగములలోను, పాశ్చాత్య సంగీతమునకు ప్రధాన నిష్పత్తిగల రాగము శంకరాభరణమున నోటు స్వరసాహిత్యములను రచించిరి. సంగీతము సర్వజనానందకరము. జానపద, శాస్త్రీయాది వివిధ గానములన్నియు, ఆబాలగోపాలానంద జనకములు. అందుకని ఆ భావనతో సర్వజన సర్వదేవతారూపము ఒక్కటియనే దృష్టితో తీర్చిదిద్దిన మహామనీషులు ముత్తుస్వామి దీక్షితులు.

## -: భారతీయ సంగీతము :-

శ్లో॥ కర్ణాలంబిత కంబలాశ్వతర యోర్గీతాఽమృతా స్వాదనా
దాన్దోళీకృతమౌళి నిర్ఝర నదీ తారఙ్గ పాటశ్రియః।
నృత్య చ్చంద్ర కలాకలాపవిలసద్ బ్రహ్మాండ ఖండాన్తరమ్
తంతూర్యత్రయ ఘోషరూపవపుషం వందేభవానీపతిమ్॥

చతుర్విధ పురుషార్థప్రదమైనది సంగీతము. శ్రీ మహాదేవుడు తౌర్యత్రికమను విద్యను సృష్టించి, సర్వులకు సులభసాధ్యముగ నభ్యసించి పురుషార్థములగు ధర్మ, అర్థ, కామ, మోక్షముల నందుటకు ఈ సంగీత విద్యను ముందు పార్వతికి, తండువునకు, బ్రహ్మకు నుపదేశించిరి. పార్వతి వద్ద బాణాసురుని కుమార్తె 'ఉషాకన్య' ఆమెనుండి గోపికలు, గోపికల నుండి సౌరాష్ట్రదేశపుస్త్రీలు నేర్చుకొని యభివృద్ధిపరచిరి. 2) తండువనగా నందికేశ్వరుడు. ఆయన నేర్పిన విద్యను ధన్వంతరికి, ఆధన్వంతరి అశ్వనీ దేవతలకు వారు అగస్త్య మహర్షికి నేర్పిరి. అగస్త్యునివలన మహర్షులు, వారివలన కొందరు మానవులు నేర్చుకొని అభివృద్ధిపరచిరి. 3) బ్రహ్మ తాను నేర్చిన విద్యను భరత మునికి, ఆ భరత ముని రంభాది

అప్సరసలకు నుపదేశించిరి. ఈ విధముగా మూడుశాఖలుగా పరంపరాను గతముగ నభివృద్ధి వివిధరూపములుగాంచినవి.

ఈ సంగీతము రెండువిధములు. 1) ఉపాసనావద్ధతి 2) లక్ష్యలక్షణ ములతో లౌకికానంద దాయకపద్ధతి. త్యాగయ్య గారు "నాదోపాసనచే శంకర, నారాయణ, విధులు, వెలసిరి ఓమనసా" అనిన విధముగా, సప్త స్వరములు స్వాధీనమగుటకు ఒక్కొకక్క వారమున ఒక్కొకక్క స్వరమును నక్షత్ర, వస్త్ర, భూషణ, లేపన, పుష్ప, నివేదన, ఛందస్సు, రస, బీజాక్షర ములతోనుపాసించి స్వరసిద్ధినిపొందుట ఉపాసనాపద్ధతి. ఈ విధముగా నుపాసించి సిద్ధినందిన మహానుభావులు పంచభూతమయ ప్రకృతిని పుల కింపజేసి, లోకకళ్యాణమొనరింతురు. జయదేవాదులు ఆకోవకు చెందిన వారు. మేఘరంజని, దీపకళిక, అమృతవర్షిణి, గుండక్రియ, చారుకేశి, జీవంతిక మొదలగు రాగములనాలపించి, వర్షములు కురిపించుట, దీప ములు వెలిగించుట, రాళ్ళను కఱగించుట, చెట్లను చిగురింపజేయుట, చని పోయినవారిని బ్రతికించుట మొదలగు మహిమలను సంగీతము ద్వారా లోకమునకు చాటిరి. ఈ విధముగా నుపాసించి ఆనందానుభూతిని పొంది సంగీతలక్ష్య లక్షణముల నభివృద్ధిపరచిన మహనీయులెందరెందరో భార తీయ సంగీత చరిత్రమున గోచరింతురు. అట్టివారు అగస్త్య, అత్రి, అభి నవగుప్త, కశ్యప, కాత్యాయన, కోహళ, జయముని, తుంబుర, అర్జున, ధన్వంతరి, దత్తిల, నందికేశ్వర, నారద, బృహస్పతి, భరత, భృంగి, మతంగ, మాతృగుప్త, మారుతి, యాజ్ఞవల్క్య, రావణ, వినాయక, విరిం చాదులెందరోగలరు. వారురచించిన గ్రంధములు లభించుట దుస్తరము. కొన్ని తాళపత్రి గ్రంధములయందు పూర్వగ్రంధాలయములలో నిక్షిప్త ములైనవి. ప్రస్తుతం మనకు లభించు పూర్వగ్రంధములలో 11వ శతాబ్ద మునాటిది శార్ఙదేవ విరచిత 'సంగీతరత్నాకరము' మరియు కాత్యాయన భరత, కోహళ భరత, చతుర సభావిలాస, సంగీతసుధ, సంగీతసారామృత వేంకటమఖి విరచిత "చతుర్దండి ప్రకాశిక" మొదలైన కొన్ని గ్రంధ ములు దేవనాగరలిపిలోనున్నవి అక్కడక్కడ లభించుచున్నవి. వానినిబట్టి పూర్వుల విషయము కొంతతెలియుచున్నది.

సంగీతరత్నాకరము ప్రాచీన గ్రంథము. శార్ఙ్గదేవ, సోమనాథ, రామామాత్య, వేంకటమఖి మొదలైన లాక్షణికులు తమపూర్వీకుల గ్రంథస్థ విషయములను తమతమ గ్రంథములయందు వివరించిరి. వ్యాసుడు పురాణములలో అక్కడక్కడ ఈ సంగీతవిషయములను పేర్కొనిరి.

శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరమును ఏడుఅధ్యాయములుగా విభజించిరి. 1) స్వరాధ్యాయము 2) రాగవివేకాధ్యాయము 3) ప్రకీర్ణకాధ్యాయము 4) ప్రబంధాధ్యాయము 5) తాళాధ్యాయము 6) నానావిధవాద్యాధ్యాయము 7) నర్తనాధ్యాయము. వీనినిగూర్చి సంగ్రహ వివరణము 1. స్వరాధ్యాయమున స్వరముల ఉత్పత్తి, స్వరధ్వనులు, వాని వివరణ 2. రాగవివేకాధ్యాయమున రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగ రాగవిభజనాదుల గురించి వివరణ 3 ప్రకీర్ణకాధ్యాయమున పూర్వగాయకుల గాయక గుణదోష వివరణము 4 ప్రబంధాధ్యాయమున ప్రబంధలక్షణము (అనగా) స్వరము, బిరుదము, పదము, తెన్నకము, పాటము, తాళము అను ప్రబంధమునకు అంగములగు వాని వివరణ 5. తాళాధ్యాయమున తాళలక్షణము, తాళవిభజన, సశబ్ద, నిశ్శబ్దక్రియలు, తాళదశప్రాణ వివరణ 6. నానావిధవాద్యాధ్యాయమున వాద్యవిభజనము సుషిర, ఘన, తంత్రీ, చర్మ, జలవాద్య విభజన లక్షణముల వివరణ 7. నర్తనాధ్యాయమున నాట్యము, నృత్యము, నృత్తవిభజన, నవరస భావప్రకటన, ఆంగికాది లక్షణములతోకూడిన శాస్త్ర సంబంధ విషయములనేర్చికూర్చి రచించిరి. దానికి 'సంగీత రత్నాకర'మను పేరిడిరి.

అటుపిమ్మట వేంకటమఖి తమ "చతుర్దండిప్రకాశిక" 10 ప్రకరణములుగా విభజించి రచించిరి. 1) వీణాప్రకరణము 2) శ్రుతి 3) స్వర 4) మేళ 5) రాగ 6) ఆలాప 7) ఠాయ 8) గీత 9) ప్రబంధ 10) తాళప్రకరణములుగా కూర్చిరి.

ఇందు ఉదాహరణకు : గీతలక్షణము

శ్లో॥ సుస్వరం సరసంచైవ సరాగం మధురాక్షరమ్।
సాలంకారప్రమాణంచ షడ్విధంగీతలక్షణమ్॥ అని

ఈవిధముగా వానివాని లక్షణములను శ్లోకరూపమున తెలియజేసిరి.

పూర్వలాక్షణికుల గ్రంథ వివరణ:

1. నందికేశ్వరుడు=అభినయదర్పణము 2. భరతుడు=నాట్యశాస్త్రము 3. నారదుడు=సంగీత మకరందము 4. మతంగుడు=బృహద్దేశి 5. పార్శ్వదేవుడు=సంగీత సమయసారము 6. గోవిందదీక్షితులు=సంగీత సుధానిధి 7. రామామాత్యుడు=స్వర మేళకళానిధి 8. సోమనాధుడు=రాగవిబోధము 9. రఘునాధభూపతి=సంగీతసుధ 10. అహోబలుడు=సంగీతపారిజాతము 11. తులజాజి=సంగీతసారామృతము 12. ప్రతాపమహారాజు=సంగీతచూడామణి 13. విద్యారణ్యుడు=సంగీతసారము. ఈ విధముగా ఎందరోమహానుభావులు సంగీత సాగరమును మధించి తమతమ కాలమునాటికి ఒక స్థితిని ఏర్పరచి పోషించిరి.

నారదుని సంగీత మకరందమున 36 రకముల వీణలను తెల్పిరి. వారాహి, హంసి, మయూరి, కచ్ఛపి, మహతి, రుద్రి, బ్రహ్మ, విష్ణు, మొదలైన నామములుగలవు. రాగవిభాగమున పూర్వగ్రంధములో మేళకర్తలు 18, 19, 21, 22 గా చెప్పబడి తరువాత 72 మేళకర్తలుగ నిర్ణయించి వాటికి ''కటపయాది'' సూత్రానుసారము నామములను కల్పించిరి. కర్ణాటక సంగీతమున రాగాంగరాగములు 72. వీనిని జనకరాగములు, జననీరాగములు, రాగాంగరాగములు, మేళకర్తరాగములందురు. హిందుస్థానీ సంగీతమున మేళకర్తరాగములు 12. పాశ్చాత్య సంగీతమున ఈ మేళకర్తలను పేరెంట్సు రాగములు, రూడ్ రాగములని యందురు. వారికి రూడ్ రాగములు 3 అని తెలియుచున్నది.

వేంకటమఖి ఈ 72 మేళముల నామములలో కొన్ని ద్విత్వాక్షరము లుండుటచేత కటపయాది సూత్రమునకు అనుగుణ్యముగ తాము పేర్లు కల్పించిరి. రాగాంగరాగ లక్షణగీతములు, మూర్ఛనాదులను రచించుటచే వేంకటమఖి సంప్రదాయమను శాఖ ఏర్పడినది. మరియు శ్రుతులనామములకు ర, రి, రు, గ, గిగు, మ, మి, ధ, ధి, ధు, న, ని, ను, అని క్రొత్తసూచనలను సూచించిరి. ముఖ్యముగ వారునిర్ణయించినమేళకర్త నామములు పూర్వనామముల వివరణనిచ్చుట సమంజసము. మిగిలిన సంగీత శాస్త్రవిషయములను సంగీత గ్రంధములవలన గ్రహించవచ్చును.

కాలానుగుణ్యముగ దేశవిదేశగానములు రేడియోలు, టి వి. ల ద్వారా విని, ఒకరి సంగీతమందలి అందమైన సంచారాది విశేషముల ననుకరించి యా నందించుట, పాడుటచేత ఈనాడు చాలారాగములు, ఉపాంగ రాగములు, భాషాంగములుగను, భాషాంగములు, ఉపాంగములుగను, మార్పుచెందు చున్నవి. వేష, భాషాచారములు కాలానుగుణ్యముగ, దేశానుగుణ్యముగ మారుచున్నట్లు ఈ సంగీతసంప్రదాయమునగూడ మార్పులు జరుగుచుం డుట గమనించదగినవిషయము. పూర్వము గానకచేరీలు ఒక క్రమపద్ధతిగ జరుగుచుండునవి. ముందు వర్ణము గణపతి, సరస్వతులప్రార్థన మొదలగు పద్ధతి ఇప్పుడు కొన్ని గానకచేరీలు అనేకసహకార వాద్యములతో శాస్త్రీయ సంగీతమునకన్న అన్నమయ్య, రామదాస, దేశభక్తి, మధ్యలో పద్య ములు ఏవేవో పాడుచు జనాదరణమునందుట చూచుచున్నాము. అయితే

''యశ్శాస్త్రవిధిముత్సృజ్యవర్తతేకామకారతః।
నససిద్ధిమవాప్నోతి నసుఖం నపరాంగతిం॥'' అను స్థితికలుగును

గాన శాస్త్రమర్యాదనువదలి సంప్రదాయమునువిడచి, కాలానుగుణ్యముగ సంచరించిన తాత్కాలిక ఫలితము లభించునేమోగాని, సంగీత పరమార్థ మగు మోక్షము, భక్తి సిద్ధించుట దుర్లభము అని పెద్దల వచనము. ఈ జరుగు మార్పు విశేషములు కాలమునకేవదలుట ధర్మము.

| శుద్ధమధ్యమ పూర్వమేళములు | వేంకటమఖి నామములు |
|---|---|
| 1 కనకాంగి | కనకాంబరి |
| 2 రత్నాంగి | ఫేనద్యుతి |
| 3 గానమూర్తి | గానసామవరాళి |
| 4 వనస్పతి | భానుమతి |
| 5 మానవతి | మనోరంజని |
| 6 తానరూపి | తనుకీర్తి |
| 7 సేనావతి | సేనాగ్రణి |
| 8 హనుమతోడి | జనతోడి |
| 9 ధేనుక | ధునిభిన్నషడ్జమము |
| 10 నాటకప్రియ | నటాభరణం |

| | | |
|---|---|---|
| 11 | కోకిలప్రియ | కోకిలారవం |
| 12 | రూపవతి | రూపవతి |
| 13 | గాయకప్రియ | గేయహెజజ్జి |
| 14 | వకుళాభరణం | వాటీవసంతభైరవి |
| 15 | మాయామాళవగౌళ | మాయామాళవగౌళ |
| 16 | చక్రవాకం | తోయవేగవాహిని |
| 17 | సూర్యకాంతం | ఛాయావతి |
| 18 | హాటకాంబరి | జయశుద్ధమాళవి |
| 19 | ఝుంకారధ్వని | ఝుంకారభ్రమరి |
| 20 | నఠభైరవి | నారీరీతిగౌళ |
| 21 | కీరవాణి | కిరణావళి |
| 22 | ఖరహరప్రియ | శ్రీరాగం |
| 23 | గౌరీమనోహరి | గౌరీవేగావళి |
| 24 | వరుణప్రియ | వీరవసంత |
| 25 | మారరంజని | శరావతి |
| 26 | చారుకేశి | తరంగిణి |
| 27 | సరసాంగి | సౌరసేన |
| 28 | హరికాంభోజి | హరికేదారగౌళ |
| 29 | ధీరశంకరాభరణం | ధీరశంకరాభరణం |
| 30 | నాగానందిని | నాగాభరణం |
| 31 | యాగప్రియ | కళావతి |
| 32 | రాగవర్ధని | రాగచూడామణి |
| 33 | గాంగేయభూషణి | గంగాతరంగిణి |
| 34 | వాగధీశ్వరి | భోగచ్ఛాయానాట |
| 35 | శూలిని | శైలదేశాక్షి |
| 36 | చలనాట | చలనాట |

## ప్రతిమధ్యమ మేళకర్తలు

| | | |
|---|---|---|
| 37 | సాలగము | సౌగంధిని |
| 38 | జలార్ణవము | జగన్మోహిని |

| | | |
|---|---|---|
| 39 | ఝాలవరాళి | ధాళివరాళి |
| 40 | నవనీతము | నభోమణి |
| 41 | పావని | కుంభిని |
| 42 | రఘుప్రియ | రవిక్రియ |
| 43 | గవాంభోధి | గీర్వాణి |
| 44 | భవప్రియ | భవాని |
| 45 | శుభపంతువరాళి | శివపంతువరాళి |
| 46 | షడ్విధమార్గిణి | స్తవరాజ |
| 47 | సువర్ణాంగి | సౌవీర |
| 48 | దివ్యమణి | జీవంతిక |
| 49 | ధవళాంబరి | ధవళాంగి |
| 50 | నామనారాయణి | నామదేశి |
| 51 | కామవర్ధని | కాశిరామక్రియ |
| 52 | రామప్రియ | రమామనోహరి |
| 53 | గమనశ్రమ | గమకక్రియ |
| 54 | విశ్వంభరి | వంశవతి |
| 55 | శ్యామలాంగి | శ్యామల |
| 56 | షణ్ముఖప్రియ | చామరం |
| 57 | సింహేంద్రమధ్యమం | సుమద్యుతి |
| 58 | హేమవతి | దేశిసింహారవం |
| 59 | ధర్మవతి | ధర్మవతి |
| 60 | నీతిమతి | నిషధ |
| 61 | కాంతామణి | కుంతల |
| 62 | రిషభప్రియ | రతిప్రియ |
| 63 | లతాంగి | గీతప్రియ |
| 64 | వాచస్పతి | భూషావతి |
| 65 | మేచకళ్యాణి | శాంతకళ్యాణి |
| 66 | చిత్రాంబరి | చతురంగిణి |
| 67 | సుచరిత్ర | సంతానమంజరి |

| | |
|---|---|
| 68 జ్యోతిస్వరూపిణి | జ్యోతి |
| 69 ధాతువర్ధని | ధాతపంచమి |
| 70 నాసికాభూషణి | నాసామణి |
| 71 కోసలము | కుసుమాకర |
| 72 రసికప్రియ | రసమంజరి |

ఈ 72 మేళకర్తలనామములు పూర్వమేళ, వేంకటమఖి మేళములుగా నిర్ణయించినవానిలో ఆనాటి స్థితినిబట్టి ఏవిధముగ నిర్ణయించిరోగాని ఈనాడు వానియందు కొన్ని గుణదోషములుగలుగుచున్నవి.

మేళకర్తయన, సప్తస్వరములు కలిగి ఆరోహణ, అవరోహణములందు ఒకే శ్రుతులు కలిగియుండుట నియమము. ప్రతి జనకరాగ మూర్ఛన, సరిగమపదని - సనిదపమగరి అని సప్తస్వరములుండవలెను. సంఖ్యనుబట్టి రాగశ్రుతులు, రాగనామమునుబట్టి సంఖ్య తద్వారా శ్రుతులు తెలుసుకొనుటకు కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్ట యని ఒక సూత్రముప్రకారము నిర్ణయించిరి.

1) క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, (9) ఞ వరుసగా 1,2,3,4,5,6,7,8,9 ఞ 0. 2) ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, (9) న, (0). 3) ప, ఫ, బ, భ, మ 5 సంఖ్యలు. 4) య, ర, ల, వ, శ, ష, స, హ 8 సంఖ్యలు. ఈ ప్రకారము మాయామాళవగౌళ రాగము మ పవర్గున 5 - య యవర్గున 1 = 51. దీనిని తల్లక్రిందు చేసిన 15 వచ్చును. ఇటులనే అన్ని మేళకర్తలు ఇందు పూర్వమేళకర్తలయందు(కొన్ని పేర్లు)చక్రవాకం, సూర్యకాంతం, షడ్విధమార్గిణి, దివ్యమణి, విశ్వంభరి, షణ్ముఖప్రియ, సింహేంద్ర మధ్యమం, ధర్మవతి మొదలైన రాగముల పేర్లలో చక్రిలో కకు ప్రాధాన్యమా లేక రేఫకు ప్రాధాన్యమా మొదలగు సందేహముకలుగుచుండును. అందువలన సాధు పదములతో వేంకటమఖి వేరుపేర్లు నిర్ణయించిరి.

(ద్విత్వ అక్షరములో దేనికి ప్రాధాన్యత అను సందేహము.)

ఇదిఒక ఉపయోగమయిన పనియే కానీ వేంకటమఖి నామములలో 22) శ్రీరాగం 20) నారీరీతిగౌళ 28) హరికేదారగౌళ 31) కళావతి 38) జగన్మోహిని మొదలైన పేర్లు ఆ సంఖ్య కొరకు మేళకర్తలుగా నిర్ణయించిరి.

పై రాగములు జన్యరాగములుగా వ్యవహరించబడుచున్నవి. ఉదాహరణకు శ్రీరాగము యొక్క మూర్ఛన సరిమపనిస = సనిపమరిగరిస ఇది 22వ మేళకర్త జన్యరాగము. ఇందు సప్తస్వరములు క్రమముగా లేవు. మేళకర్తగా నిర్ణయించుటకు శాస్త్రసమ్మతముగాదు. గానవిజ్ఞులు వీని గుణదోషములను గమనించి నిర్ణయించగలరని పండితులకువిడచుచుంటిని. మరియు ఆయా రాగమూర్ఛనలు, ఆయా కృతులయందు తెలియజేయబడునని గమనించగలరు. కాలానుగుణ్యముగ అభిరుచులననుసరించి అన్ని విషయములయందు కలుగు మార్పులు కలికాలమహిమయో లేక స్థిరత్వములేని మానవుల మనోవేగగమనపరిణామమో, ఊహించరానిది. ఏదిఏమైనను శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు సంగీత, సాహిత్య, మంత్ర, తంత్ర, యోగ, జ్యోతిష, ఉపాసనా ద్వైతముల సిద్ధపురుషులు. సర్వశాస్త్రములను తమరచనల ద్వారా లోకానికి అందించిన మహాత్ములు. శ్రీవారి రచనలలో ఒక్కొకక్క కృతి దైవాకృతియై స్వస్వరూపాను సంధాయకమై ముక్తిప్రదమైనవి.

షట్పంచాశత్కోటిభేదైః। అంతర్భేదైరసంఖ్యకైః।
స్వరైః సిద్ధైః పదైర్గమ్యైః। పాఠయామాస నారదమ్॥

సరస్వతి నారదునకు అనేక కోట్ల రాగములను, అంతర్భేదములను నేర్పినట్లు బ్రహ్మవైవర్త పురాణమున చెప్పబడినది.

"గీతిగానేన యోగాస్యాత్ యోగాదేవశివైక్యతా"

కనుక నేను నా యథాశక్తి, యథామతి, ప్రతికృతిని వ్యాఖ్యానముతో పాఠకలోకమునకందించ సాహసించితి. నాసాహసమును విజ్ఞులు మన్నింతురుగాత.

గ్రంథవిస్తరభీతిచే పూర్వసంగీతశాస్త్ర విషయములను సంగ్రహముగా తెలియజేసితిని. పూర్వముద్రిత గ్రంథములయందు సంగీత లక్షణములను సంపూర్ణముగా గ్రహించగలరు. కృతులవ్యాఖ్యానములలో విశేష విషయములు గమనించగలరు.

ఇతి శమ్



శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ తిరుత్తణి గురుగుహ కృతులు

## 1

15వ మేళకర్త మాయామాళవగౌళ రాగం-ఆదితాళం

శృతులు ర,గు,మ,ప,ద,ను

ప॥ శ్రీనాథాది గురుగుహో జయతి జయతి।
శ్రీ చిదానంద నాథోఽహమితి సంతతం హృదిభజామి॥

అ॥ నానాప్రపంచ విచిత్రకరో। నామరూప పంచభూతాకరో। అ
జ్ఞానధ్వాంత ప్రచండ భాస్కరో। జ్ఞానప్రదాయకో మహేశ్వరో॥

మ॥సా॥ దీనావనోద్యుక్త దివ్యతరో। దివ్యౌఘాది సకలదేహధరో
మానసానందకర చతురతరో। మద్గురువరో మంగళం భవతు॥శ్రీ

చ॥ మాయామయ విశ్వాధిష్ఠానో। మాతృకాది మతానుష్ఠానో।
మాలినీ మండలాంతవిధానో। మంత్రాద్యజపాహంసధ్యానో।
మాయాకార్యకలనాహీనో। మామకసహస్రకమలాసీనో।
మాధుర్యగానామృతపానో। మాధవాద్యభయవరప్రదానో।
మాయాశబళిత బ్రహ్మరూపో। మారకోటిసుందరస్వరూపో॥

మ॥సా॥ మతిమతాంహృదయగోపురదీపో। మత్తశూరాదిజయప్రతాపో।
మాయామాళవగౌళాదిదేశ। మహీపతిపూజితపదప్రదేశో।
మాధవాద్యమరబృంద ప్రకాశో।మహేశస్యమహార్థోపదేశో॥ ॥శ్రీ

వ్యాఖ్యానము:

దీక్షితులవారు పూర్ణదీక్షాపరులు శాక్తేయ సంప్రదాయకులు ఈ విధముగ గురుధ్యానము చేయుదురు.

శ్లో॥ శ్రీనాథాది గురుత్రయం గణపతిం పీఠత్రయం భైరవమ్
సిద్ధౌఘం వటుకత్రయం పదయుగం దూతీక్రమం మండలమ్।
వీరాద్వ్యష్ట చతుశ్చ షష్టినవకం వీరావళీపంచకమ్
శ్రీమన్మాలిని మంత్రరాజసహితం వందే గురోర్మండలమ్॥

ప్రారంభమున శ్రీనాథాదిగురుత్రయం గనుక తిరుత్తణిలో సుబ్రహ్మణ్యేశ్వరానుగ్రహము కలిగిన పిమ్మట రచించబడిన ప్రథమ కృతి.

ప్రథమావిభక్తి రచన. వీరిముద్ర 'గురుగుహ' ఇది ఎన్నుకొనుటలో వీరిహృద్గతభావము దీపించును. ''గు''శబ్దస్త్వంధకారఃస్యాత్ రు కారస్తన్నిరోధకః। అంధకార నిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే॥ గురువన అజ్ఞానమను చీకటిని పోగొట్టి జ్ఞానమను వెలుగునిచ్చువాడు. గురువు త్రిమూర్తి స్వరూపుడు. గురువునకును, దైవమునకును అభేదము. దైవమే గురురూపమున విజ్ఞానజ్యోతిని వెలిగించును. కాన ముందు గురుశబ్దమును ''గుహ''యన సుబ్రహ్మణ్యేశ్వరుడు.

గురుగుహానుగ్రహ పాత్రుడగుటచే ''గురుగుహ'' ముద్రను నిర్ణయించిరి. మరియొక విశేషమేమన, ''అహంబ్రహ్మాస్మి'' యను స్థితి కలిగిన గురువునకు, దైవమునకు, తనకు అవినాభావ సంబంధము. గురువు, శిష్యుడు, దైవము ఒక్కటే యను భావమున ఈ కృతిని ప్రారంభించిరి. శ్రీనాథాది గురుగుహోజయతి ముందు శ్రీకారముతో ప్రారంభము శుభ సూచకము. లక్ష్మీ సనాథుడైన నారాయణుడు మొదలగువారు గురుగుహ రూపమున ప్రకాశించుచున్నారు. నా గురువైన శ్రీ చిదానందనాథః శ్రీ చిదంబరనాథస్వామియే అహమితి నేనేయని సంతతం=ఎల్లప్పుడు. హృది భజామి=హృదయమునందు సేవించుచున్నాను. పాఠాంతరము 'హృదిని భజ' హృదయమునందు సేవించుము. సాధువుకాదు.

అ॥ చిత్ర విచిత్రముగ ప్రపంచమును సృజియించువాడు, సగుణరూప నామములతో కూడిన పంచభూతములకు స్థానమైనవాడు. అజ్ఞానమను చీకటికి సూర్యుడు, జ్ఞానమునొసగునీశ్వరుడు దీనులను రక్షించు దివ్య రూపుడు, దివ్యశక్తిచే సకల దేహములధరించువాడు, మనస్సునకానందమును కలిగించువాడైన నా గురువు శుభమును కలుగజేయుగాత.

చ॥ ప్రకృతిమాయ. మాయతోగూడిన ప్రపంచమునందున్న వాడు, గుణ కర్మలచే నేర్పడిన మతములకాధారమైనవాడు, తేజోమండలరూపుడు, అజపా గాయత్రీమంత్రాదుల హంసయై, సోఽహం తానేయై, ధ్యానమూర్తియైనవాడు, మాయాకార్యములను కలుగజేయువాడు, నా యొక్క

సహస్రారకమలమందున్నవాడు, మధుర సంగీతామృత రసాస్వాదన శీలుడు, విష్ణ్వాదిదేవతలకు అభయవరములనొసంగువాడు, మాయానిర్మిత బ్రహ్మరూపుడు, కోటి మన్మధ సుందరరూపుడు, బుద్ధిమంతులహృదయ మనే గోపురమందు ప్రకాశించువాడు, దుష్టపరాక్రములైన శూరులను జయించు ప్రతాపము గలవాడు, మాయా, మాళవ, గౌళ మొదలైన దేశ పరిపాలకమహారాజులచే పూజించబడిన పాదములు గలవాడు, లక్ష్మీపతి మొదలైనదేవతలకు పరమేశ్వర తత్వమునుపదేశించు "గురుగుహ" మూర్తిని ఎల్లప్పుడు నా హృదయమందు సేవింతును.

ఈ కృతిలో గురుదేవతాద్వైత, సగుణ, నిర్గుణ నిరూపణ మొనర్చిరి.

గురువు, దైవము, సగుణ, త్రిమూర్తి, ప్రపంచకారణ, స్థితి, ఆనంద మయునిగ, వర్ణించిరి.

సంగీతమును ప్రారంభించువారు వికృతిచెందని శుద్ధ స్వరములు గల మాయామాళవగౌళ రాగమున మొదలిడుదురు. ఆదితాళము మొదట ప్రారంభించుతాళము.

ఈ రాగశ్రుతులు శుద్ధరిషభ, అంతరగాంధార, శుద్ధమధ్యమ, పంచమ శుద్ధదైవత, కాకలినిషాదములు. ఈ శ్రుతులు వికృతిచెందనివి. మిగిలినవి వికృతిచెందును. ఆదితాళము చతురశ్ర జాతి త్రిపుటతాళము, లఘువు 4 క్రియలు రెండు దృతములు 2 + 2 = 4 మొత్తం 8 క్రియలు సమమైన సంఖ్యగలవి. అక్షరాభ్యాస ప్రారంభమున "ఓంనమశ్శివాయ సిద్ధంనమః" అని ప్రారంభించునటుల, సంస్కృత ప్రారంభమున రామ శబ్దమెంత ప్రాధాన్యమో సంగీత ప్రారంభమున మాయామాళవగౌళ రాగము, ఆదితాళము అంత ముఖ్యమైనది. అది గమనించిన దీక్షితులవారు ఆదిలో శ్రీకారం మాయామాళవగౌళరాగం, ఆదితాళం, గురుదేవ ధ్యానమున మంగళం దిశతు యని శుభప్రదముగ రచించిరి. మరియొక విశేషము. ఈ కృతిగానమున ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములు ఆరోహణ అవరోహణాద్యలంకారములు జంటలతో కూడి పాడుట గమనించ దగును.

మూడు దేశములకు సంబంధించిన రాగము
(బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాలుల సరిహద్దు ప్రాంతం)

## రెండుకళల చౌకం

పల్లవి: సా , రీ గా మ । ప ద ని స్స । స ని ద ప మ గ రి
శ్రీ నా థా ది ।గురుగుహో - జయతిజయతి

సా స నీ నీ , ద దా । దా ప ప మ గా రి । రీ గ రి రి సా ని
శ్రీ చి దా నం ద నా । థో హమితి సంత తం హృ ది భ జా మి

సా , నీ ధా ఫ । ధ ని స రి । రీ స ని సా
శ్రీ నా థా ది । గురుగుహో - జయ తి

అనుపల్లవి : సా , రీ గ మా । ప స నీ । ద ప మా | రీ గ మా ప దా ।
నా నాప్రి పం । చవిచి త్రిక రో | నామరూ ప పం ।

ని దా ప । ప మ గా , మ | గా మా పా దా । ని దా ప । మా , గ రీ
చ భూ తా - క రో అ | జ్ఞా న ధ్వాంత । ప్రిచండ । భా స్క రో

మా పా ద నీ స । పా మ గ । గ రి సా
జ్ఞా న ప్ర దాయ । కో మ హే । - శ్వ రో

మధ్యమకాల సాహిత్యం | పా మా గ రీ రి స ని ధ ఫ ధ ని సా | ద ద ప స మా గ మ ।
దీ నా వ నో ద్యు - క్త ది - వ్య త రో | ది - వ్యౌ ఘా ది స ।

గ రి సా ని ద పా | స ని రి సా నీ గ రి స రి ని ద ని సా
క ల దే హ ధ రో | మా - న సా నం ద క ర చ తు ర త రో

రీ స ని ద పా మ । మ గ రీ , రి స ని
మద్గురు వ రో మం - గళం భ వ తు

చరణం: మా పా మ ద పా । మా గా । రీ సా | స్నీ ధ ని సా రి స ।
మా యామ య వి । శ్వా ధి ష్ఠా నో | మాత్మ క కా ది మ ।

గా రీ । గా మా | గా రి స స్నీ స రి ప । మా గ రి । స రి గా
తా ను ష్ఠా నో | మా లి - నీ మం ం డ । లాంత వి । ధా - నో

సా రీ గ మ పా । సా సా । ద ద పా | మా , గా మా ప ।
మం త్రా ద్య జ పా । హం స । ధ్యా - నో | మా యా కా ర్య ।

ద ప మా । గా మా | పా మ గ ద పా మ । సా ద ప మ గ । మా పా |
క ల నా । హి నో మా మ క స హ స్ర । క మ - లా - సి నో |

దా, నీ స్స నీ । సా ని స్స । నీ దా | నీ స రీ గ స రి । స గా రి ।
మా ధుర్య గా । నామృ త । పా నో | మా ధ వా ద్య భ య । వ ర ప్ర ।

సా నీ | సా రీ స ని ద ప । ప ద ని స్స । రీ సా | నీ స్స ని ద
దా నో | మా యా శ బ లి త । - బ్ర - హ్మ । రూ పో | మా ం కో టి

ప మ । ప దా ని । సా నీ | ద ని ద పా మ గ మ । గ మ ప
సుం । ద ర స్వ । రూ పో | మ తి మ తాం హృ ద య । గో - పు

ద । సీ దా | పా మ గా రీ స । రి గ మ ప । దా పా |
ర । దీ పో | మ త్త శూ రా ది । జ య - ప్ర । తా పో |

మ॥ సా॥ మా దా - మా ద ద - ప ప మా - గ రీ స । రి సా ని ధ స్ని స ।
మా యా - మా ళ వ గౌ - ళా ది దే శ । మ హీ ప తి పూ జి ।

మ గ ద ప - ని దా ప | మా గ పా మ ద ప - సా నీ
త ప ద - ప్ర దే శో | మా ధ వా ద్య మ ర - బృం ద

గ రీ స । మ గా రీ స స ని । ని దా ప - మ గ రి స ||
ప్ర కా శో । మ హే శ స్య మ హా - ర్ఘో వ దే - శో ||

## 2

## ఆనందభైరవి త్రిశ్ర ఏకతాళము

20వ మేళకర్త జన్యము — స గ రి గ మ ప ద ప ని స్స
స్స ని ద ప మ గ రి స

ప॥ మానసగురుగుహరూపంభజరేరే। మాయామయహృత్తాపంత్యజరేరే॥

అ॥ మానవజన్మని సంప్రాప్తేసతి। పరమాత్మని నిరతిశయసుఖం వ్రజరేరే॥

చ॥ సత్వగుణోపాధిసహిత సదాశివం। స్వావిద్యాసమేత జీవోద్భవం।
తత్వం తామసయుతవిశ్వవైభవం। తారకేశ్వరం ఆనందభైరవం॥

మ॥సా॥ నత్వాశ్రీగురుచరణం। కృత్వానామస్మరణం।
జిత్వామోహావరణం। మత్వాత్వదేకశరణం॥ ।మానస।

వ్యాఖ్య :- ఇది ద్వితీయావిభక్తి రచన. మనస్సునకు సంబోధన జేయబడినది. ఓ మనసా! గురుగుహరూపుని భజించుము, రేరే; ఒరే, ఒరే; అని రెండు పర్యాయములు హెచ్చరించినారు. మాయతోగూడిన, అజ్ఞానముచే కలిగిన, హృదయమందలి తాపమును విడిచి భజించుమురా! ''మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః''. బంధమునకు, మోక్షమునకు కారణము మనస్సు. కాన మానస సంబోధన గావించిరి.

అ॥ మానవజన్మము కలిగినందుకు పరమాత్మయందు, భగవంతుని యందు, గురువునందు భక్తికలిగి శాశ్వతసుఖమును పొందుమురా!

చ॥ సత్వరజస్తమో గుణములలో సత్వగుణమే శరీరముగా గల, సదాశివం-ఎల్లప్పుడు మంగళప్రదుని, స్వతనయొక్క అవిద్య అజ్ఞానముచే జీవుడుగా జన్మించిన వానిని, తత్ పదార్థరూపుని, తామసగుణరూపమైన ప్రపంచ వైభవము, విభూతి గలవానిని, తరింపజేయు ఈశ్వరుని ఆనందభైరవమూర్తిని, ఆనందనటనము చేయువానిని, ఆనంద రూపుని, పాదములను నమస్కరించి, గురుదేవనామమును స్మరించి, మోహము వలన కలిగిన మాయను జయించి, నీవే నాకు శరణ్యమని నమ్మి ఓ మనసా! గురుగుహమూర్తిని సేవింపుము. గురువు, దైవము, ఆనంద మూర్తులు. బ్రహ్మానందానుభవము నొసంగువారు. మనస్సుద్వారా ఆనందము కలుగును. అందువలన ఆనందభైరవి రాగమున, త్రిశ్రఏకతాళమున అనగా గురువు, దైవము, జీవుడు. ఈ మూటి గమనమున కలయికను, నిత్యానందము కలుగునని గురుగుహ తత్వమును తెల్పిరి.

ఒక కళ చౌకం

ప॥ పా ద ప మ గ రి । గ మ పా , మ మ గ ప మ । గ రి సా గ రి గ మ |
మా న స గురు - గుహ రూ - పం - - - భ జ రే రే - - - |

(2) సా రి సా ని | ని ని స ని మ గ రీ । గా మ గ మ ప పా ద ప ।
రే రే - - - | మా యా - మ - య । హృ త్తా - - - పం - -

మా ప మ గ రి గ రి గ మ | ||
త్య జ - రే - రే - - - | మా ||

అ॥ సా ప ప సా । స మ గ రి సా । రి సా ని ని స ప ప ।
మా న వ జ న్మ ని స ం ప్రా ప్తే - - స తి ప ర ।
సా ని ద ప ద । ని ప ద ని ద ప ద ప
మా త్మ ని ని ర తి శ య - సు ఖం - -
మా ప మ గ రి గ రి గ మ ॥
వ్ర జ - రే - రే - - - ॥

చ॥ సా మ గ మా । పా మ గ రి స ని । స గా మ పా
స త్వ గు ణో పా ధి స హి త - స దా శి వం
సా ని ద పా ద ప । మ మ గ రి గ రి సా , ని
స్వా వి - ద్య - - స మే - - - త జీ -
ని ని స ని సా । సా సా స మ । గ రి గ రి సా , ని ।
- వో - ద్భ వం త త్వం తా - మ స యు త వి -
ని ని ద ని సా । సా ని ద ని ప । స పా ద ని ప ।
శ్వ వై - భ వం । తా ర కే - శ్వ ర మా న ం ద ।
మ గ ప మ గ రి పా
భై - - - - ర వం

మ॥సా॥ సా సా సా స స స ని సా । మా గ రి స రి స ని ని ని సా
స త్వా శ్రీ గు రు చ ర ణం కృ త్వా - నా - మ - స్మ ర ణం
పా సా నీ దా ప ద స మ ।
జి త్వా మో హా వ ర ణ ం ।
గా మా ద పా మ గ రి గ మ ॥ మానస ॥
మ త్వా త్వ దే క శ ర ణ ం ॥

3

## పాడిరాగము రూపకతాళము

15 వ మేళకర్త జన్యము సరిమపదపనిస
సనిపదపమరిస

ప॥ శ్రీ గురుణా పాలితోస్మి, సచ్చిదానంద నాథేన॥

అ॥ ఆగమాదిసన్నుతేన। అఖిల విశ్వ వందితేన।
త్యాగరాజ విభాతేన। తాపత్రయ సమేతేన॥ శ్రీ॥

చ॥ వేదాంతార్థ వేద్యేన। వికల్పరోగ వైద్యేన।
నాదామృత సుపాద్యేన। నవ నాథేనాద్యేన।
సాదాఖ్య కళాకరేణ। సదాశివావతారేణ।
నాదాంతవిహారేణ। నవచక్రాధారేణ॥

మ॥సా॥ పాదాంబుజేన పరేణ। భేదాది విదారేణ।
ఆదిగురుగుహ వరేణ। కాది మతాను సారేణ॥ శ్రీ గురుణా॥

వ్యా॥ తృతీయావిభక్తి రచన. సంపత్సమ్యుక్తుడైన గురువుచేత పరిపాలింపబడితిని. సత్, చిత్, ఆనందమునకు నాథుడైన గురువుచేత, వేదములచేత నుతింపబడు వానిచేత, అన్నిలోకములచేత నమస్కరింపబడు వానిచేత, త్యాగరాజుగా ప్రకాశించు వాని చేత, దారేషణ, ధనేషణ, పుత్రేషణాది తాపత్రయములతో కూడినవానిచేత, వేదాంతార్థములచేత, "తత్త్వమస్యాది" వాక్యార్థములచేత తెలియదగిన వానిచేత, జననమరణ ప్రవాహ భవరోగమును పోగొట్టు వైద్యునిచేత, నాదమువలన గలిగిన అమృతరసమే పాద్యముగా గల వానిచేత, సాదాఖ్య=సకలమును ద=ఇచ్చు పేరుగల, కళలతోగూడిన కరములు గలవానిచేత, సదాశివుని రూపున అవతరించిన వానిచేత, నాదాంత= నాదమునకు చివర, సహస్రారము, నందు విహరించు వానిచేత, నవ చక్రములకు, భూపురము, షోడశ, అష్టదళ, చతుర్దశార, దశత్రికోణ,

అంతర్దశార, అష్టకోణ, త్రికోణ, బిందువు మొదలైన నవచక్రములకు ఆధారమైనవానిచేత, పద్మములవంటి పాదములుగలవానిచేత, పరునిచేత, భేదాదిభావములను పోగొట్టువానిచేత, ప్రథమ గురుగుహ శ్రేష్ఠునిచేత, కామాదులచే కలుగు మతముల ననుసరించు వానిచేత పాలింపబడితిని. గురువు సగుణ నిర్గుణరూపుడు. బాహ్యమున కర చరణాద్యవయవములతో కనిపించువాడు. అంతర్దృష్టిలో, నిర్గుణ రూపుడై, వేదాంతవేద్యుడైన పరబ్రహ్మ, సచ్చిదానంద రూపునిగ వర్ణించిరి. ఈ పాడి రాగమును, పహిడియని కూడయందురు. పాడి శబ్దము=తెనుగు పదము=ధర్మము, న్యాయము, క్షీరము,క్షీరదధ్యాది సమృద్ధిని, పాడియందురు. = అందువలన రాగనామము చేర్చలేదు

ఒక కళ చౌకం

ప॥ దా - ప మ రీ । స ని - ధ ధ ధ ని । సా - సా రి మ ।
శ్రీ గు రు ణా । పా- లి తో - - । స్మి - స -
ప ద - ద ద ప ని । సా - , సం ని ప ‖
చ్చి దా - నం ద । నా ధే - న ‖

అ॥ పా - ద పా మ । రీ - స స ని ధ । ధ ధ - ధ నీ స ।
ఆ గ మా ది స న్నుతే - న । అ ఖి ల వి శ్వ ।
రీ - మ పా ప | ప ద - ప నీ సం । రిం సం - సం సం ని రిం |
వం ది తే న | త్యా- గ రా జ । వి భా - తే - న |
సా - సం ని ప ద । ద ప - మ రి మ ప ‖ శ్రీ గురుణా ‖
తా ప - త్ర య । స మే - తే - న ‖

చ॥ రీ - మా రి । ప మ - మ రీ స । రి స - స ని ధా ।
వే దాం తా ర్థ వే - ద్యే న । వి క - ల్ప ర్లో ।

ధ ధ - ధ ని స । రి మ - పా మ ప । ద ప - ప పా మ ।
గ ద్బై - ద్యే న । నా - దా మృ త । సు హ - ద్యే న ।

రి రి - మా రీ । ప మ - రీ , స ।
న వ నా థే నా - ద్యే న ।

ధా - ధా ధ రి । సా - ప మా ప । సం ద - ద ప సీ ।
సా దా ఖ్యే క । ళా క రే ణ । స దా - శి వా ।

సం రిం - రిం సం ని సం । నీ - సాం ని రిం । సాం - , సం ని ప ।
వ తా - రే - ణ । నా దాం త వి । హా రే - ణ ।

ప ప - పా మా । రీ - , స ని స ।
న వ చ క్రా ధా రే - ణ ॥

మ॥సా॥ రీ మా - ప దా ప ప మా రి । మా రీ రి స - ద పా సీ సం ॥
పా దాం బు జే న ప రే ణ । భే దా - ది వి దా రే ణ ॥

రిం , సం - రిం సం ని ప ద పా మ ।
ఆ ది గు రు గు హ వ రే ణ ।

రీ స రి - స ని రి సా రి మ ప ॥ (శ్రీ) గురుణా ॥
శా ది మ తా - ను సా రే - ణ ॥

## 4

## సామరాగం ఆదితాళం

28వ మేళకర్త జన్యము స రి మ ప ద స
స ద ప మ గ రి స

ప॥ గురుగుహాయ, భక్తానుగ్రహాయ, కుమారాయ, నమోనమస్తే॥

అ॥ గురుగుహాయ. భక్తానుగ్రహాయ, గుణాతీతాయ, రూపరహితాయ॥

మ॥సా॥ హరిహర విరించిరూపాయ, సచ్చిదానందస్వరూపాయ, శివాయ॥

చ॥ సకలాగమ మన్త్రసారజ్ఞాయ, సత్సంప్రదాయ, సర్వజ్ఞాయ।
సకల నిష్కళప్రకాశకాయ, సామరస్య సంప్రదాయకాయ।

మ॥సా॥ వికళేబరకైవల్యదానాయ! వికల్పహీనాయ, విజ్ఞానాయ।
శుకవామదేవ వందితపదాయ। శుకవామదేవ ముక్తి భేదాయ
॥గురు॥

వ్యా॥ చతుర్థీవిభక్తి రచన. ప॥ గురుగుహస్వామికొఱకు, భక్తుల ననుగ్రహించువానికొఱకు, కుమారస్వామికై నమస్కారము అని సగుణరూపునికి నమోవాకములు. అ॥ సత్త్వరజస్తమోగుణముల కతీతుడు, రూపములేని, నిర్గుణరూపుడైన గురుగుహస్వామికి, భక్తుల ననుగ్రహించు స్వామికొఱకు నమస్సులు. అని బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపుడు, సచ్చిదానందరూపునికొఱకు. ఇచట ఒకటి సగుణము, రెండు నిర్గుణము. చ॥ సమస్త వేదమంత్రసారము తెలిసినవాడు, మంచి సంప్రదాయముల తెలిసినవాడు. అన్నియు తెలిసినవాడు, సర్వకళలను ప్రకాశింపజేయువాడు, సమరసభావము సంప్రదాయముగా గలవాడు, శరీరము లేకుండ కైవల్యమొసగువాడు, సంకల్ప వికల్పములు లేనివాడు, విజ్ఞానము గలవాడు, శుకమహర్షి, వామదేవ మహర్షులచేత నమస్కరింపబడిన పదములు గలవాడు, శుక. వామ దేవులకు వేరు వేరు ముక్తి నొసగువానికొఱకు నమస్కారము. వారి వారి స్థితినిబట్టి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తి యొసగువానికొఱకు అని సగుణ, నిర్గుణ, రూపమును నమస్కరించిరి. "సామరస్య" అను పదమున సామరాగ నామమును కూర్చిరి.

## రెండు కళల చౌకం

ప॥ ద ద ప మా మ పా । గా రీ । స రీ రి |
గు రు గు హా య భ క్తా ను గ్ర హా య |

ధ సా రి మ గ గ రి । రి స స ధ రి స । రీ సా ||
కు మా రా - య న మో - న - - మ - స్తే - ||

అ॥ స రి మ పా ప దా । పా మా । గ రీ గ |
గు రు గు హా య భ క్తా ను గ్ర హా య |

స ధా సా రీ రి । దా ప మ । గ రి రి స |
గు ణా తీ తా య । రూ ప ర హి తా - య |

స రి మ ప ద పా ద । మా దా । ద పా స |
హ రి హ ర వి రిం చి రూ పా య స చ్చి |

దా సా దా ప మ । మ గా రి । స రి మ మ ||
దా నం ద స్వ రూ - పా య శి వా - య || గురు ||

చ॥ స ధ సా రి మ గా । రి సా ధ । ధ రీ రి |
స క లా గ మ మం త్ర సా ర - జ్ఞా య |

సా రి మ గ గా రి । స రి మా । పా, ప |
స త్సం ప్ర దా య స - ర్వ జ్ఞా య |

ద ప ద మా ద దా । ప పా మ । ద ప ద ద |
స క ల ని ష్క ళ ప్ర కా శ । కా - - య |

సా ద పా మ మా । గ గా రి । రీ రీ |
సా మ ర స్య సం ప్ర దా య కా య |

మ॥సా॥ స ధ రీ రి రి మా మా మ దా పా మ ।
వి క ళే బ ర కై వ ల్య దా నా య ।

మ గా రి సా రీ । మ పా మా దా ద
వి క ల్ప హీ నా య వి జ్ఞా నా య |

స ద సా రి రి మ గ రీ స రి గ రీ రి ।
శు క వా మ దే - వ వం ది త ప దా య ।

స ద పా మ మా గ । రీ గ సా రీ మ
శు క వా మ దే వ ము క్తి భే దా య || గురు ||

5

## బలహంసరాగం జంపెతాళము

28వ మేళకర్త జన్యం — స రి మ ప ద స
స ని ద ప మ రి మ గ స

ప॥ గురుగుహాదన్యం నజానేఽహం । గుప్తాగమార్థ తత్వ ప్రబోధినో॥

అ॥ అరుణోదయానంత కోటి బ్రహ్మాండాకర శివాది ధరాంత తత్వ
స్వరూపిణో॥

చ॥ సహస్రదళ సరసిజ మధ్య నివాసినో ।
సకల చంద్ర భాస్కర తేజః ప్రకాశినో।
సహజానంద స్థిత దాస విశ్వాసినో ।
సచ్చిత్సుఖాత్మక స్వవిలాసినో ॥

మ॥సా॥ అహరహః ప్రబల హంస ప్రకాశాత్మనో ।
దహర విద్యా ప్రదాయక పరమాత్మనో ।
జహదజహల్లక్షణయా జీవైక్యాత్మనో ।
రహః పూజిత చిదానంద నాథాత్మనో ॥

వ్యా॥ పంచమీ విభక్తి రచన. గురుగుహస్వామికన్న వేరు వస్తువు నాకు తెలియదు. సర్వము గురుగుహ రూపమే "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అనినటుల. రహస్య వేద తత్వమును తెలియజేయు వాడు, సూర్యోదయముతో అనంతకోటి లెక్కలేనన్ని బ్రహ్మాండములకు ఆధారమైన శివుడు మొదలు భూమి వరకు గల తత్వస్వరూపుడు, సహస్రార కమలము మధ్య చిత్ స్వరూపుడై నివసించువాడు, సూర్య, చంద్రాగ్ని తేజో రూపమున ప్రకాశించు వాడు, నిజమైన ఆనందమును పొందిన దాసులయందు నమ్మిక గలవాడు, సత్, చిత్ రూపుడై సుఖస్వరూపుడై విలసిల్లు వాడు, నిరంతరము గొప్పదైన హంస గమనమును, రేచక, పూరక, కుంభక ములచే ప్రకాశించువాడు, ఆత్మవిద్య నొసగు పరమాత్మ రూపుడు మాయ, జ్ఞాన లక్షణములచే జీవుడు ఆత్మ తానే అయిన వాడు, రహస్యముగా పూజింపబడు చిదానంద నాథుని కంటె నాకేమియు తెలియదని, గురుదైవ యథార్థ తత్వమును తెలియజేసిరి. ఇందు ప్రబలహంస "అని" బలహంస రాగ నామమును కూర్చుట గమనించ దగినది.

రెండు కళల చౌకం

ప॥ స రి మ పా , మ గ రీ , స ధా । ధా - సా సా |
గు రు గు హా ద - న్యం స జా । నే హ ం |

సా ధా ధ సా రి పా ప మ రి స రి । రి రి - సా సా ||
గు ప్తా గ మా ర్థ త త్వ ప్ర బో - ధి నో - ||

అ॥ మ గ రీ ప మా దా ప పా దా । పా - దా సా |
అ రు ణో ద యా నం త కో టి బ్రం హ్మాం డా |

రి గ రి సా ని ప దా ప సా పా । మ గా రి మ గ గ రి |
క ర శి వా ది ధ రాం త త త్వ స్వ రూ పి ణో - - |

చ॥ స రీ రి స ని ధ ఫ ధ స రి మా గ రి । స రి - గ రీ ,
స హ స్ర - ద ళ స ర సి జ మ ధ్య ని । వా- సి నో

స ని ఫ ధా స రి మ గ రి పా ప మ । రి గ - స రి సా
స క ల చం ద్ర భా - స్క ర తే జః ప్ర కా - శి నో

స స పా రీ స రి గ రి దా ప స । స ప - ద ని పా
స హ జా నం ద స్థి త దా స వి - శ్వా - సి నో

దా సా , స రీ గ రి సా ని ప । పా - మ గ రీ ,
స చ్చి త్సు- ఖా త్మ క వి శ్వ వి । లా సి - నో

మ॥సా॥ రి గ రి సా స ని ఫ ధా సా రి గా రీ గ రీ స రి మ పా, దా
అహ ర హః ప్ర బ ల హం స ప్ర కా శాత్మ నో ద హ ర విద్యా

ప సా ని - ద ని ద పా ద సా
ప్ర దా య క ప ర మా త్మ నో

రి గ రి స రీ సా ని ప దా పా దా పా ద పా ప సా పా మ గ।
జ హ ద జ హ ల్ల క్ష ణ యా జీ వై క్యా త్మ నో ర హః పూ జి త

రి సా స - ని ఫ ధ స రి మ గ రి ॥ గురు ॥
చి దా న ం ద నా - థా - త్మ నో

## 6

## పూర్వీరాగము మిశ్రజాతి ఏకతాళము

15వ మే. జన్యము. స రి గ మ ప ద ని ద స
స ని ద ప మ ద మ గ రి స

ప॥ శ్రీగురుగుహస్య దాసోహం నోచేత్ చిద్గురుగుహ ఏవాహం॥

అ॥ భోగ మోక్షాత్మక చరణస్య భూపురాది నవావరణస్య ।
యోగి బృందాంతః కరణస్య యోగ పీఠాధి కరణస్య ॥

చ॥ సనకాది పూర్వీక మునిగణ సన్నుతానంద విగ్రహస్య ।
వనజ భవాది సకల సుమనో వాంఛితార్థానుగ్రహస్య ।
జనన లయాది రూప ప్రపంచాజ్ఞాన కార్య నిగ్రహస్య ।
మనన ధ్యాన సమాధి నిష్ఠ మహానుభావ హృద్గృహస్య ॥

మ॥సా॥ దినకర కోటి విభాస్వరస్య । తేజోమయ జగదీశ్వరస్య ।
జన రంజనకరస్య, వరస్య, సర్వస్వాత్పరస్య । హరస్య ॥ శ్రీ ॥

వ్యా॥ షష్ఠీ విభక్తిరచన. శ్రీ గురుగుహ స్వామికి దాసుడను లేదా, చిత్ స్వరూపుడైన గురుగుహ రూపుడను నేనే. అని భోగ, మోక్షముల నొసగు పాదములకు, భూపురము మొదలైన నవావరణ రూపునికి, యోగీశ్వరుల అంతఃకరణమున నున్న వానికి, యోగపీఠము నధిష్ఠించి యున్న వానికి, సనక సనందనాది పూర్వ మునిబృందము లచే సన్నుతించబడిన వానికి, బ్రహ్మాది దేవతల మనస్సునందలి కోర్కెలు దీర్చువానికి, పుట్టుట, చచ్చుట మొదలైన ప్రపంచ అజ్ఞాన కృత కార్యములను నిగ్రహించు వానికి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి యను అష్టాంగముల ద్వారా యోగుల హృదయమను గృహమునందున్న వానికి, కోటి సూర్యకాంతితో ప్రకాశించు వానికి తేజోరూపుడైన ఈశ్వరునికి, జనులను రంజింపజేయు వానికి, శ్రేష్ఠుడైన వానికి, అన్నిటికంటె పరమైన హరునకు దాసుడనని, యోగ మార్గమును సూచించిరి, "సనకాది పూర్వీక మునిగణ" అను పదమునపూర్వీ రాగ నామమును కూర్చిరి.

ప॥ సా , రి స ని ని స్రీ । స గ గ మ గ మ ద మ ప
శ్రీ - - గు రు గు । హ - స్య దా - - - సో -

గ రీ సా సా । సా , మా మా
హం - - నో చే త్

గ మ ప ని ప మా । గా మ ప మ గ మా రీ రి స స ని ।
చి - ద్గు రు గు హ ఏ - - - - - వా - - - - ।

సా , సా సా ‖
హం - - -

అ॥ పా గ మా గా । రి స ని స గా మ । పా స్ర ని దా ప మ ప
భో గ మో క్షా త్మ క చ ర ణ స్య . భూ పు - రా ది వ -

మ గ గ మ పా ని । నీ స్ర నీ దా । పా గ మ పా ని ।
వా - వ ర ణ స్య . యో గి బృం దాం । తః క ర ణ స్య .

నీ రి నీ సా । మ మా గ రీ స ‖ శ్రీ ‖
యో గ పీ ఠా ధి క ర ణ స్య

చ॥ గ మ పా ప మ ప । మా ప మ గ మ గ గ ।
స న కా ది పూ - ర్వ క ము ని - గ ణ ।

సా ని స గ మ గ మ ద । మ గా గ రీ స
స న్న తా - నం - - - ద వి గ హ స్య

ప ప ప గ మా మ । గ గ గ స గ రి స స్రీ ।
వ న జ భ వా ది . స క ల సు మ నో - -

సా గ మా పా । నీ ని దా పా |
వాం ఛి తా ర్థా ను గ్ర హ స్య |

మ గ మ ప నీ ని । సా నీ ద పా ।
జ న న ల యా ది । రూ ప ప్ర పం ।

మ ద పా ప ద మ ప । మ గా గ మా మ ||
చా - జ్ఞా న శా ర్య ని గ్ర హ స్య ||

గ రి స రి నీ స । స మ గ మ పా ప ।
మ న న - ధ్యా న । స మా - ధి ని ష్ఠ ।

స నీ మ పా గ । మా గ రి సా |
మ హా ను భా వ హృ ద్గ్ర హ స్య |

మ॥సా॥ రి రి రి స నీ స స గా మ పా ప ।
ది న క ర కో టి వి భా స్వ ర స్య ।

ద ప ద ప ద మ గ మ పా ని సా స ।
తే - జో - మ య జ గ దీ శ్వ ర స్య ।

స స నీ స రి రి సా స ద పా ప ।
జ న రం జ న క ర స్య వ ర స్య ।

సా సా గా మ గా మ రి సా ని ||
స ర్వ స్మా త్ప ర స్య హ ర స్య || శ్రీ ||

## 7

## భానుమతిరాగము ఖండజాతి త్రిపుటతాళము

4 వ మేళకర్త జన్యము సరిగరిమపస
సనిదపమగరిస

ప॥ శ్రీగురుగుహ స్వామిని భక్తిం కరోమి ।
నిరుపమ స్వమహిమ్ని పరంధామ్ని ॥

అ॥ కరుణాకర చిదానంద నాథాత్మని ।
కర చరణాద్యవయవ పరిణామాత్మని ।
తరుణోల్లాసాది పూజిత స్వాత్మని ।
ధరణ్యాద్యఖిల తత్వాతీతాత్మని ॥

చ॥ నిజరూప జిత పావకేందు భానుమతి ।
నిరతిశయానందే హంసే విరమతి ।
అజశిక్షణ రక్షణ విచక్షణ సుమతి ।
హరిహయాది దేవగణ ప్రణామవతి ॥

మ॥సా॥ యజనాది కర్మనిరత భూసురహితే ।
యమ నియమాద్యష్టాంగ యోగవిహితే ।
విజయవల్లీ దేవసేనా సహితే ।
వీరాది సన్నుతే వికల్ప రహితే ॥ శ్రీగురు॥

వ్యా॥ సప్తమీ విభక్తిరచన. శ్రీగురుగుహ స్వామియందు భక్తిని చేయుచున్నాను. సాటిలేని సంపదలు మహిమగల వాని యందు, పరంధాముని యందు, దయకు స్థానమైన చిదానంద నాథుని యందు, సంపూర్ణ కర, చరణాది అవయవములు గల వానియందు, వయసు, ఉత్సాహము మొదలైన వానితో పూజింపబడిన ఆత్మ

స్వరూపునియందు, భూమి మొదలైన అన్ని తత్వములకు అతీతుడైన వానియందు, అగ్ని, చంద్ర, సూర్య కాంతుల జయించిన నిజరూపుని యందు, శాశ్వత బ్రహ్మానందమందు హంసయై రమించు వానియందు బ్రహ్మాదులచే సృష్టి, స్థితి, లయములొనర్చు మతిగల వానియందు, ఇంద్రాది దేవతలచే నమస్కరింప బడు వానియందు, యజ్ఞ యాగాది కర్మము లాచరించు బ్రాహ్మణులకు మంచిని కలుగజేయు వానియందు అష్టాంగ యోగములతో కూడిన వానియందు విజయవల్లీ, దేవసేనా సహితుడు, వీరులచే నుతింపబడిన వానియందు, వికల్పములు లేని సుబ్రహ్మణ్యేశ్వరుని యందు భక్తిని చేయుచున్నాను కలిగియున్నాను. ఇందు భానుమతిరాగనామమును కూర్చిరి.

## రెండు కళల చౌకం

ప॥ స̇ ని ద పా , పా ద మ । ప మ రి గ । స రి గ స |
గు రు గు హ స్వా మి ని । భ - క్తిం । క రో - మి |

ని̣ ధ̣ ని̣ సా , రీ మ మ । మ ప ప స̇ । స̇ ని ద ని ||
ని రు ప మ స్వే మ హి - మ్ని ప రం । - ధా - మ్ని ||

అ॥ రి మ పా ద ప ని దా ప । ప మ ప మ । గా రి స |
క రు ణా క ర చి దా నం - ద నా - ధా త్మ ని |

స ని̣ ధ̣ ని̣ ధ̣ా ని̣ ధ̣ ని̣ స । రి గ రి స । రీ మ ప |
క ర చ ర ణా ద్య వ య వ । ప రి ణా - మా త్మ ని |

ప మ నీ ద ని సా̇ స̇ రి̇ । రి̇ గ̇ రీ̇ । సా̇ ని ద |
త రు ణో ల్లా - సా ది పూ - జి త । స్వా త్మ ని |

ద ప ద మా ప మ గ రి స । రీ సా । రీ మ ప ||
ధ ర - ణ్యా ద్య ఖి ల త - । త్వా తీ । తా త్మ ని || గురుగుహా ||

చ॥ స స మా ప ని ద పా మ । గా రి స । స రి గ రి స ।
నిజ రూ ప జిత పా వ । కేం దు భా - ను - మ తి ।

ని ధ ని ని సా రీ మా । పా పా । స ప మ ప ।
ని ర తి శ యా నం దే । హం సో । వి ర మ తి ।

స స పా మ ప నీ ద ని । స సా రి । గ స రి స ।
అ జ శి క్ష ణ ర క్ష ణ । వి చ క్ష । ణ సు మ తి ।

గ రి గ సా ని ద ప ద మ । మ ప మా । గ రి గ స ॥
హ రి హ యా ది దే - వ తా - గ ణ । ప్ర ణ మ తి ॥

మ॥సా॥ రి గ సా రి సా ని ని ధ ని ధా ని ధ ని సా గ రి ।
య జ నా ది క ర్మ ని ర త భూ సు ర హి తే య మ ।
గ స మా గ రి రి గ । స నీ ద ని ద పా ।
ని య మా ద్య - ష్టాం గ యో గ వి హి తే ।
ని ని స నీ సా పా ద మా గ రి స గ రి సా ।
వి జ య వ ల్లీ దే వ సే నా - స హి తే పి ।
సా గ రీ రి సా । స నీ ద ని స రి స ॥ గురు ॥
రా ది స న్ను తే । వి క ల్ప ర హి తే - ॥

## 8

## ఉదయరవిచంద్రిక రూపకం

22వ మేళకర్త జన్యం — స గ మ ప ని స / స ని ప మ గ స

ప॥ శ్రీగురుమూర్తే చిచ్ఛక్తిస్ఫూర్తే ।
శిష్య జనావన కీర్తే సముదయార్తే ॥

అ॥ యోగినీ హృదయ ప్రకాశ చిత్తవృత్తే।
యుగపద్భోగ యోగ ప్రదాన నిపుణశక్తే।
ఆగమ రహస్య తత్వానుసంధాన యుక్తే।
ఆనందానురక్తే అతివిరక్తే జయజయ ॥

చ॥ ఆత్మేశ్వర జీవ భేదావరణ నివృత్తే।
ఆశ్రిత శిష్యానుగ్రహ కారణ ప్రవృత్తే।
ఆత్మతత్వాది శోధన సాధన సంపత్తే।
ఆరక్త శ్వేత మిశ్ర చరణవృత్తే।
ఆత్మకోటి భక్తే, అనాది మాయోత్పత్తే।
ఆత్మానుభవ సార సంతృప్తే నిర్ముక్తే।
ఆత్మోదయ రవిచంద్రికా సందీప్తే।
పరమాత్మ శ్రీ చిదానంద నాథ నమస్తే జయజయ ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి రచన. ఓ గురుగుహమూర్తే! చిచ్ఛక్తి స్వరూపా ! శిష్యజనులను రక్షించువాడను కీర్తికలవాడా ! ఆర్తిని బాపువాడా! యోగినులన దశవిధ నాదరూపులు హృదయ మందు నాదరూపమున ప్రకాశించు యోగినుల చిత్తవృత్తి గలవాడా! భోగమును, యోగమును రెంటిని యొసగుటలో నిపుణత్వము గల వాడా ! ఆగమముల ద్వారా యుక్తిగ తత్వమును అనుసంధానము చేయువాడ! ఆనందము నందు అనురాగముకలిగి, దేనియందును అను రాగము లేనివాడ ! జయము, జయము. ఆత్మ, ఈశ్వర, జీవులు వేరు వేరను భేదభావమును పోగొట్టువాడ ! ఆశ్రయించిన శిష్యులను అను గ్రహించు స్వభావము గలవాడ! ఆత్మతత్వమును తెలుసుకొనుటకు తగిన సాధన సంపద గలవాడ ! ఎరుపు, తెలుపు రంగులు కలిసిన పాదములు గలవాడ! అనగా రజోగుణ, సత్వగుణయుత, చరణములు అని. కోటి ఆత్మలయందు భక్తిగలవాడ ! "మమాత్మా సర్వ

భూతాత్మ” అనుభావము గలవాడ! అని, మాయ ఉత్పత్తికి ఆది అయినవాడ! ఆత్మ తత్వానుభవముచేత తృప్తి గలవాడ! అన్నియు విడచినవాడ! సంబంధము లేనివాడని, సూర్యచంద్రుల కాంతివలె ఆత్మ జ్ఞానము గలవాడ! పరమాత్మ రూపుడైన చిదానందమూర్తే నీకు నమస్కారము, జయము. లోపల బయట అంతట నిండియున్న స్వరూపము నీవే, నీకన్న వేరు లేదని గురూత్తముని భావన చేసిరి. ఇందు “ఆఢ్యోదయ రవిచంద్రిక” అని ఉదయ రవిచంద్రిక రాగ నామమును కూర్చుట, రచనయందు, అంత్యప్రాసలు గమనించ దగినవి.

### రెండు కళల చౌకం

ప॥ సా - గ గ మ మ । పా - పా పా |
శ్రీ గు రు గు హ । మూ - ర్తే |

మ ప - ప మ గ మ గా । గ స గ మ - గా గా ||
చి - చ్ఛ - - - క్తి స్ఫూ - - - - ర్తే ||

సా - సా సా || సా - ని ధ నీ । స ప - ప మ గా |
ఏ - - || శి ష్య జ నా వ న కీ - - |

మ గ - సా స ని । పా - మ మ గ స ||
ర్తే - - సు ము । హూ ర్తే - జ య ||

అ॥ మ ప - స నీ , । ప ని - పా , స |
యో - గి నీ । హృద య ప్ర |

గా - గ సా ప । మ గ - మా మా |
కా శ చి త్త । వృ - - త్తే |

స గ - సా పా | ప ని సాం - సం పా ప |
యు గ  ప ద్భో గ - యో - గ ప్ర |

నీ - ని మ ప మ | నీ - పా పా |
దా  న ని పు ణ | శ - త్రే |

పా - సం స గం సం | సం గం - సా గాం |
ఆ  గ మ ర హ - స్య త త్వా |

గ ప - ని సాం గం | పా - నీ నీ |
ను స ం ధా న | యు - త్రే |

గాం - సాం నీ | , ప - మా పా |
ఆ  నం దా  ను ర త్రే |

సం ని - ప మా , | గ గ - మ మ గ స ||
అ తి  వి ర | త్రే -  జ య జ య ||

చ॥ సా - పా ప ప | మ ప - మ గ మ గ |
ఆ  త్మే శ్వ ర | జీ -  వ భే - - - |

స గ - స స ని ధ | ని స - గా గా |
దా-  వ ర ణ ని | వృ - - త్తే |

సా - మ గ మా | పా - నీ ప మ |
ఆ  శ్రి త శి | ష్యా ను గ్ర హ |

గా - గ మా ప | పా - మా మా |
కా  ర ణ ప్ర  వృ - త్తే |

పా - ని పా సం | సం ని - సాం సం ని |
ఆ  త్మ త త్వా - ది  శో ధ న |

ప స - ప మ గ స । గ మ - పా పా |
పా - ధ న స ం ప - - త్తే

మా - మా మా । పా - ని పా సం |
ఆ ర క్త శ్వే త మి శ్ర

గ సం - నీ , ప । మా - గా సా |
చ ర ణ ప్ర వృ - - త్తే

సా - స పా ప । సా - సా , సం |
ఆ త్మ కో టి । భ క్తే అ

నీ - సం ని పా । ప మ గ మ - పా పా |
నా - ది మా । యో - - త్ప త్తే

ని సం - గం , గం । సం గం - సా , ని |
ఆ - త్మా ను భ వ సా ర

ప మ - పా పా । ని ప - మ గ సా ||
స ం తృ ప్తే । ని - ర్మ - త్తే

మ॥సా॥ గా మా - ప ప ప ని - పా సం సం ।
ఆ త్మో ద య ర వి చం ద్రి కా ।

సా ని స - మ మ గా ; ప ప |
- స ం దీ - ప్తే ప ర

గం గం - గం సం సా ని ప మ ।
మా త్మ శ్రీ చి దా న ం ద ।

పా సం ని - పా సం సం - మ మ గ స || శ్రీ గురుగుహ ||
నా థ న మ స్తే - జ య జ య

# 9

## దేవక్రియ రాగం రూపకం (శుద్ధసావేరి)

28వ మే. జన్యము.

స రి మ ప ద స
స ద ప మ రి స

ప॥ శ్రీ గురుగుహ తారయాశు మాం । శరవణభవ ॥ శ్రీ ॥

మ॥సా॥ శ్రీపతి, రతిపతి, వాక్పతి, క్షితిపతి, పశుపతి సురపతి సేవిత ॥

సమిష్టిచరణం॥ రాగాది రహిత హృదయ విభావిత సురముని పూజిత।
త్యాగాధిరాజ కుమార, తాపత్రయ హర కుమార ॥

మ॥సా॥ భోగిరాజ వినుతపాద । భూదేవ క్రియామోద ।
యోగిరాజ యోగ భేద । యుక్త మనోలయ వినోద ॥ శ్రీ ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి. ఓ గురుగుహమూర్తే వేగమే నన్ను తరింపజేయుము. రెల్లు పొదలయందు జన్మించినవాడ! ఇంద్ర, మాధవ, మన్మథ, బ్రహ్మ మహారాజు పశుపతులచే సేవించబడు వాడ! రాగ ద్వేషాదులులేని హృదయమున గోచరించువాడ! నారదునిచే పూజింపబడువాడ! తిరువారూరు నందలి శంకరుడు త్యాగరాజేశ్వరుడు, ఆయన కుమారుడ! ఈ షణ్త్రయములవలన కలుగు తాపములను పోగొట్టువాడ! కుమారస్వామీ! ఆదిశేషునిచే నుతింపబడిన పాదము గలవాడ! భూదేవులు=బ్రాహ్మణులు నిత్యము చేయు జప, తప ధ్యానార్చనాది క్రియలచే సంతోషించువాడ! యోగిరాజు=శివుడు, శివుని యోగ భేదమొనర్చి, మనస్సు పార్వతి యందు లగ్నముకాగా జన్మించిన వాడు గాన "యోగిరాజ యోగ భేద యుక్త మనోలయ వినోద" అను సమాస పదమును ప్రయోగించి నారు. ఇందు "భూ దేవక్రియా మోద" అని దేవక్రియా రాగనామ మును కూర్చిరి.

ఈ విధముగ గురుగుహ నవావరణ కృతుల యందు, గురు, దేవ, అభేదమును సూచించుచు, గుర్వనుగ్రహ విశేషమును, తమ అనుభూతి ఈ రూపమున తెలియజేసిరి.

రెండు కళల చౌకం

ప॥ సా - ద ప మ ద । పా - మ రీ స । రీ - రీ స రి మ ప ద రి ॥
శ్రీ గు రు గు హా । తా ర యా శు । మాం - శ ర వ ణ భ వ ॥

సా - ద ప మ ద । పా - మ రీ స ।
శ్రీ గు రు గు హ తా ర యా శు ।

రీ - రీ స స ధ రి । సా మ రి - ద ద ప స దా రి స ।
మాం - సు ర ప తి శ్రీ ప తి ర తి ప తి వా క్ప తి

మ రి స రి - స ద స ద ప మ ప ద ॥ సా ॥
క్షి తి ప తి ప శు ప తి సే - వి త ॥ శ్రీ ॥

స॥చ॥ దా - దా ప ద । మ ప - రి మ ప ద । మా - రి స సా రి స ।
శా గా ది ర హి త హృ ద య వి । భా వి త సు ర -

రీ మ ప - దా మ ప । దా - రీ స రి సా ।
ము ని - పూ జి త । త్యా గా ధి - రా ।

స ద - స దా ప । సా - పా మ ద । మ ప - మ రీ స ॥
- జ కు మా ర తా ప త్ర య । హ ర కు మా ర ॥

మ॥సా॥ సా ధ రి - రి స మ రి మ పా ద ।
భో గి రా - జ వి ను త పా ద ।

మా పా - దా సం దా రిం సం
భూ దే వ క్రి యా మో ద

రిం మం రిం - రిం రిం సాం సం దా ద।
యో గి రా - జ యో గ భే ద

మా రి స - ధా స రి మ పా ద ॥ (శ్రీ) ॥
యు క్త మ నో ల య వి నో ద ॥

గురుగుహ నవావరణకృతులు సమాప్తము ॥

# గురు శిష్య లక్షణము

శ్లో॥ సుందరః సుముఖః స్వచ్ఛః సులభో బహుతంత్రవిత్ ।
అసంశయః సంశయచ్ఛిన్నిరపేక్షో గురుర్మతః ॥

శ్లో॥ ఆస్తికో దృఢ భక్తిశ్చ । గురౌ మంత్రే సదైవతే ।
ఏవంవిధో భవేచ్ఛిష్యః ఇతరో దుఃఖకృద్గురోః ॥



# శ్రీ మహాగణాధిపతి కృతులు

శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు జన్మించిన తిరువారూరు నందు ఆగమ తాంత్రిక శాస్త్రోను సారము షోడశ గణపతులను ప్రతిష్ఠించిరి. ఆ మూర్తులపై అన్ని విభక్తులలో మొత్తము 26 కృతులు రచించిరి. షోడశ గణపతుల వివరణము.

శ్లో॥ ప్రథమో బాల విఘ్నేశో ద్వితీయ స్తరుణో భవేత్ ।
తృతీయో భక్త విఘ్నేశ శ్చతుర్థో వీర విఘ్నకః ।
పంచమః శక్తి విఘ్నేశః షష్ఠో ద్విజ గణాధిపః ।
సప్తమః సిద్ధి రుద్దిష్టః । ఉచ్ఛిష్ట శ్చాష్టమః స్మృతః ।
నవమో విఘ్న రాజస్స్యాత్ । దశమః క్షిప్రనాయకః ।
హేరంబశ్చైకాదశ స్స్యాత్ । ద్వాదశో లక్ష్మి నాయకః ।
త్రయోదశో మహావిఘ్నో । విజయ స్స్య చ్చతుర్దశః
నృత్తాఖ్యః పంచదశ స్స్యాత్ షోడశో్చర్ధ్వ నాయకః ।
ఏతత్ షోడశకం నామ । స్తోత్రం సర్వార్థ సాధకమ్ ।
త్రిసంధ్యం యఃపఠేన్నిత్యం । ససుఖి సర్వతో జయీ ।
తస్య విఘ్నాః పలాయంతే । వైనతేయా ద్యథోరగాః ।
గణేశ్వర ప్రసాదేన । మహాజ్ఞానీ భవేద్ధ్రువమ్ ॥

షోడశగణపతులు : బాలగణపతి, తరుణగణపతి, భక్తగణపతి, వీరగణపతి, శక్తిగణపతి, ద్విజగణపతి, సిద్ధిగణపతి, ఉచ్ఛిష్టగణపతి, విఘ్నగణపతి, క్షిప్రగణపతి, హేరంబగణపతి, లక్ష్మీగణపతి, మహా

గణపతి, విజయగణపతి, నృత్తగణపతి, ఊర్ధ్వగణపతి, వీరుకాక ఏకవింశతి (21) గణపతులు మరియు అష్టోత్తరశత గణపతులు గలరు. ఇందు దీక్షితుల వారు తమ రచనలయందు, గణపతి తత్వము, ఉపాసన, మహిమాను వర్ణనమును విశేషముగ వర్ణించిరి. వ్యాఖ్యానమున వివరణ గమనించదగును.

గణపతితత్వము : శ్లో॥ జలభూత శుభాకారం చతుర్గుణ సమన్వితమ్ ।
సర్వవిఘ్నహరం దేవంభజామి గణనాయకమ్॥

పంచ భూతములలో జల భూతాకారుడు గణాధిపతి. శబ్ద, స్పర్శ, రూప, రసములను నాలుగు గుణములు గలవాడు. జల భూతాకారుడగుట చేతనే శ్రీగణపతి నవరాత్రోత్సవములు జరిపి ఆ మూర్తులను జలములో నిమజ్జనము చేయుట పూర్వాచారము.

## 10

## గౌళరాగం త్రిశ్రజాతిత్రిపుటతాళము

15వ మేళకర్త జన్యము స రి గ మ రి మ ప ని స
స ని ప మ గ మ రి స

ప॥ శ్రీమహా గణపతి రవతు మాం ।
సిద్ధి వినాయకో మాతంగముఖ ॥ శ్రీ ॥

అ॥ కామజనక విధీంద్ర సన్నుత । కమలాలయ తట నివాసో ॥

మ॥సా॥ కోమలతర పల్లవ పదకర గురుగుహాగ్రజ శ్శివాత్మజః ॥ శ్రీ ॥

చ॥ సువర్ణాకర్షణ విఘ్నరాజో, పాదాంబుజో, గౌరవర్ణ వసన ధరో।
ఫాలచంద్రో, నరాది వినుత లంబోదరో। కువలయాస్య, విషాణ।

పాశాంకుశ, మోదక ప్రకాశ కరో। భవజలధి నావో, మూల
ప్రకృతి స్వభావ సుఖతరో॥

మ॥సా॥ రవి సహస్ర సన్నిభ దేహో।
కవి జన నుత మూషిక వాహో।
అవనత దేవతా సమూహో।
అవినాశ కైవల్య గేహో॥ (శ్రీ)॥

వ్యాఖ్య: ప్రథమా విభక్తి రచన. శ్రీమహాగణపతిః=లక్ష్మీ ప్రదుడు, శక్తిగల మహాగణపతి మాం = నన్ను అవతు = రక్షించుగాక. కార్యసిద్ధిని కలుగ జేయు ఏనుగు ముఖముగల గణపతి.

అ॥ మన్మథుని తండ్రి విష్ణువు, విధి = బ్రహ్మ ఇంద్రాదులచే సన్నుతింప బడువాడు. కమలాలయ తట నివాసః = తిరువారూరును కమలాపుర మందురు. అందు కమలాంబా శ్రీచక్రవాసినియై యున్నది. గాన కమలాంబా ఆలయ సమీపమున నున్నవాడు, మృదువైన, చిగురుటాకుల వంటి పాదములు, చేతులు గలవాడు గురు గుహాగ్రజుడు=కుమారస్వామికి అన్నయైన శివుని కుమారుడు నన్ను రక్షించుగాత.

చ॥ సువర్ణా కర్షణ విఘ్న రాజః = బంగారు భూషణములతో ఆకర్షింప బడి, ధరింపబడి విఘ్నములను నివారించుటలో రాజు అయిన గౌరవర్ణ=పసుపు ఎరుపు కలిసిన రంగుగల అనగా (కాషాయరంగు) వస్త్రమును ధరించిన వాడు, ఫాలచంద్రః=చంద్రునివంటి నుదురు గల వాడు, శంకరుడు చంద్రమౌళి=శిరమున చంద్రుని ధరించినవాడు. నరాది వినుత లంబోదరః=మానవులచేత నుతింప బడిన పెద్ద బొజ్జ గలవాడు, కువలయాస్య=కలువలవంటి ముఖము. విషాణ=దంతము, పాశ=త్రాడు, అంకుశ=ముల్లుగల ఆయుధము, మోదక=కుడుము

లతో, ప్రకాశకరః=ప్రకాశించు చేతులు గలవాడు, నాలుగు చేతులు గలవాడు, భవజలధి నావః=సంసార సముద్రమును దాటుటకు నావ వంటివాడు, మూలప్రకృతి స్వభావ సుఖతరః=ప్రకృతికి మూలమైన మాయా స్వభావము దెలిసి సుఖము నొసగువాడు, రవి సహస్ర సన్నిభ దేహః=అనంతకోటి సూర్యుల కాంతిగల దేహముగల వాడు, కవి జన నుత=పండిత జనముచే మూషిక వాహనుడని నుతిగన్నవాడు, అవనత దేవతా సమూహః=శిరస్సు వంచబడిన దేవతా సంఘముతో గూడి యున్నవాడు, అవినాశ=నాశముకాని, శాశ్వతమైన కైవల్య గేహః=మోక్షమే గృహముగా గల, మోక్షప్రదాత యగు గణపతి దేవుడు నన్ను కాపాడు గాక యని, విఘ్నేశ్వరుని సగుణ మూర్తిని, ఆపాద మస్తకము, పాద, కర, ముఖ, ఉదర, వస్త్ర, భూషణాయుధ ములు, మహిమతో ఇహ భోగము లొసగి చివరకు మోక్ష మొసగు వాడని ధ్యానించిరి, కాని "కాళ, దేశ్యము, ఒకానొకజాతి, కఠినము, బిగ్గరమైనది, ఇది తెనుగు పదము. గాన రాగనామమును చేర్చలేదు.

## రెండు కళల చౌకం

ప॥ రీ మ - పా - రి ప । మ ప మ గ మా - రి స - స ని̣ సా
శ్రీ మ హా గ ణ ప - తి - ర వ తు మాం -
రీ స - ని̣ ధ̣ - ధ̣ ని । ని̣ స రి స రీ రీ గ మ రి స ని̣ స
సి ద్ధి వి నా - య । కో - - - - మాత ం గ ము ఖ - । శ్రీ

అ॥ పా మ - రి గ మ రి । రీ స - స ని̣ సా రి మ
కా మ జ న క వి ధీం ద్ర స - - న్ను త ।
రి మ ప - పా ని ప । ని సం రిం - రిం సం సం ని సా
క మ లా - ల య । త ట ని వా - - - సో

మ॥సా॥ రీ మ ప ని ప - నీ సఀ రిఀ సఀ ని సఀ రిఀ ।
కోమల తర పల్లవ పదకర ।

రిఀ సఀ ని పా మ - రి గ మ రి రి స ని స
గురుగుహా గ జ - శ్రీ వా - త్మజ ‖ శ్రీమహా ‖

చ॥ రి గ మ - రీ గ మ । రి స స - ని ధ స ని సా ।
సువ - ర్ణాక - ర్షణవి - ఘ్నరా -

రీ ప - ప మ మ గ । మా రి - మ ప ని ప
జోపా - దాంబు । జో గా - రవ -

రి ప మ - రి రి గ మ । రీ రి - స ని సా ।
ర్ణవస నధరో । ఫాల చంద్రో ।

ని రీ - ని స రి మ । పా ప - మ ని పా
నరాదివినుత లంబో - దరో

ని ప ని - పా మ ప । ప మ మ మ - రి రి గ మ ।
కువల యాస్యవి । షా- - ణ పా - శాం ।

రి రి గ - గ మ రీ సా । ని పా - ని సఀ రీఀ
కుశమో - - దక ప్రకశ శకరో

నీ సఀ రిఀ సాఀ - ని ప నీ । సా , - పా నీ ।
భవ - జ లధినా వో మూల ।

ప మ మ - మ రి గా । గ మ రి . స ని సా
ప్రకృతి - స్వభా వ - స్సుఖతరో

మ॥సా॥ రి రి గ రీ రి - సా ని ధ రీ రీ ।
రవిసహస్ర సన్నిభ దేహా ।

మ రి మ ప ని ప - ప మ ప ని పా పా
క వి జ న నుత మూ - షి క వా హా |

ప స̇ ని స̇ నీ - స̇ రి̇ రి̇ స̇ ని సా |
అ వ న త దే వ తా స మూ- హా |

రి̇ స̇ స̇ ని ప ప - మ రి గ మ రి స ని స | శ్రీ మహా ||
అ వి నా - శ కై - వ - ల్య గే - హా - |

# 11

## శ్రీ రాగము ఆది తాళము

22 వ మేళకర్త జన్యము — స రి మ ప ని స
స ని ప మ రి గ రి స

ప॥ మూలాధార చక్ర వినాయకా మూల్య వర ప్రదాయక ॥శ్రీ॥

అ॥ మూలాజ్ఞాన శోక వినాశక మూలకంద, ముక్తి ప్రదాయక॥శ్రీ॥

చ॥ సకలీకృత దేవాది దేవ శబలీకృత సర్వజ్ఞ స్వభావ ।
ప్రకటీకృత వైఖరీ స్వభావ పరాభవ ప్రసిద్ధ గజగ్రీవ ॥

మ॥సా॥ వికట షట్చ్ఛత శ్వాసాధికార । విచిత్రాకార, భక్తోపకార ।
అకళంక విభాస్వర, విఘ్నేశ్వర । హార, గురుగుహ సోదర
లంబోదర ॥శ్రీ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి రచన. మూలాధార చక్ర వినాయక = మనలో షట్చక్రములు గలవు. 1} మూలాధార చక్రము, 2) స్వాధిష్ఠాన, 3) మణిపూరక, 4) అనాహత, విశుద్ధ, అజ్ఞా చక్రములను షట్చక్రములందురు. అందు వెన్నెముక మూలమున మూలా

ధార చక్రము గలదు. ఆ చక్రమునకు అధిపతి గణపతి. స్వాధిష్ఠాన చక్రము నకు బ్రహ్మ మణిపూరకమునకు విష్ణువు అనాహత చక్రము నకు సదాశివుడు, విశుద్ధ చక్రమునకు బృహస్పతి, ఆజ్ఞా చక్రమునకు ఇంద్రుడు, అధిపతులు = అందువలన మూలాధార చక్రమునకు నాయకుడవు, విలువ కట్టలేని వరము లొసంగువాడు, మూలాజ్ఞాన శోక వినాశక = శోకమునకు మూలమైన అజ్ఞానమును నాశనము చేయుటలో మూల స్థానమైన వాడు, ముక్తిప్రదాయక = మోక్ష మొసగువాడు,

చ॥ సకలీకృత దేవాదిదేవ = సకలమును, చేయు దేవతలకు మొదటి దేవుడవు, శబలీకృత సర్వజ్ఞ స్వభావ=చిత్రచిత్ర వర్ణములను చేయుటయందు సర్వము తెలిసిన స్వభావము గలవాడు, వర్ణము లనగా రంగులు మరియు "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" బ్రాహ్మణాది వర్ణములు, వాని స్వరూప స్వభావములు తెలియ జేయువాడు, ప్రకటీకృత వైఖరీ స్వభావ = వైఖరి యనగా, మనము పీల్చుగాలి బ్రహ్మ రంధ్రమునుండి నాభిక్రింద నున్న మూలా ధారమును జేరి అటనున్న జఠరాగ్ని ఒరిపిడిచే ప్రణవ నాదము (ఓం) ఉత్పన్నమై అది అకారాది క్షకారాంత వర్ణ రూపమై మనస్సున కలిగిన భావములను తెలుపుటకై మొదట పరావాక్కు, నాభియందు పశ్యంతివాక్కు, హృదయమందు మధ్యమ వాక్కుగ పైకి బయలు దేరి కంఠము వరకు వచ్చి నోటినుండి వెలువడు వాక్కును "వైఖరి" వాక్కు అందురు. ఆవాక్కును ప్రకటించువాడు, సర్వవాఙ్మయ, భావ సంకల్ప, నాద స్వరూపుడని భావము. పరాభవ ప్రసిద్ధ గజగ్రీవ=శంకరునిచే పరాభవమంది నట్లు ప్రసిద్ధిగని ఏనుగు కంఠము గలవాడవు. మరొకయర్థము పరావాక్కు ద్వారా పుట్టి ప్రసిద్ధి గాంచి, ఏనుగువలె గంభీర నాద రూపము గల కంఠము గలవాడవు. "వికట షట్చత శ్వాసాధికార=జీవులు ప్రతినిత్యము, గాలిపీల్చి విడచుశ్వాస,

రోజుకు 21,600 ల పర్యాయములు జరుగును. అందు 6 చక్రముల అధిపతులు, గణపతి 600 లు, బ్రహ్మ 6 వేలు, విష్ణువు 6 వేలు, శివుడు 6 వేలు, జీవాత్మ 1 వెయ్యి, బృహస్పతి 1 వెయ్యి, సహస్రార మున సచ్చిదానందమూర్తి 1 వెయ్యి-మొత్తము 21,600 శ్వాస జరుగు చుండును. ఈ విషయమును తెలియజేయుచు, షట్శత=600 ల సార్లు శ్వాసను జరుపు అధికారము గలవాడు, విచిత్రమైన ఆకారము గల వాడు, భక్తులకుపకారము జేయువాడు, కళంకము లేక విశేషముగ ప్రకాశించువాడు, అయిన ఓవిఘ్నేశ్వర ! హర గురుగుహ సోదర = శివ స్వరూపుడైన సుబ్రహ్మణ్యేశ్వరుని సోదర! లంబోదర=పెద్ద పొట్ట గలవాడ! అని వర్ణించిరి. ఈకృతి యందు క్రియాపదములేదు. ఈ కృతి యంతయు యోగము. రేచక, పూరక, కుంభక ములను త్రివిధ మగు ప్రాణాయామ పద్ధతిచే, అంతర్దృష్టి సాధనచే తానెవరో, తన తత్వమేదో, యోగ సాధనచే తెలుసుకొనువాడు యోగి. అతనే గణపతి. సర్వదేవతలు, తానువేరు, దైవము వేరను భావము మాయా జనితము. ఉన్నది సత్పదార్థమై గుర్తించినప్పుడు, ఎవరు ఎవరిని వేడుదురు. అందువలన శ్రీ దీక్షితులవారు తానే గణపతియై, తన రూపమును ఈకృతి ద్వారా అద్వైత బ్రహ్మానంద, యోగానుభూతిని పొంది రచించి యుండుటచే క్రియాపదము వేయలేదని తోచుచున్నది.

## రెండు కళల చౌకం

ప॥ రి స న్ని స స రి రీ గ రి రి స స్నీ ।
శ్రీ - మూ - - - లా ధా - - - ర

స రి స న్ని స ని ఫా । ఫా , ని ని స ।
చ - - - క్ర - వి నా - య క ।

రి మ పా ప మ రి రి గ రి సా । నీ ని గ రి స । ని ని సా ||
మూ - - ల్య - వ ర - - ప్ర దా - - - - । య - క ||

అ॥ పా స ని ప మ ప మ రీ గ రి సా ।
మూ - - - లా - - జ్ఞా - - - న

రి ని సా రి మ । ప ని పా ని స |
శ్లో - - క వి నా - - శ క |

స ని స రి సా స ని రి స స ని పా స ని ।
మూ - - - ల క ం - - ద - ము - -

ప సా ని ప మ । రీ రి గ రి స ||
త్రి - - - ప్ర దా - - య క ||

శ్రీ

చ॥ నీ స ని ప మ రి గ గ రీ స । ని స రి మ మ రి మ ప ।
స క - లీ - కృ త దే - - వా - - - - - - ది -

ప మ ప ని ని ప ని స | స ని ప మ రి గ గ రి సా ని ధ ।
దే - - - - - - వ - | శ - బ - లీ - కృ - త స -

ని స రి మ ప మ పా ప |
ర్వ - - జ్ఞ స్వ - భా వ |

ప మ పా మ ప మ నీ । ప రీ స ని । సా , స |
ప్ర క టీ కృ - త వై ఖ రీ స్వ - భా వ |

సా స ని స రి సా రి రి నీ పా మ మ ।
ప రా - - - భ వ - - ప్ర సి -

ప ని స ని ని ప మ మ । ప మ రీ గ రి సా |
- - ద్ధ - - - - - గ । జ - గ్రీ - - వ |

మ॥సా॥ రి గ రి సా ని సా రీ మా మ పా ప ।
వి క ట ష ట్ఛ త శ్వా సా ధి కా ర ।

మ పా నీ మా ప । నీ సా ని సా స
వి చి త్రా కా ర । భ క్తో ప కా ర

ని ని స గ రి స నీ రి స నీ పా ని స ।
అ క ళం క వి భా స్వ ర వి ఘ్నే శ్వ ర ।

ని గ రి స ని ప సా । ని ప ప మ రి గ రి స ‖ (శ్రీ) ‖
హా ర గు రు గు హా పో ద ర లం బో - ద ర

## 12

## హంసధ్వని రాగము ఆదితాళము

29వ మేళకర్త జన్యము — స రి గ ప ని స / స ని ప గ రి స

ప॥ వాతాపి గణపతిం భజేహం వారణాస్యం వరప్రదం ॥

అ॥ భూతాది సంసేవిత చరణం । భూత భౌతిక ప్రపంచ భరణం ॥

మ॥సా॥ వీతరాగిణం వినుత యోగినం విశ్వకారణం విఘ్నవారణం ॥ వాతాపి ॥

చ॥ పురా కుంభ సంభవ మునివర ప్రపూజితం। త్రికోణ మధ్యగతం ।
మురారి ప్రముఖాద్యుపాసితం, మూలాధార క్షేత్రస్థితం ।
పరాది చత్వారి వాగాత్మకం ప్రణవ స్వరూప వక్రతుండం ।
నిరంతరం నిటల చంద్ర ఖండం। నిజ వామకర విధృతేక్షు దండం।

మ॥సా॥ కరాంబుజ పాశ బీజా పూరం ।
కలుష విదూరం భూతాకారం ।
హారాది గురుగుహ తోషిత బింబం ।
హంసధ్వని భూషిత హేరంబం ॥వా॥

వ్యా॥ ద్వితీయా విభక్తి రచన. వాతాపిగణపతిం = వాతాపి గణపతిని, భజేహం = నేను సేవించుచున్నాను. వాతాపి గణపతి యనగా, దక్షిణ దేశమును పల్లవ రాజులు పాలించిన కాలమున వారి రాజధాని నగరము వాతాపి, ఆసమయమున వారు శిల్పకళను బాగుగ పోషించిరి. ఇప్పుడు, వాతాపి "బాదాం" "బాదల్" జిల్లాగా మార్పు చెందినది. వాతాపి గ్రామము నుండి ప్రత్యేకముగా తెచ్చి తిరువారూరులో ప్రతిష్ఠింప బడుటచే. ఆ గణపతి మూర్తికి వాతాపి గణపతి యను నామ మేర్పడెను. వారణాస్యం= ఏనుగు ముఖముగల వానిని, వరప్రదం=వరమునిచ్చు వానిని భజింతును. అ॥ భూతాది సంసేవిత చరణం=భూతములనగా=పృధివ్యాప స్తేజో వాయు రాకాశ ములనే పంచభూతములచే సేవించ బడిన పాదములు గలవానిని, భూత భౌతిక ప్రపంచ భరణం=పంచభూతములచే నేర్పడినది గావున భౌతిక మైన ప్రపంచమును భరించు వానిని, వీత రాగిణం = పోగొట్టబడిన అనురాగముగల వానిని, వినుత యోగినం= యోగులచే నుతింపబడు వానిని, విశ్వ కారణం = ప్రపంచమునకు కారణ భూతమైన వానిని, విఘ్న వారణం=విఘ్నములను తొలగించు వానిని, పురా=పూర్వము కుంభ సంభవ ముని వర ప్రపూజితం = అగస్త్యః కుంభ సంభవః. సనాతనుడైన అగస్త్యముని వరునిచే పూజింపబడిన వానిని. త్రికోణ మధ్యగతం = త్రికోణాకారము గల మూలాధార చక్ర మధ్య యందుండు వానిని, మురారి ప్రముఖాద్యుపాసితం = మురాసురుని వధించిన శ్రీకృష్ణుడు మొదలైన ముఖ్యులచే ఉపాసించబడిన వానిని, మూలాధార క్షేత్ర స్థితం=ప్రపంచమునకు మూలమైన ఆధారచక్ర క్షేత్రమున నుండు వానిని, పరాది చత్వారి వాగాత్మకం = పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి యను నాలుగు విధములైన వాగ్రూపుని, ప్రణవ స్వరూప వక్రతుండం. ఓంకార స్వరూపుడై అందు వంకర తొండము గలవానిని, సంస్కృతమున "ఓం" అక్షరరూపుని,

నిరంతరం=ఎల్లప్పుడు, నిటల చంద్రఖండం=చంద్రరేఖవలె ప్రకాశమాన మైన నుదురు గలవానిని, నిజ వామకర=ఎడమ చేతియందు, విధృతేక్షుదండం=చెఱకు దండమును ధరించినవానిని, చెఱకు మధుర రస మొసగును గాన మధుర రస ఫలమొసగు వానిని కరాంబుజ పాశ బీజా పూరం=హస్తములందు, పద్మము, పాశము, బీజములను ధరించిన వానిని, నాలుగు చేతులందు, చెఱకుగడ, పద్మము, పాశము, బీజములను ధరించిన వానిని కలుష విదూరం=పాపములను తొలగ జేయు వానిని, భూతాకారం=పంచభూతములలో నొకటియైన "జల భూత శుభాకారం" జలభూత స్వరూపుని, హరాది గురుగుహ తోషిత బింబం=శివుడు, పార్వతి, కుమార స్వామి మొదలైన వారికి ఆనందము కలుగజేయు ఆకారము గల వానిని, హంసధ్వని భూషితం హేరంభం=హంసధ్వని రాగముచే అలంకరింపబడిన హేరంబ గణపతిని భజింతును. హంసధ్వని=హంసయన, మనము పీల్చివిడచుగాలి. సో, హం అని వినిపించును. సఃఅహం=సోహం, అదే అహం=సః=హంస అగును. హంసవలన ఉత్పన్నమైన ఓంకార నాదముచే అలంకరింప బడిన వానిని భజింతును. ఈరాగమును ముత్తుస్వామి దీక్షితులవారి తండ్రి రామస్వామి దీక్షితులు ఏర్పరచి నామము పెట్టినట్లు లోకప్రసిద్ధి ఈ కృతి దేశమందు బహుళ వ్యాప్తిగాంచినది. గాయకులు, కథకులు, బుఱ్ఱకథకులు, నాట్యాచార్యులు సినిమాలు, ఒకటేమిటి అన్ని రంగములలో ముందు వినవచ్చు చున్నది. అటులనే శ్రీత్యాగరాజకృతి "పవమాన సుతుడుబట్టు కృతి, అంత్యమున గానము చేయబడు చున్నది. ఆనోట ఆనోట బడి, సాహిత్యము రకరకములుగా వారి ఇష్టాను సారము పాడుచున్నారు. వారణా = అని ఆపేవారుఒకరు, త్రిభువనమధ్యగతం అని మరొకరు, అనాది గురుగుహ అని కొందరు, నిఖిల చంద్రఖండం" అని కొందరు పాడుచున్నారు. కృతియందలి యథార్థ శబ్దార్థములను గమనించి గానముచేయుట యుక్తము.

ఇందలి రహస్య విషయములు = ఈకృతిలో ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపమైన హంసనుండి ఉత్పన్నమైన నాద రూపుని, హంసధ్వని రాగమున రచించుట, ఐదు ప్రాణముల కాధారమైన గణనాథుని 5 స్వరములుగల ఔడువ రాగమున, అంతర గాంధార రూపుని, వాతాపి గణపతిని అంతరగాంధార స్వరమున ప్రారంభించుట, మరియు భూతాది సంసేవిత చరణం" అని అనుపల్లవిని; పంచభూతములచే సేవించబడు వాడని. పంచమ స్వరమున ప్రారంభించుట మొదలగు రహస్య విశేషములను గమనించి గానము చేయుటయే; దీక్షితుల రచనలలోని, సంగీత, సాహిత్య, మంత్రోపాసనారీతులు. ఇట్టి రహస్య విషయము లెన్నియో గలవు.

* "గ" అను అక్షరము గతికి గమనమునకు సంకేతము. త్యాగయ్య గారు "ఆశుగసంభవుడు" అన్నారు. ఆశు = వేగముగా గచ్ఛతీతి = నడచువాడు ఆశుగః = వాయుదేవుడు. ఆయన కుమారుడు ఆంజనేయుడు. గాన గం, గః, గతి, గమనము, ఇవి అన్నియు సంకేతములు.

రెండు కళల చౌకం

ప॥ గా , రీ రి స ని । ప రీ ని । రీ స ని స రి |
వా తా పి గ ణ ప తిం భ జే హం - - |

రీ గ పా , నీ । ప గా గ । రీ స ని స రి ||
వా ర ణా స్యం వ ర ప్ర దం శ్రీ - - - ||

అ॥ పా , గా రి సా । రీ ని స । రి గ పా |
భూ తా ది సం సే వి త చ ర ణం |

నీ స̇ రీ̇ స̇ నీ | ప పా గ | రి గ రీ |

భూ త భౌ తి క ప్ర పం చ భ ర ణం |

మ॥సా॥ నీ̣ గ రీ ని పా గ̇ రి̇ స̇ నీ రి̇ సా |

వీ త రా గి ణం వి న త యో గి నం |

రి̇ ని పా ని గా | పా రి నీ̣ గ రీ ‖ వాతాపి ‖

వి శ్వ కా ర ణం వి ఘ్న వా ర ణం ‖

చ॥ గ పా గా రి సా | ని̣ ప̣ రి ని̣ | గ రీ గ |

పు రా కుం భ సం | భ వ ము ని వ ర ప్ర |

పా గ రీ , స ని̣ | ని̣ స రీ | గ స రీ |

పూ జి తం త్రి కో - ణ మ ధ్య గ తం |

ప̣ పా̣ రీ , గ రి | సా ని̣ ప̣ | ప గ రీ |

ము రా రి ప్ర ము ఖా ద్యు పా - సి తం |

గా పా గా రీ | సా ని̣ స | ని̣ రి సా |

మూ లా ధా ర క్షే త్ర - - స్థి తం |

ప̣ స ని̣ స రీ గా | రి పా గ | గ ని పా |

ప రా - ది చ త్వా రి వా గా - త్మ కం |

ని స̇ నీ , ప నీ | ప రీ̇ రి̇ | స̇ ని సా̇ |

ప్ర ణ వ స్వ రూ ప వ క్ర తుం డం |

ని రీ̇ గ̇ రీ̇ ని స̇ | రి̇ పా ని | సా̇ నీ |

ని రం త రం ని ట ల చం ద్ర ఖం డం |

ప ని పా గ రి స ని̣ | ప̣ గా రి | స రి సా ‖

ని జ వా మ క ర వి ధృ తే క్షు దం డం ‖

మ॥సా॥ రి రి గ రి సనీ ప రీ స ని సా రీ ।
క రాం బు జ పా శ బీ జా - పూరం ।

గ గ ప గ నీ పా । ని రీ సం ని సా
క లు ష వి దూ రం భూ తా కా - రం

రి గా రి స రి ని స పా ని స రీ రీ ।
హ రా ది గు రు గు హ తో షి త బిం బం ।

సా సా రి ని పా । గ రి స ని ధ ని స రి ॥
హం స ధ్వ ని భూ షి త హే - రం బం

# 13

## మలహరి రాగము రూపక తాళము

15వ మేళకర్త జన్యము స రి మ ప ద స
స ద ప మ గ రి స

ప॥ పంచ మాతంగ ముఖ గణపతినా ।
పరిపాలితోఽహం సుముఖేన ॥ (శ్రీ) ॥

అ॥ పంచ భూతాత్మక ప్రపంచోదయాది కరణ । వి
రించి హరి రుద్ర నుతేన, పంచవక్త్ర శివ సుతేన ॥పంచ॥

చ॥ వరదాఽభయ పాశ, సృణి, కపాల, దంత, మోదక, ము
ద్గరాక్ష మాలా కరేణ, కమలాపుర విహారేణ ।
పురుహూతాద్యఖిల దేవ పూజిత విఘ్నేశ్వరేణ ॥

మ॥సా॥ వర గురుగుహ సోదరేణ సురచిర లంబోదరేణ ।
కరుణాంగ గౌరతరేణ కలి మలహరణ వరేణ ॥పంచ॥

వ్యా॥ తృతీయా విభక్తిరచన. షోడశగణపతులలో పంచముఖ గణపతి యొకరు. పంచముఖ గణపతిని హేరంబగణపతి యందురు. ధ్యాస శ్లోకమున ఈవిధముగ వర్ణించబడినది.

శ్లో॥ అభయ, వరద, హస్తః । పాశదండాకుమాలా ।
సృణి, పరశుదధానో । ముద్గరం, మోదకంచ ।
ఫలమధిగత సింహః । పంచ మాతంగవక్త్రో ।
గణపతి రతి గౌరః । పాతు హేరంబనామా ॥

ప॥ పంచ మాతంగముఖ గణపతినా = ఐదు గజముఖములు గల గణపతిచేత పరిపాలితో௨హం = నేను పాలించబడితిని. సుముఖేన = మంచి ముఖము గల వానిచేత, (శ్రీ) = సంపద్యుక్తుని చేత॥ అ॥ పంచ భూతములతో కూడిన ప్రపంచ సృష్టి, స్థితి, లయములను చేయు బ్రహ్మ, విష్ణు, రుద్రులైన త్రిమూర్తులచేత నుతింపబడు వానిచేత, పంచవక్త్ర = ఐదు నోరులుగల, శివసుతేన = శివుని కుమారునిచేత పాలింపబడితిని॥

చ॥ వరద, అభయ, పాశ, సృణి, కపాల, దంత, మోదక, ముద్గర, అకు, మాల అనునవి పది చేతులయందు ధరించిన వానిచేత, కమలాపుర విహారేణ కమలాపురమనగా = తిరువారూరునందు విహరించు వానిచేత, పురుహూతాద్యఖిల దేవపూజిత విఘ్నేశ్వరేణ = ఇంద్రాది సమస్త దేవ సమూహములచే పూజింపబడు విఘ్నేశ్వరుని చేత॥ వర గురుగుహ సోదరేణ = శ్రేష్ఠుడైన కుమారస్వామి సోదరుని చేత, సురచిర లంబోదరేణ = కాంతిగల పెద్ద పొట్టగల వానిచేత, కరుణాంగ గౌరతరేణ = గౌర వర్ణముగల, దయగల వానిచేత, కలి మల హరణ వరేణ = కలియందలి మాలిన్యమును పోగొట్టుటలో గొప్ప వాడైన పంచముఖ గణపతిచేత పాలించబడితిని. కలి మలహరణవరేణ

అను పదమున అర్థయుక్తముగ "మలహరి" రాగ నామమును కూర్చిరి.

## రెండు కళల చౌకం

ప॥ పా - ద మా ప । ద ప - ను గ రి స । ధ ధ - సా రి మ ।
పం చ మా తం - గ ము ఖ గ ణ । ప తి నా ప రి ।

పా - ప మ గ రి । సా - ప రి సా ధ స రి మ ॥
పా లి తో - - హం సు ము ఖే న శ్రీ - -

అ॥ మా - ద పా , । మా - ప ద స స ।
పం చ భూ తా త్మ క - ప్ర

రీ - సా ద ప । ప ద - ప మ ప ద ।
పం చో ద యా - ది క ర ణ ని ।

మ॥పా॥ సా రి గ - రి సా రి స దా ద ।
రిం చి హ రి రు ద్ర ను తే న ।

పా ద ప - ప మ రి స రి మా మ ॥
పం చ వ - క్త్ర శి వ సు తే న ॥

చ॥ మ - పా ద మ । పా - మ గ రి స ।
వ ర దా భ య పా శ సృ ణి క ।

రీ - స ధా ధ । ధా - స రి మా ।
పా ల దం త మో ద క ము ।

గ రి - రి మ మా । పా - ద పా మ ।
ద్గ రా - క్ష మా । లా క రే ణ ।

ప ద - రి̇ స̇ రి̇ । ద స̇ - స̇ దా ప |
క మ లా పు ర । వి హా - రే ణ |

స̇ ద - పా మా । ప మ - గ రీ స ।
పు రు హూ తా । ద్య ఖి ల దే వ ।

సా - రి మ గ రి । రి స - ధ̣ రీ స |
పూ జి త వి - ఘ్నే - శ్వ రే ణ |

మ॥సా॥ మ ప ద ప మ గ రీ ద దా ప ।
వ ర గు రు గు హా పో ద రే ణ ।

ద రి̇ స̇ రి̇ ద స̇ దా గ̇ రీ̇ స |
సు రు చి ర లం బో ద రే ణ |

రి̇ స̇ దా ప పా మ గ రీ స
క రు ణాం గ గా ర త రే ణ

ధ̣ స రి మ గ రి స స̇ దా , మ ||
క లి మ ల హా ర ణ వ రే ణ ||

చిట్ట॥ పా , ద ద ప - ను ప మ గ రి స । ధ̣ా . రి స రి - స రి మ మ పా॥
మా , ప ద ప - మ ప ద స̇ ద ప । ప ద రి̇ స̇ ద ప -
మ ప స̇ దా , ॥ ప ద స̇ రి̇ మా̇ మ̇ గ̇ రి̇ స̇ రి̇ స̇ ।
స̇ రి̇ ద స̇ ప ద మ ప ద స రీ̇ । స̇ రి̇ మ̇ గా̇ రీ̇ స̇ ద ప
రీ̇ సా̇ ద ప మ గా రీ స రి మ ॥ పంచ॥

# 14

## నవరోజు రాగం మిశ్రజాతి ఏకతాళము

29 వ మేళకర్త జన్యము   ఫ ధ ని స రి గ మ ప
మ గ రి స ని ధ ఫ

ప॥ హస్తి వదనాయ నమస్తుభ్యం ।
హాటకమయ మంటపే సింహాసనస్థితాయ ॥

అ॥ హస్తి కృత్తివసన ధరార్చిత, మ ।
హా గణపాయ, తత్వరూపాయ, స
మస్త భక్తానుగ్రహాయ, మాయాలింగిత విగ్రహాయ ॥హస్తి॥

చ॥ కమలోత్పల, పాశ, శంఖ, చక్రేక్షు, కార్ముక, వ్రీహ్యగ్ర, గదా
నిజ విషాణ, మాతులుంగ, రత్నకలశ, ధరణ కరాంబుజాయ,
పదపంకజాయ, విమలాయ, విశ్వోత్పత్తి స్థితి లయాయ,
కరుణాలయాయ ॥

మ॥సా॥ హిమాద్రి తనయానన పంకజ హిరణ్యగర్భాయ, సుమనసే ।
ఉమారమణ కుమార గురుగుహ సమాన నవోజసే, మహసే
॥ హస్తి ॥

వ్యా॥ చతుర్థీవిభక్తి. షోడశ గణపతులలో మహాగణపతి ధ్యాన శ్లోకం.

శ్లో॥ హస్తీంద్రానన మిందు చూడ మరుణచ్ఛాయంత్రి
నేత్రం రసాత్ ।
ఆశ్లిష్టం ప్రియయా, సపద్మకరయా, స్వాంకస్థయా సంతతమ్ ।
బీజాపూర, గదేక్షు, కార్ముక, లసచ్చక్రాబ్జ పాశోత్పల ।
వ్రీహ్యగ్ర స్వవిషాణ రత్నకలశాన్ హస్తైర్వ హంతం భజే ॥

ప్రతి మూర్తికి ధ్యాన శ్లోకములు గలవు. ధ్యాన శ్లోకము నందలి మూర్తిని ఇందు వర్ణించిరి. హస్తివదనాయ = ఏనుగునకు తొండమే హస్తముగాన, "హస్తి" యను నామము గలదు. గజ, మాతంగ, కరి, హస్తి, వారణ మొదలైనవి ఏనుగు పేర్లు. ఏనుగు ముఖము గలవానికొఱకు నమస్కారము. హాటకమయమంటపే = బంగారుతో కూడిన మంటపము నందుగల సింహాసన స్థితాయ=సింహాసన మందున్నవానికై, అ॥ హస్తికృత్తివసనధరార్చిత మహాగణపాయ ఏనుగుచర్మమును ధరించిన శంకరునిచేత నర్చించబడిన మహాగణపతికై. తత్వరూపాయ = ఏది శాశ్వతమైనదో, ఏది మూలకారణమైనదో, తత్ = ఆరూపముగల వానికై, ఆత్మతత్వస్వరూపునకై, సమస్త భక్తానుగ్రహాయ = సర్వులను భక్తులను అనుగ్రహించు వానికై, మాయాలింగిత విగ్రహాయ=మాయా శక్తిచే ఆలింగనము చేసికొనిన వానికై, మాయను స్వాధీనము చేసికొనినవాడు, మాయాతీతుడు. ధ్యాన శ్లోకమున= ఆశ్లిష్టంప్రియయా = ప్రియురాలిచే ఆలింగనము చేసికొనబడినవాడు. మహాగణపతికి 12 చేతులు. గాన ద్వాదశ హస్తములయందు, కమలోత్పల, పాశ, శంఖ, చక్ర, ఇక్షు, కార్ముక, వ్రీహ్యగ్ర, గదా, నిజవిషాణ,మాతులుంగ, రత్నకలశములను ధరించిన వానికై, పద్మముల వంటి పాదములు గల వానికై, విమలాయ - శుద్ధ స్వరూపునికై, విశ్వోత్పత్తి స్థితిలయాయ = ప్రపంచ సృష్టి, స్థితి, లయము లొనర్చు వానికై, సత్వ, రజస్తమోగుణములచే, బ్రహ్మ విష్ణు శివ మూర్తుల మూలాధార మందుంచి వానిచే కార్యములు చేయించువాడు, దయకు స్థానమైన వానికై, హిమాద్రి తనయానన పంకజ హిరణ్యగర్భాయ=చల్లని పర్వత రాజకుమారి, పార్వతియొక్క ముఖమనే పద్మమునకు సూర్యుడైన వానికై, రవి దర్శనముచే పంకజములు వికసించును. గణపతిని చూడగనే పార్వతి ముఖ పద్మము వికసించునని, ఉమారమణ కుమార గురుగుహ సమాన వక్షోజసే =

ఉమారమణుడు శంకరుడు, శివుని కుమారుడు కుమారస్వామితో సమానమై, గొప్ప బుద్ధి బలము గల వానికై, మహసే= గొప్పవాని కొఱకు నమస్కారము. సమాన సరోజసే=యను పదమున "నవరోజు" రాగ నామమును కూర్చిరి. ఇందు మరియొక చమత్కారమును గమనింపుడు. పార్వతీ ప్రియ తనయుడు గణపతి. శంకర ప్రియ తనయుడు కుమారస్వామిని వర్ణించుటలో, పార్వతి తొడపై గణపతి, శివుని తొడపై కుమారస్వామి గోచరింతురు. మరియు కమల, ఉత్పల, పంకజ ఆననపంకజ, కరమల, పదపద్మము అని వర్ణించుటలో కోమలత్వ, స్వచ్ఛత, నిర్మలత గోచరించును. హృదయ కమలము వికసించిన, వారికి గోచరించునని ధ్వని = ఈవిధమైన భావమును అనుభవ మొనర్చుకొని, మూర్తిని తిలకించుచు గానము చేసినవారు దీక్షితులు.

## రెండు కళల చౌకం

ప॥ గా , గా గ మ । గ రీ స ని స రి ।
హ - స్తి - వ ద నా - - -

సా సా స దా, । స ని ఫ ధ ని స రి ‖
య - - న మ - - స్తు - భ్యం ‖

గా గ గా గ రి గ మ । గా మ గ రి స ని స రి ।
హ - - స్తి - - - వ ద - - నా - - - ।

సా సా స ధా । ధ ని స రి స ని ధ ఫ ధ ని స రి ‖
య - - న మ - - - - - - - స్తు - భ్యం ‖

స్రి, సా రీ । గా మ గ రి సా గ రి ।
హా ట క మ య - - మం ట - ।

గ గ రీ ధ స రి । ని ధా ని సా రి |
పే - - సిం - హా - స న స్థి తా య |

(2) రి ప గ రి స ధా ని సా రి |
సిం హా - స న స్థి తా య |

గా గ గా రి గ మా । గ ప రీ స ని స రి । సా , సా సా ||
హ - - స్తి - - వ - ద - నా - - య - - ||

అ॥ ని సా గ రి సా । ని సా ధా స ని । పా, ధా నీ । ని సా రీ రి గ |
హ - స్తి - కృ త్తి వ - స - న ధ రా - ర్చి త మ - |

రి స నీ సా రీ । రి గా గా రీ మ గ । గ రీ స ని స రి
హా - - గ ణ । పా - య త - - - త్వ రూ - - -

రి స రీ రీ రి | (2) రి స రి రీ సా | నీ స ధా నీ |
పా - - - య | పా - య - స | మ స్త భ క్తా |

పా గ రీ , రి । మ గ మ రి గ స ని । ధా గ రీ , రి ||
ను గ్ర హా య । మా - యా లిం గి త । వి గ్ర హా య ||

చ॥ ధ నీ సా సా । ని ధా స ని పా । ధా , నీ సా ।
క మ లో - త్ప ల పా - - శ శం ఖ ।

రీ , మ గ మ రి | సా , నీ సా । ధా , మ గ రీ ।
చ క్రే - - క్షు | కా ర్ము క । ప్రీ హ్యా - - ।

గ గ మ రీ , రి । స నీ సా సా | గా , గ రి గ మ ।
గ్ర గ - దా ని జ వి షా - | ణ మా - - -

గా మ గ రీ సా నీ | ధా , నీ పా । స నీ రీ సా | స ధ రి నీ , స ।
తు లుం - - గ | ర త్న క ల శ ధ ర | ణ క - రాం బు

ధా , నీ నీ । ప ధా నీ సా । రి స రి రీ రీ
జా - య । ప ద పం క । జా - - - య

గ మా గ మ రీ । రి గా సా సా । రి నీ సా రీ ।
వి మ లా - - - య వి - శ్వో - - త్ప ।

గ సా గా రీ । ధ రీ సా సా । ని ధా స ని పా ।
- త్రి స్థి తి । వి ల యా - య - క - రు

ధ నీ ని ధ నీ । స రి స సా సా ॥
ణా - - - ల యా - - - య ॥

మ॥సా॥ ధ నీ స రి గ రీ గ మ గా గ రి ।
హిమా ద్రి త న యా న న పం క జ

ని సా ని రీ సా ని ధ ధ ని పా ।
హి ర ణ్య గ ర్భా య సు మ న సే ।

ధ స ని స స స మ గా మ రి గ మ ప ।
ఉ మా - ర మ ణ కు మా ర గు రు గు హా ।

మ గా గ రి సా ని ధా ధ ని స రి ॥ హా స్త్రి ॥
స మా న వ వ ర్లో జ సే మ హా సే - ॥

## 15

## ఆర్ద్రదేశి రాగం మిశ్రజంపెతాళము

15వ మేళకర్త జన్యము స రి గ మ ప ద స ని స
స ద ప మ గ రి స

ప॥ శ్రీ గణేశాత్పరం నహి రేరే ।
శివాది షట్త్రింశ తత్వ స్వరూపిణా ॥ శ్రీ ॥

అ॥ వాగాది పంచక వ్యాపార రహిత హృదయాగార సంస్థితాత్।
యోగిరాజార్చితాత్ ॥

చ॥ మాతంగవదనాత్, ఉమా రుద్ర దర్శితాత్,
భూత భౌతిక విశ్వపూజిత కళేబరాత్ ।
శ్వేతార్క సుమధరాత్, స్వేతర వివర్జితాత్,
పీతాంబరావృతాత్, బ్రహ్మాద్యుపాసితాత్ ।
భూతాది నుత పదాంభోజాత్, శివాత్మజాత్,
శీతాంశుధర పరమశివ గురుగుహాగ్రజాత్ ॥ పరం నహి రేరే ॥

వ్యా॥ పంచమీ విభక్తి రచన. శ్రీగణేశాత్ = మంగళ ప్రదుడైన గణపతి కంటె, పరం = వేరైనది, నహి = లేదు, రే, రే, ఒరే ఒరే = అని గట్టిగా పలికిరి. శివాదిషట్త్రింశతత్వ స్వరూపిణః = ప్రపంచమునకు ఆధారమైన తత్వములు 36; 24 గుగా వర్ణించిరి. చతుర్వింశతి, షట్త్రింశ త్తత్వములు, 36 తత్వముల వివరణ, శివ, శక్తి సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్యా, మాయా, కళా, అవిద్య, రాగ, కాల, నియతి, పురుష. ప్రకృతి, అహంకార, బుద్ధి, మనః, శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, ఆకాశ, వాయు, అగ్ని, ఆపః, పృథివి; ఇవి శివాది షట్త్రింశ త్తత్వములు. ఈ 36 తత్వముల స్వరూపికన్న, వాగాది పంచక వ్యాపారము లేకుండ, చర్మము, నేత్రములు, చెవులు. నాలుక, ముక్కు ఇవి పని చేయకుండ ఆపినచో మనస్సు హృదయమందున్న మూర్తిపై నిలచును గాన అటువంటి హృదయమందున్న వానికంటె, యోగి రాజార్చితాత్ = యోగమునందు సిద్ధినందిన వారిచేత అర్చింపబడు వానికంటె, (సనక సనందనాదులు) ఇంతవరకు నిర్గుణ తత్వరూపము. చ॥ మాతంగ వదనాత్ = ఏనుగు ముఖముగల వానికన్న, ఉమా రుద్ర దర్శితాత్ = పార్వతీశ్వరులచే చూడబడు వానికన్న, భూత

భౌతిక విశ్వప్రూజిత కళేబరాత్ = పంచ భూతమయమైన భౌతిక ప్రపంచ ముతో గూడిన ఈవిశ్వములో పూజింపబడు సగుణ రూపునికన్న, శ్వేతార్కసుమధరాత్ = తెల్లజిల్లేడు పూవును ధరించిన వానికన్న, స్వేతరవివర్జితాత్ = స్వ = తన, ఇతర = భేదములేని వానికన్న, స్వ, పర భేదము లేనివాడు, పీతాంబరాన్వృతాత్ = పసుపుపచ్చని వస్త్రము ధరించిన వానికన్న, బ్రహ్మాద్యుపాసితాత్ = బ్రహ్మాదులచేత నుపాసించబడు వానికన్న, భూతాదినుత పదాంభోజాత్ = భూతము లనగా, పంచ భూతములు. మరియు "ఏకోవిష్ణుః మహద్భూతం" అన్నారుగాన విష్ణ్వాదులచేత కొనియాడబడిన పాదపద్మములుగల వానికన్న, శివాత్మజాత్ = శివుని ఆత్మజుడు కుమారునికన్న, శీతాంశుధర పరమశివ గురుగుహాగ్రజాత్ = శీతాంశుని = చంద్రుని ధరించిన పరమశివుని కుమారుడైన గురుగుహునకు అగ్రజుడు అన్నయైన గణపతికన్న వేరు లేరు లేరని ఘంటాపథముగా, గణపత్యుప నిషత్తు, గణేశతాపిన్యుపనిషత్తుల సారమంతయు నీకృతి యందు తెలియజేసిరి.

ఒక కళ చౌకం

ప॥ రీ గ మా ద ప దా । ప । మ గ |
శ్రీ గ ణే శా - - త్ప రం |

గా గ గ రి స ని ధ । ని । సా |
చి త్త న - హి - రే రే - |

మ॥సా॥ ని దా ద పా మ మ గా రీ సా ।
శి వా ది ష ట్త్రిం శ త్త త్వ

ధ శి | రి రి స ని || రి స రీ |
స్వ రూ - పి ణ - || శ్రీ - - |

అ॥ సా సా ద పా | ప | మా | దా పా ద ద ద | సం | ని సం |
వా గా ది పం చ క | వ్యా పా ర ర హి త హృ ద |

దా సాం ద సాం | ద | పా | మా ద పా మ గ | రి | రి స స ని |
యా గా ర సం థ్ధి తా | దో గి రా జా - ర్చి తా - - - |

రి స రీ || చ॥ మా మ గ మ ద ప మ | గ | రి స |
చ్ఛి) - - || మా తం - గ వ ద నా - దు |

సాం ధా ని స రి | గ | మా | గా గ గా రి స | ధ | ధ రి |
వా రు (ద ద - ర్శ తా | దూ్యత భా తి క . వి . శ్వ - |

సా ధ రి స ని సా | రి | గా | మా మ గ మ మ గ | మ | దా |
పూ జి త క - శై | బ రా | చ్ఛే తా - ర్క-సు మ | ధ | తా |

పా ద ద సం ని సం | ద | పా | దా సాం ద సాం | ద | పా |
చ్ఛేత ర వి వ - ర్జి తా | త్రి తాం బ రా వృ తా |

పా మా గ గ రి స ని | రి | సా ||
(ద్బ హ్మ ద్య పా - - - సి తా ||

మ॥సా॥ రీ గా మ ద ద ప దా సాం నీ | సం ద | ద సం నీ |
దూ్యతా ది న త ప దాం భో జా చ్ఛి వా | - త్మజా |

సాం పా ని ద ద ప ప మ మ మ గ గ |
చ్ఛీ తాం శు ధ ర ప ర మ శి వ గు రు

రి స | స ధ సా | రి స రీ | గణేశాత్ ||
గు హా - గ్ర జా | చ్ఛి) - - |

## 16

## బేగడ రాగము   రూపక తాళము

29 వ మేళకర్త జన్యము

స గ రి మ ప ద నీ ద ప స=స ని ద ప మా గ రి స

స గ రి గ మ ప ద ప స = అనునది కూడ కలదు.

ప॥ వల్లభానాయకస్య, భక్తోభవాని ॥

మ।సా॥ వాంఛితార్థదాయకస్య । వరమూషిక వాహనస్య ॥వల్లభ॥

అ॥ పల్లవపద మృదుతరస్య । పాశాంకుశాదిధరస్య ।
మల్లికాబ్జ చంపకాదిహారస్య । మణిమాలస్య ॥

మ॥సా॥ వల్లీవివాహకారణస్య । గురుగుహ పూజితస్య
కాళీ కళామాలినీ । కమలాక్షీ సన్నుతస్య ॥ వల్లభ ॥

వ్యా॥ షష్ఠీ విభక్తి రచన. వల్లభానాయకస్య = వల్లభాదేవి నాయకునకు భక్తుడనైతిని. కోరిన కోర్కెలు దీర్చువానికి, శ్రేష్ఠమైన ఎలుక వాహనముగ గలవానికి, పల్లవపద మృదుతరస్య=చిగురుటాకుల వలె కోమలములైన పాదములు గలవానికి, పాశము, అంకుశము మొదలైన ఆయుధములు ధరించినవానికి, మల్లిక, పద్మ, చంపకము లతో కూర్చిన మాలను ధరించినవానికి, మణులతోగూర్చిన మాలను ధరించినవానికి, వల్లీ వివాహకారణస్య=కుమారస్వామికి, అమృతవల్లి, దేవసేనలు ఇరువురు భార్యలు. అందు అమృతవల్లి, విష్ణుమూర్తి కుమార్తె. ఆవల్లిని తన సోదరునకు నిచ్చి వివాహము జరిపించుటకు కారణమైన వానికి, సుబ్రహ్మణ్యేశ్వరునిచే పూజింపబడువానికి, కాళీ,

కళామాలినీ, కమలాక్షీ, సన్నుతస్య, కాళీ = భద్రకాళీ, పార్వతి, కళామాలిని= సరస్వతి, కమలాక్షి = లక్ష్మిచే నుతింపబడువానికి భక్తుడను. దీక్షితులవారు కొన్ని కృతులు పల్లవి, అనుపల్లవి, (లేక) సమిష్టి చరణముతో రచించిరి. అందులో ఇది యొకటి. ఇందు రాగ నామము లేదు. కారణము, బేగడ తెనుగు దేశ్య పదము. తెనుగువారి రాగము. బేగడయన=కాకి బంగారము, అభ్రకము అని అర్థము.

ధ్యాన శ్లోకం :

బీజాపూరగదేక్షు కార్ముకరుజా । చక్రాబ్జపాశోత్పల
వ్రీహ్యగ్రస్వ విషాణరత్నకలశ । ప్రోద్యత్కరాంభోరుహః ।
ధ్యేయోవల్లభయా, సపద్మకరయా । శ్లిష్టోజ్వలద్భూషయా,
విశ్వోత్పత్తి విపత్తి సంస్థితికరో । విఘ్నో విశిష్టార్థదః ॥

## 17

## కాశిరామక్రియ రాగం ఆదితాళము

51వ మేళకర్త జన్యము స గ రి గ మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ ఉచ్ఛిష్ట గణపతౌ భక్తిం కృత్వా । ఉన్నత పదవీంవ్రజరేరే ॥

అ॥ సచ్ఛబ్దవాచా స్వరూపిణి । సఫలీకృత బ్రహ్మ స్వరూపిణి ॥

మ॥సా॥ చిచ్ఛక్తి స్ఫూర్తి స్వరూపిణి । చిదానందనాథ స్వరూపిణి॥ఉ॥

చ॥ నారీయోనిముఖాస్వాదనే । నగ్న రామాక్రియామోదనే ।
భేరీ, వీణావాదనే । భేదాఽజ్ఞాన ధ్వాంతసూదనే ॥

మ॥సా॥ శౌరినుతే, నత గురుగుహమదనే ।
సూరి జనయుత శ్రీపురసదనే ।
దూరీకృత మహాదురితకదనే ।
గౌరీశనందనే, గజవదనే ॥ ఉ ॥

వ్యా॥ సప్తమీ విభక్తి రచన. ధ్యాన శ్లోకములు.

శ్లో॥ నీలాబ్జదాడిమీవీణా । శాలి, పాశాక్ష సూత్రకం ।
దధదుచ్ఛిష్ట నామాయం । గణేశః పాతు మేచకః ॥

(2) ఉచ్ఛిష్ట గణపతిర్దేవః । పార్వత్యాః ప్రియనందనః ।
ఆయురారోగ్యమైశ్వర్యం । కీర్తిందద్యాత్సదామమ ॥

ఉచ్ఛిష్ట గణపతి మంత్రమును వామాచార పద్ధతిలో క్షుద్ర బీజాక్షరములతో జపింతురు. దాని ప్రభావము ఇహలోకమందు. కీర్తి, ధన, భోగము, ఉన్నత పదవుల నొసగునని ప్రతీతి. ఉచ్ఛిష్ట గణపతౌ = ఉచ్ఛిష్ట గణపతి యందు, భక్తిం కృత్వా = భక్తిని కలిగి, సేవించిన, ఉన్నతపదవీం = గొప్పదైన పదవులను, వ్రజ, రే, రే = పొందుమురా, సచ్ఛబ్దవాచ్యా స్వరూపిణే = సత్-శబ్ద వాక్, కంటికి కనబడునది సత్, జ్ఞానముచే తెలియబడునది చిత్, ఉన్నాడు అను మాటకు నిదర్శనమును చూపు శబ్ద స్వరూపునియందు, సఫలీకృత బ్రహ్మస్వరూపిణే = కార్య సాఫల్యమును జేయు బ్రహ్మ స్వరూపుని యందు, చిచ్ఛక్తి స్ఫూర్తి స్వరూపిణే, సర్వజీవులయందు చిత్ = తేజోరూపముగా గోచరించువానియందు, చిదానంద నాథస్వరూపిణే = శాశ్వతానంద రూపునియందు, చిదానంద నాథరూపుడైన గురువునందు, నారీయోనిముఖాస్వాదనే = స్త్రీ యోని ముఖమును ఆస్వాదించు వానియందు, నగ్న కామాక్రియా మోదనే = వివస్త్రయైన

స్త్రీల రతి క్రీడయందు ఆమోదము, ఇష్టము గలవాని యందు. ఈ అర్థము లౌకిక భోగులకు మాత్రమే, నారీ=స్త్రీ= ప్రకృతి, మాయ, ఉత్పత్తి స్థానము యోని, యోని ముఖము మూలాధార స్థానము. మూలాధారమందుండి సృష్టి కార్యక్రమమును కలుగజేయువాడని, మాయతో కూడి యుండువాడను భావము. నగ్న=వివస్త్ర, దిగంబర యని = వస్త్ర విహీనయని, దిగేవ అబరః = దిగంబరః = దిక్కులే అంబరముగాగల మాయ, యని అర్థము. రామాక్రియామోదనే= రామక్రియా రాగముతో ఆనందించువాడు అని రాగ నామమును కూర్చిరి. భేరీ, వీణ, వేణు, వాదనే=సంగీత వాద్యములను వాయించు వాడని మామూలు అర్థము. అంతరార్థము, సప్తధాతువులు, సప్త తంత్రులుగ, మూలాధారము నుండి సహస్రారము వరకు గల వెన్నెముకయే వీణ, అందలి పూసలు, మెట్లుగ, అనాహతనాదమును, యోగ సాధనచే, ఓంకార నాదముత్పన్నమై, అదియే సప్తస్వర రూపమై, నిత్యము, అంతర్వీణా, వేణువు, గాలి వాద్యము. సోహం, అనునదే వేణువుగ, భేరీ= చర్మ వాద్యము, పాంచ భౌతిక దేహము చర్మముచే కప్పబడి యుండుటచే, చర్మము, భూత తత్వముగాన, వీనిని ఈ రూపమున వాయించువాడని యర్థము. దీనినే శ్రీ త్యాగరాజు మోక్షముగలదా=అని సారమతి రాగమున, ప్రాణానల సంయోగము వలన, ప్రణవ నాదము సప్త స్వరములై బరగె, వీణావాదనలోలురై, శివమనోవిధ మెఱిగిన వారలకు = మోక్షము గలదు. అని వారి అభిప్రాయమును వ్యక్తపరచిరి. అదే విధముగ, యోగికి ఒక్కనికే తెలియగలది. అటువంటి వీణను వాయించు వానియందు, భేదాజ్ఞాన ధ్వాంతసూదనే= అజ్ఞానముచే కలిగిన, భేదభావములను నశింప జేయు వానియందు, శౌరినుతే = విష్ణువుచే కొనియాడబడు వాని యందు, నత గురుగుహమదనే= కుమారస్వామిచే నమస్కరించబడిన మన్మథుని యందు, సూరిజనయుత శ్రీపురసదనే=ఉత్తములు, పండితు

లతో కూడిన శ్రీపురము, తిరువారూరునందున్న వానియందు, గజవదనుని యందు, భక్తిని కలిగి సర్వసుఖములను పొందుమని వర్ణించిరి. ఇందు, ఆస్వాదనే, ఆమోదనే, వాదనే, సూదనే, మదనే, సదనే, కదనే, నందనే, వదనే అను అంత్యప్రాస పదములు, మృదు మధుర భావములు గమనించదగినవి.

## రెండు కళల చౌకం

ప॥ సా గ రి గా స గ మ ప । దా స ని ద ప దా । ప మ పా గా
ఉ చ్ఛి - - ష్ట గ ణ ప । తౌ - - భ - - క్తిం - కృ
గ రి గా ద ప ప మ ప మ గా ।
తో్వ - - న్న త ప - ద - వీం ।
గ రి గ మ గ రి మ గ । గ రి రీ గ రి స ని
ప్ర - - - జ - - - రే - - హృ ద య -

(2) గ రి గ మ గ రి మ గ । గ రి రీ సా
ప్ర - - - జ - - - రే - - -

అ॥ సా , ద ప ద ద ప మా । పా , ద । పా ప మ గా
స చ్ఛ - - - బ్ద వా చా స్వ రూ పి - ణి
గ రి గా మ మ మ ప గా గ రి । గ మ మ మ ప । గా గ రి గ గ
శ - బ లీ - కృ - త బ్ర - - హ్మ - స్వ - రూ - - పి ణి
గా మా పా దా , నీ ద సా స ని
చి చ్ఛ క్తి స్ఫూ ర్తి స్వ రూ పి ణి

ద స నిదపపగా । గ రీ గ రి స ధ స

చి దా - నం ద నా - ధ స్వ రూ - పి ణి

చ॥ గా శీ సా ధ స । సా , గ । గ రి గా

నా రీ యోసి ము । ఖా స్వా - ద నే

మా ప గా గ ప మ గా । రి సా స । ద ప ప మ గా

న గ్న రా మా - - - క్రి యా మో - ద నే - -

మా రీ గా రీ । గా రి గ ॥ మ గ మా పా

భే రీ వీ ణా। వే ణు వా - - ద నే

దా దా , గ రి స రీ సా । ద ప ద ప పా ప మ । గ రి సా

భే దా - జ్ఞా - - న । ధ్యాం - - త సూ - - ద నే

మ॥సా॥ సా ధ స స రి గ రి గ ద ప మ గ రి పా ।

శౌ రిను తే - న త గు రు గు హ మ ద నే ।

రీ గ స రి స ధా । గ రి గ ద ప మ పా

సూ రి జ న యు త శ్రీ - పు ర స ద నే

గా మా ప ద మ పా ద ని ద గ రి పా ।

దూ రీ కృ త మ హా దు రి త క ద నే ।

నీ దా ప ప మ గ । గ రి గ ద ప మ గ రి ॥ ఉ ॥

గౌ రీ శ నం ద । నే - గ జ వ ద నే - ॥

## 18

## నటనారాయణి ఆదితాళము

28వ మేళకర్త జన్యము   స రి మ ప ని ద ని స
స ని ద ప మ గ రి గ రి స

ప॥ మహాగణపతే, పాలయాశుమాం । మాయామయవల్లభాపతే ॥

అ॥ మహా నటనారాయణీ నందన । మానితదేవ, దేవకీనందన ॥

మ॥సా॥ మహేశ్వర గురుగుహ భక్తచందన ।
మాతంగవదనేంద్రాది వందన ॥ మహాగణపతే ॥

లఘువ్యాఖ్య॥ సంబోధన ప్రథమావిభక్తి. మహాగణపతీ; వేగమే పాలించుము. లోక నాటక రంగమున, నటించు నారాయణుని సోదరి, నారాయణీ కుమార. పార్వతీ తనయం, దేవకీనందనునిచే పూజింపబడిన దేవ అను సంబోధనలతో, రాగనామముతో, చరణము లేకుండ, పల్లవి, మధ్యమకాల సాహిత్యముతో రచించిరి.

## 19

## జంఝూటిరాగం ఏకతాళము

ప॥ గణేశ కుమార పాహిమాం । గజముఖ ॥

అ॥ మనోరథ సిద్ధిదాయక । ఆగమ పదాదినుత ।
భవ, శ్రీ గురుగుహహిత ॥

ల॥వ్యా॥ గణేశ కుమారయన్న, కుమారుడు బాలుడైన గణపతి యని అర్థము.

శ్లో॥ కరస్థం కదలీచూత । పనసేక్షుక మోదకం ।
బాలసూర్య నిభంవందే । దేవం బాలగణాధిపమ్ ॥

షోడశ గణపతులలో "కుమార గణపతిని వర్ణించిరి.

## 20

## వేగవాహిని రాగం రూపకతాళము

16వ మే. జన్యము (చక్రవాళ జన్యం)

ప॥ వినాయక, విఘ్ననాశక, మాం । తారయ, దయానిధే ॥

అ॥ అనాథరక్షక, ఆరూఢమూషిక । దక్ష శిక్షక । మోదక భక్షక॥

చ॥ శివ గురుగుహ విధిపూజిత । ఆశ్రితజన పరిపాలక ।
దేవరాజపురతోషిత । వేగవాహినీ వందిత ॥

మ॥సా॥ రవి, శశి వహ్ని నేత్ర । రతి, పతి సన్నుత శుభగాత్ర ।
పవనాత్మజానందకర । రామమిత్ర । వరపవిత్ర ॥వినాయక॥

ల॥వ్యా॥ సంబోధన=ఇందు రవి,శశి, వహ్ని నేత్ర, పవనాత్మజా నందకర= ఆంజనేయునకు ఆనందము కలిగించువాడ, రామమిత్ర = రామునకు మిత్రుడు, అను పదములు, వేగవాహినీ రాగ నామము కూర్చుట గమనించదగినది.

## 21

## ఈశమనోహరి రాగం రూపకతాళం

28వ మే. జన్యము. స రి గ మ ప ద ని స
స ని ద ప మ రి మ గ రి స

ప॥ (శ్రీ)గణనాథం భజరే । చిత్తపరాశక్తియుతం ॥ (శ్రీ) ॥

అ॥ నాగయజ్ఞ సూత్రధరం । నాద లయానందకరం ।

చ॥ ఆగమాది సన్నుతం । అఖిల దేవ పూజితం ।

యోగశాలి భావితం । భోగిశాయి సేవితం ॥

మ॥సా॥ రాగద్వేషాదిరహిత । రమణీయ హృదయ విదితం ।

(శ్రీ) గురుగుహ సన్నుదితం । చిన్మూల కమలస్థితం ॥(శ్రీ)॥

ల॥వ్యా॥ ద్వితీయా విభక్తి. సాధారణముగ పల్లవి, అనుపల్లవి, ఒక ప్రాస, చరణం వేరొక ప్రాసలో నుండును. ఈకృతి అంతా ఒకే ప్రాసలో రచించబడినది. చిత్త పరాశక్తియుతం = చిత్తము నందు పరాశక్తితో కూడినవాడు, చివర చిన్మూల కమలస్థితం=చిత్ ప్రకాశం సహస్రారం=సహస్రార కమలమందుండు వాడని, ఈశ్వరుని మనసునకు ఆనందము కలిగించువాడు గాన ఈశమనోహరి రాగమున కృతి రచించిరి.

## రెండు కళల చౌకం

ప॥ సా రి గ రీ । రీ గ మ పా । నీ ద ప మా ।

(శ్రీ) గ ణ నా । ధం భ జ రే । చి త్త ప రా

గా రి స న్ | సా సా సా |

శ క్తి యు తం | (శ్రీ) - - |

అ॥ గా గ మా మ । పా స ని సా । నీ ద ని పా ।

నా గ య జ్ఞ సూ త్ర ధ రం । నాద ల యా ।

మా గ రి స ని | (శ్రీ) ||

నం ద క రం | ||

చ॥ రీ గ మా రి । గా స రీ, । స ని ధ పా గ । రీ ని సా,
ఆ గ మా ది స న్ను తం అ ఖి ల దే వ పూ జి తం

సీ గ రీ మ । గా ప మా, । పా గ మా రి । గా మ పా,
యో గ శా లి భా వి తం భో గి శా యి సే వి తం

మ॥సా॥ సా సా నీ దా ని ద ప మ ।
రా గ ద్వే షా ది ర హి త
గ మ పా ద ప ద ని స ని సా
ర మ ణీ య హృ ద య వి ది తం
రీ గ మ రి గ సా ని ద పా ।
శ్రీ గు రు గు హ స న్మ ది తం ।
నీ నీ ద ప మ గా రి స ని ॥ శ్రీ ॥
చి న్మా ల క మ ల స్థి తం ॥

## 22

## రాగచూడామణి రాగం త్రిపుట తాళము

32వ మే. జన్యము — స రి గ మ ప స / స ని ద మ గ రి స

ప॥ శ్వేత గణపతిం వామదేవ ప్రతిపాద్యమనాద్యం ॥

అ॥ భూత గణాది సంసేవితం । బుద్ధ గురుగుహ సంభావితం ॥

మ॥సా॥ మాతంగ ముఖం వల్లభా సమేత విరాగ చూడామణిం ॥

ల॥వా॥ ద్వితీయా విభక్తి. శ్వేత గణపతిని భక్త గణపతియందురు.

ధ్యాన శ్లో॥ నారికేళామ్ర కదళీ గుడ సాయస ధారిణం ।
శరచ్ఛంద్రాభ వపుషం భజే భక్త గణాధిపం ॥

## 23

## రుద్రప్రియ రాగం చతురశ్ర ఏక తాళం

22వ మే. జన్యం.  స రి గ మ ప ద ని స
స ని ప మ గా రి స

ప॥ గణనాయకం భజేఽహం ।
భజే కమలేశ సుతం కామ రిపు సుతం ॥

అ॥ అణిమాది సిద్ధి దాయకం । సుముఖం ॥ గణ ॥

చ॥ వాణీ రమణానందం వరదం వదనే ద్విరదం ।
వర బాల గురుగుహం ॥ గణనాయకం ॥

ల॥వ్యా॥ ద్వితీయా విభక్తి. దీక్షితులవారు "రుద్రపియసుతం" అను పదమును వేయవచ్చును. నోటు స్వర సాహిత్యములవలె ఇటువంటివి రచియించి యుందురు.

## 24

## చామరం రాగం రూపక తాళం

56 వ మేళకర్త.  షణ్ముఖప్రియరాగం సంపూర్ణం.

ప॥ సిద్ధి వినాయకమనిశం । చింతయామ్యహం । ప్ర
సిద్ధ గణ నాయకం విశిష్టార్థ దాయకం ॥ వర ॥

అ॥ సిద్ధ యక్ష కిన్నరాది సేవితం । అఖిల జగత్ప్ర ।
సిద్ధ మూల పంకజ మధ్యస్థం మోదక హస్తం ॥

చ॥ భాద్రపద మాస చతుర్థ్యాం । బ్రాహ్మణాది పూజితం ।
పాశాంకుశ ధరం ఛత్ర । చామర పరివిరాజితం ।
రాహిణేయానుజార్జితం । ఈహనాపర్జితం ॥

మ॥సా॥ అద్రిరాజ సుతాత్మజం । అనంత గురుగుహాగ్రజం ।
భద్రప్రద పదాంబుజం । భాసమాన చతుర్భుజం ॥ సిద్ధి ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి రచన. భాద్రపద శుద్ధ చవితి వినాయక చవితి. ఆనాడు అన్ని ప్రాంతములలో వరసిద్ధి వినాయక నవరాత్రోత్సవములు జరుపుట శ్యమంతకోపాఖ్యానం చదువుటచే నీలాపనిందలు రావని ప్రతీతి. ఆ సందర్భమును పురస్కరించుకొని రచించ బడిన కృతి. వరసిద్ధి వినాయకుని ఎల్లప్పుడు నేను చింతించెదను అని ప్రసిద్ధ గణనాయకం సిద్ధ. యక్ష, కిన్నరాదులచే సేవింపబడు వాడని; రోహిణేయానుజార్చితం = రోహిణీతనయుడు బలరాముడు, ఆయన అనుజుడు కృష్ణుడు, ఆయనచేత పూజింపబడిన వాడను కథను తెలుపుచు, ఛత్ర చామర పరివీజితం అని చామర రాగ నామమును కూర్చిరి.

## 25

## వేగవాహిని ఆదితాళం

16వ మే. జన్యం. స రి గ మ ప ద ని ద స
స ని ద ప మ గ రి స

ప॥ గజానన యుతం గణేశ్వరం । భజామి సతతం సురేశ్వరం ॥

అ॥ అజేంద్ర పూజిత విఘ్నేశ్వరం । గణాది సన్నుత పద్మకరం ॥

మ॥సా॥ కుంజర భంజన చతురతర కరం ।
గురుగుహాగ్రజం ప్రణవాకారం ॥

ల॥వ్యా॥ ద్వితీయావిభక్తి. మామూలు విశేషణ పదములతో రచించబడినది. ఇందు రాగనామము లేదు. ఏనుగుముఖము గల వానిని, గణములకు నాయకుని ఎల్లప్పుడు సేవింతును.

# 26

## తోడిరాగం రూపకం

8 వ మేళకర్త. సంపూర్ణం,

ప॥ మహాగణపతిం వందే । మహాధవాద్యమర బృందం ॥

అ॥ అహంతాది రహితం శక్తి వినుతం । ఆనందదం తం, ఏకదంతం॥

చ॥ త్రిపుర వధార్థం శివేన । త్రయంబకేనార్చితం ।
ఉపనిషత్ప్రతిపాదితం । ఉమా మహేశ్వర సుతం ।
కపిల వశిష్టాది నుతం । కంజజాదిభి రీడితం ।
కపిలం కృష్ణ పూజితం । కరివదన సుశోభితం ॥

మ॥సా॥ సుపర్ణ వాహ సేవితం । సుర గురుగుహ భావితం ।
కపిత్థామ్ర పనస జంబూ కదలీ ఫల భక్షితం ॥మహా॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఇది తరుణ గణపతిపై రచించ బడినది. ధ్యాన శ్లోకమున,

శ్లో॥ పాశాంకుశాపూప కపిత్థ జంబూ ।
స్వదంత శాలీక్షు మపి స్వహస్తైః ।
ధత్తే సదా య స్తరుణారుణాభః ।
పాయాత్సయుష్మా స్తరుణో గణేశః ॥

కపిల వర్ణము త్రిపుర సంహార సమయమున త్రిమూర్తులచేత నర్చించబడిన వాడు, దేవతా బృందముతో కూడిన మహాగణపతిని నమస్కరించు చున్నాను. తోడి = తెనుగుపదం. తెనుగువారి రాగం. తృతీయా విభక్తి. తోడీ, తోడు, సహాయము, వెంట అని అర్థము గాన రాగనామము లేదు.

## 27

## బిలహరి రాగం త్రిపుట తాళం

29వ మేళకర్త జన్యము — స రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ ఏకదంతం భజేఽహం । ఏకానేక ఫలప్రదం ॥

అ॥ పాకశాసనారాధితం । పామర పండితాది నుతపదం ॥

చ॥ కైలాసనాథ కుమారం । కార్తికేయ మనోహరం ।
హాలాస్య క్షేత్ర వేగవతీ తట విహారం హారిం ॥

మ॥సా॥ కోలాహల గురుగుహ సహితం ।
కోటిమార రావణ్య హితం ।
మాలా కంకణాది ధరణం ।
మాషా వల్లభాంబా రమణం ॥ ఏక ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. తిరునల్వేలి యందు, వేగవతీ నదీ తీరముననున్న కైలాసనాథేశ్వరుని ఆలయమందున్న ఏకదంత గణపతిని వర్ణించిరి. ఆ క్షేత్రమును, హాలాస్య క్షేత్రమందురు. అచట మాషా వల్లభాంబా రమణుడైన మూర్తిని, కైలాసనాథ కుమారుని, కార్తికేయుడు = కుమారస్వామికి మనోహరుని, కోటి మన్మథ లావణ్యము గలవానినిగ వర్ణించిరి.

## 28

## నాట రాగం చతురశ్ర ఏకతాళం

36 వ మే. జన్యం. — స రి గ మ ప ద ని స
స ని ప మ రి స

ప॥ మహా గణపతిం మనసా స్మరామి ।
వశిష్ఠ వామ దేవాది వందిత ॥ మ ॥

అ॥ మహాదేవ సుతం గురుగుహ నుతం ।
మారకోటి ప్రకాశం ॥ శాంతం ॥

మ॥సా॥ మహాకావ్య నాట కాది ప్రియం ।
మూషిక వాహన మోదకప్రియం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. మహాగణపతిని, మహాదేవ సుతుని, మూషిక వాహనుని, మోదకహస్తుని మొదలగు విశేషణములతో రచించిరి. ఇందు "మహాకావ్యనాటకాదిప్రియం" అను పదమున నాట రాగమును కూర్చిరి.

## 29

## మోహనరాగం ఆదితాళం

28 వ మే. జన్యం. స రి గ ప ద స
స ద ప గ రి స

ప॥ రక్త గణపతిం భజేఽహం । రత్నసింహాసన పతిం ॥ సురపతిం ॥

అ॥ రక్తాంబర ధరం రాగద్వేషాది హరం ।
పార్వతీ ప్రియకరం మోహన కరం ॥

చ॥ పరశు రామ క్షేత్ర ప్రభావం ।
పాయసాన్న హోమాది విభావం ॥

మ॥సా॥ సకల కార్యార్థ స్థితం । వామదేవాది పూజితం । పరం ।
వారిజభవ వందిత వల్లభేశం । గురుగుహ నుతం ।
పరమ శివసుతం ॥రక్త॥

వ్యా॥ ద్వితీయావిభక్తి. సిందూర గణపతి యందురు. మోహన కరం అని రాగ నామమును కూర్చిరి. ఇందు ప్రభావం, విభావం, స్వభావం, వైభవం పదములు గమనించదగినవి.

## 30

## ఆఠాణా రాగం ఖండజాతి ఏక తాళం

29వ మేళకర్త జన్యము స రి మ ప ని స

స ని దా ప మ ప గా రి స

ప॥ వామాంక స్థితయా వల్లభయాశ్లిష్టం ।

వారణ వదనం దేవం వందేఽహం ॥

అ॥ వామన స్వరూపం వరదం । సచాపం ।

చామర చరణం శశి శేఖర తనయం ॥

చ॥ అష్టాంగ యోగ వర హఠాణవాది ।

వశిష్ఠాది తపోధన సేవిత గణనాథం ।

సృష్ట్యాది కారణం శిష్టభక్త భరణం ।

ఇష్టఫలద చరణం శిష్టహృద్విహరణం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఇది దీక్షితులవారు ప్రారంభ దశలో రచించిన కృతియనవచ్చును. "వరాహఠాణవాది" అఠాణా రాగమును కూర్చిరి.

## 31

## ఆరభిరాగం త్రిపుట తాళము

29వ మే. జన్యము స రి మ ప ద స

స ని ద ప మ గ రి స

ప॥ గణరాజేన సంరక్షితోఽహం । మణిమండిత చారునిటలేన ।

గుణిజన నుత పల్లవ పదేన ॥

అ॥ అణిమాద్యష్ట సిద్ధి ప్రదేన । మాణిక్య మకుటాది ధరేణ ।
మం। త్రిణీ పూజిత సుముఖేన । మహిత గురుగుహ వంది తేన ॥

మ॥సా॥ దినకర కోటి ప్రకాశేన । వినతాశ్రిత మందారేణ ।
మను పూజిత పాశాంకుశేన కానన స్థిత బ్రహ్మచర్యేణ ॥

వ్యా॥ తృతీయా విభక్తి రచన. ఇది చిన్నతనమున రచించ బడిన రచన అయియుండవచ్చును. శ్రీవారి రచనలలో సామాన్య రచనలు, విశేషరచనలు అని రెండుగా నిర్ణయించవచ్చును. ప్రారంభ దశలోని రచన, సామన్యరచన దైవగుర్వనుగ్రహమున రచించబడినవి విశేషరచనలు.

## 32

## వరాళి రాగం ఖండజాతి ఏకతాళము

ప॥ లంబోదరాయ నమస్తే । కుంభజ పూజితాయ ।
ఇభవదన వరదాయ ।

స॥చ॥ అభయ ప్రదాయ అంబుజ సన్నుతాయ ।
సాంబశివాత్మజాయ జంబూ కదలీ ఫల హార భక్షితాయ ।
గురుగుహాగ్రజాయ ॥

ల॥వ్యా॥ చతుర్థీ విభక్తి రచన. సామాన్య రచన. గణపతి విశేషణములతో రచించబడినది.

## 33

## సావేరి రాగం రూపక తాళము

15వ మేళకర్త జన్యము స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ కరికలభ ముఖం । దుంఠి గణేశం । భజ రేరే చిత్త ।
కావేరీ తటస్థితం । సావేరీ రాగ నుతం ॥

అ॥ హరిహయాది సకల దేవతారాధిత పదాంబుజం ।
గిరిజా తనుజం విజిత మనసిజం । గురుగుహాగ్రజం ॥

చ॥ మూలాధార చక్ర దళ పంకజ మధ్యస్థం ।
మోదక హస్తం మునిజన హృత్కమలస్థం ।
బాలచంద్ర సుముఖం । కరుణాసాంద్రం ।
పాశాంకుశధరం । పద్మకరం । సుందరం ॥

మ॥సా॥ నీలగ్రీవ కుమారం । నీరద శుభాకారం ।
పాలిత భక్తం, ధీరం । అపారం, వారం, వారం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి రచన. కావేరీ తీరముననున్న దుంఠి గణపతిపై సావేరి రాగమున, "కుళిక్కరై" క్షేత్రమున, గల స్వామిపై రచించిరి. ఈక్షేత్రము దక్షిణ కాశీక్షేత్రమని ప్రసిద్ధి. అట కాశీ విశ్వేశ్వర, విశాలాక్షి, అన్నపూర్ణ, కాలభైరవాది దేవతలను ప్రతిష్ఠించిరి. అందువలన కాశీక్షేత్రముతో సమాన పుణ్యక్షేత్రముగా విరాజిల్లినది.

## 34

## నాటకురంజి త్రిపుటతాళము

28 వ మే. జన్యము. స రి గ మ ద ని ప ద ని స
స ని ద మ గ స

ప॥ గజాధీశాదన్యం నజానేఽహం । గురుస్వరూపావతారిణో ॥

అ॥ నిజానందానుభవ । నిత్య విద్యాప్రబోధినో ।
నిర్మల హృదయస్థిత । నిర్గుణ రసరూపిణో ॥

మ॥సా॥ అజపాహంస నటనాది నిజ భజన తృప్త గురుగుహ రూపిణో ॥

వ్యా॥ పంచమీ విభక్తి రచన. గణపతి కన్న వేరు లేదని, అజపాహంస నటనముచే నిజభక్తులను తృప్తిపరచు మూర్తికన్న వేరు లేరని వర్ణించిరి.

# 35

## కళ్యాణి రాగం రూపకం

65 వ మేళకర్త, సంపూర్ణం.

ప॥ గణపతే, మహామతే । గౌరీకుమార మాంపాహి ॥

అ॥ అణిమాద్యష్టైశ్వర్యప్రద । గురుగుహ పూజితవర ॥

చ॥ సోమ సూర్యాగ్ని నేత్ర । సదాశివానంద పుత్ర ।
వామదేవాది వక్త్ర । వారిజ గంభీర గాత్ర ।
హిమాద్రీశ సుతామోద । హిరణ్మయ పీఠస్థిత ।
పామర పండిత నుతపద । పంకజాసనారాధిత ॥

వ్యా॥ సంబోధన ప్రథమావిభక్తి. గొప్ప మతి గల గణపతే, గౌరీకుమార నన్ను రక్షించుము, విశేషణ పదములు, అణిమాది అష్టైశ్వర్యముల నొసగువాడ, గురుగుహునిచే పూజింపబడువాడ, సూర్య, చంద్రాగ్ని నేత్ర! మొదలైన పదములతో రచించిరి. ఈ విధముగ దీక్షితులవారు గణపతి, మూలతత్వమును, నిర్గుణ, సగుణ, రూప, నామ, గుణ, భేదములతో, గాన, ఉపాసన, యోగ, మంత్ర, తంత్ర విషయములను, గాణాపత్య మత సంప్రదాయములను సవివరముగ, 26 కృతులలో గొప్పగ వర్ణించిరి.



# శ్రీ తిరువారూరు

# త్యాగరాజ కృతుల వివరణము

శ్రీ దీక్షితులవారు తిరువారూరునందలి త్యాగరాజేశ్వరునిపై అన్ని విభక్తులలో 13 కృతులు, అచటనేయున్న పంచలింగములపై 5 కృతులు, అమ్మవారు నీలోత్పలాంబికపై 9 కృతులు, కమలాంబా నవావరణ కృతులు 11 రచించిరి. ఇవి వీరి రచనా పటిమను చాటు రచనలు. తిరువారూరు, పరిసర ప్రాంతములో అనగా సుమారు 30, 40 మైళ్లలోపున ఆది జ్యోతిర్లింగములు ఏడు గలవు. వానిని "సప్త విడంగర్ త్యాగర్" క్షేత్రములందురు. ఈ ఏడును త్యాగరాజేశ్వర క్షేత్రములుగ ప్రసిద్ధి గాంచినవి.

1) తిరువారూరు = కమలాపురము, శ్రీపురమను పేర్లుగలవు. స్వామి "వీధీవిడంగ త్యాగర్" అందురు. స్వామి నటనము. "అజపానటనం" అమ్మవారు "నీలోత్పలాంబ", శ్రీచక్రవాసిని "కమలాంబ". ఆలయము త్యాగరాజ కోవెలకు వెనుక వాయువ్య మూలనుండును.

2) దీనికి నైరృతిగా "తిరువాయ్ మూర్" గలదు. దానిని "వాయుమూర్ నాదేశ్వర్" అందురు. స్వామి "నీల విడంగ త్యాగర్". అమ్మవారు "నిమ్మడి అమ్మై". స్వామి నటనం "కమల నటనం".

3) "తిరుకారైవాసల్". స్వామి "కణ్ణాయిర నాదేశ్వర్", అమ్మవారు "కైలాస నాయకి", స్వామిని "ఆది విడంగ త్యాగర్" అందురు. స్వామి నటనం "కుక్కుట నటనం".

4) "తిరునాగ పట్టణం". స్వామి "ఆది పురాణేశ్వర," "కాయా రోహణేశ్వర", అమ్మవారు "నీలాయతాక్షి", స్వామిని "సుందర విడంగ త్యాగర్" అందురు. స్వామి నటనము "పారావార తరంగ నటనం".

5) "తిరు కోళిలి" దానిని "తిరు కువళై" యందురు. స్వామి "కోళిలి నాదేశ్వర" "వండమర్ పూంపుడలి". స్వామిని "అవని విడంగ త్యాగర్" అందురు. అమ్మవారు "వండమర్ పూంపుడలి", స్వామి నటనము "శకట నృత్యము", వండి యనగా "బండి".

6) "వేదారణ్యం" "తిరుమరైక్కాడు". స్వామి "మరై కాటీశ్వర" "వేదారణ్యేశ్వర" అందురు. స్వామిని "భువిని విడంగ త్యాగర్" అని పిలుతురు. అమ్మవారు యాళైపడిత్త ముడియమ్మ", స్వామి నటనము "హంసనటనం".

7) "తిరునల్లూరు" "ఆదిపురి" "దర్భారణ్యం" అందురు. అచట 'శనైశ్చరుడే దర్భారణ్యేశ్వరుడు'. స్వామి "నగ విడంగ త్యాగర్" అందురు. అమ్మవారు "భోగ మార్త పూణ్ ముళై అమ్మై". అచటి లింగము 'మరకత లింగము'. అమ్మవారిని "ప్రాణేశ్వరి" యని పిలుతురు. స్వామి నటనము "ఉన్మత్త నటనము" ఈ ఏడు క్షేత్రములు దక్షిణదేశమున మహిమ గలవిగా తమిళ గ్రంథముల పేర్కొనబడినవి. వీని వివరణము ఆయా కృతుల వ్యాఖ్యానముల గమనింప దగును.

## నవావరణ వివరము :

శాక్తేయ సంప్రదాయమున శ్రీచక్రార్చన, నవావరణములని తెలుపబడినవి. కాని, భక్తుడు ఆత్మరూపమును ప్రాణ, లింగ దేహ

మును చేరుటకు, నవావరణములను తెలియవలెను. మహాన్యాసమున, పంచాంగరుద్ర, పంచముఖ ధ్యాన, న్యాస, సంపుటీకరణ, దశాంగ, షోడశాంగ, రౌద్రీకరణ, శివసంకల్ప, అష్టాంగ ప్రణామములతో స్థూల, సూక్ష్మ కారణ దేహమును వీడి, 9వది 'యథాలింగ మంగాని సమృజ్య' అనియు, నారుద్రో రుద్రమర్చయేత్ అనిన విధముగా తాను రుద్రుడై లింగరూపుని అర్చించుటయే నవావరణము. శ్రీరంగ క్షేత్రమును "సప్త ప్రాకార మధ్యే సరసిజ ముకుళోద్భాసమానే విమానే" అందురు. 7 ప్రాకారములు, అటుపైన గర్భాలయము, ఆపైన స్వామి ఈవిధముగా ఏ మతాను సారముగ వారు నవావరణ ములు లేనిదే ఆత్మ దర్శనము నందలేరని ఆ దీక్షితులవారు శివ నవావరణ కృతులను రచించిరి. ఆకృతుల అంతరార్థములను ఆయా కృతుల వ్యాఖ్యానమున గమనించి గ్రహించి గానముచేయుట సమంజసము.

## 36

## అఠాణా రాగం త్రిశ్రజాతి ఏకతాళం

29 వ మే. జన్యము. స రి మ ప ని స

స ని దా ప మ గా రి స

ప॥ త్యాగరాజో విరాజతే మహారాజ రాజశ్రీ ॥త్యాగరాజః॥

అ॥ వాగర్థమయ భువన రాజో హరి ।
వాంఛితార్థ ప్రద రాజో । హర ।
శ్రీ గురుగుహ గణేశ రాజో ।
సంసేవిత రాజాధి రాజో ॥

మ॥సా॥ నాగర ఖండాఖ్య పురాణ ప్రతిపాదిత రాజో ।
యోగినీ గణరాజో । యోగి రాజరాజశ్రీ ॥త్యాగరాజః॥

చ॥ కలిరాహిత్య నగర వాసో। నీలోత్పల నాయికా సహవాసో। అతి
లలిత హంసలాస్యోల్లాసో। నిఖిలాగమ శిరోనుత విలాసో। అతి
విలసిత హాటకావభాసో । అనేక లీలా విచిత్ర వికాసో । రక్తో
త్పల కుసుమాది వికాసో । పరి । పాలిత హరిహయాది
దాసో॥ ని ।

మ॥సా॥ ర్మల హృదయ రాజహంసో । మహా పరమహంసో । ని
శ్చల తత్వ ప్రశంస శశికళావతంసః । శ్రీ ॥త్యాగరాజః॥

వ్యా॥ ప్రథమా విభక్తి రచన. తిరువారూరునందలి శివుని నామము త్యాగరాజేశ్వరుడు. శివునకు తగిననామము. నిజమైన త్యాగమున రాజు. అనగా "నకర్మణా, నప్రజయా, నధనేన, ఏకేన త్యాగేన అమృతత్వమానసుః" శ్రుతివాక్యము. ఒక్క త్యాగముచే అమృత స్వరూపుటగును. శివుడు అమృతమయుడు. సర్వైశ్వర్యములు భక్తులకొసగి తాను భిక్షుకుడైన త్యాగి. ప॥ త్యాగరాజు ప్రకాశించు చున్నాడు. మహారాజరాజ శ్రీ = మహారాజులకు రాజ రాజుగ, శోభాయమానముగ ప్రకాశించు చున్నాడు. అ॥ వాగర్థ మయ భువన రాజః=వాక్కు అర్థమువలె, మహాకవి కాళిదాసు =

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ । వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥

అనినటుల ప్రకృతి పురుషుల ఏకస్వరూపముతో భువనములకు రాజు, వాక్కు అర్థములు విడదీయరానివి. హరి వాంఛితార్థ ప్రద రాజః = విష్ణువుయొక్క కోర్కెలు దీర్చుటలో రాజు, హర శ్రీగురుగుహ గణేశ రాజః = శివ, కుమార, గణేశులకు రాజు. సంసేవిత రాజాధి రాజః = చక్రవర్తులచే సేవించబడు రాజు ప్రకాశించుచున్నాడు. నాగర ఖండాఖ్య పురాణ ప్రతిపాదిత రాజః = స్కాంద పురాణ మందలి నాగరఖండమున, ఈస్థల పురాణమున త్యాగరాజుని గురించి

ప్రతిపాదింప బడినరాజు, యోగినీ గణరాజః = సప్త మాతృకాది యోగినీ గణములకు రాజు. యోగిరాజ రాజశ్రీ = యోగీశ్వరులకు రాజు, కలిరాహిత్య నగర వాసః = కలి ప్రభావము లేని నగరము తిరువారూరున నివసించువాడు, నీలోత్పల నాయికా సహవాసః = అమ్మవారు నీలోత్పలాంబతో కూడి యున్నవాడు, అతిలలిత = మిక్కిలి కోమలమైన, హంస లాస్యోల్లాసః = హంస లాస్యమున ఉత్సాహముగల వాడు, నిఖిలాగమ శిరోనుత విలాసః = సర్వవేద శిరస్సుల వంటి ఉపనిషత్తులచే కొనియాడబడు వాడు, అతివిలసిత హాటకావభాసః= గొప్ప కాంతిగల సువర్ణమును తిరస్కరించు కాంతి గలవాడు, అనేక లీలా విచిత్ర వికాసః= లెక్కించరాని మహిమలచే విచిత్రముగా నొప్పువాడు, రక్తోత్పల కుసుమాది విశ్వాసః = ఎఱ్ఱ కలువ, మొదలైన పుష్పములవలె విశ్వాసము గలవాడు, పరిపాలిత హరిహరాది దాసః=హరిహరాదులను పాలించుటలో దాసుడైనవాడు భక్తదాసః = నిర్మలమైన హృదయమున, రాజహంస వలె భాసించు వాడు, మహా పరమహంసః = అద్వైత స్వరూపుడై, సర్వము తానె యైన వాడు, నిశ్చల తత్వ ప్రశంసః=కదలని తత్వమూర్తిగా కొనియాడ బడు వాడు, శశి కళావతంసః = చంద్రకళను ధరించిన వాడుగ ప్రకాశించుచున్నాడు. త్యాగరాజమూర్తిని, అద్వైతమూర్తిగ, తత్పద వాచ్యునిగ వర్ణించిరి. ఈకృతియందు "రాజ" శబ్దమును 11 పర్యాయములువాడిరి. ఏకాదశ రుద్రులు గాను, రాజా ప్రకృతి రంజనాత్ = సర్వజీవులను రంజింప జేయువాడు రాజు ఈరాజ శబ్ద మును అనేకార్థములలో, అంత్యప్రాస నియమములతో రచించిరి. చరణమున, వాసః, సహవాసః, ఉల్లాసః, విలాసః, అవభాసః, వికాసః, విశ్వాసః, దాసః అను అంత్యప్రాస శబ్దములు. వివిధముగా దైవ తత్వ స్వభావమును తెలియ జేయుచున్నవి. చివరకు రాజహంస, పరమహంస, కళావతంస, ఈమూడు శబ్దములు, అద్వైత, యోగ,

జ్ఞానములను తెలియజేయుచున్నవి. ఇట్టి పదభావ గుంభనతో రచించుట శ్రీదీక్షితులవారి రచనలయందు గల ప్రత్యేకతను తెలియజేయుచున్నది. అఠాణా దేశ్యపదము. ప్రభువుల దివాణమును ఠాణా యందురు.

## 37

## యదుకుల కాంభోజి రాగం మిశ్రజాతి ఏకతాళం

28వ మే. జన్యం. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ త్యాగరాజం భజరే । చిత్త తాపత్రయం త్యజరే

అ॥ యోగిరాజ హృదయాబ్జ నిలయం ।
భోగిరాజ నుత చరణ కిసలయం ।
నాగరాజ మణి వలయం ।
రజతాగజా. ముఖ కువలయం ॥

చ॥ పౌలోమీశాది దిక్పాల పూజిత గాత్రం ।
నీలోత్పలాంబానుకూల తర కళత్రం ।
త్రైలోక్య గురుగుహ తాతం త్రినేత్రం ।
సాలోక్యాది కైవల్య ప్రద చరిత్రం ॥

మ॥సా॥ నీలకంఠమనేక ఫలదం । శూలపాణిమశోక శుభదం ।
మూల భూత మమూల్యవరదం । కాలకాలమఖండ సుఖదం
॥ త్యాగ ॥

॥ వ్యా॥ ద్వితీయా విభక్తి. త్యాగరాజును సేవించి, దారేషణ, ధనేషణ, పుత్రేషణలను చిత్త తాప కారణములైన ఈషణాత్రయ

లను విడువుమురా ! యోగీశ్వరుల హృదయమను పద్మమున నుండు వానిస, ఆదిశేషునిచే నుతించబడిన పాద పద్మములు గలవానిని, నాగ రాజుని చుట్టుకొనిన వానిని, వెండికొండ యందున్న కలువ వంటి ముఖముగలవానిని, ఇంద్రాది అష్ట దిక్పాలకులచే, పూజించబడు శరీరము గలవానిని, అనుకూలముగల నీలోత్పలాంబ భార్యగా గల వానిని, మూడు లోకములకు గురువైన కుమారస్వామికి తండ్రియైన వానిని, మూడు నేత్రములు గలవానిని, నాలుగు విధముల కైవల్య ముక్తులు సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్యాది కైవల్యము లొసగు వానిని, విష భక్షణచే నల్లనైన కంఠము గలవానిని, అనేక ఫలముల నిచ్చు వానిని, చేతియందు శూలము ధరించిన వానిని, "అశోక శుభదం" దుఃఖములేని శుభము లొసగు వానిని, పంచ భూతములకు ఆధారమైన వానిని, విలువ కట్టుటకు వీలులేని, వరముల నొసగువానిని, యమునకు యముడైన వానిని, శాశ్వత సుఖము నొసగు త్యాగరాజును భజించుమురా! అని శివ స్వరూప లక్షణము లను వర్ణించిరి. ఇందు నిలయం, కిసలయం, వలయం, కువలయం, పదములకూర్పు, గాత్రం, కళత్రం, త్రినేత్రం, చరిత్రం, అనునవి, ఫలదం, శుభదం, వరదం, సుఖదం, అను అంత్య ప్రాసనియమ పద ములు, గానమునకు యమకముగాను, సొగసుగా నుండును.

## 38

## సాళగభైరవి రాగం ఆదితాళం

22 వ మే. జన్యం. స రి మ ప ద స

స ని ద ప మ గ రి స

ప॥ త్యాగరాజేన సంరక్షితోఽహం । దయా సుధాసాగరేణ ॥

అ॥ యాగశాలాది మహోత్సవేన । యతివరాద్యుపాసితేన, భవేన ॥

మ॥సా॥ భోగభోగ్య ప్రపంచోద్భవేన।
భుక్తి ముక్తిప్రద పరమశివేన ॥ త్యా ॥

చ॥ శ్రీరమణాది పూజిత చరణేన । సృష్ట్యాది పంచకృత్యకరణేన ।
హార కటకమకుటాది భరణేన । హాటక క్షేత్రాధి కరణేన ॥

మ॥సా॥ వీరఖడ్గ ఖేటాది ధరణేన । వికల్ప విరహితాంతః కరణేన ।
మారకాల త్రిపురాది హరణేన । మహాదేవ గురుగుహ
స్మరణేన ॥

వ్యా॥ తృతీయా విభక్తి. త్యాగరాజుచేత సంరక్షింపబడితిని, దయా సముద్రునిచే, యాగశాల, హోమాదులతో ఉత్సవము చేయ బడువానిచే, యతీశ్వరులచే నుతింపబడు వానిచే, శివునిచే అని, కర, చరణ. ఆభరణాది విశేషణములు గలవానిచే అని చివరలో మన్మధుడు, యముడు, త్రిపురాసురులను సంహరించిన వానిచే రక్షించ బడితిని. ఇందలి చరణ, కరణ, భరణ, అంతఃకరణాది పదముల కూర్పు గమనించ దగినది. రాగనామము లేదు.

## రెండు కళల చౌకం

ప॥ రీ  గ మ గా గ రి రి ని । సా , రి । రి గ మ రి గ |
త్యా గ - రా జే - - న  సం ర - క్షి తో - - |

మా , ద పా సఁ సఁ । సఁ ని ద ప । మ గ రి రి స ||
హం ద యా సు ధా - సా - గ రే - ణ శ్రీ - ||

అ॥ పా గ పా , గా । రీ గ మ గా । రి స రి స |
యా గ శా లా ది మ - హో త్స వే - న |

ని ధ ప సా ధ పా । గ రి గ । మ పా ప ||
య తి వ రా ద్యుపా సి తే న భ వే న ||

మ॥సా॥ పా ద పా సాం ప సాం గాం గం రిం సం ।
భో గ భో గ్య ప్ర పం చో ద్భ వే న ।

రిం సం నీ దా ప । ద ప ప మ గ రి స ||
భు క్తి ము క్తి ప్ర ద ప ర మ శి వే న || త్యాగ ||

చ॥ రి గ మ గా రి స । స రి గ మ । గ మా మ
శ్రీ ర మ ణా ది పూ - జి త చ ర ణే న

రి గ సా ధ పా ప । గా రి ప । ప మా ప
సృ - ష్ట్యా ది పం చ కృ త్య క ర ణే న

దా ప మ గ రి మ గ । రి రి ప । మ ప దా ప
హా ర క ట క మ కు టా ది భ ర - ణే న

సాం రిం గాం , రిం । సాం ద ద । పా మ గ రి స ||
హా ట క క్షే త్రా ది క ర ణే - - న ||

మ॥సా॥ సా రి సా గ రి గా మ రి గ రి రి ।
వీ ర ఖ డ్గ ఖే టా ది ధ ర ణే న ।

గ మా ప ద ప ప గ । గ రి రి గ మా ప
వి క ల్ప వి ర హి తాం - తః క ర ణే న

మా ప సాం సం ని ద పా ప గం గం రిం రిం ।
మా ర కా ల త్రి పు రా ది హ ర ణే న ।

మం గాం రిం సం ని ద । ప మా మ గ రి స ||
మ హా దే వ గు రు గు హ స్మ ర ణే న || త్యాగ ||

# 39
## బేగడరాగం రూపకం

29వ మేళకర్త జన్యము        స గ రి గ మ ప ద నీ ద ప స
                                    స ని ద ప మ గ రి స

ప॥ త్యాగరాజాయ నమస్తే, నమస్తే। కా।
త్యాయనీపతే, పశుపతే, సింహాసనపతే॥

అ॥ వాగీశాద్యఖిల దేవ వందిత పదపంకజాయ।
యోగీశ్వర మానస సంయుక్త వదనవారిజాయ॥

మ॥సా॥ భోగమోక్షదాన వామభాగ స్థిత శైలజాయ,
యోగ గురు గుహాత్మజాయ। త్యాగధ్వజాయ, అజాయ
॥ త్యాగ ॥

చ॥ ముకుందాది పూజిత సోమా స్కందమూర్తయే।
ముచుకుందాది భక్తజన మనోరథ పూర్తయే।
ముకురబింబ ప్రతిబింబిత ముఖస్ఫూర్తయే।
ముని పక్షి మృగ కీటాది ముక్తిప్రద కీర్తయే॥

మ॥సా॥ సకలాగమ మంత్ర తంత్రసార జ్ఞానరక్తయే।
అకతాది త్రిరేఖాత్మకాధార ప్రవృత్తయే।
సకల, నిష్కళ, స్వరూప సచ్చిత్సుఖ వ్యాప్తయే।
వికల్ప భేదయుక్తయే, విటంక రూప శక్తయే ॥త్యా॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. త్యాగరాజు కొఱకు నమస్కారము. కాత్యాయనీపతి, పశుపతి, సింహాసన మందున్నవాడు, బ్రహ్మాది దేవతలచే నమస్కరింప బడిన పాదపద్మములు కల యోగుల మనస్సు; యోగముతో గూడిన మనస్సుతో కూడిన ముఖపద్మము, భోగ, మోక్షములిడు పార్వతిని ఎడమ భాగమందు గలవాడు,

యోగము నందున్న కుమారస్వామిని కుమారునిగా గన్నవాడు, త్యాగమే ధ్వజముగ గలవాడు, పుట్టుక లేనివాడు, విష్ణ్వాదులచే, "సోమాస్కంద" సోముడు చంద్రునకు, ఆస్కంద=ఆధారము, ధరించిన మూర్తి చంద్రశేఖరుడు, మరియొక అర్థము సోమ, ఉమతో కూడిన అర్ధ నారీశ్వరుడు, అద్దమువలెనున్న ముఖము గలవాడు సర్వ జీవులకు ముక్తియొసగువాడు అను విశేషణములతోను, మూర్తయే పూర్తయే స్ఫూర్తయే. కీర్తయే, మొదలగు, పద స్ఫూర్తితో అక్షర మూర్తికొఅకు నమస్కారమని వర్ణించిరి "వీధీ విటంక త్యాగమూర్తి గనుక విటంక రూపశక్తయే" యనిరి. బేగడ రాగయుతమైన ఈకృతి యందలి పదములు మీగడవలె రుచి గలిగించు నవిగనున్నవి. బేగడ= తెలుగు వారి రాగము, తెలుగు పదము. అందువలన. రాగ నామము లేదు. బేగడ యన కాకి బంగారము. అభ్రకము అని అర్థము.

రెండు కళల చౌకం

ప॥ నీ - ద ప మ ప దా | పా ద ప మ గ । గ మ రీ సా |
త్యా గ రా - - - | జా - - - - య - న మ |

గ గ - రీ గ ద ద ప మ గ । రీ - సా గ మ ప ద ||
స్తే - - న - మ - - - స్తే - శ్రీ - - - ||

(2) నీ , స̇ - ద .... గ ద ద ప మ ప । రీ - సా సా |
త్యా- గ . . , . న - మ - - - స్తే - కా |

మా - మ గ మ ప మా । పా - పా పా |
త్యా య నీ - - ప తే - కా |

మా - మ గ మ ప మా । పా - పా ప ద నీ ।
త్యా య నీ - - ప । తే - శా - - ।

ద మ - మ గ మ ప మా । ద ప - స ని ద ప స స ॥
త్యా - య నీ - - ప తే - - - ప - శు ప

రి సా - మ గ రి స సా రి స ని స దా । ప మ గ మ ప ద
తే - - - సిం హా - - - - స న ప తే - - -

అ॥ నీ, ద - ద ద పా ప మ ప ద । ప ద మ ప - గ మ రీ స ।
వా - గీ - - శా - - - ద్య - ఖి - ల - దే వ ।

సా । మ గ గ రి । గ మ పా - మ పా ద
వం ది త ప ద । పం - క జా య

(2) నీ స ద - దా ని ద పా ... । గ మ పా - మ పా ప ద
వా - - గీ - - శా ... । పం - - క జా య -

మ గ - మా ప మ । దా - ద ప ని స
యో - గీ శ్వ ర మా న స సం

గ రి సా - నీ స రి ని దా । ప ద - ప మ ద ద ॥
యు - - క్త వ - ద - న వా - రి జా - య ॥

మ॥సా॥ పా ద మ - మ ప గా మ రీ స । మ గ మ ప -
భో గ మో - క్ష దా న వా మ । భా - గ -

ద ప ద ప ద సా స । స మ గ రి - స రి నీ స దా రి ।
స్థి త శై - ల జా య యో - గ గు రు గు హా త్మ జా య ।

ని స దా - ద మా గ మ పా ద ॥ త్యా ॥
త్యా - గ ధ్వ జా య అ జా య ॥

చ॥ ద ప - పా మ ప మ ద । మ ద ప మ - గ రి సా ।
ముకుం - దా- - ది । పూ- - - జిత సో

సా । సా మ గ మ రి గ రి । గా మ ప - మ పా మ |
మా స్క ం - - - - ద । మూ - - ర్త యే - |

గ మ - ప దా ప ప ద నీ । దా ప ప - మ గ మా రి స ।
ము చు కుం - దా - - ది భ- - - క్త జ న

ని స ధా - మ గ రి గ రీ | మా - ద ప మ గ రి స ||
మ - నో - - ర - థ | స్ఫూ - - ర్త - యే- ||

ని ద - ప మ గ గ । మా - గ మ ప మ ।
ముకు ర బిం - - బ ప్రతి బిం

ద ప - స ప ద ప । నీ - దా ని స రి స రి |
బి త ముఖ - - స్ఫూ ర్త - - యే- - |

ని ని - సా మ గ రి స రి । స ద - దా ప మ ప స సా ।
ముని ప - - క్షిమృ- గ కీ - టా - - - ది ।

మ గ మ ప - ప దా ప ప రి సా ।
ము - - - త్రి - - ప్ర - ద ।

ప మ ప ద - మా ద ప మ రి సా || మ॥సా॥ స స మా -
కీ - - - - ర్త - యే - - || స క లా

గ మ పా మ దా ప । మా పా - మ గ మ రీ గ మా |
గ మ మం త్ర తం త్ర । సా ర జ్ఞా - ను ర క్త యే |

గ మ పా - దా ప ద మ రీ స । పా మ గ - రీ గ మా ప మా |
అ క తా ది త్రి రే - ఖా త్మ కా ధా - ర ప్ర వృ త్త యే |

ప ద ప ని - ని ద పా స్ సా స్
స క ల ని - ష్క ళ స్వ రూ ప

గా రీ - స రి స దా రి సా । రి నీ స - దా ని మా ప గా
స చ్ఛి త్సుఖ - వ్యా ప్త యే వి క ల్ప భే ద యు క్త యే

మ పా మ - దా ప ని రీ
వి టం క రూ ప శ క్త యే ॥ త్యా ॥

చిట్ట॥ నీ ద ప మ ద మా ప గ రి స । సా రి ని ధ ప స స మ గ రి స।
మ గ మ ప ద ప ని ని ద ప ప ద। ప మ గ రి గ మ ప ద ప స సా॥
రి స మ గ రి స స రి స నీ ద । ప ద ప సా స మ గ మ పా ద।
ప సా ని ద ప ద మా గ రి స । రి సా మ
గ మ ప ద ప స ప రి ॥ త్యాగ ॥

## 40

## దర్బారు రాగం ఆదితాళం

22 వ మే. జన్యం. స రి మ ప ద ని స
స ని ద ప మ రి గా గా రి స

ప॥ త్యాగరాజా దన్యంనజానే ।
గురుగుహాది సమస్త దేవతా స్వరూపిణ ॥శ్రీ॥

అ॥ రాగాది వృత్తి రహిత, స్వానుభోగానంద స్ఫూర్తి విశేషాష్ట.

మ॥సా॥ భూ, గంధవాహా, వహ్ని, జల,
గగన, పుష్ప, వద్యజ్వమయమూర్తే ॥శ్రీ॥

చ॥ సత్వ రజస్తమో గుణాతీత, సత్య జ్ఞానానందరూపిణో ।
ద్విత్వాది భేదవర్ధన పరమాద్వైత స్వాత్మానందరూపిణో ।
త్రి తత్వ పరిచ్ఛేద రాహిత్య త్రైపద పరమాద్వైత రూపిణో ।
తత్వం పదార్థ శోధన శేషిత తత్పదలక్ష్యార్థ స్వరూపిణో ।

మ॥సా॥ తత్వ సమష్టి, వ్యష్టి, రూపలయ తారక బ్రహ్మరూపాత్మనో ।
తత్వం స్వాతిరిక్త సహన తత్సక్తమాన రూపాత్మనః
॥ శ్రీ ॥ త్యాగ ॥

వ్యా॥ పంచమీ విభక్తి. త్యాగరాజు కంటె వేరు వస్తువు ఎఱుగను అని సర్వము త్యాగరాజ రూపముగ వర్ణించిరి. గురుగుహాది సర్వ దేవతా స్వరూపుడైన, రాగ ద్వేషాదులు లేని, తన అనుభవ మున కలిగిన ఆనందముచే, భూమి, వాయు, అగ్ని, జల, ఆకాశ, పుష్పమువలె యజ్ఞమయ మూర్తికన్న, త్రిగుణాతీత సత్యమైన జ్ఞాన ముచే కలిగిన ఆనందమూర్తికన్న అని, చరణమున ఆనందరసమూర్తిగ వర్ణించిరి. సత్య జ్ఞానానందము, అద్వైతాత్మానందము, పరమాద్వైత రూపము, తత్స్వరూప లక్ష్యరూపము, తారక బ్రహ్మ రూపము మొదలైన పదముల యదార్థ తత్వమును, శ్రుతియందు "అంతర్బహిశ్చ తత్సర్వం" తత్వమూర్తి కన్న వేరు నాకు తెలియదని తెలిపిరి. వీనిని సంపూర్ణముగ గురుముఖమున తెలియ దగినవి. చరణము ప్రథమా విభక్తి. ఈ గుణములు గల అని ప్రథమ, వానికంటె అని చతుర్థి విభక్తి కలిగియున్నది.

రెండు కళల చౌకం

ప॥ రీ రి గ స స రి ని సా ధ ని ధా । ధా స ని సా ।
త్యా - - గ రా - - - - జా - - - - ద - న్యం

సా రి ప మ రి గా | గ మ రీ రి స రి ని̣ స స̇ దా ద |
- న - జా - - | నే - - గురు గు హాది స మ స్త

ని స̇ ని రి̇ స̇ రి̇ ని స̇ | ప ని మ ప మ రి ని̣ స |
దే - - వ తా - - స్వ రూ - - పి ణి - శ్రీ -

రీ రి గ స స రి ని̣ సా ధ̣ ని̣ ధ̣ ధ̣ | ధ̣ ని̣ సా | సా సా ||
త్యా - - గ రా - - - జా - - - ద - న్యం - - -

అ॥ పా రీ రి మ పా ద | పా ద రి̇ స̇ ద స̇ ద | ద ప ద ప రి̇ స̇ |
రా గాది - వృ త్తి ర హి - త - - - స్వా - - - - ను

రీ̇ స̇ రి̇ గా గ̇ మ̇ రీ̇ సా̇ | రి̇ స̇ దా ద మ |
భో గా - - న ం - ద స్ఫూ - - ర్తి వి

ద ని ద ని ద ని సా̇ | రీ̇ సా̇ స̇ స̇ ని ని ని స̇ ద ప గ మ ప ద |
శే - - - షా - ష్ట | భూ గం ధ వా - హ వ - హ్ని జ ల గ గన

మ మ ప ద స̇ రి̇ ని ద | ద ప ద ప మ రి ని̣ స ||
పు - ష్ప వ ద్య - - జ్వ మ - యమూ - ర్తే శ్రీ -

చ॥ సా ప మ పా ద ద స | పా ద ప మ ప ద ప |
స త్వ ర జ స్త మో - - గు - ణా - - -

మ రి గా గ మ రీ | రీ స రి రి మ గ మ గ మ రీ సా , గ |
తీ - - - - త | - స - త్య - - - జ్ఞా - - నా -

స ధ̣ ధా̣ దా ద ప | మ రి గా గ మ రీ | రి స పా మ దా ద |
నం - - ద రూ - - - - పి - ణో | ద్వి - త్వాది భే ద

ప ద ని ద ద స్ద మ । పా ప ద మా మ ప |
వ - - - ర్ధ - న - ప ర - మా - - |

మ రి గా గ మ రీ స ని దా ని । పా మ ప రీ మ ప ।
ద్వై - - - - త స్వా - త్మా - నం - - ద రూ -

రి మ ద ప మ ప | ద మ మ ప రీ గా । గ మ రీ - మ ప ద ప
- పి ణో - - - | త్రితత్వ ప రి చ్ఛే ద - - శా - - -

మ ప మా ప ధ | ని సం ని రిం రిం సం దా ప ద ప మ దా ।
- - హి - త్య | త్రై - - - ప - ద ప - ర - మా

ప ద నీ దా ద ప । రిం సం ని సా | సా ని సం రీం , సం
ద్వై - - త రూ - - - పి ణో | త త్వం - - -

మం రిం గం మ రిం సం । సం గం రిం సం ని ద పా । ప ని ద ప మ ప మ ద |
ప - దా - - ర్ధ శో - - - ధ - న శే - - - షి - త - |

మ మ ప ద ని సం - రీం సం రిం సం ప ద ప । మ రి ప మ
త - త్వ - - ద ల - - క్ష్య - - - ర్ధ - - -

రి స ధ ఫ | మ రి గా గ మ రీ ||
స్వ - రూ - | - - - పి - ణో ||

మ॥సా॥ సా రి స స్నీ ధ ఫ గా రి ని ఊ ప ద ప ।
త త్వ స మ ష్టి - వ్య ష్టి రూ - ప ల య

ద మ రి మా పా ద । నీ , సం ని రిం సా |
తా - ర క బ్ర హ్మ రూ పా - త్మ నో |

ని స̇ రి̇ స̇ గా̇ రి̇ సా̇ రి̇ నిద దనిస̇రి̇ ।
త - త్వం స్వాతిరి క్త సహ నత - -

రి̇ స̇ ద ప గ రి రి స । రి గ మ ప గా రి స ‖
త్స - క్తమా - న రూ - పా - - త్మ న శ్రీ - ‖ త్యా ‖

## 41

## రుద్రప్రియ రాగం త్రిపుటతాళం

22వ మే. జన్యము — స రి గ మ ప ద ని స
స ని ప మ గా రి స

ప॥ శ్రీ త్యాగరాజస్య భక్తో భవామి ।
చించిత్ జ్ఞోప్యతోహం । సర్వజ్ఞేవాస్మి ॥

అ॥ కాత్యాయనీ మోహిత స్వరూపస్య ।
కామాది వృత్తిహరణ ప్రతాపస్య ।
భూత్యాభరణాలంకృత గాత్రస్య ।
బుద్ధ శుద్ధ నిత్యానంద మాత్రస్య ॥

చ॥ అమరేశాది పూజిత సాయంకాలస్య ।
అతిశుద్ధ మర్దళాది వాద్య లీలస్య ।
నవనంద్యాది భక్తజన పాలస్య ।
నతసురాసుర సంయతి జాలస్య ।
కమల కల్హారమాలస్య । కాంచన మణిచేలస్య ।
కమనీయ గురుగుహ మూలస్య । కమలాపురకృతలీలస్య ॥

మ॥సా॥ విమలరుద్ర గణికానర్తన వినోద భేద మోదకస్య ।
కమల విడంబనకరస్య । శంకరస్య, పురహారస్య,
హారస్య ॥ శ్రీ ॥

వ్యా॥ షష్ఠీవిభక్తి. సగుణమూర్తి వర్ణన : శ్రీ త్యాగరాజు నకు భక్తుడనైతిని. మెల్లగా, రహస్యముగ, నేను సర్వము తెలిసిన వాడనైతిని. కాత్యాయనిచే మోహింపబడిన రూపునకు, కామ క్రోధాదులను జయించిన ప్రతాపశాలికి, అష్టైశ్వర్య ప్రదమైన విభూతిని ఆభరణముగ చేయబడిన శరీరముగల వానికి, బుద్ధిచే, శుద్ధమై నిత్యము ఆనందమూర్తి యైనవానికి, "ప్రదోషకాలే శివ ఏక పూజ్యః" సాయంకాల సమయం ప్రదోషకాలము. ఆ సమయమున తిరువారూరునందు, నిత్యము జరుగు సేవా కార్యక్రమములు. సమస్త దేవతలు వచ్చి సేవించు సమయము. శుద్ధమైన మృదంగాది వాద్యములు మ్రోగు సమయము, నవనందులు, మొదలైన భక్తులను పాలించువానికి, స్వచ్ఛమైన రుద్రభక్తురాండ్రైన గణికాంగనల నర్తనముచే ఆనందించు వానికి, విచ్చిన కమలముల వంటి కరములుగల, శంకరునకు, పురహరునకు, హరునకు భక్తుడను. అని స్వామి సగుణ రూప లావణ్యాది విశేషములను వర్ణించిరి. సాయం సమయమున, సర్వదేవతలు స్వామి నటన సందర్శనార్థము వచ్చి, మంగళ వాద్యములు మ్రోగుచుండగా, సర్వాలంకార శోభితుని, భూసురులు వేద మంత్రములతో అర్చనము సేయుట కనులార గాంచి ఆనందించుటను గుర్తు చేసిరి.

## 42

## సారంగ రాగము జంపె తాళము

65వ మేళకర్త జన్యము స రి గ మ ప ధ ని స
స ని ద ప మ రి గ మ రి స

ప॥ త్యాగరాజే కృత్యాకృత్యమర్పయామి ।
విదేహ కైవల్యంయామి ॥

అ॥ భోగయోగాత్మకే । భుక్తి ముక్త్యాత్మకే ।
త్యాగ రాగాత్మకే । తత్వం పరాత్మకే ॥

చ॥ ప్రకృతి పురుషాత్మకే । పంచ భూతాత్మకే ।
ప్రకృతి వికృతాత్మక పంచీకృతాత్మకే ।
సుకృతి హృదయాత్మకే । సూర్యచంద్రాత్మకే ।
వికృతి భేదాత్మకే । విశ్వేశ్వరాత్మకే ॥

మ॥సా॥ సుకృతి పూర్ణాత్మికే । సురగురుగుహాత్మకే ।
సకృద సకృదాత్మకే । సచ్చిత్సుఖాత్మకే ॥త్యాగరాజే॥

వ్యా॥ సప్తమీ విభక్తి. మనము ఏ పని చేసినను, చివరకు "ఏ తత్ఫలం శ్రీపరమేశ్వరార్పణమస్తు" అని అందుము. సర్వార్పణము చేయుట భక్తుని లక్షణము. భగవద్గీత యందు, "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అన్నటుల సర్వధర్మములను పరిత్యజ్య = విడిచిపెట్టి, అంటే నాయందుంచి, నన్ను శరణు పొందుము. అటులనే ఈకృతి యందు, నేను చేయు, కృత్యాకృత్యములు = చేయతగినవి, చేయదగనివి అన్నియు సీకర్పించి, విదేహ కైవల్య ముక్తిని పొందుదును, విదేహ ముక్తియనగా, దేహముండగనే దేహము నేను కాదు, ఆత్మ వస్తువునే నేను, అని ఈ దేహమునందు, దేహ సంబంధమైన వారియందు భ్రాంతిని వీడుటయే. ఇందు, దేహ సంబంధము గాక, ఆత్మ సంబంధ రూప సగుణ, నిర్గుణ రూపతత్వ స్వరూపుని యందు సమర్పించుచున్నానని, ఆత్మ శబ్దము 16 సార్లు ఆవృత్తి నొందినది. షోడశ కళాత్మకుడు, సంపూర్ణ, సర్వజ్ఞ, లీలాకళా స్వరూపునిగా భావించిరి. త్యాగరాజు " తెలిసి రామ చింతనతో నామము సేయవే " అనినటుల, తత్వము తెలిసి అనుభూతితో గాన మొనర్చిన, ముక్తి కలుగునని తెలియజేసిరి.

# 43

## వీరవసంత రాగం ఆదితాళం

24 వ మే. జన్యం. పూర్వమూర్ఛన : స రి మ మ ప ని ద ని స
స ని ప మ మ రి గ స
నవీనము : స గ రి మ ప స
స ని ద ప మ గ రి స

ప॥ వీరవసంత త్యాగరాజ, మాం, తారయాశు కరుణానిధే ॥

అ॥ మారజనక పూజిత, మహాదేవ । మానితాజపా నటన ప్రభావ ॥

చ॥ దినకర, శశి, తేజోమయలోచన ।
దేవరాజముని శాప విమోచన ।
వనజ వదన, కమలా నగర సదన ।
వల్మీకేశ్వర, భక్త జనావన ॥

మ॥సా॥ కనకరత్న సింహాసనాభరణ । గణపతి జనక, భవతరణ ।
జననాత్కైవల్యదాయక చరణ ।
జననీ శ్రీ కమలాంబికాస్మరణ ॥

వ్యా॥ సంబోధన. వీరవసంత త్యాగరాజ, కరుణానిధే, నన్ను వేగమే రక్షించుము. తిరువారూరు నందలి త్యాగరాజ నటనము అజపా నటనము. ఆది జ్యోతిర్లింగములలో కమలాపురము ఒకటి. ఇది ముని శాపమును పొందిన ఇంద్రుడు, శాప విమోచనము పొందిన క్షేత్రము. అందువలన, ఆక్షేత్ర విశేషణములతో, వీరవసంత రాగముతో, వీరుడైన వసంత త్యాగరాజమూర్తిని కొనియాడిరి. విశేషణములు మామూలు పదములు గనుక వివరణము వ్రాయలేదు.

# 44

## గౌళ రాగం ఆదితాళం

15వ మే. జన్యం. స రి గ మ రి మ ప ని స
స ని ప మ గ మ రి స

ప॥ త్యాగరాజ పాలయాశుమాం । (శ్రీ) ।
నిత్యానందకంద, సోమాస్కంద, వీధీవిటంక ॥త్యాగ॥

అ॥ నాగరాజ మణి భూషాలంకృత ।
నగరాజ సుతార్థాంగ, గౌళాంగ ।
భోగాదిప్రద, (శ్రీ)నగరస్థిత । భూసురాదినుత, వల్మీకలింగ ।
(శ్రీ) గురుగుహ పూజిత, వృషతురంగ ।
శ్రితజన రక్షణ నిపుణాంతరంగ ॥

మ॥సా॥ భోగియుతచరణ, కరధృత, కురంగ ।
యోగి విదితాజపానటన రంగ ॥త్యాగ॥

వ్యా॥ తిరువారూరు నందలి వల్మీక లింగమూర్తిపై రచించ బడినది. ఈకృతి యందు, వీధీవిటంక త్యాగరాజ, (శ్రీ)నగరస్థిత, అజపా నటనరంగ అను పదములు, స్వామి చరిత్రకు సంబంధించిన పదములు. మిగిలిన పదములు శివ విశేషణములు. ఇందు, తురంగ, తరంగ, కురంగాది పదములు సొగసు గూర్చునవి : గౌళాంగ - అని రాగ నామము కూర్చిరి.

రెండు కళల చౌకం

ప॥ రీ గ మా రి మ పా । ని పా మ । గ మ రి స |
త్యాగ రా జ - పా ల యా శు మాం - - |

గ మ రి స | సా ని ఫ ని స రి స । రీ , మా ప ని సं
మా ం ని - | త్యా న ం ద క ం ద సో మా స్క ం ద

ని ప మ రి గ మ రి స ‖ త్యా ‖
వీ - ధీ - వి ట ం క

అ‖ రీ ప మా రి గ మ । రీ సా । ని స రి మ |
నా గ రా జ మ ణి । భూ షా ల ం కృ త |

రి గ మా రి ని సా । మా రి ప । మ పా ప |
న గ రా జ సు తా ర్ధాం గ గా - ళాం గ |

నీ సా రీ ని స - రీ గ మ - రీ రి స |
భో గా ది ప్ర ద శ్రీ న గ ర స్థి త |

రీ స సా ని ప మ । రీ గా । మ రి స ‖
భూ సు రా ది నుత వ ల్మీ క లిం గ ‖

మ‖సా‖ రీ రీ స ని ఫ నీ స రి ని స రి గా మ ।
శ్రీ గురు గు హ పూ జి త వృ ష తు రం గ ।

రి మ రి ప మా ని ప । ని స రీ ని రీ స |
శ్రి త జ న ర క్ష ణ ని పు ణాం త రం గ |

## 45

## నీలాంబరి రాగం రూపకతాళము

29వ మేళకర్త జన్యము స రి గ మ ప ద ప ని స
స ని ప మ గ రి గ స

ప‖ త్యాగరాజం భజేహం । సతతం ‖

అ॥ యోగి నారాయణా ద్యుపాసితం । ప్రభాసితం ।
యోగ భోగవితరణ నిపుణతరకరం, దయాకరం ॥

మ॥సా॥ నాగరఖండాఖ్య పురాణ ప్రతిపాద్య మనాద్యం ।
నామ రూపమయ చోద్యం । నారద గురుగుహ వేద్యం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. త్యాగరాజుని, ఎల్లప్పుడు నేను సేవింతును. యోగియైన నారాయణాదులచేత ఉపాసించ బడిన వానిని, ప్రకాశించు వానిని, యోగమును, భోగమును, ఎక్కువగా నొసగుటలో నిపుణత్వముగల చెయ్యి గలవానిని, నాగరఖండ మందు పురాణమున చెప్పబడిన అనాది మూర్తిని, అనగా పురాణ ప్రసిద్ధమైన వానిని, నామ రూపములతో విచిత్రమైన వానిని, నారదునకు, కుమారస్వామికి తెలిసిన వానిని భజింతును. ఇందు రాగ నామము లేదు.

ఆదితాళ రెండు కళల చౌకం

ప॥ పా - మ గ మ గ । రి గ మ ప - మ గ రి గ మా ।
త్యా గ రా - - జం - - భ జే - - -

మ గ గా - స స స ని ని । సా - మ గ మా |
హం - - స త తం - హం స త తం

ప స - ని ప మగ । రి గ మప - మ గ రిగమా మగగా-గాసా ||
త్యా- గ రా - - జం - - - భ జే - - - హం- - - -

అ॥ సా - స సా , । సా - స సా ని । స రి సా - నీ ని స ని ప ।
యో గి నా - రా య ణా ద్యు పా - - సి తం - ప్ర

ప ని పా - మ గ మ ప | పా - ని దా ని । పా ని స - నిపమగ ।
భా - - సి తం - - | యోగ భో గ వి త - రణ నిపు

మా ప ని - పా మ ప మ గ । రీ గ రి - గ మ గా సా |
ణ త - ర క - ర ం । ద యా - - - క రం |

మ॥సా॥ సా స స - సా సా స స సా । నీ రి స - నీ ప మ పా మా |
నా గ ర ఖం డా ఖ్యపు రా । ణ ప్రతి పాద్య మ నా ద్యం |

పా ని ద - ద ని ప స నీ పా । |
నా మరూ - ప మయ చో ద్యం। |

ని స ని ప - మ గ స ని స గ గ మ ‖ త్యా ‖
నా - ర ద గు రు గు హ వే - ద్యం ‖

## 46

## ఆనందభైరవి రాగం రూపక తాళము

22 వ మే. జన్యము. స గ రి గ మ ప ద ప ని స
స ని ద ప మ గ రి స

ప॥ త్యాగరాజ యోగ వైభవం । సదాశివం । సదాశ్రయామి ॥

అ॥ త్యాగరాజ యోగ వైభవం । అగరాజ యోగ వైభవం । రాజ
యోగ వైభవం, యోగవైభవం । వైభవం, భవం, వం ॥ త్యాగ॥

చ॥ నాగరాజ వినుతపదం । నాద బిందు కళాస్పదం ।
యోగిరాజ విదితప్రదం । యుగ పద్భోగ మోక్షప్రదం ।
యోగరూఢ నామరూప విశ్వసృష్ట్యాది కరణం ।
యుగ పరివృత్త్యాబ్ద మాస దిన ఘటికాద్యావరణం ।

శ్రీగురుగుహ గురుం। సచ్చిదానంద భైరవీశం।
శివ శక్త్యాది సకల తత్వ స్వరూప ప్రకాశం।
శం, ప్రకాశం, స్వరూపప్రకాశం। తత్వ స్వరూప ప్రకాశం।
సకల తత్వ స్వరూప ప్రకాశం। శివ శక్త్యాది సకల తత్వ
స్వరూప ప్రకాశం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఈకృతి దీక్షితులవారి, రచనకు, సంగీత పాండిత్యమునకు, సంస్కృత భాషా సౌలభ్యమునకు, ప్రతిభకు గీటురాయి వంటిది. త్యాగరాజు యొక్క యోగ వైభవమును, సదా శివం = ఎల్లప్పుడు మంగళ ప్రదమైన శివుని ఆశ్రయించు చున్నాను. త్యాగరాజ యోగ వైభవం= త్యాగము నందు రాజు అయిన ఆయన యోగము యొక్క వైభవము ఒక్క త్యాగము చేతనే అమృతత్వము లభించును. సర్వులకు, సర్వ జీవులకు సర్వ సుఖముల నొసంగువాడు ఈశ్వరుడు. "ఐశ్వర్యం ఈశ్వరాదిచ్ఛేత్" ఐశ్వర్యమనగా ధనము గాదు. ఆయువు, ఆరోగ్యము, విద్య, అనుకూల దాంపత్యము, గృహ, క్షేత్ర, పుత్రాదులు, విజ్ఞానము, యోగము, అద్వైతసిద్ధి మొదలైనవి అన్నియు ఐశ్వర్యములే. వీనినే విభూతులందురు. అష్ట విభూతులు, అష్ట సిద్ధులు. "అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము. వీటి నొసగువాడు ఈశ్వరుడు. వాని వైభవము, అగరాజ యోగ వైభవం=పర్వతరాజు హిమవంతుని యోగముచే లభించిన పార్వతిని పాణిగ్రహణము చేయుటచే కలిగిన వైభవము గలవానిని, రాజ యోగవైభవం= జీవులకు మహారాజ యోగ వైభవమును కలుగజేయు వానిని, రాజులకు రాజై, రాజాధిరాజులచే సేవించబడు వైభవము గలవానిని, యోగ వైభవం = ప్రకృతి పురుషుల సంయోగము యోగము. జీవాత్మ, పరమాత్మానుసంధానము యోగము, కర్మ, భక్తి, జ్ఞాన, యోగములతో గూడిన వైభవము గలవానిని, వైభవం= విభవము గలవానిని,

భవం=ఈశ్వరుని, వం=అమృత స్వరూపుని ఆశ్రయించుచున్నాను. నాగరాజుచే నుతింపబడు పాదము, నాద బిందు కళాస్వరూపుడు, యోగీశ్వరులచే తెలిసికొన బడువాడు, రెండైన భోగ మోక్షము లొసగువాడు. ఇహమందు భోగము, పరమందు మోక్ష మొసగు వాడు, యోగము వలన ప్రపంచ సృష్ట్యాదులను కలుగ జేయువాడు, యుగములు, సంవత్సర, మాస, దిన. ఘటికాదులతో కూడి కాల స్వరూపుడైనవాడు, గురుగుహునకు గురువును, సత్, చిత్, ఆనంద భైరవీ మూర్తికి ప్రభువు. ఆనందభైరవీ రాగమునకు నాథుడు, శివ శక్త్యాది సకల తత్వ స్వరూపప్రకాశం = శివుడు పురుషుడు, శక్తి ప్రకృతి. ఈ రూపములతో సర్వ తత్వములు తమ రూపములుగా ప్రకాశించువానిని, సకల తత్వముల రూపముగ ప్రకాశించువానిని, శం = సుఖ మొసగు వానిని, ప్రకాశం = స్వయం ప్రకాశము గల వానిని, స్వరూపముతో ప్రకాశించు వానిని, తత్వ స్వరూపముతో ప్రకాశించు వానిని, సకల తత్వములు, శివ, శక్తితో మొదలైనవే అని వర్ణించిరి. ఇందు మరియొక అర్థము గోచరించును. భగవ త్తత్వము. మొదట లేసిదై, ఆభాసమై, భాసమై, పంచభూతాత్మకమై, త్రిగుణ స్వరూపమై, సగుణమై విశ్వవ్యాప్త మైనదనియు, అనంతమై, నేతినేతీతి వాక్యములచే ఒకదానిలో నొకటి లయమై, చివరకు అద్వైత పరబ్రహ్మ మగును. ఈవిషయమును దీక్షితులవారు సంగీత శాస్త్రమున యతి రూపమగు ప్రాణము ద్వారా తెలియపరచిరి. దానిని పరిశీలింతము.

సంగీత శాస్త్రమున "శ్రుతిర్మాతా లయఃపితా" యందురు. లయను తాళమని యందురు. పాటను క్రమముగా నడిపించునది లయ. అది సశబ్ద, నిశ్శబ్ద క్రియలచే కూడి యుండును. దానిని తళప్రతిష్ఠాయామ్=అను శబ్దముచే తాళమనిరి. ఆ తాళమునకు పది ప్రాణములు కలవు. కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము,

జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము. వీనిలో యతి ఒక ప్రాణము. ఈ యతి ఆరు విధములు. యతి, విషమయతి, గోపుచ్ఛయతి, స్రోతోవహ యతి, మృదంగ యతి, డమరు యతి అనునవి. ఈకృతి యందు గోపుచ్ఛ యతిని, చివర స్రోతోవహ యతిని, సాహిత్యపరముగ చూపించిరి. ఆవు తోక ముందు లావుగనుండి చివరకు సన్నముగా కొసదేరి యుండును. పుచ్ఛమనగా, వెంట్రుకలుండు భాగము మాత్రమే. ఉదా॥ కాకపాదము + 16 అక్షరములు, ప్లుతము $\frac{1}{S}$ 12 అక్షరములు, గురువు S 8 అక్షరములు, లఘువు 1 4 అక్షరములు, దృతము ం 2 అక్షరములు, అనుదృతము ( 1 అక్షరము. 16, 12, 8, 4, 2, 1. ఈ వరుసన తగ్గివచ్చు యతి గోపుచ్ఛ యతి. దీనికి దృష్టాంతముగ త్యాగరాజ యోగవైభవం, అగరాజ యోగ వైభవం, రాజయోగ వైభవం, యోగ వైభవం, వైభవం, భవం, వం. చివరలో స్రోతోవహ యతి. నది పుట్టిన ప్రదేశమున సన్నగ ప్రారంభమై రాను రాను విశాలమై, సాగరమున కలియును. అటులనే ఉదా॥ 1, 2, 4, 8, 12, 16 వలె పెరుగును. దానికి దృష్టాంతముగ, శం, ప్రకాశం, శివ శక్త్యాది సకల తత్వ స్వరూపప్రకాశం అని. అణువు నుంచి మహత్తు వరకు, మహత్తు నుంచి అణువు వరకు గల తత్వ స్వరూపుడైన త్యాగరాజు యొక్క యోగ వైభవమును ఆశ్రయించు చున్నానని, అర్థ యుక్తముగ, అంతరార్థ బోధకముగ, సంగీత, సాహిత్య, ప్రజ్ఞను ప్రబోధించిరి. ఇటువంటి రచనలు శ్రీ నారాయణ తీర్థుల తరంగములలో గోచరించును.

రెండు కళల చౌకం

| | |
|---|---|
| ప॥ సా స పా ప । | గ̇ రి గ̇ స̇ సా̇ రి స̇ రి̇ ని నీ । |
| త్యాగ రా జ | యో - - - గ వై - - - భ |

స ని నీ సా , స । ని స్ప ప మ గ రి స ని ||
వం - - - స దా - - శ్రయా - మి - ||

(2) సా స పా మ । ... । ని ద ని సం సా , సం |
త్యాగ రా జ ... వం - - - - స |

స స్ప ప మ గ రి గ మ | పా మ మ గ రి గ రీ |
దా - - శ్ర యా - మి - | త్యా గ రా - - - జ |

రి రి స ని నీ ని స ని మ । గ రి గా , స । మా గ రీ స ని |
యో - - - - గ వై - - భ । వం - స దా శ్ర యా మి - |

స గ రి గా మ । పా ద ప మ గ ప మ |
త్యా - గ రా జ । యో - గ వై - భ - |

గ రి గా మ గ । రి గ రి ని స ని గ రి ని సా , ।
వం - అ గ రా - జ యో - గ వై - భ వం ।

గా రి గా మ సా గ మా , । పా స ద ని ద పా పా , ప |
రా జ యో గ వై భ వం । యో గ వై - - భ వం వై |

ద ప మ గ గా ప మ గ రి గ మ | పా మ మ గ రి గ రీ ।
- భ వం - భ - వం వం | త్యా గ రా - - - జ అ

నా , ని నీ ని స ని మ । గ రి గా గా । రి గ సా సా ||
యో - గ వై - - భ । వం - - - - - - ||

చ॥ పా మ గ గ మ ద । ప మ గ రి సా ।
నా గ రా - జ - వి ను త ప దం ।

మా గ గ రి రీ స ని । స గ రి గ మా |
నా ద బిం - దు - క ళా - స్ప దం |

పా సంసం ని ని సం। మం గం రిం ని సా।
యోగి రా - జ - విదిత పదం।

ని ద పా ద ప ద ప। మ గా మ ప మ గ రి స
యుగ ప ద్భో - - - గ మో క్ష - - ప్ర దం

సా స పా ప। నీ సం మం గం మం। గం రిం గం రిం సం।
యోగ రూ ఢ నామ రూ ప - వి శ్వ - సృ ష్ట్యా

ని ని సం రిం గం రిం। మం గం రిం గం రీ ని సం నీ। గం రిం సం మా సం।
- ది క ర - ణం। యు గ ప - రి వృ - - త్యా - ద్ద మా స।

రిం గం రిం సం ని నీ। ని పా ని గం రిం నీ
ది - న ఘ టి కా। ద్యా - - వ ర ణం

మ॥సా॥ గా గం రిం రిం సం ప సా నీ ద। పా మ ప మ గా రి గా మా।
శ్రీ గు రు గు హ గు రుం స చ్చి దా నం ద భై ర వీ శం

స స సా పా ప ప గం రిం సా। సా ని దా ద ప మ గ రి స ని
శి వ శ క్త్యాది స క ల త త్వ స్వ రూ ప - ప్ర కా - శం

సా మ గ రి సా ని దా ద ప।
శం ప్ర కా - శం స్వ రూ ప -

మ గ రి సా సా సా ని దా। ద ప మ గ రి సా ప గం రిం సా।
ప్ర కా - శం త త్వ స్వ రూ ప - ప్ర కా - శం స క ల త

సా ని దా ద ప మ గ రి సా। స స సా సా స సం గం రిం సా
త్వ స రూ ప - ప్ర కా - శం। శి వ శ క్త్యాది స క ల త

సా ని దా ద ప మ గ రి స ని ‖ త్యాగ ‖
త్వ స్వ రూ ప - ప్ర కా - శం

## 47

## రుద్రప్రియ రాగం ఆదితాళం

22వ మే. జన్యము. స రి గ మ ప ద ని స
స ని ప మ గా రి స

ప॥ త్యాగేశం భజరేరే । మానస । తాపాదింత్యజరేరే మానస ॥

అ॥ యోగీశ విహితం । భోగీశ మహితం ।
శ్రీగురుగుహ విదితం । సుర ముదితం ।
సింహాసనపతిం । పశుపతిం ॥ త్యాగేశం ॥

ఈకృతి, దీక్షితులవారు చిన్నతనమున రచించి యుందురు. కవిత్వ ప్రారంభ దశలో కలిగిన భావమును, త్యాగేశుని భజించుము మనసా. తాపములను విడిచిపెట్టుము. అని ద్వితీయా విభక్తిలో రచించిరి. రుద్రునకు ప్రియమైన రుద్రప్రియలో రచించిరి.

## 48

## శ్రీరాగం ఆదితాళం

22 వ మే. జన్యం. స రి మ ప ని స
స ని ప ద ని ప మ రి గ రి స
స ని ప మ రి గ రి స

ప॥ త్యాగరాజ మహాధ్వజారోహ తారకే బ్రహ్మ, రూపమాత్రశ మే।
గణేశ గురుగుహ భక్త భైరవ సోమమయం ॥

అ॥ ఆగమ సిద్ధాంత ప్రతిపాద్యం । ఆనంద చంద్రశేఖర వేద్యం ।
నాగస్వర మర్దళాది వాద్యం। నామరూపాతీత మనాద్యం॥

మ॥సా॥ యాగ శాలాద్యుత్సవ చోద్యం।
యమాద్యష్టాంగ యోగ మాద్యం।
భోగ రాగ భేద రోగ వైద్యం।
బోధామృత మహా నైవేద్యం॥

చ॥ సృష్టిస్వరూప వసంత వైభవ। అష్టధ్వజేంద్ర విమానభూత। స
మష్టి గజ వృషభ కైలాస వాహ మాశ్లేష మహారథ స్థితం, వి
శిష్ట హారం, కృష్ణగంధ ధరణం। శిష్ట సేవితాజపా న ర్తనం।
అష్ట పాశహర తీర్థ ప్రభావానుగ్రహాత్మక పాద దర్శనం॥

మ॥సా॥ ఇష్ట ఫలప్రద కళ్యాణ సుందరేశ నావమాచార్య ప్రాభవ
మష్టసిద్ధి దాయకాంబికోత్సవ మారూఢ చండేశ్వరం॥త్యా॥

వ్యా॥ ద్వితీయా విభక్తి రచన. తిరువారూరున వసంత ఋతువున శ్రీ త్యాగరాజ స్వామివారి కళ్యాణోత్సవములు జరుగును. ఆసమయమున జరుగు సేవా కైంకర్యాది విశేషములను వివరించిరి. త్యాగరాజుని, తారక బ్రహ్మరూపుని, ఆశ్రయించుము. ధ్వజము నందున్న, బ్రహోత్సవములు, పంచాహ్నిక, నవాహ్నికాది దీక్షలతో జరుగును. శైవాగమ సిద్ధాంతాను సారముగ, ముందు ధ్వజారోహణము, నందీశ్వరుని బొమ్మ వేసి ధ్వజస్తంభమునకు ప్రేలాడ వేయుదురు. నాగస్వర, తవుల్ డోళ్లు, మృదంగాది వాద్యములతోను, నామ రూపములకు అతీతుని ఆది లేనివానిని, యాగశాల యందు నిత్యము హోమాదులు ఆశ్చర్యము సలుపుచు, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి మొదలైన అష్టాంగ యోగరూపుని, భోగములు, అనురాగ, భేద రోగములకు వైద్యుని, త్యాగరాజుని గురించి చెప్పు బోధనలే అమృత నైవేద్యముగా గలవానిని, వసంత ఋతువున ప్రపంచము మరల

చిగిర్చును గాన, అట్టి వసంత వైభవమును, స్వామి రథోత్సవమున రథమున ఎనిమిది ధ్వజములతో గూడిన విమానము, అందు ఏనుగు, నందీశ్వరాదులతో, రావణానురునితో కూడిన కైలాస వాహన రథమున నున్న వానిని, నల్లని గంధమును ధరించిన వానిని, బ్రాహ్మణులు వేదములు చదువ, అజపా నర్తనము, అష్ట పాశముల హరించు తీర్థములచే, పాద దర్శనముగల వానిని, కోర్కెలు దీర్చు కళ్యాణ సుందరేశుని. అష్ట సిద్ధుల నొసగు అంబికా దేవితో, చండేశ్వరునితో నున్న స్వామిని ఆశ్రయించుము. ఇందు "అష్ట" "ష్ట"కార ప్రాస గల పదములు ఎనిమిదింటిని వాడిరి. అందుకు అంతరార్థము, అష్ట కష్టముల తొలగించి, ఇష్ట ఫలములైన అష్టైశ్వర్య ముల నొసగు, కళ్యాణమూర్తి సందర్శనమును, రథోత్సవ వైభవమును, కనులకు కట్టినట్టుగ శ్రీరాగమున రచించిరి. "రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అందురు. అనాది దంపతులు, కళ్యాణమూర్తులు, ఆనందస్వరూపులను గాంచని జన్మమేల. కన్నులున్నందుకు ఫలము, సగుణ మూర్తిని గాంచి ఆనందించుటయే యని స్వామి వైభవమును వర్ణించిరి.

## రెండు కళల చౌకం

ప॥ రీ , రి రి గ రీ స ని స రి । సా , ని ని ని । ని ని ప ప
త్యాగరా - - జ - మ - హా - ధ్వజ - - రో - హ

పా , ప సీ స ని సా । సీ ని గ రి గ సా । స రి సా ని ని
తా ర క బ్రం - హ్మ రూ- - - ప మా - - - శ్రీ

సా సా గ రీ స ని స రి మ । సా ని పా , ప మ ।
యే - గ ణే శ గు రు గు హ భ క్త భై ర వ

రి గ రి స ని ఫ ని స
సో - - మ మయ ం (శ్రీ) ||

అ|| రీ ప మ రీ రి గ రి స । స ని స రి ని । సా సా
ఆ గ మ సి ద్ధాం - - త - - ప్రతి పా ద్యం |

మా మ రి మ ప పా ప మ ప ని నీ । ని ప ని స ప ని మ ప।
ఆ న ం - - ద చ ం - - ద్ర శే - - - ఖ - ర -

రి గ రి మ పా | పా ని స రీ గ రి రి స సా రి స ।
వే - - - ద్యం | నా - - గ స్వ - ర - మ - -

ని ని స ని ప మ । ప ని నీ సా | స నిసరి స ని రిసాని పా,మ।
ర్ధళా - - - ది వా - - ద్యం | నా --- మరూ- - - పా -

రి మ ప ని ప ని ప మ । రి రి గా రి స ||
తీ - - - త - మ - నా - - ద్యం ||

మ||సా|| పా ప ప ని ప రీ పా ప మ రి గ రి స ।
యాగ శా - - లా ద్యుత్స వ చో - ద్యం ।

ని సా రి మ రి మ ప । ప నీ ని మా పా
యమా ద్య - - ష్టాం గ యోగ మా ద్యం |

మా ప నీ స రి గ రి స ని ప ని స రీ ।
భో గ రా గ ఖే - ద రో - గ వై - ద్యం

సా , సా ని ప స । పా ప మ రి గ రి స || (శ్రీ) ||
బో ధా మృ త మ హా నై - వే - ద్యం ||

చ॥ రీ రీ గ రి స స ని̣ స । ని̣ సా ని̣ । స రి గ రి స ని̣ స రి ‖
సృష్టి స్వ - రూ - ప - వ సం త వై - - - భ - వ - ‖

మా రీ మ పా మ । ని మా ప । మ ప మ రి స స |
మ ష్ట ధ్వ జేం ద్ర వి మా న భూ - - - త స |

రీ మ రి ప మ ని ప । పా మ ప నీ । స̇ సా̇ ని |
మ ష్టి గ జ వృ ష భ కై - - లా స వా హ |

పా , ని ని స̇ మా రి రి గ రీ స । ని̣ షా గ । గ రి సా ప |
మా - త్రే - - ష మ హా - - ర థ స్థి త - ం వి |

ప మ ప మ రి రి గ రి స ని̣ ని̣ । షా̣ ష̣ గ - రిగసా । ని̣ ని̣ సా |
శి - - - ష్ట హ ర ం - కృ - ష్ణ - గం - - ధ ధ రణం |

స రి మ మా ప పా । ని పా మ । మ ప నీ |
శి - ష్ట సే వి తా జ పా న - ర్త నం |

ని స̇ ని పా గ̇ రి̇ స̇ । సా̇ , రి̇ నీ । ని సా̇ స̇ |
అ - ష్ట పా శ హ ర తీ - ర్థ ప్ర భా వ |

రి సా̇ ని నీ స̇ ని ప మ । పా ద ని ప మ । రి గ గ రి రి స |
అను గ్ర హా - - త్మ క పా ద - ద - - ర్శ న ం - - |

మ॥సా॥ రీ గ రి సా రి స నీ సా ని రి̇ స̇ ।
ఇ ష్ట ఫ ల ప్ర ద క ళ్యా ణ సుం ద

రి̇ ని పా ని మా । పా రీ స̇ ని స̇ రి̇ |
రే శ నా వ మా చా ర్య ప్రా - భ వ |

రి గ రి స రి స ని స ని ప ని ప మ ప ని స ।

మ - ష్ట సి - ద్ధి దా - య కాం బి కో - త్స వ

రి మ రి మ ప ప నీ । స్ని ప మ రి గ రి స ||

మా - రూ - - ఢ చం డే - శ్వ ర ం శి వ ం || (శ్రీ) ||

## తిరువారూరు నందలి పంచ శివలింగముల కృతులు

## 49

## భూపాల రాగం త్రిశ్రజాతి ఏకతాళం

8వ మేళకర్త జన్యము — స రి గ ప ద స / స ద ప గ రి స

ప॥ సదాచలేశ్వరం భావయే ।
చమత్కార పురగేహం గిరిజా మోహం ॥

అ॥ సదా శ్రితకల్పవృక్ష మూలం ।
శరణాగత దేవతా సమూహం ।
ఉదాజ్యకృత నామధేయ వాహం ।
చిదానందామృత ప్రవాహం ॥

చ॥ చమత్కార భూపాలాది ప్రసాద కరణ నిపుణ మహాలింగం ।
ఛాయారహిత దీప ప్రకాశ గర్భగృహ మధ్యరంగం ।
సమస్త దుఃఖాది హేతుభూత సంసార సాగర భయ భంగం ।
శమదమోప వృత్యాది సంయుక్త సాధుజన హృదయ సరసిజ
భృంగం ॥

మ॥సా॥ కమల విజయ కర విధృత కురంగం ।
కరుణారస సుధార్ణవ తరంగం ।

కమలేశ వినుత వృషభ తురంగం ।
కమల వదన గురుగుహాంత రంగం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. అచలేశ్వరుని ఎల్లప్పుడు భావించుము చమత్కార పురము గృహముగా గల, శరణు కోరిన దేవతలతో గూడిన వానిని, ఉదాజ్య కృత నామధేయ వాహం = ఎత్తబడిన చేతితో నేతిని అగ్నియందుంచు నపుడు రుద్రాయ స్వాహా అను నామమును ధరించిన వానిని, నీడ లేకుండ, నలుమూలల కాంతి ప్రసారము గల దీపముతో గూడిన గర్భగృహమున నున్న సర్వదుఃఖ ములకు కారణమైన జన్మ సంసార సాగర భయమును పోగొట్టు వానిని శమము, దమము, తితీక్షాది లక్షణములు గల సత్పురుషుల హృదయ పద్మమందు తుమ్మెద యైన వానిని సాధు హృదయ నివాసుని, గురుగుహాంత రంగుని భావించు మని, చమత్కార భూపాలాది=అని రాగ నామముతో రాజును అనుగ్రహించిన మహాలింగ మూర్తిని వర్ణించిరి.

రెండు కళల చౌకం

ప॥ స దా స్-పా ద గ । గ ద ప గ ప గ రి । సా ధ స ధ ద ॥
స దా చ లే శ్వ ర ం భా- - - వ- యే హా ం - - ॥

సా సా ॥ రి సా స రి గా గా ద ప ప గ ।
యే హం ॥ చ మ త్కా- - - ర పు - ర -

గా రి గ రి స । గ ప గ ద ప స ద రి ॥
గే - - హా ం । గి రి జా - మో - హా ం ॥

అ॥ స ధా గ రి సా రి । గా ప గ । పా సా |
స దా శ్రి త క ల్ప వృ క్ష స మూ హం |

ద ప గా గ రి సా । రి గా ప । గ గ ద ప దా |
శ ర ణా గ త దే వ తా స మూ - హం - |

ప దా ద ప గ పా ద సా ద సా సా ।
ఉ దా జ్య కృ త నా మ ధే య వా హం

రి సా దా , పా । ద పా ప ప గ ద రి ‖ సదా ‖
చి దా నం దా మృ త ప్ర వా - వాం ‖

చ॥ గ రీ సా రి గ గ । పా , గ । గ రీ స |
చ మ త్కా ర భూ - పా లా - ది ప్ర |

సా ధ గ రి స ఫ ధ । స రి గా । ప గ పా గా |
సా ద క ర ణ ని పు ణ మ హా లిం - గం |

గా , పా ద ద ప । గా , ప గ । గా గ రి సా |
ఛా యా ర హి త దీ ప - - ప్ర - శా |

ద గా గా , రి గ । పా , ద । ద ప ప గ పా |
శ గ ర్భ గృ హా మ ధ్య రం - - గం |

గ పా ప గా ద ప దా । ప ఊ పా , గ । గా రి గ రి స |
స మ స్త దుః ఖా - - ది హే - తు భూ - - - త |

సా , సా రి సా । గ గ ప ప । ద ద సా |
సం సా ర సా గ ర భ య భ ం గం |

ద ప గ పా ప గ ప గ । దా ప ప । ప దా రి |
శ మ ద మో ప వృ - - త్యా ది స ం యు క్త |

సా రి స దా ప గ రి స । స రి గా రి స । ఊ ద పా |
సా ధు - జ న హృ ద య స - ర సి జ భృ ం గం |

మ॥సా॥ గ ఊ ప గ రి గ స రి గ గ ప గ పా పా ।
క మ ల వి జ య క ర వి ధృ త కు రం గం ।

ద ద గా ద ప స ద । ద రి స గ రీ సా |
క రు ణా ర స సు ధా - ర్ణ వ త రం గం |

రి గ సా ప ద ద ప గ ద గ ప రి గ స రి ।
క మ లే శ వి ను త వృ ష భ తు ర ం గ ం ।

స రి స ప గ ప గ ద । ప దా గ రి గ స రి ‖ సదా ‖
క మ ల వ ద న గు రు గు హాం త ర ం గ ం ‖

# 50

## బిలహరి రాగం మిశ్రజాతి ఏకతాళం

29వ మేళకర్త జన్యము స రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ హాటకేశ్వర సంరక్షమాం ।
తప్త హాటకమయ మూర్తే త్రయాత్మక ॥

అ॥ పాటలీ పాదప మూల ప్రకాశ ।
పాతాళ బిలహరి హయాద్యమర నుత ॥

మ॥సా॥ హాటక క్షేత్ర నివాస, హంసరూప, చిద్విలాస,
కోటి కోటి చిదాభాస, గురుగుహ మానసోల్లాస ॥

చ॥ దారుకావనస్థ తపోధనాద్యుగ్ర తపః ప్రభావ సంభవ మూర్తే
మేరు శృంగ మధ్యస్థిత శ్రీనగర విహార పరాశక్తి సహిత కీర్తే
మారుతి నంద్యర్జునాది భరతాచార్యైరవేదిత నర్తన స్ఫూర్తే
చారుస్మిత ముఖాంభోజ శశిధర సరసీరుహ పద విదళిత భక్తార్తే

మ॥సా॥ గౌరీపతే, పశుపతే, గంగాధర జగత్పతే ।
శౌరివినుత భూతపతే, శంకర కైలాసపతే ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి. తిరువారూరు నందలి "హాటకేశ్వర" లింగ మూర్తిపై రచించ బడినది. హాటక మనగా బంగారము. స్వర్ణమూర్తే నన్ను రక్షించుము. తప్త హాటకమయ లింగమూర్తే = కాల్చబడిన బంగారమువలె స్వచ్ఛమైన కాంతితో ప్రకాశించువాడా! పాటలీ = నల్ల గినియ చెట్టు యొక్క మొదలి యందు గల పాతాళ బిలమున నున్న హరి, ఇంద్రాది దేవతలచే నుతింపబడువాడు, హాటక క్షేత్రమందున్న, హంస రూపముతో కోటి కోటి చిత్స్వరూపములు గలవాడు, దారుకా వనమందు తపోధనుల గొప్ప తపస్సు నందుద్భవించిన మూర్తీ, మేరుపర్వత శిఖరమైన శ్రీనగర మందు విహరించు పరాశక్తితో కూడినవాడ, శ్రీచక్ర మండలి మేరువు నందు విహరించు ఆది శక్తితో కూడిన వాడని, హనుమ, నంది, అర్జునుడు, భరతాచార్యుల చేత తెలియబడిన నాట్య మూర్తీ, చిరునవ్వుతో కూడిన ముఖ పద్మముకల, చంద్రుని ధరించిన, భక్తుల ఆర్తిని పోగొట్టు పాద పద్మముగల, గౌరీపతే, పశుపతే, గంగాధర అను పదములతో బిలహరి రాగ నామముతో రచించిరి. సువర్ణమయ లింగమూర్తులు కాశీ, శ్రీశైల, కాళహస్తి మొదలైన క్షేత్రముల యందు, హాటక లింగములు గోచరించును. అట్టి క్షేత్ర ములతో సమానమైన క్షేత్రమగుటచే, కమలాపురమున "హాటక లింగమూర్తి" ప్రతిష్ఠింప బడినది. "పాతాళ బిలహరి హయాద్యమర"

అని బిలహరి నామమును కూర్చి, హాటకమయ మూర్తి ఆవిర్భావమును, పురాణ ప్రసిద్ధ చరిత్రను సూచించిరి. ఈ చరిత్ర హాటకేశ్వర క్షేత్ర మాహాత్మ్యమున కానవగును. పురాణ ప్రసిద్ధ క్షేత్ర విశేషములు వ్యాఖ్యానమున గ్రంథ విస్తరణ భీతిచే సంగ్రహముగ సూచించబడినవి.

## 51

## కాంభోజి రాగం అట తాళము

28వ మే. జన్యము. స రి గ మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ శ్రీ వల్మీక లింగం, చింతయే, శివార్ధాంగం ॥

అ॥ శ్రీవర దాయకం, శ్రీపుర నాయకం ।
దేవతాది వినుత దివ్య వీథీ విటంకం ॥

చ॥ కురుక్షేత్ర విరించి యజ్ఞోద్భవ కార్ముక ధర, మురరిపు హర ।
హరి హయాద్యఖిల సుర, భయోపద్రవ హరణ చణ తరం, శం
కరం సోమ కులాంబికాంభోజ మధుకరం ॥

మ॥సా॥ గురుగుహ జనకం, నతజనకం, కుబేరసఖం, చర్మాంశుకం ।
సురుచిర శిరోధృత శశాంకం । స్వయం ప్రకాశకం
తారకం ॥శ్రీ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. తిరువారూరు నందలి వల్మీక లింగమును చింతించుము. పార్వతి అర్ధ శరీరమును ధరించిన, శుభమైన వరములిచ్చు వానిని, శ్రీపుర నాయకుని, వీథీ విటంక త్యాగ మూర్తిని, కురుక్షేత్ర మందు బ్రహ్మచేసిన యజ్ఞమందు బుట్టిన

ధ ను వు ను ధరించిన వానిని, (పురాణ గాధా విషయం) సోమ కులాంబికాంభోజ మధుకరం = చంద్రవంశమునకు తల్లియైన పార్వతి ముఖ పద్మమునకు తుమ్మెదవంటి వానిని అని కాంభోజి రాగ నామ మును, ఈశ్వరుని విశేషణములతో వర్ణించిరి. ఇందు, చివర గురుగుహ జనకం, కం అను అంత్యప్రాసలు గమనించ దగినవి.

## 52

## ఆనందభైరవి రాగం మిశ్రజాతి ఏకతాళం

22వ మే. జన్యం. స గ రి గ మ ప ద ప స
స ని ద ప మ గ రి స

ప॥ ఆనందేశ్వరేణ సంరక్షితోఽహం । నిత్యానంద రూపోఽస్మి ॥
బ్రహ్మానంద రూపోఽస్మి ॥

అ॥ జ్ఞానప్రదాన గురుగుహ రూప ।
చిదానంద నాథ స్వరూప ప్రకాశేన ॥

చ॥ అవయవ త్రయాతీతేన నిత్యేన ।
అవస్థాత్రయ సాక్షిణాతి శుద్ధేన ॥
భవ పంచకోశ వ్యతిరిక్తేన, బుద్ధేన ।
శివ సచ్చిదానంద రూపేణ ముక్తేన ॥

మ॥సా॥ శ్రవణ మనన, నిధి ధ్యాస సమాధి నిష్ఠా పరోక్షేను ।
భవ స్వమాత్రావశేషిత ప్రకాశమాన, మహేశ్వరేణ ॥ఆ॥

వ్యా॥ తృతీయా విభక్తి రచన. తిరువారూరు నందలి పంచ లింగ మూర్తులలో నొకటియగు "ఆనందేశ్వర మూర్తిని" వర్ణించిరి. శ్రుతి="ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని

భూతాని జాయంతే” ఇత్యాది శ్రుతుల నాధారముగ, ఆనందము పరబ్రహ్మ స్వరూపము, ఆనందము చేతనే సృష్టిక్రమము జరుగు చున్నది. “ఈశావాస్య మిదం సర్వం” సర్వప్రపంచము శివమయము. ఆనందమూర్తియై, ఆనందేశ్వర నామమున వెలసిన స్వామిచేత రక్షించ బడితిని. ఆ ఆనందము, నిత్యానందము, బ్రహ్మానందము, చిదానందము అనునవి. లౌకికానందము తాత్కాలిక మైనది. నిత్యానందము, తృప్తి, త్యాగ, శాంత్యాది లక్షణములచే కలుగును. ఆత్మ పరమాత్మానుభూతి వలన కలుగు ఆనందము బ్రహ్మానందము. ఆత్మ, పరమాత్మ ఒకటేయై, అద్వైతమై, చిచ్ఛక్తి రూపమైననాడు చిదానందము, కైవల్యప్రదము. ఇందు ఆనందేశ్వరుని, అవస్థాత్రయ సాక్షిణా, అతి శుద్ధేన=అవస్థా త్రయమన, జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థలు ఈ మూడింటి యందు, సాక్షీ మాత్రుడుగా నుండి, అతిశుద్ధుడైన, స్థూల, సూక్ష్మ కారణ దేహములకతీతునిగా తెలియ జేయుచు, అట్టి శాశ్వతానందానుభూతికి కారణములైన శ్రవణ, మనన, నిధి, ధ్యాస, సమాధు లగు అష్టాంగ యోగ సిద్ధివలన గలుగు అపరోక్షానుభవము గలవారికే తెలియబడు వానినిగ నున్న ఆనందేశ్వరునిచే సంరక్షించ బడితిని అని ఆనందరూపమును వర్ణించిరి. అందునను, ఆనంద భైరవీ రాగమున రచించుట సందర్భ శుద్ధిని తెలియ జేయుచున్నది.

రెండు కళల చౌకం

ప॥ పా , సా స ని । ద ని దా పా ద ప । మ గా మా ప మ ।
ఆ నం దే - - - శ్వ రే - ణ స ం ర క్షి -

గ రీ సా ప మ | పా , సా ని స రి స । ని దా పా ద ప ।
తో - హం శ్రీ - | ఆ నం దే - - - - శ్వ రే - ణ

మ గా మా ద ప ప మ । X రీ సా ;స్రీ | స X రి గా మా ।
స ం ర క్షి - - - తో - హం ని | త్యా - - నం ద

పా మ మ X మ పా మ | X రీ గా గా । సా , సా ;స్రీ |
రూ - పో - - - - | స్మి - - - - - బ్ర |

స X రి గా మా । పా మ మ X మ పా మ । X రీ గా గా
హ్మా - - నం ద రూ - పో - - - - స్మి - - -

రి X సా సా సా ||
- - - - - ||

అ॥ సా , సా పా । పా , పా నీ । నీ , సా మా । గ రీ సా రీ ||
జ్ఞా న ప్ర దా న గు రు గు హ రూ - ప చి ||

సా , నీ దా । పా ద ద ప మా । X రీ సా ;స్రీ ।
దా నం ద నా - ధ - స్వ రూ - ప ప్ర ।

స X రి గా మా || ఆ ||
కా - - శే న ||

చ॥ స సా పా పా । ప పా ప ద పా మా । గా , మా , ద ప మ ।
అ వ య వ - త్ర యా - - - తీ తే - న -

X రీ సా ;స్రీ | స గా గా మా । X రీ సా ;స్రీ । పా ద ప దమా ।
ని - త్యే న | అ వ స్థా - త్ర య సా - క్షి - ణా - తి

X గా మా మా | ప సా నీ దా । పా , పా X మ ।
శు - ద్దే న | భు వ పం చ కో శ వ్య తి

పా , నీ నీ । స నీ సా సా | X రీ సా పా । సా , నీ దా ।
రి క్తే న బు - ద్ధే న | శి వ స చ్చి దా నం ద

పా ద పా మా । మ గ మ ప మా గ రి సా ||
రూ - పే ణ ము - - - - స్తే - న ||

స ద ప మ గ రి గ । మా , గ రి స ||
శ్రవ ణ మ న న ని ధి ధ్యా - - స ||

మ॥సా॥ స మా గ పా మా ప నీ నీ స ।
స మా ధి ని ష్ఠా ప రో క్షా ను

గ రీ స స రి సా ని నీ స సా ।
భ వ స్వ మా - త్రా వ శే షి త

స పా ద మ ప మ గ రి ని స గ గ మ ||
ప్ర కా శ మా - న మ హే - శ్వ రే - ణ || అ ||

## 53

## నీలాంబరి రాగం మిశ్రజాతి ఏకతాళము

29వ మే. జన్యము స రి గ మ ప ద ప ని స
స ని ప మ గ రి గ స

ప॥ సిద్ధీశ్వరాయ నమస్తే, జగత్ప్రసిద్ధేశ్వరాయ నమస్తే ॥

అ॥ బుద్ధీశ్వరాయ, పరాయ, వరాయ, భుక్తి ముక్తి ప్రద
చతుర కరాయ ॥

మ॥సా॥ శుద్ధ సత్వ గుణాకరాయ । విశుద్ధ చక్ర నిలయాయ ।
నిత్య సుఖతర కరాయ, శంకరాయ ॥ సి ॥

చ॥ నిర్మల హృదయ విహారాయ ।
హారాయ, నీలాంబరాకారాయ శ్రీకరాయ ।

చర్మాంబరధరాయ, చంద్రశేఖరాయ ।
శబ్దాది పంచతన్మాత్రాధారాయ ।
ధర్మాద్యఖిల పురుషార్థ ప్రదాయక గురుగుహ కుమారాయ ।
కర్మ జ్ఞాన యోగ సాక్షాత్కారాయ ।
విదళిత మారాయ ॥ సిద్ధీ ॥

వ్యా॥ చతుర్థీవిభక్తి. సర్వ సిద్ధుల నొసగు వాడు శివుడు. సిద్ధీశ్వర నామమున తిరువారూరునందు జగత్ప్రసిద్ధి నందిన స్వామి కొఱకు నమస్కారము. కనుబొమల నడుమ నుండు విశుద్ధ చక్రము నిలయముగా గలవాడు అని, నాసికాగ్రము నందు మనసు నిలిపి ధ్యానించిన సర్వ సిద్ధుల నొసగు వాడని యోగ మార్గ సిద్ధిని ఈకృతి యందు సూచించిరి. నిర్మలమైన హృదయమందు విహరించువాడు, నీలాంబరము వంటి ఆకారము గలవాడు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులకు ఆధారమైన వాడు, ధర్మ, అర్థ, కామ, మోక్షములను పురుషార్థముల నొసగువాడు, కర్మము, జ్ఞానము, యోగముల వలన సాక్షాత్కరించు వాని కొఱకు నమస్కార మని, సిద్ధిని, కార్యసిద్ధిని, జ్ఞానసిద్ధిని, మంత్రసిద్ధిని, యోగసిద్ధిని మొదలగు వానిని ఏవిధముగ పొందవలెనో ఈకృతి యందు సూచించిరి. ఈ ఐదు కృతులు తిరువారూరు నందున్న ప్రత్యేక ప్రసిద్ధ పంచశివ మూర్తులపై రచించ బడినవి.

## పంచ భూత లింగ స్థల కృతులు (5)

ప్రపంచము పంచభూత మయము. పంచ భూతము లనగా, ఆకాశము, గాలి, నిప్పు, నీరు, భూమి, శివునకు భూతపతి అను నామము కలదు. భూతము లనగా పంచభూతములు. శ్రుతి "ఈశావాస్య మిదం సర్వం" ఈ ప్రపంచ మంతయు శివమయము. శివమన,

మంగళము. ప్రాణమున్నంతవరకు ప్రతివస్తువు, మంగళము. ప్రాణము లేనిది అమంగళము. ప్రాణమున్నది శివం, ప్రాణము లేనిది శవం. ప్రాణ స్వరూపమే శివము. "వాయోః ప్రాణః" వాయువే ప్రాణము గాన శివ తత్వము వాయు రూపము. అందుకే

శ్లో॥ వాయు భూతం ప్రాణరూపం శబ్ద స్పర్శ గుణాన్వితమ్ ।
రుద్రం, హరం, మహాదేవం, పూజయామి సదాశివమ్ ॥

పంచ భూత రూపుడను నేనే యని తెలియ జేయుటకు పరమేశ్వరుడు, దక్షిణ భారత దేశమున ఐదు క్షేత్రముల యందు, ఐదు మూర్తులుగ వెలసి భక్తుల కోర్కెలు దీర్చుట జగద్విదితము. అట్టివి చిదంబరమున ఆకాశలింగము, శ్రీ కాళహస్తిని వాయులింగము, అరుణాచలమున తేజోలింగము, జంబుకేశ్వరమున జలలింగము, కాంచీ క్షేత్రమున పృథివీ లింగరూపమున వెలసిరి. ఆ క్షేత్రముల మహిమ వర్ణనాతీతము. వానిని పంచ భూత లింగ క్షేత్రము లందురు. ఆక్షేత్ర సందర్శన మొనర్చి ఈ దీక్షితులు ఐదు కృతులను రచించి, గానము చేసిరి. ఈకృతులు ప్రసిద్ధి గాంచినవి. వానిని వివరణమును ఆయా కృతుల వ్యాఖ్యానములలో గమనించగలరు.

## 54

## కేదార రాగం త్రిశ్రజాతి ఏకతాళం

29వ మేళకర్త జన్యము | స మ గ మ ప ని స
స ని ప మ గ రి స

ప॥ ఆనంద నటన ప్రకాశం చిత్సభేశం ।
ఆశ్రయామి శివకామ వల్లీశం ॥

అ॥ భానుకోటి సంకాశం । భక్తి ముక్తి ప్రద దహరాకాశం ।

దీనజన సంరక్షణ చణం । దివ్య పతంజలి వ్యాఘ్రపాద దర్శిత
కుంచితాబ్జ చరణం ॥

చ॥ శీతాంశు గంగాధరం, నీలకంఠ ధరం, శ్రీ కేదారాది
క్షేత్రాధారం ।

భూతేశం, శార్దూల చర్మాంబరం, చిదంబరం ।
భూసుర త్రిసహస్ర మునీశ్వరం, విశ్వేశ్వరం । నవ
నీత హృదయం, సదయ గురుగుహ తాతమాద్యం వేదవేద్యం ॥

మ॥సా॥ వీతరాగిణ మప్రమేయాద్వైత ప్రతిపాద్యం । సం
గీత వాద్య వినోద తాండవ జాత, బహుతర భేదచోద్యం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. చిదంబర క్షేత్రమున, నటరాజ రూప మున, శివకామ సుందరీ సమేతుడై సదాశివుడు ఆకాశ భూతమయ రూపమున భక్తులకు దర్శన మొసంగు చుండును. ఆనంద నాట్యము చిత్సభ యందు జేయు, శివకామ సుందరీశుని ఆశ్రయించు చున్నాను. చిదంబర క్షేత్రమున అర్చక స్వాములు మూడు వందల మంది ఉండెడి వారు. వారిని దీక్షితు లందురు. ఆ విషయమును "భూసుర త్రి సహస్ర మునీశ్వరం" అనియు, పతంజలి వ్యాఘ్ర పాద మహర్షులు దర్శించుటచేత ముడుచుకొనబడిన పాదములు గలవాడని, కేదారాది క్షేత్రాధారం = హిమాలయ పర్వతముల యందు గల "కేదార" క్షేత్రమున గలవాడని, కేదార రాగ నామమును కూర్చిరి. ఇట మరొక విషయము గమనించ దగినది. శివభక్తులను దాక్షిణాత్యులు "నాయనార్లు" అంటారు. "అరువత్తి మూార్ నాయనార్లు" 63 మంది నాయనార్లు గలరు. అందు "నందనాయ నార్" అను మహా భక్తుడు పరమేశ్వరునిలో ఐక్యమయిన మహాక్షేత్రము. చిత్ స్వరూపుడు ఆనంద స్వరూపుడు, ప్రదోష సమయమున అటగల చిత్సభా భవనమున నటరాజు సర్వదేవతలు కొలువ నాట్యము చేయు

చుండును. అందు కే నాట్యాచార్యులు, ఆనటరాజ మూర్తిని గురువుగా నెంచి నాట్యము నభ్యసింతురు. గీత, వాద్యములతో తాండవమాడు మూర్తి చిదంబరనటరాజు.

## రెండు కళల చౌకం

ప॥ ని ధా సా సా । మ గా రి గ రీ । సీ, సా సీ । స రి స రి సా సీ
ఆ - నం ద న ట న - ప్ర కా శం చి - - త్స- భే శం

సా , సా మ ప మా । గ రీ సా రి స స ని సీ
ఆ శ్రి యా - - - మి శి - - వ - -

ధా , సా పా । మ గ రి స రి సా ॥
కా మ వ ల్లీ - - శం - ॥

అ॥ మ గా మా పా । ప పా పా , స । సా , సా స ని నీ ।
భా - ను కో - టి కో - టి సం - - -

నీ స రి స రి సా స ని నీ । ని పా సా నీ । స నీ ప మ మా ।
కా- - - - శం - - - । భ - క్తి ము - క్తి ప్ర- ద

గ మా పా ని ని మా । గా రి స రి రి స సా ।
ద హా తా - - - కా - శం - - -

మ గ మ ప స సా , మ । గ గ రి స స ని ప ॥
దీ - న జ న స ం ర - క్ష ణ చ ణ ం ॥

సా స ప సా స స గా మ పా ప ।
ది వ్య ప తం జ లి వ్యా ఘ్ర పా ద

మా ప ని పా మ గా రి స రి స ని॥ ఆ ॥
ద ర్శిత కుంచి తా బ్జ చ ర ణం ॥

చ॥ పా , ప మ మ గ । రీ , మా గా । సా , సాపా । స పా గా రీ |
శీ తాం ం - శు గం గా ధ రం - నీ ల కం ధ రం |

రి గ మ పా నినిమా । గా రి సా నీ । నీ ప సా , మ। గా రి రీ సా |
శ్రీ - - కే - - - దా - రా ది । క్షే - త్రా - ధా - ర ం |

మ గా మా పా । పా సా స సా । ని రీ సా , స ।
భూ - తే శం శా ర్దూల చ ర్మాం బ రం చి

నీ రి సా స ని నీ | సా మ గా గ రి । సా ని ప నీ మ ।
దం - బ ర ం | భూ సు ర త్రి స హ స్ర ము నీ శ్వ

పా , పా ప మ । గా రి సా స స | సా మ గ రి సా ।
రం - వి - శ్వే శ్వ రం న వ | నీ త హృ ద యం

స మ గ మ ప ని ప । సా ని మా పా । మా గ రీ స ని |
స ద య గు రు గు హ తా త మా ద్యం । వే ద వే ద్యం |

సా స మా మ గ । మా ప మా గా । మా , పా స ని ।
వీ త రా గి ణ మ ప్ర మే యా ద్వై త ప్ర తి

పా , సా పా | సా స సా స మ । గ రి స సా ని ప ।
పా ద్యం సం | గీ త వా ద్య వి నో - ద తాం డ వ

పా మ గ మ ప ని । మా గ గ రి స ని॥ ఆ ॥
జా త బ హు త ర భే ద చో - ద్యం ॥

# 55

## హంసేని రాగము జంపె తాళము

22 వ మే. జన్యము. స రీ గా మ ప ని ద ని స
స ని ద ప మా గ రి స

ప॥ శ్రీ కాళహస్తీశ శ్రితజనావన ।
సమీరాకార మాంపాహి రాజమౌళే ఏహి ॥

అ॥ పాకారి, విధి, హరి ప్రాణమయ, కోశ నిరాకాశ ।
భూమి, సలిలాగ్ని ప్రకాశ, శివ ॥ శ్రీకాళహస్తీశ ॥

చ॥ జ్ఞాన ప్రసూనాంబికా పతే, భక్తాభి ।
మాన దక్షిణ కైలాస వాసాఽభీష్ట ।
దాన చతుర కరాబ్జ, దీన కరుణానిధే, సూనశర సూదన ।
జ్ఞాన భవ పశుపతే । జ్ఞాన గురుగుహ సచ్చి ।
దానంద మయ మూర్తే । హీనజాతి కిరాతేన పూజిత కీర్తే ॥

వాగ॥ సంబోధన ప్రథమ. శ్రీకాళహస్తి క్షేత్రము సువర్ణ. ముఖి నదీ తీరమున వెలసి, దక్షిణ కాశీ క్షేత్రముగ ప్రసిద్ధిగన్నది. వాయులింగ రూపమున విలసిల్లిన శంకరుడు శ్రీకాళహస్తీశ్వరుడు. ఆ క్షేత్ర నామమును గురించి, శ్రీ యనగా సాలీడు, కాళ మన సర్పము, హస్తి యన ఏనుగు. ఈ మూడు జంతువులు స్వామిని సేవించి ముక్తి గాంచినట్లు క్షేత్ర మాహాత్మ్యమున కానుపించును. అందుచే "శ్రీ కాళ హస్తి" నామము ప్రసిద్ధి నందినది. శ్రీకాళ హస్తీశ్వరుడు జ్ఞానప్రసూనాంబికతో నున్న క్షేత్రరాజము. ఆలయ ప్రాంగణమున, ఎందరెందరిచేతనో, ప్రతిష్ఠింపబడిన అనేక శివలింగ మూర్తులుండుటచే దక్షిణ కాశిగా పేరు గాంచినది. తిన్నడు అను నొక కిరాతుడు, ఆస్వామిని భక్తితో సేవించి, స్వామి పరీక్షలో తన

కన్ను. అప్పగించి, "కన్నప్ప" అను సార్థక నామమునంది, ముక్తి నందిన క్షేత్రము. ఈ క్షేత్రమును గుఱించి ధూర్జటి, శంకరాచార్యాదులు గొప్పగ కొనియాడిరి. "హీనజాతి కిరాతేన పూజిత కీర్తే" అని కన్నప్ప చరిత్రను గుర్తు చేసిరి. ఈ సందర్భమున ధూర్జటి పద్యమును కాళహస్తీశ్వర శతకమునుండి గమనింతము.

శా॥ ఏ వేదంబు పఠించె లూత, భుజగంబే శాస్త్రముల్ జూచె దా
నే విద్యాభ్యసనంబొ నర్చె కరి, చెంచేమంత్ర మూహించె బో
ధావిర్భావ నిధానముల్ చదువులయ్యా గావు నీపాద సం
సేవా సక్తియె గాక జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా ॥

పాకారి, విధి, హరి ప్రాణమయకోశ నిరాకాశ = అని మనలోని ప్రాణమయకోశము, వాయువు పంచప్రాణరూపమున, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాది కోశములను వాయురూపముగ వర్ణించిరి.

రెండు కళల చౌకం

ప॥ రీ గా మ ప గ । మ మ । గ రి సా | ని స గ రీ గ గ ।
శ్రీ కా ళ హ - స్తీ - - - శ | శ్రిత జ నా వ న ।

మ । ప మ | పా ద ని స ని దా ద పా మ । ప మ । గ రి సా |
స మీ - | రా కా - - - ర మాం - - పా - - - హి |

రి స ని స రీ గ గ రీ గ గ రీ । మ రి । గ రి స ని ‖ శ్రీ ‖
రా - - - జ మా - - శే - - ఏ - - - హి - ‖

అ॥ పా మ మ గ రి స ని స । గ గ । రి రి రీ |
పా కా - - - రి వి ధి హ - రి - - |

గ రి గ మ పా ద ని దా । ప । మ మ |
ప్రా- ణ మ య కో - - శా - ని |

మ ని ని ద ని స̇ రి̇ రీ̇ గ̇ రి̇ సా̇ । ని ద । ప మ మా |
లా - - - కా - శ భూ - - - మి - స - లి |

ప ద ని స̇ ని ద పా ద ప మ గ । ప మ । గ రి స ని̣ ‖ (శ్రీ) ‖
లా - - - గ్ని - - ప్ర - కా - శ - శి - వ - ‖

చ॥ రీ రీ స ని̣ సా । గ । రి గ | మా ద మా గా । గ । రి స |
జ్ఞాన ప్ర - సూ నా ం బి | కా ప తే భ క్తా - భి |

స ని̣ స రి రి ని̣ స రి గ । రీ , | గ రి గ మా పా ।
మా - - న ద - క్షి ణ - కై | లా - స వా సా

ద ప । ద మ మా | పా మ ని ద ని స̇ । రీ̇ స̇ |
భీ - - - ష్ట | దా న చ తు ర క రా జ్జ |

రీ̇ గ̇ రి̇ స̇ స̇ ని ద । ప । మా | పా స̇ ని ద ప మ ।
దీ న - క రు ణా - ని ధే | సూ న శ ర సూ -

ప ద । పా | మ గ మ ద ప మ గ రి । రి ని̣ । సా ‖
ద - నే | జ్ఞా - న - భ వ ప శు । ప - తే ‖

మ॥సా॥ స ని̣ రి ని గ రి గ మా ప మా ని ద ।
జ్ఞా - న గు రు గు హ స చ్చి దా న ం

ని స̇ । ని సా̇ స̇ | రీ̇ ని సా̇ ని ద పా మ పా మ గ మ।
ద మ య మూ ర్తే | హీ న జ ॰ తి కి రా - తే న పూ -

ప గ । మ గ రి స |
జి త కీ - ర్తే - |

**56**

## సారంగ రాగం రూపక తాళము

29వ మే. జన్యము  స రి గ మ ప ద ని స
స ని ద ప మ రి గ మ రి స

ప॥ అరుణాచలనాథం స్మరామి అనిశం, అపీతకుచాంబాసమేతం ॥

అ॥ స్మరణాత్కైవల్యప్రద చరణారవిందం ।
తరుణాదిత్య కోటి సంకాశ చిదానందం ॥

మ॥సా॥ కరుణా రసాదికందం । శరణాగత సుర బృందం ॥

చ॥ అప్రాకృత తేజోమయలింగం । అత్యద్భుతకర ధృతసారంగం ।
అప్రమేయ మపర్ణాబ్జ భృంగం । ఆరూఢోత్తుంగ వృషతురంగం ।
విప్రోత్తమ విశేషాంతరంగం । వీర గురుగుహాతార ప్రసంగం ।
స్వప్రదీపమౌళి విధృతగంగం । స్వప్రకాశ జితసోమాగ్ని
పతంగం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. అరుణాచల క్షేత్రమున, తేజోమయ మూర్తియై అపీతకుచాంబా సమేతుడైన, అరుణాచలేశ్వర నామమున వెలసిన, స్మరించిన మాత్రమున, కైవల్య మొసగుచున్న తరుణాదిత్య కోటి సంకాశ చిదానందం= మధ్యాహ్న వేళనున్న కోటి సూర్యుల కాంతితో ప్రకాశించు తేజస్వరూపుని, ఎల్లప్పుడు స్మరించుచున్నాను. ఈ కృతియందు, తేజోమయ లింగం, సారంగం, భృంగం, తురంగం, అంతరంగం, ప్రసంగం, గంగం, పతంగం అను అంత్యప్రాస నియమములతో గూడిన పదములు. గానమునకు ఉత్సాహమును కలుగ జేయుయునవి. లేడిని ధరించిన వాడని, సారంగ రాగ నామమును కూర్చుట గమనించ దగినది. ఇందు తేజోమయుడు, సూర్యుడు, అరుణ మన ఎరుపు, ఉదయించు సూర్యునివలె ఎఱ్ఱనైన కాంతి

రజోగుణ ప్రధానము. గాన ఈకృతియందు సగుణ రూప విశేషణము లతో వర్ణించిరి. లింగాకారము లేడిని చేతి యందు ధరించుట, చంద్రుని, గంగను ధరించుట. వృషభ తురంగుడు మొదలైన విశేషణములచే తేజోరూపుని కీర్తించిరి.

రెండు కళల చౌకం

ప॥ రి రి గ మ ప మ ప ప । ని ద ని సం ని సం దా ద ని పా ।
అరుణా - - - చల నా - - - ధం - - -- -
మ రి గ మ రీ సా | రీ స రి స మ పా ।
స్మరా - - మి - | అని - శమ పి
ప మ ప ద సం ద ప మ । పా ని సం ని ప మ రి గ మ రి స ||
త కు చాం - - బా - - స - మే - - - త ం - - ||

అ॥ స స సా సా । సా సం ని నీ సా గం రిం ।
స్మరణా త్కై వల్య - - ప్రద -
రిం ని సం ద ని ప ప మ మ రి । గ మ ప మ పా పా ||
చ - ర - ణా - - - - ర విం - - - ద ం ||
పా మ ప దా ని సం ని సం దా । ప మ ప ద ని ప మ ।
- త రు ణా - - ది - - త్యకో - టి - సం
మ ప సం ద ప మ మ ప ద ప మ రి । గ మ ప మ రీ సా |
కా - - - శ - చి - దా - - - సం - - - ద ం |

మ॥సా॥ స స సా స ప మ ప ద ని సా । మ ప ప ద ప మ
శ రు ణా ర సా - ది క ం డం శ ర ణా - గ త
ద ప ప మ రి స || అరు ||
సు ర బృ ం ద ం || ||

చ॥ స స ప మ ప మ ప । దా ని స్ ని స్ దా ని ప ప మ ।
అ - ప్ర - - కృ త తే - - జో - - మ - య -

ప మ రీ గ మ ప మ పా । ప మ ప ద ని ద ప మ |
లిం - గం - - - - - అ - త్య - ద్భు - త - |

ప ద ప మ మ రి సా । ప మ రి గ మ మ రి సా ।
క - ర - ధృ త సా రం - - గం - - -

స రి స స మ ప మ । మ ప దా ని ప ప మ మ ప |
అ - ప్ర మే - - య మ - ప ణ్ణా - - - - జ |

ద ని దా స నిస్ రి సా | దా స్ ని స్ రి సా , రి ।
భృం - గం - - - - | ఆ రూ - - - ఢో -

ని స్ దా ప మ ప స్ ద ప ప మ । మ రి గ మ రీ సా ||
త్తుం - - గ - వృ - ష - తు - రం - - - గం ||

మ॥సా॥ సా సా స స స పామాప। ద ని సా స్ గ్ రి స్ స్ ని స్ రి ।
వి ప్రో త్త మ వి శేషాం త రం గం వీ - - ర గు రు గుహ

ని స్ ద ప మ ప గ మ పా పా |
తా - - ర - ప్ర సం గం |

పా ద నీ స్ రి రి స్ గ్ రి స్ । ని ద ప మ పా ద నీ స్ రి స్ ।
స్వ ప్రదీ ప మా - ళి వి ధృ త గం గం - స్వ ప్రకా శ జి త

సా రి స్ దా ప ద ప మ రి స ||అరు||
సో - మా - గ్ని ప తం గం ||

# 57

## యమునా కళ్యాణి రాగం త్రిశ్రజాతి ఏకతాళం

65వ మేళకర్త జన్యము — స రి గ మ ప మ ప ద స / స ద ప మ ప గ మ రి స

ప॥ జంబూపతే మాంపాహి । నిజానందామృతబోధం । దేహి ॥

అ॥ అంబుజాసనాది సకల దేవ నమన ।
తుంబురనుత హృదయ తాపోపశమన ।
అంబుధి గంగా కావేరీ యమున ।
కంబు కంఠ్యఖిలాండేశ్వరీ రమణ ॥

చ॥ పర్వత జా ప్రార్థితాప్సు లింగవిభో ।
పంచ భూతమయ ప్రపంచ ప్రభో ।
సర్వ జీవ దయాకర శంభో ।
సామ జాటవీ నిలయ స్వయంభో ।
శర్వ కరుణా సుధా సింధో ।
శరణాగత వత్సలార్త బంధో ।
నిర్వచనీయ నాద బిందో ।
నిత్య మౌళి విధృత గంగేందో ।

మ॥సా॥ నిర్వికల్పక సమాధి నిష్ఠ శివ కల్పక తరో ।
నిర్విశేష చైతన్య నిరంజన గురుగుహ గురో ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. శ్రీరంగ క్షేత్రమునకు మైలున్నర దూరమున జంబుకేశ్వర క్షేత్రము కలదు. అట శివ లింగము నీటిలో నుండును. కనుక ఆపో లింగము, కావేరీ తీరమున జంబుకేశ్వరుడు వెలసిన క్షేత్ర మగుటచే ఆ క్షేత్రమునకు ఆ నామము కలిగెను.

అమ్మవారి పేరు "అఖిలాండేశ్వరి". ఓ జంబూపతే! నన్ను రక్షించుము. నిజమైన ఆనందామృత బోధను ఇమ్ము. అంబుజాసనుడు = బ్రహ్మాది సమస్త దేవతలచే "నమన" నమస్కరింప బడువాడు. పార్వతీదేవి ప్రార్థనచే జల లింగ రూపమున వెలసినవాడు. సామజాటవీ నిలయ = గజారణ్యమున నివసించువాడు, భారతదేశమున అనేక అరణ్యములు గలవు. దండక, చంపక, వింధ్యక, బదరిక, నైమిశ, గజారణ్య, శ్వేతారణ్యము లనే పేర్లు గలవు. అందులో గజారణ్యమున నివసించు వాడని విశేషణములలో వర్ణించిరి. ఇందు, నమన, శమన, యమున, రమణ మొదలగు పదములు త్రిశ్రజాతి ఏకతాళమును సూచించు చున్నవి.

## రెండు కళల చౌకం

ప॥ గా ప మ ప ద పా । గ రి మ గ రీ స ।
జం బూ - - - ప తే - మాం - -

ని స గ రి గా ప రి గ రి స రి | సా మ మ గమ పా ।
పా - - - హి - - - - ని - | జా న ం - - దా

ద రి సా , రి ని స దా | ద ని ప మ ద ప ప మ గ రి |
మృత బో - ధ ం - | దే - - - హి - - - - - |

గా మ ప మా ప ద పా । గ రి గ గ రి సా ||
జం బూ - - - - ప తే - మా ం - - ||

అ॥ గా మ ప ద ని దా । సా రి స రి స । ని స ని ద ని ద పా |
అం బు జా - - స నా ది స క ల దే - వ న మ - న |

ſ స ని ద ని ద ప మ । ప ద పా ప మ రీ, |
తుం బు రు - ను త హృ - ద య - తా |

మ ప రి గ మ రీ స రి సా | సా స స గా । రీ రీ సా ।
పో - - ప - శ మ - న | అం బు ధి గం గా కా వే

రి స దా దా ప స సా | స ద దా । ప ద ప మ రీ ని స ।
రీ - య ము - - న | కం బు కం - శ్యా - ఖి - లాం డే

గ ప రీ ని స రి || జంబూపతే ||
శ్వ - రీ ర మ ణ ||

చ॥ పా ప ప ప ప । ప ప మ ప మ గ గ మ రీ ।
ప ర్వ త జా - ప్రా - - - ర్థి తా - - పు

గా మ ప రీ గ గ రీ | ని స మ మ గ గ ।
లిం గ - వి భో - - | పం చ భూ - - త

గ మ పా ద ని ద పా మ । గ ప గ గ గ రీ |
మ - య ప్ర - పం - - చ - - ప్ర భో - |

గా గ ప రీ, । స రి సా ధా ధ స స ప ధా |
స ర్వ జీ వ - ద యా - - క - ర |

గ రి గ గ రి రీ | దా ద ద ని ప మ । ద పా మ గ గ గ రి గ ।
శ ం భో - - - | సా మ జా - - ట వీ - - ని ల య - -

మ ప రీ గ రీ | గ ప గా ప ద ని । దా, ద రి సా ।
స్వ - యం - భో | శ - - ర్వ క రు ణా సు - ధా

ని స దా ద ని పా, | స స పా గ ని ద ।
సిం - భో - - | శ ర ణా గ త -

ద ప మ ప మ గ మ గ । ని ద పా పా పా |
వ - - - త్సలా - ర్థ బం - - థో - |

దా స రి గా । గ రి గ రి గ స । గ రి గా రీ రీ |
ని ర్వ చ నీ - య నా - - ద బిం - - దో - |

రీ స ని స ని । ద ప మ రీ , | గ ద ప మ రీ సా ||
ని త్య మూ - ళి వి ధృ త గం | గేం - - దో - ||

మ॥సా॥ శ్రీ రి సా ప స స దా , ద । రీ స స ని దా ని ద ప పా |
ని ర్వి క ల్ప క స మా ధి ని ష్ట శి వ క ల్ప క త రో |

సా స సా స సా పా , మ ।
ని ర్వి శే ష చై త న్య

ప దా ప మ ద ప ప మ గ రీ || జంబూ ||
ని రం జ న గు రు గు హ గు రో ||

## 58

# భైరవి రాగం రూపక తాళము

20వ మే. నఠభైరవి జన్యము. సంపూర్ణం.

ప॥ చింతయ మాకంద మూలకందం । చేతః శ్రీ సోమాస్కందం ॥

అ॥ సంతతం అఖండ సచ్చిదానందం ।
సామ్రాజ్యప్రద చరణారవిందం ॥

చ॥ మంగళకర మందహాస వదనం ।
మాణిక్యమయ కాంచీ సదనం ।

అంగ సౌందర్య విజిత మదనం ।

అంతక సూదనం, కుందరదనం ॥ ఉ

మ॥సా॥ తుంగ కమనీయ వృషతురంగం । భైరవీ ప్రసంగం ।

గురుగుహాంతరంగం । పృథివీ లింగం ॥చింతయ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. కంచి క్షేత్రము తెలియని వారుండరు. శివ కంచి, విష్ణు కంచి యందురు. కామకోటి పీఠము గలదు. దానిని కాంచీ పురమని అందురు. ఆ క్షేత్రము శంకరుడు ఏకామ్రేశ్వర నామమున పృథివీ లింగ రూపున వెలసిన పుణ్య క్షేత్ర రాజము. చింతయ= చింతించుము, స్మరించుమని క్రియా పదముతో ప్రారంభించిరి. మాకంద మన మామిడి చెట్టు. మామిడి చెట్టు క్రింద వెలసిన స్వామి. ఆమ్రమనగా మామిడి చెట్టు, గాన ఏకామ్రేశ్వర నామమును పొందిన స్వామి. మాకంద మూలకందం= మా =లక్ష్మికి నివాసమైన, మూలస్థానమైన వానిని. శాశ్వతానంద మూర్తిని, సామ్రాజ్యము నొసగు పాద పద్మములు గల వానిని, మాణిక్యము లతో కూడిన కాంచీపురము గృహముగా గల వానిని, మన్మథుని జయించిన సౌందర్యము గల వానిని, భైరవీ ప్రసంగం = అని భైరవీ రాగము ను కూర్చిరి. పృథివీ లింగ మూర్తిని కీర్తించిరి.

ఒక కళ చౌకం

ప॥ నీ ద ప ద ని దా । పా , ద పా మ ప మ గ రి స ।

చింత య మా - - కం - ద మూ - - - ల -

రి , గ గ మ పా ప మ ప ద |

క ం - - - దం - - - |

(2) నీ ద ప ద ని ని దా । పా , ద పా మ ప మ గ రి స ।
చిం త య- మా - - కం - ద మూ - - - ల -

రీ , గ గ మ పా మా | మ ని ని స ధా స ని సా ।
కం - - - - దం | - చే త - - శ్రీ - -

సా రి గ గ మ పా ని దా ప ।
- సో - - - మా - - -

మ గ మ ప ద మ ప మ గ రి సా ‖ చింతయ ‖
స్కం - - - - - ద ం - - -

అ॥ , స స సా రి । సా రి స నీ ద ప దపద మ । ప ద ని ని ద ని స |
సం త తం అ ఖ ం - - డ స - - - చ్చి దా- నం - దం |

(2) నీ స రి | గ గ రీ సా రి స నీ దా ప ద |
దం- - | సా - - మా - - - జ్య - - |

ని ని ద ప మ గ రి రి గ స ।
ప్ర - ద - చ - ర ణా - -

ని ని స గ రి గ మ ప ద మ ‖ చింతయ ‖
- ర వి ం - - దం - - -

చ॥ , మ మ మ గ రి । రి గ మ గ రి రి గ సా ।
మం గ ళ క ర మ ం ద హా - - - స

రి ని సా ని స రి గ | (2) రీ స ని సా సా | మా గ రి రిగ స ।
వ ద నం - - - - | వ ద - నం | మా ణి - - - క్య

ని ద పా మా ప మ గా రి గ । గ మ పా దా పా |
మ - య కా ం - - చీ - స - ద నం - |

ప ప ద నీ ద రిం । సాం రిం సం నీ దా ప ని ద మ । ప ద నీ సాం |
- అంగ సౌం ం - ద - - - ర్య వి - జి త మ ద నం |

(2) ... ప ద నీ సం ని సం రి | గం గం రీం రిం సం సం ని సం రిం ।
... మ ద నం - - - - | అ ం - త క సూ - - -

సం ని ద ప మ ప మ గ రి స | రీ గ రి గ గ రి సా |
ద - నం కు ం - - ద - | ర ద - నం - - - |

(2) రీ గ రి గ గ రి స స | మా॥ సా॥ సా , స స స నీ ద ద ప ద ।
ర ద - నం - - ఉ | త్తుం గ క మ నీ యవృ ష తు

నీ సాం సాం ప గం రిం సా రిం । సం ని ని సం నీ మ ప ద పా ద |
రంగ ం భై - ర వీ ప్ర సం - గ ం - గు రు గు హాంత |

ని ని ద ప మ గ రి ప రి గ మ ప || ద నీ ద ||
ర ం గ ం పృ థ వీ - లిం గ ం || చిం త య ||



# శ్రీ నీలోత్పలాంబా నవావరణ కృతులు

శ్రీ తిరువారూరునందలి శ్రీ త్యాగరాజేశ్వరుని రాణి నీలోత్పలాంబ యను పేరున వెలసియున్నది. ఆ తల్లిపై ఎనిమిది విభక్తులలో, 9 కృతులు రచించిరి. వానిని నీలోత్పలాంబా నవావరణ కృతు లందురు. ఈకృతుల రచనలలో దీక్షితులవారు నిర్ణయించిన రాగములలో నొక ప్రత్యేకత గలదు. చివర గౌళ అను పేరుగల రాగములలో రచించిరి. గౌళ, రీతిగౌళ, ఛాయాగౌళ, కన్నడగౌళ, కేదారగౌళ, మాయామాళవగౌళ, నారాయణగౌళ, పూర్వగౌళ, నారీరీతిగౌళ రాగములను ఏరి కోరి కూర్చిరి.

## 59

## నారాయణగౌళరాగం త్రిపుటతాళం

28వ మే. జన్యము — స రి మ ప ని ద ని స

స ని ద ప మ గ రి గ రి స

ప॥ నీలోత్పలాంబా జయతి । నిత్య శుద్ధ శుభ దాయకీ ॥ శ్రీ ॥

అ॥ మూలాజ్ఞానహర గురుగుహ జననీ । ఫాలలోచనీ పురాణీ ।
పన్నగవేణీ నతవాణీ ॥ నీ ॥

చ॥ శివకామేశ్వరీ, శంకరీ, శృంగార రసకరీ ।
పాశాంకుశధరీ, పరమదయాకరీ ।

భవరోగ హర నిపుణతర వరదాయిన్యాం ।
నారాయణగౌళ రాగ మోదిన్యాం ।
భుక్తి ముక్తి మచ్చిత్తం విలయతు ॥ నీ ॥

వ్యా॥ నీలోత్పలమన "నల్లకలువ". శ్రీపురమున ఆదిశక్తి, అంబ, నీలోత్పలాంబ. ప్రథమా విభక్తిలో, నీలోత్పలాంబ విజయము చేసియున్నది. నిత్యమైన, పరిశుద్ధమైన శుభము లొసగునదియై యున్నది. అజ్ఞానమును సమూలముగ నాశనము చేయు సుబ్రహ్మణ్యేశ్వరుని తల్లి, నుదుట నేత్రము గలది, ప్రాచీనమైన, నల్లత్రాచువలె ప్రకాశించు జడగలది, సరస్వతిచే నమస్కరింపబడునది, శివుని కోర్కెలకు నాయకి, నవరసములలో శృంగారరసమును కలిగించునది. పాశము, అంకుశమును ధరించినది; దయాస్వరూపిణి అయిన నీలోత్పలాంబ వేంచేసి యున్నది, అటువంటి తల్లియందు అని సప్తమీ విభక్తిలో, జనన మరణ రూపమగు సంసార రోగమును నిపుణతతో హరించి, వరములొసగు, నారాయణ గౌళ రాగమున ఆనందించు నామెయందు భుక్తిని, భక్తిని, ముక్తినొసగు నీలోత్పలాంబ యందు నాచిత్తము ఎల్లప్పుడు చేరియుండు గాక యని ప్రథమా విభక్తిలో సగుణ రూపమును వర్ణించి, అమెయందు చిత్తము నిలిచియుండుటచే సప్తమీ విభక్తితో కృతిని ముగించిరి. సర్వార్పణముతో చిత్తము ఆమెయందు లయించు గాక యని వారి తాత్పర్యమై యుండును.

## 60

## ఛాయాగౌళ రాగం రూపక తాళం

15వ మే. జన్యం. స రి మ ప ని స
స ని ద ప మ గ స రి స

ప॥ నీలోత్పలాంబికే, నిత్య శుద్ధాత్మికే । మామవ ॥

అ॥ త్రిలోక జనని, త్రిభువన మోహిని, త్రైలోక్య చక్రవాసిని,
సద్గురుగుహ విశ్వాసిని ॥ నీలో ॥

చ॥ మాయా ప్రపంచాతీత స్వరూపిణి । ముచుకుంద భక్తపాలిని ।
వరదాయిని ఛాయాగౌళ రాగ రంజని । సచ్చిదానంద
రూపిణి ॥ నీ ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి. ఓ నీలోత్పలాంబికా, నిత్యమై శుద్ధమైన ఆత్మరూపిణీ! నన్ను రక్షించుము. మూడు లోకములకు తల్లీ! మూడు లోకములను మాయతో మోహింప జేయుదానా! త్రైలోక్య చక్రము, మూడు లోకముల స్వరూపమైన శ్రీచక్రవాసిని కుమార స్వామికి విశ్వాస పాత్రురాలివి. మాయతో గూడిన ఈ ప్రపంచమున కతీతమైన స్వరూపము గలదానివి, ఛాయా గౌళ రాగమున ప్రకాశించు దానివి. సత్, చిత్ ఆనంద రూపిణి వైన ఓతల్లీ నన్ను రక్షించుము, రాగము ఛాయా గౌళ ఛాయ మనలను వెంటనంటి ఉండునటులనే, మూడు లోకములను కల్పించుచు, మాయకు అతీతమై ఆనంద రూపిణిగా, నీడలాగా వెంటనుండి కాపాడు తల్లిని వర్ణించిరి.

## 61

## రీతిగౌళ రాగం త్రిపుట తాళము

20 వ మే. జన్యం. స గ రి గ మ ని ని స
స ని ద మ ప ద మ గ రి స. ని ప ని స

ప॥ నీలోత్పలాంబాం భజరేరే, చిత్త ।
వీధి విటంక త్యాగ రాజాంత రంగాం ॥ శ్రీ ॥

అ॥ మూలకూటత్రయ కళేబర శోభారుణాం।
ముచుకుందాది నుత పంకజ చరణాం।
మూలవిద్యా నిపుణాం। విధి పూజిత వినోద కిరణాం॥

చ॥ కమలానగర నివాసినీం గురుగుహ మార్గ రీతి గౌళినీం।
కమనీయ కామకళా ప్రదర్శినీం। కాది హాద్యాది మనో విశ్వాసినీం।
సామగాన శిరః కంపినీం। అఖిల మహాధూర్త భంజనీం।
కోమల కుచభరాంగినీం। ముకుంద సోదరీం, పురాణీం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి రచన. ఓ చిత్తమా! నీలోత్పలాంబను భజించుము. వీధి విటంక త్యాగరాజుని అంతరంగ మందున్న నామెను స్థూల, సూక్ష్మ కారణములను మూడు దేహములలో ఎఱ్ఱనై రజోగుణ రూపమున శోభించు నామెను, విద్యయన జ్ఞానము, జ్ఞానమునకు మూలమైన నామెను, బ్రహ్మచే పూజించబడి వినోదము గలిగించు కిరణముగల తిరువారూరు నందు నివసించిన, కుమారస్వామి యొక్క మార్గమునకు క్రమమును కలిగించిన నామెను, మధురమైన కామకళను ప్రదర్శించు నామెను, క కారము మొదలు హ కారము వరకు గల అక్షర స్వరూపముతో మనస్సున కలదను నమ్మిక కలుగ జేయు నామెను, సంగీతమును వినుచు, ఆనందముతో తల నాడించు నామెను, దుర్మార్గులను శిక్షించు నామెను, మృదువైన వక్షోజములు గల, విష్ణుమూర్తి చెల్లెలను, శంకరుని రాణియైన నీలోత్పలాంబను చిత్తమా! భజించుము. బీజాక్షర స్వరూపిణిగా వర్ణించిరి. మార్గ రీతిగౌళ రాగ నామమును కూర్చిరి.

# 62

## కన్నడగౌళ రాగం ఆదితాళం

22 వ మే. జన్యము.

స రి గ మ ప ని స
స ని ద ప మ గ స

ప॥ నీలోత్పలాంబికయా । నిర్వాణ సుఖప్రదయా । రక్షితోఽహం ॥

అ॥ వల్లీశ గురుగుహ పూజితయా । వరలక్ష్మీ వాణీ సేవితయా ।
హల్లీశ వంద్య సంతుష్టయా । ఆర క్తవర్ణ శోభిత కరయా ॥

చ॥ కాశీ కన్నడ గౌళ దేశాది । వాస దాస జనావన తోషితయా ।
వాసవాది వందిత వాగీశ । వాసు దేవా ద్యారాధితయా ।
శ్రీ శివ పురాణ ప్రతిపాదితయా । శివ శంకర నాయికయా ॥

వ్యా॥ తృతీయా విభక్తి. నీలోత్పలాంబికచే, మోక్ష సుఖ మొసగు నామెచే రక్షించ బడితిని. దేవసేనా, అమృతవల్లీ నాథుడైన సుబ్రహ్మణ్యేశ్వరునిచే పూజింప బడునామెచే లక్ష్మి, సరస్వతులచే సేవింప బడునామెచే, హల్లా దేవి నాథుని నమస్కారములతో, తృప్తి నందిన యామెచే, ఎఱ్ఱనైన చేతులతో శోభించు నామెచే. కాశి, కన్నడ, గౌళ మొదలైన, దాసజనులను సంతోషముతో రక్షించు నామెచే ఇంద్ర, బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలచే నారాధించ బడు నామెచే, శివపురాణమున తెల్పబడిన శంకరుని నాయికయైన నీలోత్పలాంబచే రక్షింపబడితిని. కన్నడగౌళ రాగమును సూచించిరి. ఏ దేవతను ప్రార్థించినను, సశ్చలమనస్సుతో, నిర్మలభక్తితో ధ్యానించిన, వెంటనే ఫలము కలుగును. అనుభవము కలుగును. అందువలన దీక్షితుల వారు తమ అనుభూతికి నిదర్శనముగ, రక్షించ బడితిని అని తెలియ జేసిరి.

# 63

## కేదారగౌళ రాగం ఆదితాళం

28 వ మే. జన్యం. స రి మ ప ని స

స ని ద ప మ గ రి స

ప॥ నీలోత్పలాంబికాయై । నమస్తే । జగదంబికాయై ॥

అ॥ మూలాధార క్షేత్రస్థితాయై । ముచుకుంద వరప్రదాయై ।

మూల మంత్రాత్మికాయై । మూలాజ్ఞాన హారగురుగుహ

వరదాయై ॥ నీలో ॥

చ॥ కామ సంజీవనాయై । కమలా వాణీ సేవితాయై ।

కలి కల్మష నాశిన్యై । కరుణామృతర రస ప్రవాహిన్యై ।

కామేశ వర మోహిత కౌళిన్యై ।

కామతంత్ర వితరణ నళిన్యై ।

కమలేశ పూజిత త్రికోణాయై ।

కామితార్థ ఫల ప్రద నిపుణాయై ॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. నీలోత్పలాంబిక కొఱకు, జగదంబిక కొఱకు నమస్కారము. మూలాధారక్షేత్రమందున్న, ముచుకుందునకు వరము లొసంగిన, మూలమంత్ర స్వరూపిణియైన, అజ్ఞానమును మొదలంట నశింపజేయు కుమారస్వామికి వరము లిచ్చునది యైన, కోర్కెలకు జీవమొసగిన లక్ష్మి, సరస్వతిచే సేవింప బడుచున్న, కలిలోని కల్మషములను నశింప జేయుచున్న, దయారసమును ప్రవహింప జేయుచున్న, కామతంత్రము నొసగు వితరణగల పద్మము వంటిది యైన, కామేశుడు శంకరుడు. శంకరుని వరముచే మోహింపబడిన కౌళిని యన, కులకాంతయైన, బ్రహ్మచేత పూజింప బడిన, త్రికోణ

స్వరూపిణియైన, కోరిన కోర్కెలు దీర్చుటలో నిపుణత్వము గల, నీలోత్పలాంబికకై నమస్కరించు చున్నాను. అనగా నానమస్కారము ఆ నీలోత్పలాంబిక కొఱకే యని వర్ణించిరి.

## 64

## గౌళరాగం రూపక తాళము

15వ మేళకర్త జన్యము — స రి గ మ రి మ ప ని స / స ని ప మ గ మ రి స

ప॥ నీలోత్పలాంబికాయాః పరం నహి రేరే చిత్త ॥

అ॥ సాలోక్యాది ముక్తిదాయిన్యాః ।
సురపతి, గురుగుహ సన్నుత చరణాయాః ।
నీల రత్నమణి భూషిణ్యాః నిరంజన్యాః ॥

చ॥ స్థూల సూక్ష్మ కారణ రూపిణ్యాః ।
బాలచంద్ర సేవిత వర దాయిన్యాః ।
కైలాస విలసిత కుల గౌళ మార్గ యోగిన్యాః
॥ నీలోత్పలాంబికాయాః ॥

వ్యా॥ పంచమీ విభక్తి. ఓ చిత్తమా, నీలోత్పలాంబిక కన్న వేరులేదు. సాలోక్య సామీప్య, సారూప్య, సాయుజ్యాది చతుర్విధములైన ముక్తినొసగు నామె, ఇంద్ర, కుమారస్వాములచే నుతింపబడు పాదములు గల నాపెకంటే, నీల రత్నమణులతో గూడిన భూషణములు గల యామెకంటె, నిరంజని, స్థూల, సూక్ష్మ, కారణ దేహ రూపములు గల నాపె కంటె, అనగా, జాగ్రదవస్థయందు స్థూల దేహరూపమున, స్వప్నావస్థ యందు సూక్ష్మ శరీర రూపమున,

సుషుప్త్యవస్థ యందు కారణ దేహ రూపిణి యైన నాకంటె, బాల చంద్రుని చేత సేవింప బడి వరము లొసగు నాకంటె, పరాశక్తి స్వరూపిణిని సేవించు గణములను, కుళ కౌళినులు యోగినులందురు. కైలాసమున, కుళ కౌళినులతో, యోగినులతో విలసిల్లు జగన్మాత కంటె వేరు లేదని తన చిత్తమునకు తెలియజేసిరి. ఇందు గౌళ మార్గ యను పదమున, గౌళ రాగ నామమును కూర్చిరి.

# 65

## మాయా మాళవ గౌళ రాగం త్రిపుట తాళము

15 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ నీలోత్పలాంబికాయా స్తవదాసోఽహం ॥శ్రీ॥

అ॥ నీలాంబరానుజాయాః । నిరుపమ పదాంబుజాయాః ।

నీలకంఠార్ధ శరీరిణ్యాః । నిఖిలలోక జనన్యాః ॥ నీలో ॥

చ॥ మాయా మాళవ గౌళాది దేశ ప్రకాశిన్యాః ।

మాతంగ వదనేంద్రాది పూజిత వర దాయిన్యాః ॥

మాయా మయ విశ్వోత్పత్తి స్థితిలయ కారణాయాః ।

మాధుర్యామృత ధార మహాదేవ గురుగుహోపాసిన్యాః

॥ నీలోత్పలాంబికాయాః ॥

వ్యా॥ షష్ఠీ విభక్తి. నీలోత్పలాంబిక యొక్క దాసుడను నీలాంబరధారి బలరాముడు, పీతాంబరధారి కృష్ణుడు బలరాముని సోదరికి పోల్చదగని పాదపద్మములు గల, నీలకంఠుడగు శంకరుని సగము శరీరమును పొంది, అన్నిలోకముల తల్లికి మాయ, మాళవ, గౌళ మొదలైన దేశముల యందు ప్రకాశించు నామెకు, గణపతి,

ఇంద్రుడు మొదలైన వారిచే పూజింపబడుచు వరము లొసగు నామెకు మాయతో కూడి ఈ ప్రపంచ సృష్టి స్థితి లయములకు కారణమైన నామెకు, మహాదేవ, గురుగుహులచే ఉపాసించ బడి, మధురమైన అమృత రస ధారల రూపము గల నీలోత్పలాంబికకు దాసుడను. ఇందు, మాయా మాళవ గౌళ దేశముల పేర్లతో రాగ నామమును కూర్చిరి.

# 66

## పూర్వ గౌళ రాగం రూపక తాళము

29వ మేళకర్త జన్యము — స రి మ గ రి మ ప ద ని స / స ని ద ప మ గ రి స

ప॥ నీలోత్పలాంబికాయాం । భక్తిం కరోమి ॥శ్రీ॥

అ॥ నీలోత్పల నాయక సమేతాయాం ।
నిఖిలాగమ సన్నుతాయాం ।
నీలాంబర పుష్ప మాలావృతాయాం ॥ నీ ॥

చ॥ కవిజనాది మోదిన్యాం । కమలేశ పాలిన్యాం ।
సూర్యకోటి ప్రకాశిన్యాం । సూరిజ నోపాసిన్యాం ।
పూర్వగౌళ ప్రకాశిన్యాం । అవిద్యా విద్యా స్వరూపిణ్యాం ।
ఆరక్త వర్ణ రూపిణ్యాం । ఇభవదన గురుగుహాది జనన్యాం ॥నీ॥

వ్యా॥ సప్తమీ విభక్తి రచన. నీలోత్పలాంబికయందు భక్తిని చేయుచున్నాను. కలిగియున్నాను. నీలోత్పల నాయకునితో కూడిన సమస్త వేదములచేత నుతింప బడిన, నీలాంబరము, నీలపుష్పమాలలచే చుట్టబడిన, అనగా ధరించిన, కవీశ్వరులకు ఆనందము కలిగించిన

బ్రహ్మను పాలించిన, కోటి సూర్యుల కాంతితో ప్రకాశించుచున్న, పండితులను పాలించు, పూర్వగౌళ రాగముతో ప్రకాశించుచున్న, అవిద్య, అజ్ఞానము, విద్య=జ్ఞానము, జ్ఞానాజ్ఞాన స్వరూపిణి యందు, ఎఱుపు రంగుతో గూడిన రూపముగల, గణపతి, కుమార స్వాము లకు తల్లియైన నీలోత్పలాంబిక యందు భక్తి కలిగి యున్నానని వర్ణించిరి.

## 67

## నారీ రీతి గౌళ రాగం రూపక తాళము

20 వ మేళకర్త. సంపూర్ణము.

వేంకటమఖిచే నిర్ణయించ బడిన రాగములలో నఠభైరవి రాగమునే నారీ రీతి గౌళ యని పేరిడిరి.

ప॥ నీలోత్పల నాయికే । జగదంబికే ।
శ్రీనగర నాయికే । మామవ, వర దాయికే ॥

అ॥ దీన జనార్తి ప్రభంజన । రీతి గౌరవే దేశిక ।
ప్రదర్శిత చిద్రూపిణి, నఠభైరవే ॥

మ॥సా॥ ఆనందాత్మానుభవే । అద్రిరాజ సముద్భవే,
సూనశరారి వైభవే । జ్ఞాన సుధార్ణవే, శివే ॥ శ్రీ ॥

చ॥ సంకల్ప వికల్పాత్మక । చిత్తవృత్తి జాలే ।
సాధు జనారాధిత సద్గురు కటాక్ష మూలే ।
సంకట హరధురీణతర గురుగుహానుకూలే ।
సమస్త విశ్వోత్పత్తి స్థితి లయాది కాలే । వి
డంగ త్యాగ రాజ మోహిత విచిత్రలీలే ।
శంకరి, కృపాల వాలే । హాటకమయ చేలే ॥

మ॥సా॥ పంకజ నయన విశాలే । పద్మ రాగ మణి మాలే ।
శంకర సన్నుత బాలే । శారద గానలోలే ॥ శ్రీ ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి. ఓ నీలోత్పల నాయికా, జగదంబికా, శ్రీనగర, కమలాపుర నాయికా, వరము లొసగు తల్లీ, నన్ను రక్షించుము. దీనజనుల దుఃఖమును పారద్రోలి, గురురూపమున ఉపదేశమొసగు చిత్స్వరూపిణీ, భైరవునిచే నమస్కరింపబడుదానా! ఆనందములో కూడిన ఆత్మానుభవ రూపముగలదానా! హిమవంతునికి జన్మించినదానా! మన్మథునకు శత్రువైన శంకరునితో కూడిన వైభవముగల జ్ఞానామృత సముద్ర రూపిణీ, సంకల్పము, వికల్పములుగల చిత్తవృత్తిని కలుగజేయు దానా! సాధుజనులచే నారాధింపబడుదానా! గురుకటాక్షమునకు ఆధారమైనదానా! కష్టముల తొలగించు గురుగుహునకు అనుకూలమైనదానా! వీధీ విడంగ త్యాగరాజేశ్వరునిచే మోహింప బడినదానా! విచిత్రలీలలు గల దయారాశీ, బంగారు వికార వస్త్రమును ధరించినదానా! పద్మముల వంటి విశాల నేత్రములు గలదానా! శంకరాచార్యునిచే నుతింపబడిన బాలా స్వరూపిణీ! సరస్వతీ గానమునందు ఇచ్ఛగల తల్లీ నన్ను రక్షించుమని కొనియాడిరి.

## రెండు కళల చౌకం

ప॥ నీ । ని ద మ గ రి । స ప మ - గ రి స న్ని ।
శ్రీ నీ - - లో - త్ప ల - నా - - యి

సా - సా గ రి గ మ | (2) నీ దా ని ధ మా గ రి ...
కా - - - - - | శ్రీ నీ - - - - - ..

సా - సా ని ని స | నీ , స - ప ని నీ స |
శే - - జ గ | దం - బి - కే -

స ని గా - గా రి గ రి గ సా | స ని సా - స గ గా మ |
(శ్రీ)- - - న - గ - ర నా - - యి - కే -

మా | గ రి గ మ | పా , మ - గ మ ప మ గ రి స ని |
మా మ వ వ ర దా - - - - - - - - యి

సా | పా గ రి గ మ || (శ్రీ) ||
కే - - - - -

అ॥ పా - ద ప మా | గా - మ ప మా ప గ |
దీ న జ నా త్రి ప్ర - భం - - -

గా ప మ - గా రి గ రీ | సా , ని - ని ని సా |
జ న - రీ - - తి గా - - ర వే

ని స - ని గ రి మ | గ రి - ప మ గ రి |
దే - శి క - ప్ర ద - ర్శి త చి -

ని ద - మ గ రి ని | స మ - గ గ మా |
ద్రూ - పి ణి న శ భై - - ర వే

మ॥సా॥ గా రీ - సా సా ని ని సా | సా గ రి - రి ని స గా రి సా |
ఆ నం దా త్మా ను భ వే అ ద్రి రా - జ స ము ద్భ వే

నీ ని ద | మా గ రి గ రి సా |
సూ న శ రా రి వై - భ వే

పా ని ని - పా గ గా మ మా || (శ్రీ) ||
జ్ఞా న సు ధా ర్ణ వే శి వే

చ॥ సా - సా స ని | స ని - గ రి స ని | సా - ప మ గా రి ని |
సం క ల్ప వి క - ల్పా- త్మ క చి త్త - వృ - త్తి |

సా - నీ స ని ధ ని స ని | (2) నీ నీ || స ని - స గ గ గ మ|
జా - - - లే - - - - - || సా - ధు- జ నా -

గా - రి గ రి సా | ప మ - గ రీ స | స ని . నీ - సా సా |
రా ధి - త స ద్గు రు క టా క్ష మూ- - - లే |

సా - గ గ మ మ | ని ద - ద మ గ రి |
సం క ట హ ర ఘు తీ - ణ త ర

ని స - రి గా గ | మా - మా మా | స మ - మ మ గ రి |
గు రు గు హా ను క్రూ - లే | స మ - స్త వి -

సా - పా ద ద ప మ | గ రి - స నీ ధ |
స్తో త్ప త్తి - - - స్థి తి ల యాది

సా , ని - నీ స ని | సా - సా పా | ద ని దా - ని ద మా |
కా - లే - వి | టం క త్యా గ - రా - జ మో

గ గ - మ ని నీ స | స ని నీ - ని సా, |
హి త వి - చి త్ర లీ - - - లే |

గా - గ రి ని స | సా రి స - నీ ని దమా |
శం క రి కృ పా - ల - వా - - లే

గా - మ ద ప మ గ రి | గ రి - సా సా ||
హా ట - క - మ య చే - - లే ||

మ॥సా॥ పా ద ప - ప మ గ రి గ రి సా |
పం క జ న య న వి శా - లే

ని ధ ని స - స స రి గ మా మా |
ప - ద్మ రా - గ మ ణి మా లే |

ప సం సి సం - సం మం గం రిం సం ని సాం |
శ ం క ర స - న్ను త బా - లే |

నీ ని ని - ని ని ద మ గ రి గ మ ||
శా ర దా - గా - న లో - లే - || శ్రీ ||



# శ్రీ కమలాంబా

# నవావరణ వివరణము

శ్రీ తిరువారూరును కమలాపురము, శ్రీపుర మందురు. అచట శాక్తేయ సంప్రదాయాను సారము, శ్రీచక్ర రూపమున ప్రతిష్ఠింప బడిన కమలాంబా ఆలయము గలదు. ఈ కమలాంబపై నవావరణ కృతులు దీక్షితులవారు రచించిరి. ఈ నవావరణములను,

శ్లో॥ బిందు, త్రికోణ, వసుకోణ, దశారయుగ్మ ।
మన్వస్ర నాగదళ, షోడశ పత్రయుక్తం ।
వృత్తత్రయంచ, ధరణీ సదన త్రయంచ ।
శ్రీచక్రరాజ ఉదితః, పర దేవతాయాః ॥

"బిందువు, త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, దశ త్రికోణచక్రము, చతుర్దశారము, అష్టదళపద్మము, షోడశదళపద్మము, భూపురము" వీనిని నవావరణము లందురు. దేవియొక్క సగుణ, నిర్గుణ తత్వము, ప్రపంచ స్వరూప స్వభావ మంతయు ఈ శ్రీచక్ర

మున నిండియున్నది. "కమలాంబ" యన, అంబ= తల్లి, కమలమన పద్మము. పద్మమున నున్నతల్లి లేక, పద్మస్వరూపిణియైన తల్లియని అర్థము. స్థూలరూపమున కమలమన = పద్మము. అంతర్దృష్టిలో కమలమును, 1) హృదయ కమలము, 2) సహస్రార కమలము అని అందురు. హృదయ కమలమున ప్రాణరూపమున, సహస్రార కమలము నందు, చిత్స్వరూపమున భాసించి, జగత్సృష్టి స్థితి లయములకు కారణమై, శరీరమందు నాడీరూపమున, చైతన్యమును కలిగించి, మూలాధారాది సహస్రారము వరకు, ప్రణవ నాద రూపమున, అ కారాది క్ష కారాంత వర్ణస్వరూపిణియైన పరాశక్తియే జగన్మాతృ స్వరూపిణి. ఆమె ప్రతిరూపమే శ్రీచక్రము. నవావరణాయుత శ్రీ చక్రమును అర్చించుట, ఉపాసించుటనే శ్రీ విద్య యందురు. "నగాయత్ర్యాః పరంమంత్రం నమాతుః పరదైవతం" అన్నటుల, ఇది బ్రహ్మ విద్యగా నున్నది. శ్రీచక్రము, భక్తులను రక్షించుటకై ఏర్పడిన పరాశక్తియొక్క ప్రత్యక్ష సగుణ రూపము. స్థూల శరీర మందలి రహస్యములను తెలియ జేయును. సృష్ట్యాదిని పరాశక్తి "బిందు" రూపమును, ఆ బిందువు శివసామరస్యమును, పరబ్రహ్మ స్వరూపమున, ఏకాకారమంది, అందలి మాయా స్వరూపమైన ఇచ్ఛా శక్తిచే బిందువు ప్రస్ఫుటమై, పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ రూపముల నందినది. శ్రీచక్ర మధ్యబిందువు పరాస్వరూపము. త్రిభుజాచక్రము పశ్యంతి స్వరూపము, అష్టకోణ చక్రము, మధ్యమా స్వరూపము మిగిలినవి వైఖరీ స్వరూపములు. ఇందు, 1) బీజములు, 2) దళములు, 3) గుణములు, 4) మండలములు, 5) భూతములు, 6) షడధ్వలు, 7) సప్తధాతువులు, 8) అష్టప్రకృతులు, 9) నవ యోగులు గలరు. మరియు అష్ట చక్రములు, 28 మర్మములు, 18 సంధులు, 8 డమరుకములు, 45 యోనులు, 25 దళములు గలవు. దళములు గలవి కమలములు. ప్రకాశాంతము శివభాగము. కోణ

ములు గలవి చక్రములు. అవి శక్తిభాగము. బిందువు, అష్టకోణములు షోడశదళములు, భూపురము ఈ నాలుగు శివస్వరూపములు. కమలములు, అష్టకోణములు, దశారయుగ్మము, చతుర్దశారము ఈ నాలుగు శక్తిచక్రములు. కమలచక్ర మేళనము నాలుగు ద్వంద్వములుగా ఏర్పడినది. బిందు త్రికోణములు, ఆదిద్వంద్వము. తక్కిన మూడును త్రిమూర్తి ద్వంద్వములు. ఈవిధముగా నున్న మాతృకయందు, అనేక సంకేతార్థములుగలవు. అన్నియు శ్రీచక్రమందు గలవు గావున శ్రీచక్రము పరదేవతా సంకేతములను, బ్రహ్మాండ సంకేతములను తెలియజేయు చున్నది. బ్రహ్మజ్ఞాన మందుటకు, నిజస్వరూప తత్వమును తెలుసుకొనుటకు ముఖ్య సాధనము శ్రీచక్రము. ముందుగ, స్థూలాకారముగ నున్న చక్ర సంకేతములను తెలుసుకొని, పారమార్థిక శరీరమందున్న మూలాధారము మొదలు, సహస్రారము వరకు గల చక్రములందు, భ్రూమధ్యాది స్థాన విశేషములను, గురుముఖమున యోగ సాధన మొనర్చిన వారికే గోచరమగును. శ్రీవిద్యా విషయమున, పరాశక్తి రూపమును. నాదాత్మిక, స్వరాత్మిక, రాగాత్మిక, లయాత్మికగా గుర్తించి గాన మొనర్చవలెనను భావమును శ్రీదీక్షితుల వారు ఈ నవావరణ కృతుల యందుదహరించిరి. ఇటువంటి నవావరణము, 1) కమలాంబా నవావరణములు, నీలోత్పలాంబా నవావరణములు, మంగళాంబా నవావరణములు, అభయాంబా నవావరణములు, మధురాంబా నవావరణములు, కామాక్షీ నవావరణములు మరియు గణపతి, శివ, గురుగుహ నవావరణములు అను పేరులతో "ఏకబ్రహ్మ విద్యోపాసనా రీతిలో" రచించిరి. కనుక గాయకలోకము, గానము సకలార్థ సాధనమని, ఇహపర సుఖసాధనమని గుర్తించి, లౌకిక దృక్పథమును వదలి, గురుకృపచే అంతర్దృష్టి కలిగి, అంతరార్థముల గమనించి, తాను అనుభూతిని పొంది గానము చేయగలరని ఆకాంక్ష.

తిరువారూరున ఆరువేలికొలుమ్, ఆరువేలికోవెల్ అను నానుడి గలదు, వేలియన 6 ఎకరముల విస్తీర్ణము. 6×6=36 ఎకరముల విస్తీర్ణము గల కోనేరు. 36 ఎకరముల విస్తీర్ణము గల కోవెల ఆలయము. అందు 6 ఎకరములు కల్హారపూల కోనేరు గలదు. దానిని కమలాలయ మందురు. ప్రతి నిత్యము కల్హారపూలతో కమలాంబను అర్చింతురు. త్యాగరాజేశ్వరుని ఆలయమునకు వెనుక వాయువ్యమున కమలాంబాలయము గలదు. ఆ దేవిపై కృతులు రచించిరి. వీనిని నవావరణ కృతులందురు.

## 68

## తోడిరాగం రూపక తాళము

8వ మేళకర్త. ధ్యానకీర్తన. సంపూర్ణం.

పll కమలాంబికే, ఆశ్రితకల్పలతికే । చండికే ।
కమనీయారుణాంశుకే । కరవిధృతశుకే । మామవజగదంబికే ॥

అll కమలాసనాది పూజిత కమలపదే । బహువరదే ।
కమలాలయ తీర్థ వైభవే । శివే । కరుణార్ణవే ॥

చll సకల లోక నాయికే సంగీత రసికే ।
సుకవిత్వ ప్రదాయికే సుందరి । గతమాయికే ।
వికళేబర ముక్తిదాన నిపుణే అఘహరణే ।
వియదాది భూతకిరణే । వినోద చరణే । అరుణే ।
సకలే గురుగుహ కరణే, సదా శివాంతఃకరణే ।
అకచటతపాది వర్ణే । అఖండైక రసపూర్ణే ॥

వ్యాll సంబోధన ప్రథమా విభక్తి. హే! కమలాంబికే = ఓ కమలనివాసిని యైన తల్లీ. కమలములు రెండు. 1) హృదయ

కమలము, 2) సహస్రార కమలము. హృదయ కమలమున ప్రాణ రూపమున, సగుణాకార మూర్తివై, సహస్రార కమలమున చిచ్ఛక్తి స్వరూపమున నిరాకార రూపిణి వైన తల్లీ ! జననమున కాధారము జనని, అంబ. సంకల్ప వికల్పాదులు, సృష్టి స్థితి లయాదులను గలిగించు నది గావున "కమలాంబిక" నామముగల తల్లీ. ఆశ్రయించిన వారికి కల్పవృక్షమైన చండికా ! చూచుటకు అందమై, రజోగుణ రూపమును తెలుపు ఎఱ్ఱని వస్త్రము ధరించి, కరమునందు చిలుకను ధరించిన ఓ జగదంబా ! నన్ను రక్షించుము. కమలాసనుడు బ్రహ్మ, మొదలైన వారిచే పూజింప బడిన పద్మములవంటి పాదములు గలది. అనేక వరము లొసంగు దానివి. కమలాలయ తీర్థవైభవే = కమలాలయ మను కోనేరు నందలి తీర్థముచే అభిషేకించు వైభవమున నొప్పు చున్న, శివే = మంగళప్రదురాలా ! దయాసముద్రురాలవైన తల్లీ నన్ను రక్షించుము, అన్ని లోకములకు నాయికివి. సంగీత మునందు రసికత్వము, ఆసక్తి కలదానివి, మంచి కవిత్వము నొసంగు దానివి, లోకమున అందమైన దానివి గనుకనే సుందరివి. (అనగా) లోకమునందలి అందము కాలమునుబట్టి మారుచుండును. ఆమె సౌందర్యము గలది అందుకే శ్రీ ఆది శంకరులు "సౌందర్యలహరి" యందు ఆమె సౌందర్యమును వర్ణించిరి. సుందరి, త్రిపురసుందరి, మహాత్రిపురసుందరి నామములు గలది. మాయను తొలగించు దానవు, దేహము ఉండగనే దేహభ్రాంతిని పోగొట్టి ముక్తినొసగుట యందు నిపుణత్వము గల దానవు. దానిని "విదేహ ముక్తి" యందురు. పాపములను హరించు దానవు. వియదాది = ఆకాశము మొదలైన పంచభూతముల ద్వారా ప్రకాశించు దానవు. వినోదముగా చరించు దానవు, ఎఱ్ఱని రూపము గలదానవు. త్రిగుణములలో రజో గుణము ఎఱుపుగా నుండును. రజోగుణమువలన సృష్టి జరుగును. ప్రకృతియే శక్తిగనుక, ప్రకృతిని "అరుణే" అన్నారు. సకలము నీవే.

కళతో కూడిన దానవు. గురుగుహ రూపమును కలిగించు దానవు. సదాశివుని అంతఃకరణ మందున్న దానవు, అవర్గు, కవర్గు చవర్గు, టవర్గు, తవర్గు, పవర్గు మొదలైన వర్ణ రూపిణివి, అకారాది క్షకారాంత గల అక్షర స్వరూపిణివి, శాశ్వతానంద స్వరూపిణివైన, ఓ కమలాంబికా! నన్ను రక్షించుమని ధ్యానించిరి. తోడి పదము తెలుగు పదము గాన, ఈ రాగ నామమును గూర్చ లేదు.

రెండు కళల చౌకం

ప॥ సీ సీ - ద ని దా - , ని స్స ని ॥ సా ; - సా ; ని ద ప మ |
క మ లాం - - - - బి కే - - - - -

సీ సీ - ద ని దా - , ని స్స ని ॥ సా ; - దా ; పా సా |
క మ లాం - - - బి - కే - ఆ శ్రి త

దా ; - ప మ గా - మ ప ద ప ప మ గా |
క ల్ప - ల తి - - - - కే - -

రి ని సా - సా రి గ రి స గ రి స్రి |
- - చం - డి - కే - - - -

సా సా - రి గా రి స రి స | స్రి ధ ని - దా నీ సా ; |
క మ నీ - - యా - - | రు ణా - ం శు కే

గా గా - మా నీ దా పా |
క ర వి ధృ త శు

గా ; - గ మ ప మా ద ప ద ‖ కమ ‖
కే మా - - - మ - వ

అ॥ పా పా - దా ని ప - దా పా |
క మ లా - - స నా

ద మ మా - గా ప మ గ రి స ని |
- - ది పూ - - జి - త - |

సా రీ - గా మా పా ద ని | దా మా - దా నీ - సాం |
క మ ల ప దే - - | బ హు వ ర దే |

దా నీ - సాం రిం గం - రీం సాం | రిం సం రిం ని - నీ సం ని సం ద దా |
క మ లా - - ల య | తీ - - - ధర వై - - - భ |

ప ద ని సం - రీం సం సం - సం ని దా |
వే - - - శి వే - - - క |

ప మ గా - గా మా - గ మ ప ద ‖ కమ ‖
రు - ణా - ర్ణ వే - - - ‖

చ॥ పా దా - పా మ గ మ గ గా |
స క ల లో - - - క |

గ మ ప ద - పా ప మ - గ రి స ని |
నా - - - యి కే - - - - - |

నీ స రి - గా సా - రీ నీ | సా రీ - గా ; - మా ; |
సం - - గీ - - త | ర సి కే - |

మా గ మ - పా ; ద ప ప మ |
సు క - వి త్వ - - - |

ద ప దా - దా నీ - సం రిం గాం |
ప్ర - దా యి - కే - - |

ని సా , - రిం ని ని ద - ని ని ద ప |
సు ం - ద - - రి గ - త - |

మ గ మ ప ద ప - ప మ గ రి - స గ రి ని |
మా - - - - - యి - - - కే - - - |

సా స స - పా ; - పా ద ని |
- వి క లే బ ర - |

ద ప ని ద - మా ద ప - గా గా |
ము - - - త్రి దా - - న |

మా ని ద - దా ; పా ద ని ||
ని పు - ణే - - - ||

దా మా - దా నీ సా - ; | సా ద ని - సా ; - సా సా ||
ఆ ఘ హ ర ణే | వి ద్య దా ది భూ ||

సా సా - నీ స రి - రి సా ని |
- త కి ర - ణే - - |

ని నీ ద - ని స రి స - ని ద నీ |
వి నో - - - - ద చ - ర |

స ని ద మ - దా నీ - సా ; ||
ణే - - - అ రు ణే ||

మ॥సా॥ ద ద గా - రి స రి రి - స ని సా |
స క లే గు రు గు హా క ర ణే |

ని సా ని - దా ప మ - గ మ పా |
స దా శి వా ం తః క ర ణే |

గ మ ప ద - ని రీ స - ని ద ని స |
అ క చ ట త పా ది వ - ర్ణే - |

ని సా ద - ద ప ప మ - గ మ ప ద || కమ ||
అ ఖం డై - క ర స పూ - ర్ణే - ||

# 69

## ఆనందభైరవి రాగం త్రిపుట తాళం

22 వ మే. జన్యము. స గ రి గ మ ప ద ప ని స
స ని ద ప మ గ రి స

ప॥ కమలాంబా సంరక్షతు మాం ।
హృత్కమలా నగర నివాసినీ ॥ కమ ॥

అ॥ సుమనసారాధితాబ్జ ముఖి । సుందర మనః ప్రియకర సఖి ।
కమలజానంద బోధసుఖి । కాంతాతార పంజర శుకీ ॥ కమ ॥

చ॥ త్రిపురాది చక్రేశ్వరీ । అణిమాది సిద్ధేశ్వరీ ।
నిత్యాకామేశ్వరీ । క్షి.
తిపుర త్రైలోక్య మోహన చక్రవర్తినీ । ప్రకట యోగినీ । సుర
రిపు మహిషాసురాది మర్దినీ । నిగమ పురాణాది సంవేదినీ ॥

మ॥సా॥ త్రిపురేశీ । గురుగుహ జననీ ।
త్రిపుర భంజన రంజనీ । మధు,
రిపు సహోదరీ । తలోదరీ ।
త్రిపుర సుందరీ । మహేశ్వరీ ॥ కమ ॥

వ్యా॥ ప్రథమా విభక్తి. నన్ను కమలాంబ రక్షించు గాత. హృదయ కమలమనే నగరమందు నివసించినది, కమలా నగరమన, తిరువారూరని మరియొక అర్థము. మంచి మనస్సుతో భక్తులచే, వేద విదులచేత దేవతలచే నారాధింప బడు పద్మమువంటి ముఖము గలది. సుందరేశ్వరుడని శివునికి నామము గలదు. గాన పురుష శబ్దమున సుందరుడు శివుడు గాన శివుని మనస్సునకు ప్రియమైన చెలిమి గలది. కమలజానంద = కమలజుడు బ్రహ్మ. బ్రహ్మానంద సుఖమును బోధించునది, మనోజ్ఞమైన నక్షత్రములతో కూడిన పంజరమున

చిలుకవలె భాసించునది. త్రిపురాది = ప్రథమ, ద్వితీయ, తృతీయ భూపురములతో కూడిన భూపురమునుండి, మధ్య, బిందువు మొదలైన చక్రములకు నాయిక యైనది. అణిమ, మహిమ, గరిమ మొదలైన అష్ట సిద్ధుల నొసంగుటలో నాయకురాలైనది, ఎల్లప్పుడు కోర్కెలు దీర్చు ఈశ్వరి, భూలోక, భువర్లోక, స్వర్లోకము లను మోహింప జేయుచున్న కాలచక్రమగు శ్రీచక్రమున మోహన రూపమున తిరుగుచున్నది. యోగినీ గణములచే కూడినది, యోగమును ప్రకటించునది, దేవతలకు శత్రువైన మహిషాసురుడు మొదలైన దానవులను మర్దించినది, వేద, పురాణాదులచే తెలియబడునది, త్రిపురేశీ=మూలాధార, మణిపూరక, సహస్రారములే త్రిపురములు. వానికి నాయకురాలు అయిన, కుమారస్వామికి తల్లియైన, త్రిపురములు స్వర్ణ, రజత, తామ్రపుర ములతో సంచరించు దానవులను సంహారించినది, మధు రాక్షసునికి శత్రువైన విష్ణుమూర్తికి సోదరి = విష్ణువునకు మధు రాక్షసుని వధించుటచే మధు సూదనుడను పేరు గల్గినది. తలోదరి, లోతైన ఉదరముగలది. మహేశ్వరి నన్ను రక్షించుగాత! యని వర్ణించిరి. ఇది ప్రథమావరణము.

ఇందు త్రిపురాది చక్రేశ్వరీ, త్రైలోక్య మోహన చక్రవర్తినీ, త్రిపురేశీ, త్రిపురసుందరీ మొదలగు పదములు పరాశక్తియొక్క సాకార, నిరాకార తత్వమును తెలియ జేయుచున్నది ఆ శబ్దముల గూఢార్థములను గురుముఖముగా గ్రహించవలయును.

## రెండు కళల చౌకం

ప॥ పదపా మగమ పామ । గ రీసా స్రీ । న్రి స్రీ సా ప మ ।

క - మ లాం ం - - - బా - స ం - ర క్ష తు -

గ రీ గా మా | (2) గ రీ సా ని
మాం (శ్రీ) - | మాం హ్రా - | స గా గా మా |
త్క మ లా -

ప ద పా మా మ పా మ | గ రీ గ మ ప మ |
న - గ ర ని - - వా - సి - - -

గ రి | గా గా , స ని || (2) స గా గా మా |
సీ - - - హ్రా - || త్క మ లా -

......... | ...... | గా , సా సా ||
న గ ర ని వా సి సీ - - ||

అ॥ ప మ ప సా పా | ద పా మ గ మా | ప ద మ గ గ మా |
సు మ న సా రా | ధి తా బ్జ ము ఖీ | సుం ద ర మ నః |

ప మ ని ని ని సా | స ని స మా రి గ | రి సా ని ద పా |
ప్రి య క ర స ఖీ | క మ ల జా నం ద బో ధ సు ఖీ

సా స ని ద ని స | మా ద ప ప మ గ రి గ మ || క ||
కాం తా - తా - ర పం - - జ - ర సు ఖీ - ||

చ॥ ప ద పా మ గ మ ప మా | గ రీ స ని సీ | సీ , సా ని |
త్రి - పు రా - - - ది చ - క్రే - శ్వ రీ - అ

గ రీ గా మా | పా ద పా మ గ | మ ప మా గ రీ ని |
ణి మా ది సి | ద్ధి - శ్వ రీ - - - - ని - త్యా

సీ , సా ప మ | గ రీ గా , స | ద పా మా గా |
కా మే శ్వ - రీ - - షి | త్రి పు ర త్రై

ప మ గ రీ స ని | సా గ గా మా | పా , ద మ మ గ |
- - లో - - క్య మో - హ న చ క్ర వ - |

గ గా గా మా । మ మా ప మ మ గ । గ మా గా మా ।
- త్రి - నీ - ప్ర క - ట - యో - - గి

పా పా , స స | ప పా సా ని స । మా , గా రీ ।
నీ - సు ర | రి పు మ హి - షా సు రా

రి గ రి స రి స స సి । నీ , సా ని గ | రి సా సా సా ।
- - - ది మ - - ర్ది నీ - ని గ | మ పు రా -

పా పా , ద ప । మ గా మ ద ప మ । గ రీ సా సా |
ణా - - ది స ం వే - - ది నీ - - - |

మ॥సా॥ స స పా పా గ రి రి స స ని నీ ।
త్రి పు రే శీ గు రు గు హ జ న నీ

మ మ మ రి గ రి స ని ద ని సా మ గ |
త్రి పు ర భ ం జ న ర ం జ నీ మ ధు |

రి స స నీ ద పా ప మా గ రీ ।
రి పు స హో ద రీ త లో ద రీ

ని గ రి గా మ ప ద మ గా రి గ మ ‖ కమ ‖
త్రి పు ర సుం ద రీ - మ హే శ్వ రి - ‖

# 70

## కళ్యాణి రాగం ఆది తాళం

65 వ మేళక ర్త రాగము. సంపూర్ణము.

ప॥ కమలాంబాం భజరే, రే మానస ।
కల్పిత మాయాకార్యం త్యజరే ॥

అ॥ కమలా వాణీ, సేవిత పార్శ్వాం ।
కంబుజయ గ్రీవాం నత దేవాం ।
కమలాపుర సదనాం మృదు గదనాం ।
కమనీయ రదనాం, కమల నయనాం ॥

చ॥ సర్వాశా పరిపూరక చక్ర స్వామినీం । పరశివ కామినీం ।
దుర్వాసార్చిత గుప్త యోగినీం । దుఃఖ ధ్వంసినీం, హంసినీం ।
నిర్వాణ నిజ సుఖ దాయినీం, నిత్యకళ్యాణీం, కాత్యాయినీం ।
శర్వాణీం. మధుప విజయ వేణీం ।
సద్గురుగుహ జననీం, నిరంజనీం ॥

మ॥సా॥ గర్విత భండాసుర భంజనీం ।కామాకర్షిణ్యాది రంజనీం ।
నిర్విశేష చైతన్య రూపిణీం ।
ఉర్వీ తత్వాది స్వరూపిణీం ॥ కమ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ద్వితీయావరణ సంబంధమైనది. ఓ మనసా! కమలాంబను సేవించుము. మాయచేత కల్పించబడిన అకార్యములను విడిచిపెట్టుము. లక్ష్మి, సరస్వతులచే ఇరు వైపుల సేవించబడుచున్న, కమలాపురము ఇల్లుగా గలది. అనగా తిరువారూరు నందున్న, లలితమైన వాక్కులు గల, అందమైన పలువరుస గల; పద్మపత్రముల వంటి నేత్రములు గల కమలాంబను సేవించుము. ఇచట నవచక్రము లనుగూర్చి వివరింతును. 1) త్రైలోక్యమోహన చక్రమున, ప్రకట యోగినీ గణములతోను, 2) సర్వాశా పరిపూరక చక్రమున, గుప్త యోగినీ గణముల తోను, 3) సర్వ సంక్షోభణ చక్రమున, గుప్తతర యోగినీ గణములతోను, 4) సర్వ సౌభాగ్య చక్రమున, సంప్రదాయ యోగినీ గణముతోను, 5) సర్వార్థ సాధక చక్రమున, కులోత్తీర్ణ యోగినీ గణము తోను, 6) సర్వ రక్షాకర చక్రమున, నిగర్భ యోగినీ గణముతోను, 7) సర్వరోగహార చక్ర

మున, రహస్య యోగినీ గణముతోను, 8) సర్వసిద్ధిప్రద చక్రమున, అతిరహస్య యోగినీ గణముతోను, 9) సర్వానందమయ చక్రమున, పరాపరాతి రహస్య యోగినీ గణముతోను, ఆయా నవావరణముల యందు, ఆచక్రవర్తినియై, ఆయా యోగినీ గణములచే సేవింపబడు పరాశక్తిని, ఒక్కొక్క కృతి యందు ఒక్కొక్క ఆవరణమును వర్ణించిరి. ఈ నవచక్రముల వివరణమును, ఆరభి రాగమున, అఖిలాండేశ్వర్యై నమస్తే అను కృతియందు దహరించిరి. సర్వాశా పరిపూరక చక్రమునకు నాయకురాలైన, పరశివుని కామ స్వరూపిణి, దూర్వాసాదులచే నర్చించ బడిన గుప్త యోగినీ గణముతో కూడినది. దుఃఖములను పోగొట్టునది, హంస స్వరూపిణి, శాశ్వత మోక్ష సుఖము నొసంగునది, నిత్యము శుభము లొసంగునది, కాత్యాయని, శర్వుని రాణి, తుమ్మెదల నల్లదనమును జయించిన నల్లనైన జడ గలది, గురుగుహ మూర్తి తల్లి, నిత్యము జీవులను రంజింప జేయునది, గర్వముగల భండాసురుని సంహరించినది, కోర్కెలచే నాకర్షింప బడిన వారిని ఆనందింప జేయునది, సర్వ జీవరాసుల యందు చైతన్య రూపముతో ప్రకాశించుచున్న, పృథివ్యాప్తేజో వాయు రాకాశాది పంచభూత స్వరూపిణి యైన, కమలాంబను భజించు మనసా! యని ఆశా పరిపూరక చక్రముననున్న జగన్మాతను, "ఆశయాబధ్యతేలోకః" గనుక ఇహలోక, పరలోకాపేక్షతో కూడిన వారికి సర్వకోర్కెలు తీర్చునదిగా వర్ణించిరి.

## రెండు కళల చౌకం

ప॥ గ మ పా దా ద ర్రి । సా స ని దా । ప మ గా రి స ।
క మ లాం బాం భ జ రే రే - - మా - - - న స ।

పా మ గ మ ప ద మ మ గ గ గ రీ ।
క ల్పి - త - మా - - - యా - -

స ని ధ రి రి గ గ స । మా గ రి రీ ||
కా- - - ర్యం - - - త్య జ రే ||

అ॥ ప మ పా గా మా । రి గ ఠీ గ ద । పా పా |
క మ లా వా ణీ సే- - వి త పా ర్శ్వం |

పా ద ని ద ప ప మ మ గ మ ప । దా ద రి । సా సా |
క ం - బు జ య - - - గ్రీ - వాం న త దే వాం |

మ॥సా॥ స స గ రి స ని ద ద ని ద ప మ గ ద పా ।
క మ లా - పు ర స ద నాం మృ దు గ ద నాం

గ గ నీ ద రి స ద । ద ప మ ప గ ప మ రి || కమ ||
క మ నీ యర ద నాం - క మ ల వ ద నా ం || ||

చ॥ సా పా సా ధ రి । రి స ని స ని స రీ । గ గ రీ |
స ర్వా శా ప రి పూ- - - ర - క చ - క్ర |

సా గ రి నీ , ధ ద । ని స రి గ । గ మ పా |
స్వా మి - నీం ప ర శి వ కా- - మి నీం |

దా నీ సా ని స దా । ప మ దా ప మ గా । గ గ రీ |
దు ర్వా సా ర్చి - త గు - - ప్త - యో - గి నీం |

సా స ని సా రీ గ గ । రీ గ మ ప ద పా । మ గ రి పా |
దుః ఖ - - ధ్వం సి నీం - హం - - - సి నీం - - |

నీ ని ద ని ద ప గ మ ప । దా ప ని । ద ని సా |
ని ర్వా - - - ణ ని జ సు ఖ ప్ర దా - యి నీం |

దా గ రీ రి స రి గ రి స । స సా రి స । స ని ద నీ |
ని త్య క ళ్యా- - - ణీ ం - కా త్యా- - - య నీం |

సాం పా మా ప ద । ప రి స ని సా । రీ రీ | సా స ని ని ద
శ ర్వా ణీం మ ధు ప వి జ - య వే ణీం | స ద్గు - రు -

పా మ ప మ గ గా । గ గ రీ స ని సా । రి స రి స ||
గు హ - జ - న నీ ౯ - ని - రం - జ నీ ం ||

మ॥సా॥ గా గ రి రి స రి స ని ధ నీ స రీ , । గా మా పా దా ।
గ ర్వి త భ ం డా - సు ర భం జ నీం కా మా క ర్ష

నీ స ద రి స నీ | దా గ రీ గ స రి రిస ని ని ద రి రీ ।
ణ్యా ది ర ం జ నీం | ని ర్వి శే ష చై - త - న్యరూ - పి ణీ

సా స ని ద ప ప మ । ద ప మ గా ప మ రి || కమ ||
ము ర్వీ - త - త్వా - ది - స్వ రూ పి ణీ ం || ||

# 71

## శంకరాభరణం రూపకతాళం

29 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ శ్రీకమలాంబికయా కటాక్షితోఽహం ।
సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మాస్మి ॥

అ॥ పాకశాసనాది సకల దేవతా సేవితయా ।
పంకజాసనాది పంచకృత్య కృద్భావితయా ।
శోకహర చతుర పదయా మూకముఖ్య వాక్ప్రదయా ।
కోకనద విజయ పదయా । గురుగుహ తత్త్వైక పదయా ॥శ్రీ॥

చ॥ అనంగ కుసుమాద్యష్ట శక్త్యాకారయా ।
అరుణ వర్ణ సంక్షోభణ చక్రాకారయా ।
అనంత కోట్యండ నాయక శంకర నాయికయా ।

అష్టవర్గాత్మక గుప్తతరయా, పరయా।
అనంగాద్యుపాసితయా। అష్టదళాబ్జ స్థితయా।
ధనుర్బాణ ధర కరయా। దయా సుధాసాగరయా
॥శ్రీ కమలాంబికయా॥

వ్యా॥ తృతీయా విభక్తి. తృతీయావరణము. సర్వ సంక్షోభణ చక్రమున నివసించు కమలాంబికచేత అనుగ్రహించ బడి, సత్, చిత్ ఆనంద పరి పూర్ణత్వముగల బ్రహ్మను అయితిని. ఇంద్రాది సమస్త దేవతలచేత సేవింప బడుచున్న, బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను, పంచభూతములు. "ఏకో విష్ణుర్మహద్భూతం పృథక్ భూతాన్యనేకశః" అనినట్లు, ఈభూతములు చేయుపనియందు భావించ బడుచున్న, దుఃఖమును పోగొట్టుటలో నిపుణమైన పదములు గల, మూగవారికి ముఖ్యముగా వాక్కు నొసగుచున్న. కలువల సొగసును మించిన పాదములుగల, కుమారస్వామిచే తెలియబడిన "తత్" శబ్ద రూపమైన తత్, త్వం, అసి అను మూడు పదములుగల (మరియు) భూర్భువస్సువరాది, త్రిపదములు గల, కమలాంబికచే కరుణించ బడితిని. మూడవ ఆవరణము అష్టదళపద్మము. అందు అనంగాది అష్ట దేవతామూర్తులతో కూడినది. అవి అనంగ కుసుమ, అనంగ మేఖల, అనంగ మదన, అనంగ మదనాతుర, అనంగ రేఖ, అనంగ వేగిని, అనంగ కుశ, అనంగ మాలిని యనునవి. అందుకే అనంగ కుసుమాద్యష్ట శక్త్యాకారయా= అనంగ కుసుమాది ఎనిమిది శక్తుల ఆకారము గలదానిచే, ఎట్టిదైన సంక్షోభణ చక్ర స్వరూపిణిచే, లెక్క పెట్టలేని అనేక కోటానకోట్లు బ్రహ్మాండములకు నాయకుడైన శంకర నాయికచే, అష్టవర్గాత్మక = అ, క, చ, ట, త, ప, య, శ అను ఎనిమిది వర్గములుగా విభజించ బడిన అకారము మొదలు, క్షకారము వరకు గల రహస్యాక్షర రూపిణిచే, పరదేవతారూపిణిచే, అనంగ దేవతలచే నుపాసించబడు నామెచే, ఎనిమిది దళములు గల పద్మ మందున్న నామెచే. ధనుస్సు, బాణము ధరించిన చేతులుగల, దయ

అనే అమృత సముద్ర స్వరూపిణియైన కమలాంబిక చేత అనుగ్రహించ బడితినని, మూడవ ఆవరణ, అందలి అష్టశక్తులు, సంక్షోభణ చక్ర రూప విశేషణములతో వర్ణించిరి.

## రెండు కళల చౌకం

ప॥ రీ - గ మ గ మ గ రి । సా , రి - స ని స ధ స నీ । సా గ రి -
శ్రీ క మ లాం - - - - బి - క - యా క టా -

గ మ ద పా , । రీ । సా సా | ద - ద పా మ । గా మ ప -
- క్షి తో - హం - స | చ్చిదా - నం ద ప రి -

మ గమరి రి గసా । స నిసధ - నిసా ధ నిసని । నిధ సా । సాసా ||
పూ - - - ర్ణ - - బ్ర - - - - - - హ్మ - - - - - స్మి - - ||

అ॥ పా - మ గ మ గ । రి గ మ ప - మ గ గ రి స ని ।
పా క శా - స నా - - - ది స క - ల -

సా రి రి గ స ని । సా । రి గ మా | పా - ని ద పా మ ।
దే వ తా - - - సే వి త యా | పం క - జా స

గ మ - దప గ మ రి । గా - మ గ మా । పా - ద ని సా |
నా - ది - పం చ కృ త్య కృ - ద్భా వి త యా |

మ॥సా॥ సా గ రి - గ స ని స ప ద నీ । సా స స - ని ద
శో క హ ర చ తు ర ప ద యా మూ క ము - ఖ్య

ప మ ప ద పా । సా రి గ - మ ప ద ని స రి సా ।
వా క్ప్ర ద యా కో క న ద వి జ య ప ద యా

స ద ప మ - గ రి స ని ధ ధ ని స ||
గు రు గు హ త త్రై - క ప ద యా - ||

చ॥ స ప - ప మ గ రి । మ ప మా - మా మ గ గ రి ।
అ న ం గ కు సు మా - - ద్య - - - ష్ట

స ని - సా సా । మ గ - మ ప గ మ రి గా , |
శ - క్త్యై - కా - ర - యా - - -

స ని - స పా మ । మగారి - స రీ , సా । ని స - గరి గ మా ।
అ రు ణ వ ర్ణ స ం - క్షో - - భ ణ చ - క్రా -

మ ప - మ ద పా | స మ - గ మ పా । పాని ద - నిప మప ।
కా - - ర యా | అ నం - త కో - ట్యం - డ నా -

ద ని - సా సా రి గ । రీ - సా ని ద నీ | పా - రి సా , । నిప -
య క శం క ర - నా యి క - యా | అ ష్ట వ ర్గా -

ద ని సా । స ద - ప మ పా । పా - గా మ ప గ మ రి గ ‖
త్మ క గు - ప్త త ర యా - ప ర - యా - - - ‖

మ॥సా॥ స మాగ - గ మ పా ద ని సా । సా రి గ - రీ సా నిద నీ |
అ నంగా - ద్యష్ట సి త యా అ ష్ట ద ళా బ్జ స్థి త యా |

రి సా స - ని ద ప మ ప డ పా ।
ధ ను ర్బా - ణ ధ ర క ర యా

రి సా ప - పా పా మ గ రి స ‖
ద యాసు - ధా సా గ ర యా ‖

# 72

## కాంభోజి రాగం అటతాళం

28వ మే. జన్యం.　　స రి గ మ ప ద స
　　స ని ద ప మ గ రి స

ప॥ కమలాంబికాయై, కనకాంశుకాయై ।
కర్పూర వీటికాయై, నమ స్తే నమ స్తే ॥

అ॥ కమలా కాంతానుజాయై , కామేశ్వర్యై, అజాయై ।
హిమగిరి తనుజాయై । హ్రీంకార పూజ్యాయై ।
కమలానగర విహారిణ్యై । ఖల సమూహ సంహారిణ్యై ।
కమనీయ రత్నహారిణ్యై । కలికల్మష పరిహారిణ్యై ॥కమ॥

చ॥ సకల సౌభాగ్య దాయకాంభోజ చరణాయై ।
సంక్షోభిణ్యాది శక్తియుత చతుర్థావరణాయై ।
ప్రకట చతుర్దశ భువన భరణాయై ।
ప్రబల గురుగుహ సంప్రదాయాంతఃకరణాయై ।
అకలంక రూప వర్ణాయై, అపర్ణాయై, సుపర్ణాయై ।
సుకర ధృత చాప బాణాయై । శోభన కర మను కోణాయై ।
సకుంకుమాది లేపనాయై । చరాచరాది కల్పనాయై ।
చికుర విజిత నీల ఘనాయై । చిదానంద పూర్ణ ఘనాయై ॥కమ॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. చతుర్థావరణమును తెలియజేయు కీర్తనము. కమలాంబికా దేవికొఱకు, బంగారు వికార వస్త్రమును ధరించిన, పచ్చకర్పూరాది సుగంధ ద్రవ్యములతో గూడిన తాంబూలమును వేసుకొనిన తల్లికొఱకు, నమస్కరించుచున్నాను. కమలాకాంతుడు = లక్ష్మీపతికి శ్రీమన్నారాయణుని సోదరియైన, కోర్కెలకు నాయకురాలైన, "హ్రీం" కారముచే పూజింపబడుచున్న,

తిరువారూరు నందు విహరించుచున్న, దుష్టజన సమూహమును సంహరించుచున్న, అందమైన రత్నములతో గూడిన హారములు ధరించియున్న కలి, మాయ, అజ్ఞానము వలన కలుగు కల్మషమును, పాపమును పోగొట్టు కమలాంబికకై నిరంతరము నమస్కారము.

చతుర్థావరణము, 14 కోణములు గల చక్రము. దీనిని "సర్వ సౌభాగ్యదాయక చక్రమందురు. చతుర్దశ భువన స్వరూపిణి, అతల, వితల,సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములు అధోలోక ములు 7. భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోకములు ఊర్ధ్వలోకములు 7. 14 లోకముల స్వరూపిణి, ఈ 14 కోణములయందు, సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసమ్మోహిని, సర్వ స్తంభిణి, సర్వ జృంభిణి, సర్వవశంకరి, సర్వరంజను, సర్వోన్మాదిని సర్వార్థసాధిని, సర్వసంపత్తిపూరిణి, సర్వమంత్రమయి, సర్వద్వంద్వక్షయకరి అను పేర్లతోనున్న పరాంబికా రూపమును చరణమున వర్ణించిరి. సర్వ సౌభాగ్యముల నొసగు పద్మములవంటి పాదములుగల, ఇందు "సౌభాగ్యదాయకాంభోజచరణాయై" అనుచు కాంభోజి రాగ నామ మును కూర్చిరి. సర్వ సంక్షోభిణి మొదలైన 14 శక్తులతో కూడిన నాల్గవ ఆవరణ రూపిణియై, 14 భువనములను భరించుచున్న, గొప్ప దైన గురుగుహ సంప్రదాయమే అంతఃకరణముగా నొప్పుచున్న, కళంకములేని రూపవర్ణముగల, అపర్ణ, సుపర్ణ యను నామముగల, ధనువు, బాణము ధరించిన చేతులుగల, మంగళప్రదమగు, "మనుకోణాయై" చతుర్దశ మనువులు గనుక 14 కోణములు. వేద పరిభాషయందు "మను" శబ్దమునకు 14 సంఖ్యగాన, 14 కోణములు గల, కుంకుమాదులచే పూయబడిన, కదలునవి, కదలనివియగు, జంతు, వృక్ష జీవ రాసులను అనగా, వృక్షపర్వతాదులు అచలములు, జంతు పక్షిజాతులు చరములు. వీనితో గూడిన ఈ ప్రపంచమును

కల్పించినది యైన, నల్లని మేఘముతో సమానమైన నడుముగల, చిదానందముచే పరిపూర్ణమై, గొప్పదైన, దృఢమైన, కమలాంబిక కొఱకు నమస్కారమని చతుర్థావరణమును కీర్తించిరి.

ఒక కళ చౌకం

ప॥ గా ప మ పా , । ద ని దా , । ద మ గ గ । ప ద స్సా | దా ని ద
క మ - లా ం బి - కా యై - - - - - - - - - | క న -

దా ప మ పా । పా ద స్స పా ద మ మ గ । మరిగరి । పమగగ |
- కాం - శు - - కా - - యై - - - - - - - - - |

సా ని ని ధా దప । ధ సా స రి గ । రి మ । గ రి |
క ర్పూ- - -- ర వీ టి కా - - - యై - న |

రి ప మగ మగ మరి సరి । మగ రిస నిప ధ స । సా । సా ||
మ- - - - ద స్తే- -- -- న - -మ - - స్తే- - - ||

అ॥ స । ప మ గా । రి మ గప స రిప మ గా । మా । పా |
- క మ లా కాం - - తా - - - ను జా యై |

ప మ గ పా । దా ద స్స ని పా । ద ని దద । సా | స రి రి
- కా - మే శ్వ రై - - అ జా - - - యై | - హి మ

మగ మరి । రిస రిగా రి సా । ని నిదా । ప మ పద |
గి - - - రి- - - త నూ జా - - యై - - - |

పా , ని ని దద । ప మ పా దమ । మ గ మరి । గ రి గస ||
హ్రీం కా- - - - ర పూ - - జ్యా - - - యై - -- ||

మ॥సా॥ ప మ పా స రి మ గ మా । పా దా ని ని ద పా ద ।
క మ లా న గ ర వి హా రి ణ్యై ఖ ల స మూ హ

సా̇ ప ద । సా̇ రి̇ | గ̇ గ̇ రి̇ స̇ రి̇ స̇ ని ని । ద ప ద రి̇
సం హా - రి ణ్యై | క మ నీ య ర త్న హా - రి - ణ్యై -

స̇ ని ద ద ప మ । గ రి గ స । పా స రి ‖ కమ ‖
క లి క - ల్మ ష ప రి హా - రి ణ్యై - ‖

చ॥ , స రి గా । గ రి గ మ గా , । రీ । రి సరిగ | రి గ స
స క ల సౌ - - - భా గ్య దా --- | య కాం

ని̣ ని̣ధా̣ । ని̣ప̣ ధ̣ స సా । రి గరీ । గ మాంగ | రి సా ని̣ ।
భో - - -- జ చ ర ణా - - యై - - | స ం క్షో

దా పా పద । మ గ । గ మ | ప ద పా దమ మగ మరి ।
భి ణ్యా - - ది శ - క్తి | యు - త చ - తు - - -

స రిసా మాంమగగా । మపమా । పా | ప ప ద నినిదా । ద ప
ర్గా - - వ ర - - ణా - - యై | - ప్ర క ట - - - చ

ప దపా పద । పమ మగ । పా | స̇ నీదా । పమగగ పదస̇పదా |
తు - - -- ర్ద - - - శ | భు వ న భ - - - ర - - - - |

రీ̇ । సా̇ | సా̇ రి̇ స̇ రి̇ గా̇ । గ̇రి̇గ̇మ̇ గా̇ మ̇రి̇ । రి̇ గ̇సా̇ । స̇నిదా |
ణా యై | - ప్ర - బ ల గు - - - రు గు - హ - - సం - |

రి̇ సా̇ పా । ప మ పా దస̇పా దమ । మ గ మరి । గ రి గస |
ప్ర దాయాం తః - - క - - - - ణా - - - యై - - - |

రి స ని̣ ధ̣ । ఫా̣ ధ̣ ధ̣ని̣ప̣ధ̣ । సా । సా | స పా ద మమగ ।
అ క ళం క రూ ప వ --- ర్ణా యై | అ ప ర్ణా - - -

గ నిదా ప దమా గగ । పా । పా | ప ద స రి గ ।
మై - - సు - ప -- ణ్ణా మై | శు క ర ధృ త

గ రి గమ గ స । ని నిదా । ప మపద | సా ని ద మ ।
చా- -- ప బా- ణా - - మై - -- | శో భ న క

పామ పద స ద ప ద మ । మ గ మ రి । రి గ సా ||
ర మ -ను- కో- - - ణా - - - మై- - ||

మ॥సా॥ స రీ మ గా మ పా మ । దా పా ద నీ ద సా । నిదా గ ।
స కుంకు మా ది లే ప నా మై చ రా చ రా ది క ల్ప

రీ సా | రి గ మ రి గ స నీ ద రి । నీ దా రి సా నిద ప।
నా మై | చి కు ర వి జ త నీ ల ఘ నా మై చి దా నం ద

సా ని ద । పా మ ప || కమ ||
పూర్ణ ఘ నా మై - ||

# 73

## భైరవి రాగం మిశ్రజంపె తాళం

20 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ శ్రీకమలాంబికాయాః పరం నహి రేరే చిత్త ।
క్షిత్యాది శివాంత తత్వ స్వరూపిణ్యాః ॥శ్రీ॥

అ॥ శ్రీకంఠ విష్ణు విరించ్యాది జనయిత్ర్యాః ।
శివాత్మక విశ్వకర్త్ర్యాః । కారయిత్ర్యాః ॥

మ॥సా॥ శ్రీకర బహిర్దశార చక్రస్థిత్యాస్సేవిత భైరవీ,
భారత్యాః ॥శ్రీ॥

చ॥ నాదమయ సూక్ష్మరూప సర్వ సిద్ధిప్రదాది
దశ శక్త్యారాధిత మూర్తేః ।
శ్రోత్రాది దశ కరణాత్మక కుళ కౌళికాది
బహువిధోపాసిత కీర్తేః ।
అ । భేద నిత్య శుద్ధ బుద్ధ ముక్త సచ్చిదానంద
పరమాద్వైత స్ఫూర్తేః ।
ఆది మధ్యాంత రహితాప్రమేయ గురుగుహ మోదిత
సర్వార్థ సాధక పూర్తేః ॥

మ॥సా॥ మూలాది నవాధార వ్యావృత్త దశ ధ్వనిభేదజ్ఞ
యోగిబృంద సురక్షిణ్యాః ।
అనాది మాయావిద్యాకార్యకారణ వినోద హారణ
ప్రదుత్తర కటాక్షవీక్షిణ్యాః ॥శ్రీ॥

వ్యా॥ పంచమీ విభక్తి. పంచమావరణ సంబంధితమైన కీర్తనము. ఓ చిత్తమా! కమలాంబికకన్న వేరు వస్తువు లేదు. భూమి మొదలు శివుని వరకుగల 36 తత్వముల స్వరూపిణియైన, శివ, విష్ణు, బ్రహ్మాదులకు తల్లియైన, మంగళప్రదమైన విశ్వమును సృజియించునది, చేయించునది యైన, లక్ష్మీప్రదమైన బహిర్దశారమను ఐదవ ఆవరణముతో గూడిన చక్రమునగల, దుర్గా, లక్ష్మీ సరస్వతులచే సేవింపబడు కమలాంబిక కన్న వేరులేదు. బహిర్దశారము, పదిమంది దేవతలు, దశాకృతులతో జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములే, సర్వసిద్ధిప్రదాది దేవతలతో గూడిన చక్రము, ఆదశ శక్తులు, సర్వసిద్ధిప్రదా, సర్వసంపత్ప్రదా, సర్వప్రియంకరీ, సర్వమంగళకరీ, సర్వకామప్రదా, సర్వదుఃఖవిమోచనీ, సర్వమృత్యుప్రశమనీ, సర్వవిఘ్ననివారిణీ, సర్వాంగసుందరీ, సర్వసౌభాగ్యదాయినీ, నామములతో ప్రకాశించువారు. ఈవిషయమును చరణమున నాదమయ, సూక్ష్మరూప, సర్వసిద్ధిప్రదాది 10 శక్తులచే నారాధింప బడుచున్న, దశ ఇంద్రియాదు

లచే కుళ, కాళికాదులచే ఉపాసించబడుచూ కీర్తిగన్న, భేదభావము లేక, శాశ్వత, పరిశుద్ధ బుద్ధియందు ఏసంబంధములేనిదై, సత్, చిత్, ఆనందముతో గూడి ఏకస్వరూపిణియైన, ఆది, మధ్య, అంతములు లేని పరిపూర్ణ స్వరూపిణియై, గురుగుహమూర్తికి ఆనందము, సర్వకోర్కెలను సిద్ధింప జేయుచు, మూలస్థానము నుండి తొమ్మిది ఆధారములు. (ద్వారములు) గలిగి, పదిరకముల ధ్వని భేదములద్వారా యోగము చేత తెలుసుకొనుచున్న యోగీశ్వరులను సంరక్షణ చేయుచున్న, మొదటినుంచి మాయ, అజ్ఞానములచే ఏర్పడిన కార్యమును, దాని కాధారమైన కారణములచే వినోదించుచు, హరించుచు, సాక్షీ మాత్రయై చూచుచున్న కమలాంబికకన్న వేరులేదు. అని సాకార, నిరాకార, స్వరూపిణి, సర్వాభీష్టప్రదాయిని, సర్వము ఆమెయేనని సిద్ధాంతీకరించిరి. మరియు ఇందు దశప్రాణముల గూర్చి తెల్పిరి. దశప్రాణములు, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనునవి పంచప్రాణములును, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ మనునవి ఉపప్రాణములు. ఈ పదియు ఆవరణ దేవతలుగా దేహమందు గమనించదగినవి.

## రెండు కళల చౌకం

ప॥ సా , ని - సీ   ని ని ద - దా పా - పా ద ని ద   ప - దపదా -
- - శ్రీ - - క - - మ - - లా ం   బా - - యాః - - - - -

పా మ గ - రీ ; । గా ప మ । పా పా ద ని ‖ (2) సా , ని
- - ప - ర ం - - - న హి - - రే రే చి త్త ‖ - శ్రీ -

...... । గా ప మ । పా , ద మ గ రి స । గ రి స్రీ - స ని స గ
...... । న హి - - రే - రే - చి త్త । క్షి - - త్యా - - -

రి గ మ పా - ద ని స్ప నీ - దా ప ని । దా మ ప । మ ప
ది శి - వాం త త - - త్వ స్వ - రూ - - పి -

ప ద నీ | సా , ని నీ ని ద ద ప పా ద ని ద ప |
ణ్యా - - | శ్రీ - క మ - లాం బా - - - - |

ప ద ప మ గ రి । సా ప మ । గ రి సా ||
యాః - ప ర ం - న హి - రే - రే ||

అ॥ మ ప ద ప ద ద ప మ గ రి రి గ మా గ రి మ గ రి గ సా ।
శ్రీ - క ం - - ర వి - ష్ణు వి - రిం - - చా - - - ది

రి గ । మా పా | మ మా ప ద నీ స రి స రి స ని ద ప
జ న యి త్యాః | శి వా త్మ క వి శ్వ - క - - - ర్త్ర్యాః

ద మ పా । ద ని । స ని సా , స | నీ ని ని స రి గ మ రి గ రి
- - శా - ర యి - త్యాః - | శ్రీ క ర బ హి ర్ద శా - - ర

సా ని ప ప ద మ ప మ గ రి స నీ ద ప । ప గా రి ।
చ క్ర - స్థి - త్యా - స్సే - వి త భై ర వీ - భా ర్గ

సా రి ని ద మ ద ని ||
వీ భా - ర - త్యా - || శ్రీ ||

చ॥ నీ ద ద ని ని ద పా ద మ ప మ ప ని ద ప మ ప మ గ
నా ద - మ - య సూ క్ష్మ - రూ - - - - ప స - - -

రి గ మ । రి గ స రి ని స | రి గ మ ప ప ద ని ద ప ని ద
ర్వ సి - - - ద్ధి - - ప్ర | దా - - ది ద శ శ - - న్యా -

ద మా ప గా రి గ । మ ప । దా ద ప ద మ |
- - రా - ధి త మూ - ర్తే - - - - |

(2) ... మ ప । దా పా | మ ప సా స రి గ మ గ రిగా మా, |
.. మూ- _ర్తే గ్రో | గ్రా- - ది ద శ క ర -ణా - |

ప మ । ని ద పా । మగ రిమ రిగ సా | పా రిమ ప ద నీ
త్మ క కు - ళ కా- -- -- ళి | కా -ది బ - హు

ద పా ని ద మా ప ద । నీ , స̇ । నీ , స̇ ద ని | నిసా̇, స̇పాప
వి ధో - - పా సిత । కీ - ర్తే - - ర | భే- ద నిత్య

ద ప ద ద ని ద ని ని స̇ ని స̇ గ̇ । రి̇ స̇ రి̇ స̇ । ని ద ప ద |
శు - - ద్ధ బు - - ద్ధ ము- - - - క్త - స - - చ్చిదా - |

నిస̇ నిరి̇ స̇రి̇ ని ద ప మ గ రీ గ రి గస - గ రి గమ పద ।
నం - - - - ద మయ ప - ర మా- - - ద్వై - - - - త

ద ని । స̇ ద ని సా̇ | రీ̇ రి̇ సా̇ రీ̇ స̇ రీ̇ గ̇ మ̇ గ̇గ̇ రి̇ని స̇।
- స్వా - - ర్తే - | రాది మ ధ్యాంత ర హి - తా- - ప్రమే

స̇ రి̇ । ని ద ని స̇ | రి̇ గ̇ మ̇రి̇ గ̇గ̇ రి̇ సా̇ ని ని దప ద ని
- య గు రు గు హ | మో- - - ది - త స ర్వా - -- - ర్ధ

సా̇, ని దప । మ మగా । రీ రిగ సాస రి || మ॥సా॥ ని̣ ధ̣ ని̣
సా - ధక పూ - - ర్తే - - - మూ- || లాది న

సా ధా̣ పా̣ గా రీ గ మ పా ద ని పా ద మ మ గా రి ।
వా ధా ర వ్యా వృ త్తి ద శ ధ్వ ని భే ద - జ్ఞ యో గి

రీ ని̣ స । , గ రి స మ ప మ గ | రీ ని̣ రీ , సా ని̣ధ̣ మ
బృం ద సం ర - క్ష - ణ్యా - ర | నా దిమా యా విద్యా-

గా రి మా గ రి ని రీ̇ స̇ ని ద ని ప ద । ని స̇ రి̇ ని ।
కా ర్య కా ర ణ వి నో ద హార ణ ప్ర దు త్త ర క టా

, గ రి స ని̣ ధ̣ ని̣ || క్షి ||
క్ష వీ - క్ష ణ్యా - ||

# 74

## పున్నాగవరాళి రాగం రూపక తాళము

8 వ మే. జన్యము. నిసరిగమపదని
నిదపమగరిసనిస

ప॥ కమలాంబికాయాః స్తవభక్తోఽహం ।
శంకర్యాః, శ్రీకర్యాః, సంగీత రసికాయాః ॥

అ॥ సుమశరేక్షు కోదండ పాశాంకుశ పాణ్యాః ।
అతిమధుర తర వాణ్యాః శర్వాణ్యాః కళ్యాణ్యాః ।

మ॥సా॥ రమణీయ పున్నాగ వరాళి విజిత వేణ్యాః ॥కమ॥

చ॥ దశకళాత్మక వహ్ని స్వరూప ప్రకాశాంతర్దశార
సర్వరక్షాకర చక్రేశ్వర్యాః ।
త్రిదశాది నుత కచవర్గ ద్వయ సర్వజ్ఞాది దశశక్తి
సమేత మాలినీ చక్రేశ్వర్యాః ।
త్రిదశ వింశద్వర్ణ గర్భిణీ కుండలిన్యాః ।
దశముద్రా సమారాధిత కౌళిన్యాః ।
దశరథాది నుత గురుగుహ జనక శివ బోధిన్యాః ।
దశకరణావృత్తి మరీచి నిగర్భ యోగిన్యాః ॥కమ॥

వ్యా॥ షష్ఠీవిభక్తి. ఆరవ ఆవరణము. కమలాంబిక యొక్క భక్తుడను. సుఖములను, మంగళములను కలుగజేయుచు, సంగీతమున అనురాగముగల శ్రీదేవికి భక్తుడను. చేతులయందు, పుష్పము, శరము, చెఱకు, కోదండము, పాశము, అంకుశమును ధరించిన, మిక్కిలి మాధుర్యముతో గూడిన వాక్కులుగల శంకరునిభార్య, కళ్యాణమూర్తియైన, అందమైన, శ్రేష్ఠమైన సర్పము, తుమ్మెదలను జయించిన జడగల, అనగా నల్లగా నిగనిగ మెఱయుచు, కోమలము

మృదువునైన జడగలదియైన యనుచు, పున్నాగవరాళి రాగమును గూర్చిరి. ఇంతవరకు హస్తములు, వాక్కు, రూపమును, జడను సాకార రూపమును వర్ణించిరి. చరణమందు, అగ్నిరూపమై, దశ కళలతో గూడి, అంతర్దశార మను ఆరవ ఆవరణ విషయమును ప్రతిపాదించిరి. పున్నాగము=నల్లత్రాచు. పరశ్రేష్ఠమైన అళి=తుమ్మెదల సమూహము. (పున్నాగము= సురపొన్న, ఇంద్రుని ఏనుగు, పురుషశ్రేష్ఠుడు). అంతర్దశార చక్రమును సర్వరక్షాకర చక్రమని యందురు. ఇందు రకారం అగ్నిబీజము. ప్రకృతిశేష. అగ్నికి పది కళలు గలవు. ధూమ్రా, ఉష్మా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ మొదలైనవి. ఇందు, సర్వజ్ఞ, సర్వశక్తి, సర్వైశ్వర్య ప్రదాయిని, సర్వజ్ఞానమయి, సర్వాధార స్వరూపిణి, సర్వేప్సిత ఫలప్రద మొదలగు పేర్లతో కూడిన గర్భ యోగినులు గలరు. ఈ ఆరవ చక్రేశ్వరి త్రిపుర మాలిని. రౌద్రరసముతో కూడినది. దేవతలచే నుతిగన్న, కవర్గ, చవర్గ లచే సర్వజ్ఞాది దేవతలచే కూడిన మాలినీ చక్రేశ్వరియై, త్రిదశ, వింశతి. 13, 20 వర్ణములు గల గర్భిణీ, కుండలిరూపిణియై, 10 ముద్రలచే నారాధింపబడుచున్న కాళీస్వరూపిణియైన, దశరథాదులచే నుతించబడిన, గురుగుహుని తండ్రియైన శివునిచే బోధించబడిన, 10 కరణ ఆవృత్తులతో, మరీచినులను గర్భయోగినులతో గూడిన కమలాంబిక యొక్క భక్తుడను అని వర్ణించిరి.

రెండు కళల చౌకం

ప॥ గమ - గా , గ రి । రీ - సా , గ రీ , స । ని ని - నీ స రి గా
కమ లాం బి - కా యా - - - స్త వ - భ - క్తో

రిరి । గ మగా - గా స రి ‖ గాప మ - ప రిగా గరిరీ । రీ -
-- హం - - - (శ్రీ) - ‖ క మ- లాం - బి -- కా

సా , గ రీ , స । ని ని - స రిగా గ రిరీ । (1) గ మగా । రీసా॥
యా - - - స్త వ భ - - క్షో - - హం - - -

(2) గ మ గా - గారి స ॥ రీ - గా గ రిరీ । దా - పా , మ ।
హం - - శం క రా్య (శ్రీ) - - క రా్య స్సం

మగపా - పా దప మగ మప ॥ మా - పగ రి ని స రి ||
గీ - - - - తర - సి - కా - - యా - (శ్రీ) -

అ॥ మమ - మగారి । స రిగా - గారిస । స రిగా - రి సగరి రి ని!
సుమ శ రేఖు కో - - దం-డ పా- - శాం - - కుశ

స రి - గా మ మ ‖ గ గ - మ ప మదప । గ రి - గా ప మ
పా- ణ్యాః- అ ‖ తి మ ధు - రతర వా- ణ్యాః- -

పదాప । గ రి - గా పమ నిదపద । ప మగా - గ రిసా ।
- శ - ర్వా- ణ్యాః- - క- - - ళా్య - - ణ్యాః- -

మ॥సా॥ స ని గా - గ రి రి మ ప గ రి స ।
ర మ ణీ య పు - - న్యా - గ వ

సా ద ప - ద మ ప మ గ రి స రి ‖ కమ ‖
రా ళి వి జి త వే - ణ్యాః- (శ్రీ) - ‖

చ॥ ని స - రి సా , । రి స - నీ నీ । స రి - రి గా మ ।
ద శ క ళా త్మ క వ హ్ని స్వ రూ - ప ప్ర

గా , రి - రీ సా | స మ - మమసరి । గ రి - రీరిగ స రీని ।
కా - శాంత | ద్ర శా - రస- ర్వ ర - - - ఘా - -

సరి - గాగమ - గారిగ । రీ - సా సా ‖ రీ - సా , ని । సగ -
కర చ - - క్రే - - శ్వ రా్యః- ‖ శ్వ రా్య స్త్రి దశా

గరిమమ । మదపమ - గాగా | మాఁగ మ- గ రి సా। ప మగా
-దినుత శ -చ- వర్గ | ద్వ - - య - స ర్వ - -

- మా , మ । దమ - మగ గ మప । మ గ - మపమా ని॒ని॒ ।
జ్ఞా ది దశ శ - త్రిస - మే - త-మా -లి

ని॒ - సరి గ మ గా । గ రి రీ - గ మ గా గా , స । ద ప -
నీ చ - కే - - శ్వ - - రా్య - - - స్త్రీ ద శ

ప మ పా పా ‖ సా - ససాద । పాదద - పమ గారి । గాపమ -
- వి ం శ ‖ ద్వ ర్ణగర్భి । ణీ -- కుం - డ లి - -

పా , ప । గ మ - మా మా । స మ - మా మ గ మ ని ।
న్యాః - ద శ ము ద్రా స మా - రా - - -

ద ప - మ గ మ ప గా । రీ - రీ సా ‖
ధి త కా - - - ళి న్యాః - - ‖

మ॥సా॥ ని॒ స ని॒ గ - గ రి మ మ మ గ రి స । ద ద ప ద -
ద శ ర థా - ది ను త గు రు గు హ జ న క శి

ప మ ప గ మ పా ప । మగపమ - ద పా గ మ గా రి
వ బో - ధి - న్యాః - దశ క ర ణ వృ త్తి మ రీ చి |

ని॒ గా రి - మా గా రి ని॒ స రి ‖ కమ ‖
ని గ ర్భ యో గి న్యాః- శ్రీ - ‖

# 75

## శహన రాగం త్రిపుట తాళము

28వ మే. జన్యము — స రి గ మ ప మ దా ని స
స ని దా ప మ గా మ రి గ రి స

ప॥ శ్రీకమలాంబికాయాం । భక్తిం కరోమి ।
శ్రితకల్ప వాటికాయాం । చండికాయాం, జగదంబికాయాం ॥

అ॥ రాకా చంద్ర వదనాయాం । రాజీవ నయనాయాం !
పాకారి నుత చరణాయాం । ఆకాశాది కిరణాయాం ।
హ్రీంకార విపిన హరిణ్యాం । హ్రీంకార సుశరీరిణ్యాం ।
హ్రీంకార తరు మంజర్యాం । హ్రీంకారేశ్వర్యాం,
గౌర్యాం ॥ శ్రీ ॥

చ॥ శరీర త్రయ విలక్షణ సుఖతర స్వాత్మాను భోగిన్యాం ।
విరించి హరీశాన హరిహయ వేదిత రహస్య యోగిన్యాం ।
పరాది వాగ్దేవతా రూప వశిన్యాం, విభాగిన్యాం ।
చరాత్మక సర్వరోగహర నిరామయ రాజయోగిన్యాం ॥

మ॥సా॥ కరధృత వీణావాదిన్యాం । కమలానగర వినోదిన్యాం ।
సురవర మునిజన మోదిన్యాం ।గురుగుహ వర
ప్రసాదిన్యాం ।శ్రీ॥

వ్యా॥ సప్తమీ విభక్తి. సప్తమావరణము. శ్రీకమలాంబిక యందు భక్తిని చేయుచున్నాను. కలిగియున్నాను. ఆశ్రయించిన వారికి కల్పతరువైనటువంటి చండిక, జగమునకు తల్లియైన, పూర్ణ చంద్రుని వంటి ముఖముగల, పద్మములవంటి కన్నులుగల, ఇంద్రునిచే నుతింపబడు పాదములుగల, ఆకాశము మొదలగు పంచభూతముల కాంతులుగల, హ్రీంకారమను అరణ్యమున సంచరించు లేడివంటిది

యైన, హ్రీంకారమే శరీరముగా గల, హ్రీంకారమను వృక్షమున పూసిన పుష్పమైన హ్రీంకార మంత్ర బీజమునకు నాయికయైన గౌరి యందు భక్తిని కలిగి యున్నాను. చరణమున, సప్తమావరణ చక్రమును, సర్వరోగహర చక్రమందురు. ఇందు రహస్యయోగినీ గణములు, అష్టకోణములు, అష్టదేవతలు గలరు. స్థూల, సూక్ష్మ, కారణ దేహములకు విలక్షణమైన, సుఖములతో శివ, ఇంద్రాదులు కూడి, తన ఆత్మయందు అనుభూతితో సుఖించుచున్న, బ్రహ్మ, విష్ణు, తెలుసుకొనిన రహస్య యోగినీ గణములతో కూడిన,పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ, రూప విభాగముల యందు నివసించినది. కదలు స్వభావముగల (మార్పుచెందు) జగత్తునందలి సర్వరోగములను హరించునది. తామరాకుపై నీటి బిందువువలె అంటీ అంటని రాజ యోగిని యందు, వీణను ధరించి వాదనముచేయుచు, కమలాపుర మున వినోదించుచు, గురుగుహునకు వరములొసగుచు అనుగ్రహించు కమలాంబయందు భక్తిని చేయుచున్నాను. అష్టకోణముల యందు, నళిని, కామేశ్వరి, మోదిని, విమల, అరుణ, జయిని, కౌళిని, సర్వేశ్వరి, నామములతో వాగ్దేవతలై హాస్య రసముతో కూడిన సప్తమ చక్రేశ్వరిని వర్ణించిరి. "హ్రీం" కారము భువనేశ్వరీ మంత్ర బీజము.

ఒక కళ చౌకం

పll రీ రి గ - మపమా - గాగమ । రీ గరి - సా - రిరిస్ । స ని
శ్రీ - - క - మ లాం - - బి - కా - - - యాం

సా - సా - స ధ | రీ రి - రి గ - మప | (2) మ పరిగ...
- - - భ | క్తింక రో - - ఖి | శ్రీ --- ...

రి । రి గ - మ ప | ని ద ప - దపమా - గ గ । గమరి గరీ -
క రో - - మి | శ్రి త క --ల్ప వా - టి -కా- -

పా - దానిదపాదప । మ గ మ - రీ గ రి సా - సా ని̣ స |
యాం చ ం - - - - డి కా - యాం - - జ గ -

రి గ మ ప ద మ - గ మ గ రి - గ రి స ని̣ ||
ద ం - - బి - కా - - యాం - - - - ||

అ॥ పా , - మపరీ - గామప । మగమ - రీ గరి - సా |
రా కా-- చం- - ద్రవద నా-- యాం |

రి సని̣సగరి - ని̣ ని̣ - ధ̣ ధ̣ | ని̣ సా - రీ గమ - గ మ గ రి ।
రా- ---- జీ - - వ | న య నా-- యా ం --

పా , - మపమా - ద ద । స సं రिं - ని ని - దా ని ద పా |
పా కా-- రి ను త చ ర ణా - యా - - - |

మా పమ - గ మ - రీ గరి । సపమ - ద ని - సాం ||
మా - - కా - శా -- దికిర ణా - యాం ||

మ॥సా॥ రిं గं మं రిं గं రिं - సं ని గं రिं - సాం నీ ।
హ్రీం - కా- ర వి పి న హ రి ణ్యాం

సं ని ప ద ని ద - స రి గా - మా పా |
హ్రీం - కా - ర సు శ రీ రి ణ్యాం |

మ ప మ దా ద - సं ని సాం - గं రिं సాం ।
హ్రీం - కా ర త రు మం జ - ర్యాం

ని ని ద ద ప ప - మ మ గ గ - రి రి స ని̣ ||
హ్రీం కా- రే - శ్వ - ర్యాం గా - ర్యాం ||

చ॥ సపా - మా - మ ద ప మ । గ గ గ - రి రి - రి గ రీ ।
శరీ ర త్ర - య - వి ల - క్షణ సు - ఖ

స రి నీ̣ - ని̣ ని̣ - ధ̣ ని̣ । ధా̣ స ని̣ సా - రీ - రీ ।
త - ర స్వా - త్మా - ను భో - - గి న్యాం

స రి నీ̣ - నీ̣ ని̣ స - ధా̣ ని̣ ధ̣ । ఫా ఘ - ధా̣ ని̣ స - రి రి |
వి - రిం చి హ - రీ - - శా న హ రి - హ య |

రి గమపమా - గ గ - రి గ । రి ని̣ ధ̣ - నీ̣ - సా |
వే - - - ది త ర హ - స్య యో - గి న్యాం |

ప దా - మపమా - దా । ని స̇ ని - సా̇ - స̇ ని | స̇రి̇ స̇స̇ -
ప రా - - ది వా గ్దే - వ తా రూ - | ప - వశి

సా స̇ రి̇ - ని ని । నిస̇దానిద - ని స̇ - రీ̇ | సా̇రి̇ గ̇ మా̇ -
- న్యా - - ది వి - భా - - గి - న్యాం | చ రా - -

గ̇ గ̇ - రీ̇ గ̇ రి̇ । స̇ ని ని - దానిద - పా ప మ । పమా -
త్మ క స - - ర్వ రో - - - గ హ ర - ని రా

ని ద - పా ద ప । మ గ గ - రీ గ రి - సా |
మ య రా - - జ యో - గి - - న్యాం |

మ॥సా॥ ప ప రి గ మా - గ గ రి రి - స ని̣ సా ।
క ర ధృ త వీ ణా - వా - ది - న్యాం

ప ప మాద ద - ద ద నీ - సా̇ రి̇ । మ̇ మ̇ గ̇ రి̇ గ̇ రి̇ -
క మ లా న గ ర వి నో ది న్యాం సు ర న ర ముని

స̇ స̇ ని ని - ద ద పా | రి గ మ ప రి ప -
జ న మో - ది - న్యాం | గు రు గు హ వ ర

ప మ గ గ - రి రి స ని̣ ‖ శ్రీకమలాంబికాయాం ‖
- ప్ర సా - ది - న్యాం ‖

# 76

## ఘంటా రాగము ఆది తాళం

8వ మే. జన్యం. స రి గ మ ప ద నీ

ద ప మ గ రి స ని ధా ప నీ స

ప॥ శ్రీ కమలాంబికే అవావ । శివే । కరధృత శుకశారికే ॥

అ॥ లోకపాలిని, కపాలిని, శూలిని, లోకజనని, భగమాలిని ।
సకృదాలోకయ, మాం, సర్వసిద్ధి ప్రదాయికే, త్రిపురాంబికే,
బాలాంబికే ॥

చ॥ సంతప్త హేమ సన్నిభ దేహే । సదాఽఖండైక రస ప్రభావే ।
సంతాపహారి త్రికోణ గేహే । సకామేశ్వరీ శక్తి సమూహే ।
సంతతం ముక్తి ఘంటా మణి ఘోషాయమాన కవాట ద్వారే ।
అ । నంత గురుగుహ విదితే । కరాంగుళి నఖోదయ విష్ణు
దశావతారే ।
అంతఃకరణేక్షు కార్ముక శబ్దాది పంచ తన్మాత్ర విశిఖా ।
త్యంత రాగ పాశ ద్వేషాంకుశ ధర కరే ।
అతిరహస్య యోగినీ పరే ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. అష్టమావరణము, త్రికోణ చక్రము. దీనిని సర్వసిద్ధిప్రద చక్రమందురు. గుణత్రయ రూపము. మహాకామేశ్వరీ,మహావజ్రేశ్వరీ మహాభగమాలినీయను వారు కోణ దేవతలు. అద్భుతరసము. ఓ కమలాంబికా! చిలుకను, గోరువంకను, పాచికలు చేతియందు ధరించిన, మంగళ ప్రదురాలా, నన్ను కరుణతో జూడుము. లోకములను పాలించుదానా, కపాలము, శూలమును ధరించిన దానా, లోకములకు తల్లీ, భగమాలినీ నామము గల జననీ, నన్ను ఒక్కసారి చూడుము. త్రిపురాంబా. బాలాంబా, సర్వసిద్ధుల

నొసంగు దానా, అగ్నిచేత తప్తమై, బంగారము శుద్ధమై సహజ వర్ణముతో ప్రకాశించును. గాన స్వచ్ఛమైన బంగారము కాంతితో గూడిన దేహము గలదానా, ఎల్లప్పుడు ఎడతెగని రసముతో గూడిన దానా, దుఃఖమును హరించు త్రికోణయుత అష్టమావరణమే గృహముగా గలదానా, కామేశ్వరీ శక్తులతో గూడి, ఎల్లప్పుడు ముక్తి ఘంటామణి నాదముతో గూడిన తలుపులు అమర్చబడిన ద్వారములు. గలదానా! అనగా ముక్తిప్రదాయిని అనుచు ఘంటా రాగ నామమును కూర్చిరి. ఈవిషయమునే దేవీభాగవతమున, "ముక్తిద్వారము తల్పు దీయగదె, చాముండా జగజ్జీవనీ" అంటారు ము లు గు పాపయారాధ్యులు. "ముక్తిద్వార కవాటపాటనకరీ" అనంత రూపుడైన సుబ్రహ్మణ్యేశ్వరునిచే తెలియబడు దానా, నీయొక్క చేతి గోళ్ళయందు విష్ణుమూర్తి దశావతారములను ఉదయింప జేసిన దానా! ఈ నామము లలితా సహస్రనామములోనిది. "కరాంగుళీ నఖోత్పన్న నారాయణ దశాకృత్యై నమః" అంతఃకరణమందు, చెఱకు ధనువును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు, కాంతులతో భాసిల్లు రాగ, పాశ, ద్వేష, అంకుశములు ధరించిన కరములు గల, అతిరహస్య యోగినులతో గూడిన ఓ కమలాంబా నన్ను ఒక్కసారి కరుణాదృష్టితో వీక్షించుము.

## రెండు కళల చౌకం

ప॥ నీ , ద ని ద దా ప । పా మ ప నిదాప । ప గమప పమపద
(శ్రీ) క మ - లాంబి కే - - - - అ వా - - - వ - - -

నీ ... పమపా | మపదని దపమద ప మ గ రి సా రి ని ।
(శ్రీ) ... - - - | శి - వే - క - ర - ధృత - - శు - -

స ధ ని స గ గ రి స । రి సా ||
క - శా - - - రి - కే - ||

అ॥ , గ మ పా ని ని స ద । ని స స గ రి స । ని స ని రి |
లో క పా లి ని క - పా - - - - ల శూ - - - |

స ని ని రి | (2) గ మ ... ని స ని రి స ని నీ | ని స ని స
లి - ని - | లో క ... శూ - - - లి - ని | లో - - -

రి స ని ని స ని ద ప పా గ మ । ప ద ప ద మ ని ద ప ।
- క జ - న - ని - భ గ - మా - - - లి - ని -

మ ద ప మ గా రి స |
స - కృ - దా - - |

మ॥సా॥ ని స గ గ రి స గ మ ప ని ద ప ని పా గ ।
లో - క య మాం స - ర్వ సి - ద్ధి - ప్ర దా

రి స రి రి ని సా ని । ద ప పా గా మ ప | ప ద నీ ||
యి కే - త్రి పు రాం బి కే - బా లాం బి కే | - - శ్రీ ||

చ॥ సా పా ప ద ప ద ద పా । మ గా , మ ని ద ప । మ ప ద ప
సం త ప్త హే - - - మ స - న్ని - భ - దే - - -

ప మ గ రి | (2) మ గ రి స | స ని నీ ని స ధా ని స గ గ
హే - - - | హే - - - | స - బా ఖ ం - డై - - -

రి ని । స గ రి గ । గ మ గ మ ప ప మ ప | పా స ప పా
క - ర స - ప్ర వా - - - - - హే - | సం - - తా

ప ద ని ద నీ । దా ని ద ద ప । మ ప మ ప ద పా మ |
ప - హా - ర త్రి కో - - ణ గే - - - - హే - |

ప సా ని రి స ని పా ద ప గా । గా మ ని ద ప । మ ప మ గ
స శా మే- - - శ్వ రీ - - శ క్తి - స - మూ- - -

మ గ రి స | సా స ని సా గ రి గ గ రి గ । మా పా ।
హే - - - | సం - - త తం ము - - క్తి ఘం టా

, మ ప నీ | సా , ని రి స ని దా ప ని । స స స రి
మ ణి ఘో | షా య- మా- - న క వా- - -

గ గ రి స । ని స ని స రి ని స | ని స ని స రి స
ట - - - ద్వా- - - రే - అ | నం - త గు -

ని రి స ని ద ప మ ప పా ।
రు - గు - - - హా - వి

స ని దా ప ప । పా గ మా ప రీ | ని స గ రి రి స రి స ని స
ది - తే - క రాం- - గు ళి | న ఖ్య - - ద య వి- - -

ద । ని సా రి స । ని ప ని రి స ని సా |
న్మ ద శా వ - తా- - - రే - - |

మ॥సా॥ దా పా మ గ రీ స నీ ని స ధ నీ । పా స గా రి గ మ ।
అం తః క ర ణే క్షు కార్ము క - శ బ్దాది పం చ త -

పా , ప ని ని సా | నీ స గా రి రి సా నీ నీ స ద ।
న్మా త్ర వి శి ఖా | త్యం త రా గ పా శ ద్వే షాం కు శ

ని ప రి సా ని ద ప । ప మ మ గ రి సా ప |
ధ ర క రే తి ర హ - స్య యో - గి నీ ప |

ప ద నీ || క మ ||
రే - (శ్రీ) ||

# 77

## ఆహిరి రాగం రూపక తాళము

20 వ మే. జన్యము. స రి స గ మ ప ద ని స
స ని దా ప మ గా రి స

దీక్షితులవారి సంప్రదాయమున 20వ మేళకర్త జన్యముగా తెల్పబడినది. పూర్వ సంప్రదాయమున 8 వ మే. జన్యముగా తెల్పబడినది. మూర్ఛన ఒక్కటియే.

ప॥ శ్రీకమలాంబా జయతి । అంబా, జగదంబా, శృంగార
రస కదంబా, మదంబా ।
శ్రీకమలాంబా జయతి । చిద్బింబా, ప్రతిబింబేందు బింబా,
శ్రీకమలాంబా జయతి ॥

శ్రీపుర బిందు మధ్యస్థ చింతామణి మందిరస్థ ।
శివాకార మంచస్థిత । శివ కామేశాంకస్థా ॥ శ్రీ ॥

అ॥ సూకరాననవద్యార్చిత మహా త్రిపురసుందరీం ।
రాజరాజేశ్వరీం, సువాసినీం ।
శ్రీకర సర్వానందమయ చక్రవాసినీం, చింతయేఽహం ।
ది । వాకర శీతకిరణ పావకాది వికాస కరయా ।
భీకర తాపత్రయాది భేదన ధురీణ తరయా ।
పాకరిపు ప్రముఖాది ప్రార్థిత సుకళేబరయా ।
ప్రాకట్య పరాపరయా పాలితో దయాకరయా ॥ శ్రీకమ॥

చ॥ శ్రీమాత్రే నమస్తే । చిన్మాత్రే, సేవిత రమా హరీశ విధాత్రే।
వామాది శక్తి పూజిత పర దేవతాయాః సకలం జాతం ।
కామాది ద్వాదశభిరుపాసిత కాది హాది సాది మంత్ర
రూపిణ్యాః ।

ప్రేమాస్పద శివ గురుగుహ జననాన్యాం ప్రీతియుక్త
మచ్చిత్తం విలయతు ॥

మ॥సా॥ బ్రహ్మమయ ప్రకాశిని । నామరూప విమర్శిని ।
కామకళా ప్రదర్శిని । సామరస్య నిదర్శిని ॥ శ్రీ ॥

వ్యా॥ ఎనిమిది విభక్తులతో గూడిన రచన. ఇది విచిత్ర, విశేష రచన. తొమ్మిదవ ఆవరణ. త్రికోణ మధ్యయందున్న బిందు రూపము. సర్వానందమయ చక్రము పంచ బ్రహ్మాత్మకము. శాంత రస యుతము. ఇందు శ్రీరాజరాజేశ్వరీ, పరాభట్టారకా దేవి చక్రాధిష్ఠాన మూర్తి. శ్రీచక్రమును బిందు త్రికోణ వసుకోణ అని ప్రారంభించిరి. కాని క్రిందనుండి 9వ ఆవరణ బిందు. బిందు = నీటి బిందువు, అమృతబిందువు. కొన్ని బిందువులు కలసి నీరు అయినది. అటులనే అణువు అతి సూక్ష్మము. ఆ అణువులే కొన్నింటితో మహత్తు అయినది. కంటికి కనిపించని సూక్ష్మ రేణువులు అనేకములు కలసి అనంతమైన ప్రపంచమైన విధముగా, ఆ పరాశక్తి నిరాకారయై, ఆనందరూపిణియై క్రమముగా లోక రక్షణకు బిందువునుండి, త్రికోణాది నవావరణములచే అండ పిండ బ్రహ్మాండ రూపిణియై జగత్తును పాలించుచున్నది గాన, అన్ని విభక్తులు ఆమెయే. సర్వము పరాశక్తియే. యను భావమున అన్న విభక్తులతో ఈకృతిని రచించిరి. ఇట్టి రచనను సార్వవిభక్తికమని అందురు. ప్రథమ = శ్రీ కమలాంబ జయించును గాక. తల్లి జగమునకు తల్లి. శృంగార రస స్వరూపిణి. నా కన్నతల్లి, చిత్స్వరూపిణి, ప్రతిబింబ రూపమున, చంద్రబింబ రూపమున, అనగా కళారూపిణియై, శ్రీపురమధ్య నున్న బిందు మధ్యమున, శ్రీపురమనగా కమలాపురమున, తిరువారూరున నున్న, చింతామణి మందిరమున నున్న, శివాకార మంచ యందున్న శివ కామేశుని తొడయందున్న కమలాంబ ప్రకాశించుచున్నది.

ద్వితీయ :- వారాహి మొదలైన శక్తులచే పూజింప బడుచున్న మహా త్రిపుర సుందరిని, రాజరాజేశ్వరిని, నిత్య సువాసినిని, సౌభాగ్య ప్రదయగు సర్వానందమయ చక్రవాసినిని, నేను చింతించు చున్నాను. ధ్యానించు చున్నాను.

తృతీయ :- ప్రపంచమునకు వెలుగునిచ్చు, సూర్య,చంద్రాగ్నులకు వెలుగు నిచ్చు నామెచే, భయంకర ఈషణ త్రయముల తాపమును భేదించు నామెచే, ఇంద్రాది ముఖ్య దేవతలచే తొలుతగా ప్రార్థింప బడిన మంచి శరీరముగల నా మెచే, ప్రకటింపబడిన పరాపర యోగినులతో గూడిన దయాస్వరూపిణిచే పాలింప బడితిని.

చతుర్థి :- సంపద్యుక్తమైన తల్లికొఱకు, చిద్రూపిణి కొఱకు, రమా విష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మలచే సేవింపబడు నామెకొఱకు నమస్కారము.

పంచమి :- వామ, జ్యేష్ఠ మొదలైనశక్తులచే పూజింపబడు పరదేవత వలన ఈ సమస్తము సృజింప బడినది.

షష్ఠి : కామము మొదలైన 12 మంది ఉపాసకులచే, కాది, హాది, సాది మొదలైన మంత్ర స్వరూపిణికి.

సప్తమి :- ప్రేమకు ఆధారమూర్తి యగు శివ, గురుగుహుని తల్లియందు ప్రేమతో గూడిన నాచిత్తము లయించుగాక.

సంబోధన :- బ్రహ్మరూపమున ప్రకాశించుచు. నామరూపమున విమర్శించబడుచు, కామకళలను ప్రదర్శించుచు, సమభావముతో ప్రత్యక్షమగు ఓ తల్లీ, నీకు నమస్కారము. అని నీవు, నిన్ను, నీచే, నీకొఱకు, నీవలన, నీకు, నీయందు, అంతా నీవేయను సంపూర్ణ భక్తి భావముతో ఆపరాశక్తియే తానై, తనకన్న వేరు లేదని తన్మయులై రచించిరి.

## రెండు కళల చౌకం

ప॥ పా , ద ని ద పా । దపామ ప మగా రీ , స । స ని గ రి రీ
శ్రీ - క మలాం - - - బా- - - - జ - య - తి

సా గ మ | (2) పా , ద ... । స ని గ రి - రీ సా |
అం బా - | శ్రీ - ... జ - య - తి - |

స ని సా మ గ మా ద ప ద మ | (3) పా , ద ... |
జ - గ దం - బా - - - | శ్రీ - .. |

స ని గ రి రీ సా | సా , ని ధా , ఫ । ఫ స సా స గ మా ప ।
జ - య - తి - | శృం - గా ర ర - స క - దం బా

పా ద పా ద ప ద మ పా మ | పా , ద ... | స ని గ రి రీ సా ।
- మ - దం - బా - - | శ్రీ - ... | జ - య - తి -

సా మ గ మ పా । ప గ మా పా ద ని దా । ద ప మా ద ప
చి ద్బిం - బ ప్ర - తి బిం - బేం - దు బిం - -

ప మ గ మ | పా , ద .. | స ని గ రి రీ సా । ధా ధ ఫ
బా- - - | శ్రీ - ... | జ - య - తి - శ్రీ పు ర

ధ ని స మ గ రీ స । స మ మా మ మ గ మ ప పా ప ।
బిం దు మ - ధ్య స్థ చిం తా మ ణి మం ది ర స్థ

ప సం ని సం ప ద మ ప గ మ ప ద । ని ద ప మ గ మ -
శి వా - కా - ర మం చ - స్థి త శి వ కా - మే -

గ రి స రి గ మ || పా , ద ... । స ని గ రి రీ సా ||
శాం క - స్థా - || శ్రీ - ... జ - య - తి - ||

అ॥ పా ద ని ద ప పా ద ప ద మ । గా గ మ ప మ గ రి ।
సూ - - క - రా - - న - వ ద్యా - - - - ర్చిత

స ని సా స ని ని ధ ధ ప | ప ని సా ప మ మా ప । పా ప ద
మ - హా త్రి - పు - ర - | సుం - ద - రీం రా జ -

పా గ । మా మ ని దా ప | ప ద ని స సా । స రి స రి
రా - జే శ్వ - రీం | శ్రీ - క ర స ర్వా - - -

ని సా ని ని రి సా । ని దా ప ప ద ప ద | మ ప ద
నం - ద - మ య - చ క్ర వా - - - | సి నీం

ని ని స పా । మ మా ప ని ద ప । గ మ ప గ రి సా , స |
సు వా - - సి నీం చిం - త యే - - - హం - ది |

మ॥సా॥ మా మ గ మా ప ప గ మ పా । ద పా ప ప దా ప గ మ పా ।
వా క ర శీ త కి ర ణ పా వ కా ది వి కా స క ర యా

ప ద ని స రి సా ని రి స | సా స ని ని దా ప ద మ పా ।
భీ - క ర తా ప త్ర యా ది | భే ద న ధు రీ ణ త ర యా

ప ద ని రి సా స మ గా , రి । ని రి స ని ని ద ద ప
పా - క రి పు ప్ర ము ఖా ది ప్రా - ర్థి త సు క ళే -

ని ని సా | ప రి సా ని ని దా ని ద ప మ ।
బ ర యా | ప్రా - క ట్య ప రా ప ర యా -

ప ద ని స ప ని దా ప మ గ మ ‖ శ్రీ ‖
పా - లి తో - ద యా క ర యా - ‖ శ్రీ ‖

చ॥ రి రి సా మ గ మా పా । గ మ ప ద ద పా । మ గ మ ప ద ని
శ్రీ - - మా - - త్రే న - మ - - స్తే చి - - - న్మా -

ద నిదప | స పా ద ప మగమా । మగరిసా ని । ధాప స నిసా;
త్రే- - - | సే - వి త ర - మా హరీ-శ వి ధా- త్రే- -

సా మా , గ రిస । పా మగ మా , । పద పద మప మగా
వా మా - -ది శ క్తి- పూ జి - త - ప - ర దే

మప గమపద ని నిసా । సనిదా , ప । గాగని దా పా
వ తా - - - - యాః- - సకలం - జా- - త ం

గామాగమ । దా పాదపపా మప । గమ పా , ద నిదపా
కామా- ది ద్వా - - - - దశ భి రు పా - సి - త

దా ని సా రి । సా ని దా ప । ప ద ని స ని రి స
కా ది హా ది సా ది మంత్ర రూ - పి ణ్యాః- - -

ని సమ గ రి స । నినిరి స ని ద ని ద । పగ మపదని స స
ప్రే- మా - స్పద శివగు రు గు - హా - జన - - - - న్యాం

పా ప పా గ । మాపద దా పా , మ । గగగా గ మగా రి స
ప్రీ తి యు క్త మ - - చ్చి త్తం । వి - ల య - - తు -

మ॥సా॥ సా మ గ రి స ని ధా ప ని స । సామగ మపగమ
బ్ర హ్మమ య - ప్ర కా - శి ని నామరూ - పవిమ

పదని ద | పా మ గ మా ప ద ని స ని రి ।
- -ర్శి ని | కా మ క ళా ప్ర ద - - ర్శి ని

పా మ గ రి స నిదా ప గ మ ॥ శ్రీకమ ॥
సా మ ర - స్య ని ద - ర్శి ని

# 78

## శ్రీరాగము ఖండజాతి ఏక తాళము

22 వ మే. జన్యము. స రి మ ప ని స
స ని ప ద ని ప మ రి గ రి స

ప॥ శ్రీ కమలాంబికే, శివే, పాహిమాం । లలితే,
శ్రీపతి వినుతే, సితాసితే, శివ సహితే ॥

అ॥ రాకా చంద్రముఖి, రక్షిత కోల ముఖి ।
రమా వాణీ సఖి, రాజయోగ సుఖి ॥

మ॥సా॥ శాకంభరి శాతోదరి చంద్ర కళాధరి, శంకరి ।
శంకర గురుగుహ భక్తవశంకరి ।
ఏకాక్షరి, భువనేశ్వరి, ఈశ ప్రియకరి ।
శ్రీకరి, సుఖకరి, శ్రీమహా త్రిపుర సుందరి
॥ శ్రీకమలాంబికే ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. మంగళా శాసనము. శ్రీరాగం మంగళప్రదము. అంత్య శ్రీరాగము మంగళము. కమలాంబికా, శివే, లలితేలను విశేషణములతో నన్ను పాలించుము. రక్షించుము. ఇందలి విశేషణములు జగన్మాత నామములు. భువనేశ్వరి, త్రిపురసుందరి మొదలగు పదములతో మూడు శ్రీకారములతో కూడిన శ్రీమహా త్రిపురసుందరి, సర్వులను రక్షించుగాక యని, శాక్తేయ సంప్రదాయానుసారము ఈ కమలాంబా నవావరణములను కృతులను రచించి వారు ధన్యులై మనలను ధన్యులుగా జేసిరి.

## రెండు కళల చౌకం

ప॥ నీ , ప మ ఠీ గ రి స । స్నీ ఫా ని సా గ రి సా |
శ్రీ క మ లాంబి కే- శి వే పా హి మాం ల లి తే |

రీ ప మ రి గ రీ స స్నీ రి సా న్ని స రి మ ప స్ప ॥ శ్రీ ॥
శ్రీ ప తి వి ను తే సి తా సి తే శి వ స హి తే- ॥ శ్రీ ॥

అ॥ రీ ప మ ప మ రీ గ రి సా న్ని రి । స్నీ ఫ గ రి
రా కా- - - చం- - ద్ర ము ఖి ర క్షి త కో

గ రి స న్ని స స | రి మా పా నీ మ పా ।
- - - ల ము ఖి | ర మా వా ణీ స ఖి

రీ , ని పా ని స్ప నీ స్ప స్ప |
రా జ యో - - గ సు ఖి |

మ॥సా॥ ర్రీ గ్గీ గ్గ ర్రి స్సా సా ర్రి స్ప నీ ప మ ప ని స్ప ర్రి |
శా కం భ రి శా తో ద రి చం ద్ర క ళా - ధ రి |

గ్గ ర్రి ర్రి గ్గ ర్రి స్ప స్ప రి స్ప ని ని స్ప స్ప ని ప మ రి గ రి స |
శ ం క రి శ ం క ర గురుగుహ భ- క్త వ శ ం క రి |

రీ స్నీ స రి రి గ రీ రి స సా స్సా స్ప స్ప ని ప । పా ద ని
ఏ కా క్ష రి భు వ నే శ్వ రి ఈ శ ప్రి య క రి శ్రీ క రి

ప ని ప మ రి గ రి సా రి న్ని స రి మ ప ॥ నీ స్ప ని నీ ॥
సు ఖ క రి శ్రీ - మ హా త్రి పు ర సు ం ద రి ॥ శ్రీ - - - ॥





# అభయాంబా నవావరణ కృతులు

శ్రీ దీక్షితులవారు "మయూరం" వెడలినప్పుడు అట పురాతన శివాలయమును సందర్శించిరి. మయూరమును "మాయవరం" అని కూడ అందురు. అట మయూరనాథ స్వామి. అభయాంబా దేవితో కూడియుండును. ఆ మూర్తులను గాంచి, మయూర నాథ స్వామిపై 3 కృతులు, అభయాంబా దేవిపై 9 కృతులు రచించిరి. అభయాంబ= భయమును పోగొట్టి రక్షించు తల్లి. భయమనగా ఇహలోక భయము. ఇహలోక భయమనగా, ఆరోగ్యము, ఐశ్వర్యము, సంతానాదుల వలన కలుగు భయము. పరలోక భయము పుట్టుట, చచ్చుట మొదలైన భయము. ఇహ పర లోకములందలి భయమును పోగొట్టి అభయ మొసంగునది ఆ దేవి. ఆమెపై అభయాంబా నవావరణములుగా 9 కృతులు రచించిరి. ముందు మయూరనాథునిపై కృతులు గమనించదగినది.

## 79

### ఆనందభైరవి రాగం ఆదితాళం

ప॥ అభయాంబా నాయక । హరిసాయక ।

ఆత్మరూప ప్రకాశక, అవ అవ ॥

అ॥ ఉభయాత్మక ప్రపంచ ప్రకాశా । ధికార స్వరూపావకాశక ।

శుభకర, కావేరీ తీరస్థిత । సుందర గౌరీ మయూరనాథ ॥

చ॥ నాగలింగ, భక్తాభీష్టప్రద । నాద బిందు కళా రూపాస్పద ।

ఆగమాది సన్నుత పల్లవ పద । ఆనందభైరవీ సంయుత పద ॥

మ॥సా॥ భోగ మోక్ష వితరణ ధురీణ తర ।

భూసురాది సంసేవిత శంకర ।

త్యాగరాజ గురుగుహ సంగత కర ।

తాపత్రయహర । దయా సుధాకర ॥ అభయ ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. అభయాంబా నాయకుడా! విష్ణుమూర్తి బాణముగా గల వాడు శివుడు. త్రిపురాసుర సంహార సమయమున నారాయణాస్త్రమును ధరించుటచే, హరి సాయకముగా గల వాడాయెను. ఆత్మ రూపముతో ప్రకాశించు మయూరనాథ స్వామీ అవ = రక్షించుము. భూలోక, స్వర్గ లోకములను ప్రకాశింపజేయు అధికారముగల స్వరూపమును చూపుటకు అవకాశము గలవాడా! "ఈశావాస్య మిదం సర్వం" అను వేదార్థ ప్రతిపాదితుడని, శుభమును కలుగ జేయువాడా! కావేరీ సమీపమున నున్న అందముగా గౌరీ దేవితో కూడిన మయూరనాథ స్వామీ! నాగలింగ। భక్తుల కోర్కెలు దీర్చువాడా! నాద, బిందు, కళా స్వరూపమునకాధారుడా! వేదములచే నుతింప బడిన చిగురుటాకుల వంటి కోమలములైన పాదములు గలవాడా! ఆనంద భైరవీ దేవితో కూడిన మాటలుగల వాడా! ఇహమందు భోగమును, పరమందు మోక్షము నొసగువాడా! భూసురులచే సేవించబడు శంకర! త్యాగరాజు, కుమార స్వాములతో కూడిన వాడా! తాపత్రయములను హరించు, దయాసముద్రుడవైన ఓ మయూరనాథస్వామీ, నన్ను రక్షించుమని కీర్తించిరి.

# 80

## ధన్యాసి రాగం త్రిపుట తాళము

8వ మే. జన్యము    స గా మ ప నీ స

స ని ద ప మ గ రి స

ప॥ మయూర నాథమనిశం భజామి ।
మాయా మయ ధరణీశం త్యజామి ॥

అ॥ కేయూర హారాద్యలంకృత దేహం ।
కేకి పూజితామ్ర వన గేహం ।
ఆయురారోగ్యైశ్వర్యదం ।
సాయుజ్యాది ముక్తిప్రదం ॥

చ॥ ఆదిత్య కోటి ప్రకాశం । నంది కేశమప్రమేయం ।
అభయాంబికేశం, మహేశం ।
మేదిన్యాది పంచభూతావకాశం ।
మీన ధ్వజారిం, పురారిం ॥

మ॥సా॥ వేదనుత గురుగుహ నివాసం । భేదయుత విశ్వ విలాసం ।
నాదమయ నవనవోల్లాసం । మోదరూప మనోవిలాసం
॥ మయూర ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. మయూర నాథుని ఎల్లప్పుడు సేవించు చున్నాను. మాయతో గూడి ఈ ప్రపంచమును పాలించు రాజులను విడచు చున్నాను. కేయూర హారములచే నలంకరింపబడిన దేహము గలవానిని, నెమలిచే పూజింపబడిన మామిడి వనము గృహముగా గలవానిని, ఆయు రారోగ్యైశ్వర్యముల నొసంగువానిని, సాయుజ్యము మొదలైన నాలుగు విధములైన ముక్తి నొసంగువానిని, కోటి సూర్యుల కాంతితో ప్రకాశించు వానిని, నంది కేశ్వరుని,

అప్రమేయుని, అభయాంబికా నా థు ని, మ హే శ్వ రు ని, పృధివ్యాప స్తేజోవాయు రాకాశములను పంచ భూత స్వరూ పుని, మీనధ్వజుడు=మన్మధుడు, మన్మధునకు శత్రువైన వానిని, త్రిపురాసురులకు శత్రువైన వానిని, వేదముచే నుతింపబడిన గురుగుహునితో కూడినవానిని, భేదముతో కూడిన ప్రపంచ విలాసుని, నాదముతో గూడి, నిత్య నూతనోల్లాసము గలవానిని, ఆనందముతో గూడిన మనస్సుగల వానిని, సేవించు చున్నానని సామాన్యులకు సైతము అర్ధమగు పద విశేషణములతో వర్ణించిరి.

## 81

## కేదార గౌళ రాగము ఆది తాళం

28వ మే. జన్యం. స రి మ ప ని స
స ని ద ప మ గ రి స

ప॥ అభయాంబా నాయక, వరదాయక ।
ఆత్మరూప ప్రకాశ కావావ ॥

అ॥ ఉభయాత్మక ప్రపంచ వ్యాపక ।
ఓంకార స్వరూపావ కాశక ।
శుభకర, శశి శేఖర, కరుణాకర ।
సుందర శంకర, భక్త వశంకర ॥

చ॥ నీలకంఠ పూజిత నిర్వికల్ప । నీలకంఠ భవ, సత్య సంకల్ప ।
కాలకాల సకల విశ్వ వికల్ప । జాల మూల కోటి బ్రహ్మ
కల్ప । క
పాల మాల, శూలధర, గురుగుహ । జాల లీల
ఫాలలోచన ! లోక

పాల, వరదాన శీల, శార్దూల । చేల, కరుణాల వాల,
రతిలోల ॥ అభ ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. ఈకృతి శంకరుని విశేషణములతో అంత్య ప్రాసాలంకారములతో కూర్చబడినది. నాయక, దాయక, ప్రకాశక, వ్యాపక, అవకాశక, శుభకర, శేఖర, కరుణాకర, సుందర, శంకర, వశంకర, నీలకంఠ, కాలకాల, జాల, కపాల, మాల, మూల, శూల, నీల, ఫాలలోచన, లోకపాల, దానశీల, శార్దూల చేల, కరుణాల వాల, రతిలోల అను అంత్యప్రాస, పదములు కవిత్వమునకు గానమునకు యమకమును, ఉత్సాహమును కలిగించును, ఈ కృతి యందు ముఖ్యముగ గమనించ దగినవి పదముల కూర్పు. సొగసు = ఇందు రాగనామములేదు. ఈ మూడు మయూరనాథేశ్వరునిపై రచించిరి. ఇక ఆయన సతీమణి అభయాంబికపై 9 కృతులు రచించిరి. వానిని క్రింద పొందు పరచితిని.

## 82

## కళ్యాణి రాగం ఆది తాళము

65వ మేళకర్త.

ప॥ అభయాంబా, జగదంబా, రక్షతు ।
ఆత్మరూప ప్రతిబింబా, మదంబా ॥

అ॥ ఇభవదన, శ్రీగురుగుహ జననీ ।
ఈశ మయూరనాథ రంజనీ ॥
అభయ వరద పాణీ । అలివేణీ ।
ఆశ్రిత, మా, వాణీ, కళ్యాణీ ॥

చ॥ భక్త నాగలింగ పరిపాలినీ । భాసమాన నవరత్న మాలినీ ।
వ్యస్తసమస్త జగద్విశాలినీ । వ్యధికరణ హరణ నిపుణ శూలినీ ।

రక్త శుక్ల మిశ్ర ప్రకాశినీ । రవికోటి కోటి సంకాశినీ ।
భక్తి ముక్తి మానస నివాసినీ । భావ రాగ తాళ విశ్వాసినీ ॥

మ॥సా॥ భుక్తి ఫలప్రద దక్ష మృడానీ ।
భక్తిప్రద నిపుణతర భవానీ ।
శక్తి సంప్రదాయక శర్వాణీ ।
భుక్తి ముక్తి వితరణ రుద్రాణీ ॥ అభ ॥

వ్యా॥ ప్రథమా విభక్తి. అభయాంబ, జగదంబ, ఆత్మరూప ప్రతిబింబమైన నాతల్లి రక్షించుగాక. వినాయక, షణ్ముఖుల తల్లి, మయూరనాథుని రజింపజేయునది. అభయము, వరము లొసగు హస్తములుగలది. లక్ష్మి, సరస్వతులచే ఆశ్రయించ బడినది, కల్యాణి మొదలగు విశేషణములతో కీర్తించిరి. ఇందు, జనని, రంజని, పాణీ, వేణీ, వాణీ, కళ్యాణీ, పాలిని, మాలిని, శాలిని, శూలిని, ప్రకాశిని, సంకాశిని, నివాసిని, విశ్వాసిని, మృడాని, భవాని, శర్వాణి, రుద్రాణి మొదలైన అంత్యప్రాస పదములు, చతురశ్ర గతికి అలంకారములు. కళ్యాణి విశేషముతో రాగనామమును కూర్చిరి. భుక్తి, ముక్తి, శక్తి నొసగి అభయాంబ నన్ను రక్షించుగాత! అని కీర్తించిరి.

## 83

## తోడి రాగం ఆది త్రిశ్రనడక

20 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ దాక్షాయణి, అభయాంబికే ।
వరబాభయ హస్తే । నమస్తే । (శ్రీ) ॥ దాక్షా ॥

అ॥ దక్ష సంతుష్ట మానసే । దీనజనావన హస్త సారసే ।
కాంక్షితార్థ ప్రదాయిని । కామతంత్ర విధాయిని ।
సాక్షిరూప ప్రకాశిని । సమస్త జగద్విలాసిని ॥ దా ॥

చ॥ సకల నిష్కళ స్వరూప తేజసే ।
సకలలోక సృష్టికరణ భ్రాజసే ।
సకల భక్త సంరక్షణ యశసే ।
సకల యోగి మనోరూప తత్వతపసే ॥

మ॥సా॥ ప్రబల గురుగుహోదయే । పంచానన హృదాలయే ।
భరత మాతంగాది నుతే । భారతీశ పూజితే
॥ దాక్షాయణి ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. దక్షప్రజాపతి కుమార్తెయైన దాక్షాయణీ, అభయాంబా, వరద, అభయ హస్తములుగల నీకు నమస్కారము. కార్యదక్షత, సంతృప్తిగల మనస్సుగల, దీనులను రక్షించు పద్మములవంటి హస్తములు గల, కోర్కెలు దీర్చగల, కామ తంత్రమును కల్పించు, సాక్షీరూపమున ప్రకాశించు, సమస్తజగద్రూప మున విలసిల్లు, సకల కళల రూపమున ప్రకాశించు, సమస్త లోకము లను సృష్టిజేయుచున్న, సర్వభక్తులను రక్షించునదను కీర్తిగల, సర్వ యోగుల మనస్సున, తత్వరూపమున తపింపజేయుచున్న, కుమార స్వామి ఆవిర్భావమునకు కారణమైనది, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను ఐదు ముఖములుకల శివుడు మయూరనాథ స్వామి హృదయమందు నివసించిన, భరతుడు, మాతంగాదులచే నుతింపబడుచు, బ్రహ్మచేత పూజింపబడు అభయాంబా ! నీకు నమస్కారమని కొనియాడిరి.

## 84
## చామరం రూపకం

56 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ సదాశ్రయే, అభయాంబికే । సన్నిధేహి ।
సదాశ్రయే, త్వామంబికే, భద్రం దేహి ॥

అ॥ చిదాశ్రయే, చిదంబర చంద్రికే, ఏహి ।
శివామంబికే నత వారాహి ॥

మ॥సా॥ ముదా శ్రయే భుక్తి ముక్తిప్రద మార్గం బ్రూహి ।
ముదా శ్రయే మాయాధీనం । దీనం మాం పాహి ॥సదా॥

చ॥ గౌరీ, మయూరనాథ మోహనకర శక్తే ।
శౌరీశ విధీంద్రాది సన్నుత పరాశక్తే ।
నారీమణ్యాద్యర్చిత నాద బిందు యుక్తే ।
శారీరకాది విద్యా సిద్ధాంత యుక్తే ।
భేరీ మర్దళ వీణా వాదనాను రక్తే ।
సూరి జనోపాసిత చరణ నళిన యుక్తే ॥

మ॥సా॥ వాగీశాది లోకపాల నుత గురుగుహ భక్తే ।
దారిద్ర్య దుఃఖ భంజనకర శంకరాభి భక్తే!
శుక సనకాది దేవతా సేవితే, పరదేవతే ।
వారిజముఖి వరదాభయ హస్తే, నమో నమస్తే ॥

వ్యా॥ సంబోధన ప్రథమ: ఓ అభయాంబికా, ఎల్లప్పుడు ఆశ్రయించిన నావద్దకు రమ్ము. నిన్ను ఆశ్రయించిన నాకు శుభము లిమ్ము. "చిత్" ను ఆశ్రయించి "చిత్" అనే ఆకాశమునకు చంద్రిక యైన, మంగళ ప్రదురాలా, వారాహిచే నమస్కరింపబడు, తల్లీ! సంతోషముతో నాశ్రయించితిని. భుక్తిని, ముక్తిని యొసగు మార్గ మును పలుకు. మాయకు అధీనుడనైన, దీనుడనైన నన్ను రక్షిం చుము. గౌరీ! మయూరనాథునికి మోహము కలిగించు శక్తివి, విష్ణు, శివ, బ్రహ్మదులచే నుతింపబడు పరాశక్తివి, నారీ మణులచేత పూజింప బడిన, నాద, బిందు స్వరూపిణివి, శరీర సంబంధమైన విద్యను సిద్ధాంత మొనర్చిన దానివి, భేరి, మద్దెల, వీణ మొదలైన

వాద్యముల వాదన యందు ఆసక్తిగల దానివి, శుక, సనక, సనంద నాదులచే సేవింపబడు పరదేవతవు. పద్మమువంటి ముఖముగల, వరద, అభయ హస్తములు గల తల్లీ! నీకు నమస్కారమని స్తోత్ర మొనర్చిరి.

## 85

## భైరవి రాగం ఖండజాతి అట

20 వ మేళకర్త.

ప॥ ఆర్యాం అభయాంబాం । భజరే, రే చిత్త, సంతతం ।
అవిద్యాకార్య కలనాం త్యజరే । ఆది మధ్యాంత రహితాం,
శివ సహితాం ॥

అ॥ సూర్యాగ్ని చంద్ర మండల మధ్య వాసినీం ।
సుఖతర ప్రవర్తినీం ।
స్వేతర నివాసినీం, ఆచార్య శిష్యానుగ్రహ కరణ శక్తి
ప్రదాపార కరుణాం ।
చర్యాది చతుష్టయ వితరణ సమర్థత తర చరణాం
అరుణాం ॥ఆర్యాం॥

చ॥ నందన వనోత్పాదన పుష్పమాలికాం ।
వందనాలయాది ప్రస్థాపన దివ్య ।
చందన కర్షణ, స్థలశుద్ధి కరణ ।
వందన స్తోత్రాది పఠన భక్త సేవనాం ।
మంద ధీహరణ చర్యాయుత మానవానాం । ధర్మమయ, స్వ
చ్ఛంద శివ సాలోకదాయక చతురతర హర నట భైరవీం ॥

మ॥సా॥ మందస్మిత విలసిత ముఖారవిందాం, గురుగుహాంబికాం ।
కుంద సోదరీం, మహా త్రిపుర సుందరీం ।
ఆనంద లహరీం ॥ఆర్యాం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఆర్యాం = ఆర్యా దాక్షాయణీ, గిరిజా మొదలైన నామములు పార్వతిని గుఱించి అమరకోశమున తెలుపబడినవి. ఉత్తమురాలైన అభయాంబను, ఓచిత్తమా ఎల్లప్పుడు భజించుము. అజ్ఞానము వలన కలుగు పనులను విడిచిపెట్టుము. ఆ త్రిపురసుందరి, ఆది, మధ్య, అంతములు లేని పూర్ణ స్వరూపిణిని, శివునితో కూడినది. సూర్య, చంద్ర, అగ్ని మండలమున నివసించు నది, సూర్యునియందు గాయత్రి, చంద్రునియందు సావిత్రి, అగ్ని యందు సరస్వతీ రూపిణియై యుండునది. సుఖమును కలిగించు నడవడి గలది, స్వ=తనయందు, ఇతర=పరులయందు నివసించునది. లోపల, వెలుపలనుండునది. గురు శిష్యులకు అనుగ్రహ సంబంధమైన శక్తిని అనంత కరుణతో నొసంగునది. చర్యాది చతుష్టయ=నాలుగు విధములైన చర్యలు=నడచుట, చూచుట, వినుట, పలుకుట మొదలైనవి చేయుచున్న పనులను విశాల మనస్సుతో అధికముగా నొసగు పాద ములుగల, ఎఱ్ఱనైన నందన వనమున పూసిన పుష్పమాలను ధరించి నది, నమస్కరించుటకు నిర్మించబడిన ఆలయమున, దివ్యమైన, సుగంధయుత చందనమును చేయుచు, ఆప్రదేశమును పరిశుభ్రము చేయుచు, నమస్కారము, స్తోత్రములు చేయు భక్తులచే సేవింపబడు నది, మానవుల బుద్ధి మాంద్యమునుపోగొట్టి నడిపించునది, ధర్మముతో కూడిన, స్వయం ప్రకాశమైన, శివ లోకము లొసంగుటయందు చతురత్వముతో నటనజేయు భైరవీమూర్తి రాణియైన, ఇట "నట భైరవీం" అని రాగ నామమును కూర్చిరి. చిరునవ్వుతో గూడిన ముఖపద్మముగల, గురుగుహుని తల్లిని, నారాయణుని సోదరిని, ఆనంద ముతో గూడియుండు మహా త్రిపురసుందరిని, ఓచిత్తమా సేవింపుము అని వర్ణించిరి.

## రెండు కళల చౌకం

ప॥ నీ నీ నీ దా దా । ప మ పా, ని ద పా, ద ప ।
ఆ - - ర్యా ం - అ భ - యా ం - -

మ గ రి స । రీ రి ని | సాసాసా గరిస । రీ రి ని సా మ గా రి ।
బాం - - భ జ - | రే - - రే- - చి - - త్త - సం

గామా । పాదా | ని నిదా పమగా రీ । గ రిగస ని సరిగమప।
త - తం - | అ - వి - - ద్యా- కా- - - ర్య-క- ల -

నిని దప । గ మ మగమప | మ గ రీ రీ సా సా । |
-నా ం- త్య- జ - - - | రే - - - - - |

సాగరీ గ మ పదని । సా నిని । ద మ పా, ద ‖ ఆర్యాం ‖
ఆ దిమ ధ్యాం తరహి తాంశివ స హి తా ం ‖

అ॥ మ గమామా మ గ రి గ । రీ రీ రీ, గ మరిగస । రీ, ని ।
సూ- - - ర్యా- - - గ్ని- చం - - - - - ద్ర -

సాసా | గారీరీగాగా । మామాపా, మ గమపా । పమగమ ।
మం- | డల- మ- ధ్య - వా - - - - సి- - -

గా రీ | గ మామామానీద । దాపాపాదపదమ । ప గమా ।
నిం - | సు ఖ - తే - - ర - ప్రవ - - - త్రి - -

ప దా, పా | పాపా దానీనీ । నిసదాని స రీ స ని । సా సా ।
నీ ం - | - స్వే త ర- ని- - వా - - సి - నీ ం

సా ని స | రీ రీ గా రీ రీ । రి గ సా ని స గ రి స రి ।
- ఆ - | చా- ర్య శి- షా్య- - ను - - - గ్ర-

నీ దా । పా దా | పాపాదాదా ని ని । దాదాపాపాదా ।
హా క   ర   ణ | శ - క్తి - ప్ర - దా - పా - ర

నీ సా̇ । రీ̣ రీ̣ |
క రు  ణా ం

మ॥సా॥ గ̇ మ̇ గా̇ గ̇ రి̇ సా̇ రి̇ స̇ । ని ని స̇ రి̇ రి̇ సా̇ ని ద ప ।
చ - ర్యాది చతుష్టయ  వితరణసమర్థతర

మ గ రి స । రి గ మ ప ‖
చ ర ణా ం  అ రు ణా ం ‖

చ॥ , , ప మపాదాదా । పాపాపాద ప దమ । పా పా । పాదా |
నం - - ద -  న - వ నో - - -  త్వా -  - ద |

నీ నీనీనీనీ । నీ దా నీ , స̇ రి̇ స̇ నీ । దా దా । పాపా |
న పు - - ష్ప - మా -  - - - -  లి -  కా ం |

పా । మామామానిద । దాపామా , ద పమగా । రీ రీ̣ ।
- వం - ద - - నా - -  - ల - -  యా -

గరిగా | సా రీ రీ̣ గా గా । మామా పా పా పా । పాదా ।
ది - - | - ప్ర - స్థా -  - -  ప - న  ది -

ద పపమ | మామా సాపమ పాపా । దపదా ని స̇ నీ నీ ।
వ్య - - - | -  -  చం - ద -  న - - క - - -

దాపా । దాదా | నీ సా̇ సా̇ రీ̇ రీ̇ । రీ̇ నీ సా̇ నీ నీ । సా̇ సా̇ !
క్ష -  ణ - | స్థ ల - శు - ద్ధి - - క - ర -

సా̇ సా̇ | సా̇ నీ నీ సా̇ సా̇ । సా̇ , రి̇ గ̇ రి̇ స̇ రి̇ రి̇ స̇ నీ , ।
ణ - | - వం - ద -  న  - - - స్తో - - - -

ని దా , । పా దా | ని స̇ రి̇ స̇ రి̇ నినిదపా । ద ప సా̇ స̇ ని
త్రా - - ది | ప - ర - - - న - - భ - - క్త -

దాపా । మద పమగా । రీ సా | రీ రీ గామామా । మాపానీ
సే - - - వ - - నాం - | మం ద ధీ - హా ర ణ

దాదా । పా , ద । ద పామ మా | మ పా పా ద నీ నీ ।
చ - ర్యా - యు - - త | మా - - న వా -

ద ప దాని స̇ రీ̇ స̇ ని । సా̇ సా̇ । సా̇ ని స̇ | రీ̇ రీ̇ గ̇ గ̇ రీ̇ రీ̇ ।
నాం థ - - - ర్మ - మ య - స్వ - | చ్ఛం ద - శి వ

రి̇ గ̇ సా̇ ని స̇ గ̇ రి̇ స̇ రి̇ । నీ దా । పా దా | నీసా̇ రీ̇ సా̇నీ ।
సా - - లో - - - క - దా - య క | చతు ర త ర

దా పా నీ స̇ ప మ ద । ప మ గ రీ । గ రి గ స ||
హా ర న ట - భై - - - - ర వీం - - ||

మ॥సా॥ పా దా ని ని ద ని స̇ ని । సా̇ స̇ ని ని రీ̇ స̇ ని ।
మంద స్మిత వి ల సి త ము ఖా ర విం దాంగు రు

రి̇ సా̇ రి̇ గ̇ । రి̇ స̇ నిదమ | (2) పా దా .. ని ద మ |
గుహాం బి - - కాం - - - | మం ద ... ం ము - |

పా ద నీ స̇ రీ̇ స̇ రి̇ నీ । నిద ప ద ని స̇ రి̇ సా̇ ని ।
కుంద సో ద రీం మ - హా - త్రి పు ర సుం ద రీ మా

ద ప మ గ । రి గ మ ప || ఆ ||
- నం ద లహ రీం ||

# 86

## శంకరాభరణ రాగం ఆది తాళం

29 వ మేళకర్త రాగము.

ప॥ గిరిజయా అజయా అభయాంబికయా ।
గిరీశ జాయయా, రక్షితోఽహం ॥

అ॥ హరిహయాది దేవతారాధితయా ।
ఆత్మస్వరూప ప్రబోధితయా ।
హరిహర గురుగుహ సమ్మోదితయా ।
ఆది క్షాంత వర్ణ వేదితయా ॥ గిరిజయా ॥

చ॥ సమయ విశేష నిర్మాణ ముఖబీజ, నిర్బీజ దీక్షా విషయకరణ ।
సమయాచరణోపయోగ ప్రజ్ఞా సామగ్రీ సంగ్రహాంతఃకరణ ।
సమయ మత ప్రతిపాద్యానుసరణ । సామాన్య విశేష
ప్రజాచరణ ।
మమత్వ నిరాకరణ, ప్రియాయుత సద్భక్తానాం, ధర్మాత్మరూప ।
సమత్వ వృత్తి వితరణ నిపుణతర సామ్రాజ్య ప్రదారుణ
చరణయా ॥ గిరి ॥

వ్యా॥ తృతీయా విభక్తి. హిమవంతుని కుమార్తెచే, పుట్టుక లేని నామెచే, అభయాంబికచే, వెండికొండకు ప్రభువైన శంకరుని భార్యచే రక్షింపబడితిని. ఇంద్రాది దేవతలచే నారాధింపబడు నామెచే, ఆత్మస్వరూపమున తెలియబడు నామెచే, విష్ణు, శివ, సుబ్రహ్మణ్యేశ్వరులతో కూడి ఆనందించు నామెచే, అ కారము మొదలు, క్ష కారమువరకు గల అక్షరములచే తెలియబడు నామెచే రక్షింప బడితిని. తగిన సమయమున, విశేషముగ నిర్మాణము చేయుచు, బీజములను, నిర్బీజ = పుట్టుకలేని విధముగా దీక్షతో

చేయు, సమయమునకు, ఆచరణమునకు ఉపయోగమగు విజ్ఞానమును అందించు అంతఃకరణముగల, శాక్తేయ సంప్రదాయమున "సమయాచారమొకటి" ఆ సమయ మతాను సారముగ సామాన్యులచే విశేష ప్రజలచే ఆచరింపజేయు, మమత్వ=నాదియను భావమును విడిపింప జేయు, ప్రేమతో కూడిన భక్తులకు, ధర్మమైన ఆత్మ రూపమున సమాన ప్రవృత్తిని కలుగజేయుటలో నిపుణత్వము గలిగి, సామ్రాజ్యము నొసగు ఎఱ్ఱనైన పాదములు గల అభయాంబికచేత నేను రక్షించ బడితిని.

## 87

### యదుకుల కాంభోజి రాగం ఆది తాళం

28 వ మే. జన్యము.

ప॥ అభయాంబికాయై అశ్వారూఢాయై ।
అభయ వరప్రదాయై । నమస్తే నమస్తే ॥

అ॥ శుభదాకారాయై సురుచిర నటన బోధాయై ।
శోభిత రదనాయై । శుద్ధ మానసాయై ।
హిరణ్య మణి కుండలాయై । హిమాచల సంతానాయై ॥అభ॥

చ॥ సరస మంత్ర తంత్ర రూపాయై ।
సకళాయై, చంద్ర శేఖర ప్రియాయై ।
పంచమకారాయై, గూఢ గుల్ఫాయై । గురుగుహ స్వరూపాయై ।
గర్వ భండ ఖండాయై । గమపదాది నుత పదాయై ।
కావేరీ తీరాయై, కమలేశ సేవితాయై ॥అభయాంబికాయై॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. అభయాంబికకై, అశ్వమును అధిరోహించి, భయమును పోగొట్టి, వరములొసగు నామెకొఱకు నమస్కా

రము. శుభము లిచ్చు ఆకారముగల, మంచి కాంతితో గూడిన నటనచే తెలియబడు, మంచి పలువరుసతో ప్రకాశించు, పరిశుద్ధ మైన మనస్సుగల, ఐదు మకారములతో గూడిన ఆకారముగల, మాయ, మంత్ర, మమత, మహిమ, మాతృ శబ్దాకారములుగల, రహస్య రూపముగల, బంగారు మణులతో కూడిన కుండలములు గల, హిమవంతుని కుమార్తెయైన, గురుగుహ స్వరూపిణియైన, గర్వించిన భండాసురుని ఖండించిన, సరసమైన మంత్ర తంత్ర స్వరూపిణి యైన, కళతో గూడిన, చంద్రుని ధరించిన శివునికి ప్రియురాలైన, కావేరీ తీరమందున్న విష్ణువుచే సేవింపబడుచున్న అభయాంబిక కొఱకు నమస్కారము.

# 88

## కేదార గౌళ రాగము ఝంపె తాళము

28వ మే. జన్యము స రి మ ప ని స
స ని ద ప మ గ రి స

ప॥ అభయాంబికాయా అన్యం నజానే ।
అజ్ఞానధ్వాన్తే । అపరోక్షజ్ఞానే ॥

అ॥ ఇభరాజగత్యాః । ఈశ్వర జగత్యాః ।
నభోమణిగత్యాః । నాదలయ గత్యాః ॥

చ॥ బాలాది నామధేయ ప్రకాశిన్యాః ।
కాలాది తత్వాంత ప్రకాశిన్యాః ।
మూలాది ద్వాదశాంత ప్రకాశిన్యాః ।
స్థూలాది మౌనాంత ప్రకాశిన్యాః ॥

మ॥సా॥ త్రైలోక్య మూల ప్రకృత్యాః స్వశక్త్యాః ।
సాలోక్య, సామీప్య, సారూప్య ముక్త్యాః ।

మాలినీ మంత్ర మయాది తంత్రోక్తాయాః ।
శూలినీ గురుగుహ స్వానుభవ గత్యాః ॥అభ॥

వ్యా॥ పంచమీవిభక్తి. అభయాంబిక కన్న ఇతరముగా నాకు తెలియదు. అజ్ఞానమును పోగొట్టి అపరోక్ష జ్ఞానమునొసగు, ఏనుగు వలె నడచు, ప్రపంచమునకు నాయికయై. సూర్యగమనముగల, నాద, లయను పొందిన, బాలా మొదలైన నామములచే ప్రకాశించుచు, కాల గమనతత్త్వమును తెలియజేయుచు, మూల మొదలు పన్నెండు చివరవరకు ప్రకాశించుచు, స్థూల, సూక్ష్మ కారణ దేహముల వీడి మానముతో సమాధి వరకు ప్రకాశించుచు, మూడులోకముల మూలప్రకృతియై, తన శక్తిచే, నాలుగు విధముల ముక్తిని యొసగుచు మాలినీ మంత్రముతో గూడిన తంత్రములయందు చెప్పబడిన, శూలినీ నామముగల గురుగుహమూర్తికి అనుభవమునందు నిలచిన అభయాంబ కంటె వేరు నాకు తెలియదని, తెలిసినది ఆమెయొక్క తత్త్వమే. అని సిద్ధాంతీకరించిరి.

## 82

## కేదార రాగం ఆది తాళము

29వ మే. జన్యం. స మ గ మ ప ని స
స ని ప మ గ రి స

ప॥ అంబికాయాః, అభయాంబికాయాః ।
తవ దాసోఽహం, ఆది జగదంబికాయాః ॥

అ॥ శంకరాది హరి శశి ప్రముఖోపాసిత । నవ యోగిన్యాః ।
సాంఖ్య, తారకామనస్క రాజయోగిన్యాః । శివభోగిన్యాః ।
బింబ ప్రతిబింబ రూపిణ్యాః । బిందు మండల నివాసిన్యాః ।
స్వరూపిణ్యాః ॥

చ॥ యమ నియమాష్టాంగ యోగ విషయాది నిగ్రహ కరణ ।
మూలాధార మణిపూరకాద్యబ్జ భేదన స్ఫురత్కుండలినీ ।
సహస్రదళ బ్రహ్మరంధ్రస్థ కమలాంతర్గత శివ సమ్మేళన గళిత ।
పరమామృత బిందు సేచన, సముజ్జృంభిత నాడీ వికాస కరణ ।
నిజానుభూతి యోగిన్యాః ॥

మ॥సా॥ అమోఘ పరశివ సారూప్యానందానుభవ ప్రదాయిన్యాః ।
అప్రమేయ గురుగుహాది జనన్యాః । బ్రహ్మాది
పంచకారిణ్యాః ॥అంబికాయాః॥

వ్యా॥ షష్ఠీ విభక్తి. తల్లికి, అభయాంబికయొక్క, ఆది జగదంబికయొక్క దాసుడను. ఇందు అద్వైత తత్వమును నిరూపించిరి. శంకరుడు, విష్ణువు, చంద్రుడు మొదలైన ముఖ్యులచే, నుపాసింపబడిన నవయోగినీ గణములతో గూడిన, సాంఖ్యము, తారకము, అమనస్కము. రాజయోగములు గల యోగినులతో గూడిన, శివభోగినియైన, బింబము పరాశక్తి ప్రతిబింబము ఆమెయొక్క ప్రతిరూపమైన ఈజగత్తు అనగా సాకార నిరాకార రూపిణియైన, శ్రీచక్రమండలి నవావరణమగు "బిందు" మండల మందు నివసించిన స్వరూపముగల తల్లికి దాసుడను. చరణ మంతయు యోగసాధనము. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి యను అష్టాంగ యోగముచే నిగ్రహమొనర్చిరి, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆగ్నేయాది షట్చక్రముల భేదించి, మూలాధారమందున్న కుండలినీ శక్తిని, సహస్రదళములతో కూడిన కమలమున, బ్రహ్మరంధ్రము నుండి స్రవించు అమృతబిందు పానము చేసి, ఆత్మను పరమాత్మయందు రమింపజేసి అనుభూతిని కలుగజేయు యోగిసకి గొప్పదైన పరమశివుని రూపమును బొంది ఆనందానుభూతిని కలిగించుచు, గురుగుహాదుల తల్లికి, బ్రహ్మాది పంచభూతములకు కారణమైం అభయాంబిక యొక్క దాసుడనని యోగతత్వ

రహస్యమును ప్రబోధించిరి. మరియు సంగీతము యోగము. మంద్ర, మధ్య, తార స్థాయిలలో, బ్రహ్మగ్రంధి యందు పరావాక్కుతో నున్న ఓం కార నాదమును, మూలాధారము నుండి బయటకు లాగి, నాడీ గమనమే లయమై, సంచారమే కుండలినీ గమనమై, నాదము నందు మనస్సును లయింప జేసి, నాదానందాను భూతిని పొంది, దేహ భ్రాంతిని వీడి ఆ పరాశక్తియే, నాదము. నాదమునుచ్చరించు గాయకుడు, వినుశ్రోత, సర్వమును ఆజగన్మాత రూపమున నుపాసించుటే యోగమని, యోగ రూపమున ఆ అభయాంబను కీర్తించిరి. ఈ యోగశాస్త్రము సద్గురువుల వలన నేర్చుకొని యభ్యసించ దగినది.

## 90

## శహన రాగం త్రిపుట తాళము

28 వ మే. జన్యం. స రి గ మ ప మ దా ని స

స ని దా ప మ గా మ రి గ రి స

ప॥ అభయాంబాయాం భక్తిం కరోమి ।

సచ్చిదానంద రూపాయాం స్వస్వ రూపాయాం ॥

అ॥ విభవాది వితరణ నిపుణ మంత్రిణ్యాం ।

విజయ కారణ నిపుణతర దండిన్యాం ।

వియదాది భూతకిరణ మాలిన్యాం ।

వికల్ప హరణ నిపుణ శూలిన్యాం ॥

మ॥సా॥ అభేద ప్రతిపాదితాయాం । ఆది గురుగుహ వేదితాయాం ।

సభేశ మోదిత నటనాయాం । సాయుజ్య ప్రద చరణాయాం

॥ అభ ॥

వ్యా॥ సప్తమీ విభక్తి. అభయాంబిక యందు భక్తిని చేయుచున్నాను. సత్, చిత్, ఆనందరూపిణి, స్వస్వరూపిణి యందు, విభవమనగా, అష్ట విభూతులు, అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి ప్రాకామ్యము, ఈశత్వం, వశిత్వమను అష్ట విభూతులను ఇచ్చుటలో నిపుణమైన మంత్రిణి, విజయమునకు కారణమైన దండము ధరించిన, ఆకాశాది పంచభూత కిరణములే మాలగా ధరించిన, వికల్పములను పోగొట్టుటలో నిపుణత్వముగల శూలమును ధరించిన, ఏకత్వమును ప్రతిపాదించిన, ఆదిగురుగుహునిచే తెలుపబడిన, చిత్సభకు ప్రభువైన నటరాజునకు ఆనందము చేకూర్చు నటనగల, సాయుజ్యముక్తి నొసగు పాదములుగల అభయాంబిక యందు భక్తిని చేయుచున్నాను, కలిగియున్నానని మాయవరం నందలి, మయూరనాథ స్వామిని, అభయాంబను ఈవిధముగా కీర్తించిరి.





# కంచి ఏకామ్రేశ్వర, కామాక్షీ కృతులు

శ్రీ ముత్తుస్వామిదీక్షితులు కంచిలో కొంతకాలము నివసించిరి. ఆ కాంచీపురమున, ప్రసిద్ధిగన్న ఆలయములు, ఏకామ్రేశ్వరాలయము, కామాక్షీ ఆలయము. విష్ణుకంచిలో వరదరాజస్వామి దేవాలయము. మరియు అనాది పీఠమైన "కామకోటి" పీఠము గలదు. ఆ పీఠాధిపతులచే శాక్తేయ సంప్రదాయానుసారము అర్చనాదులు జరుగుచుండును. ఏకామ్రేశ్వరునిపై మూడు కృతులు, కామాక్షీ దేవిపై అనేక కృతులు రచించిరి. ఒక్కొక్క ప్రదేశమున రచించిన కృతుల సమూహామును కూర్చి ఒకేచోట జేర్చిన వరుసగా నుండునని, ఆవిధముగా చేర్చి, వ్యాఖ్యానముల వ్రాయుట జరిగినది. గాన పాఠకులు గమనించగలరు.

---

## ఏకామ్రనాథేశ్వర కృతులు

## 91

## పూర్వ కళ్యాణి రాగము ఆది తాళం

53వ మే. జన్యం.

స రి గ మ ప ద ప స
స ని ద ప మ గ రి స

ప॥ ఏకామ్రనాథం భజేఽహం । శ్రీ ॥ఏకామ్రనాథం॥

అ॥ ఓంకార రూపం శివం । ఓషధి మూల వరం । కాలకాలహరం।
కర్మభేదనకరం, జ్ఞానరూప సుఖదం । శ్రీగురుగుహ ముదం ॥

చ॥ పంచాక్షర మంత్ర రూపం । ప్రసన్న రూపం । ప్ర
పంచాతీత సద్యోజాతాది పంచముఖం । సుముఖం ॥

మ॥సా॥ ప్రకటిత కామకోటి పీఠస్థితం ।
ప్రసిద్ధ మఖాది నుత కామాక్షీ సహితం ॥ ఏ ॥

వ్యా॥ ఏకామ్ర నాథుని నేను సేవింతును. ద్వితీయావిభక్తి. ఒకటైన మామిడిచెట్టు క్రింద వెలసిన స్వామి యగుటచే "ఏకామ్ర నాథేశ్వర" నామము ప్రసిద్ధిగాంచినది. ప్రణవమైన ఓంకార రూపుని మంగళప్రదుని ఓషధికి మూలమైన వానిని, యముని కాలమును హరించు వానిని కర్మభేదమును చేయువానిని, జ్ఞానరూపమైన సుఖము నిచ్చు వానిని, కుమారస్వామికి సంతోషమును కలిగించు వానిని, నమశ్శివాయ యను పంచాక్షర రూపుని, ప్రసన్నరూపుని, ప్రపంచ మునకు అతీతమైన, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు అను ఐదు ముఖములుగల వానిని, మంచి ముఖము గలవానిని, ప్రకటింపబడిన ప్రసిద్ధమగు కామకోటి పీఠమున నున్న వానిని, యజ్ఞాదులలో నుతింపబడు కామాక్షీ దేవితో గూడిన ఏకామ్రేశ్వరుని నేను సేవింతును అని వర్ణించిరి. ఇందు రాగ నామము లేదు.

# 92

## చతురంగిణి రాగం ఆది తాళము

66 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ ఏకామ్ర నాథేశ్వరేణ సంరక్షితోఽహం ॥ శ్రీ ॥

అ॥ మూకముఖ్య వాక్ప్రద నిపుణేన । ముని గురుగుహ సన్నుతేన ।
పాకశాసనాది పూజిత వర పంచాక్షర స్వరూపేణ ॥

చ॥ కాంచీపుర విలసిత ప్రభావేన । పంచభూతాత్మకేన శివేన ।
వాంఛితార్థ ప్రదేన । చతురంగ బలేశ్వరీ మోహితాకారేణ ॥

వా॥ తృతీయా విభక్తి. ఏకామ్రనాథునిచేత నేను సంరక్షింపబడితిని. కంచిలో ఒక చరిత్రకలదు. మూగవాడు కామాక్షి ఏకామ్రనాథుల దయచే మాటలువచ్చి ఐదువందల శ్లోకములతో కీర్తించుటచే ఆదేవులకు "మూకవాక్ప్రదాయక, మూకవాక్ప్రదాయిని" అను బిరుదు గలిగెను. ఆశ్లోకములను "మూకపంచశతి" యందురు. ఆవిషయమును తెలుపుచు, మూగవానికి మాటలనిచ్చిన, మునియైన గురుగుహునిచే నుతింపబడు వానిచే, ఇంద్రాదులచే పూజింపబడిన పంచాక్షర స్వరూపునిచే, కాంచీపురమున వెలసి, కోరిన కోర్కెలు దీర్చువానిచే, చతురంగ బలేశ్వరీ = రథ, గజ, తురగ, పదాతులను చతురంగ బలములందురు. వానికి నాయకియైన కామాక్షిచే మోహింపబడిన ఆకారము గలవానిచేత రక్షింపబడితిని. ఇందు చతురంగ బలమనుచు, రాగ నామమునుగూర్చిరి.

## 93

## వీరవసంత రాగం రూపక తాళము

24వ మే. జన్యం. స గ రి మ ప స

స ని ద ని ప మ గ రి గ రి స

ప॥ ఏకామ్రనాథాయ నమస్తే । ఏకానేక ఫలదాయ ॥ ఏ ॥

అ॥ పాకశాసనాది దేవవందితాయ । వరదాయ ।
మూక ముఖ్యవాక్ప్రదాయ । మూల కంద ముక్తిదాయ ॥ఏ॥

చ॥ కామాక్షీ మోహితాయ । కామిత ఫలద నిపుణాయ ।
కుమార గురుగుహాత్మజాయ । కరవిధృత కురంగాయ ।

కామజనక పూజితాయ । కమనీయ కంధరాయ ।
కాంచీ పురి విలసితాయ । కలికల్మష వినాశాయ
॥ఏకామ్రనాథాయ॥

వ్యా॥ చతుర్థీవిభక్తి. ఏకామ్రనాథునకై నమస్కారము. ఒకేసారి సర్వ ఫలములొసగు వానికొఱకు, ఇంద్రాది దేవతలచే నమస్కరింపబడు వానికై, వరములొసగు వానికై, మూగవానికి మాటల నిచ్చిన వానికై, ముక్తికి మూలమైన వానికై, కామాక్షి చే మోహింపబడిన వానికై, చేతియందు లేడిని ధరించిన వానికొఱకు నమస్కారము అని సామాన్య పద జాలముతో అర్థమగు రీతిలో రచించిరి.

# కంచికామాక్షి కృతులు

## 94

## కళ్యాణి రాగం త్రిశ్రఏకతాళము

ప॥ కామాక్షీం, కళ్యాణీం । భజేఽహం, భజే ॥

అ॥ కామకోటి పీఠవాసినీం । నిరంజనీం ॥

చ॥ సామరస్య సంప్రదాయ కులోత్తీర్ణ యోగినీం ।
సంసార భయ భంజనీం । చిదానంద విలాసినీం ।
కమలేశాది పాలినీం । కంజ లోచనీం ।
కుమార గురుగుహ జననీం । సంపత్కరీం, ధనినీం ॥కామాక్షీం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. కామాక్షిని, కళ్యాణిని, నేను సేవింతును. కామకోటి పీఠమందున్న, నిరంజనిని, అందరకు అందుబాటులో నున్న సంప్రదాయముచే సమయాచార సంప్రదాయము=

అనగా అర్చనా విధానముచే కులోత్తీర్ణ యోగినులతో కూడిన సంసార భయమును పోగొట్టునామెను, శాశ్వతానందముతో విలసిల్లు చున్న, బ్రహ్మవిష్ణ్వాదులను పాలించుచున్న, పద్మ పత్రములవంటి విశాలనేత్రములుగల, కుమారుడైన కుమారస్వామి తల్లిని, ఐశ్వర్య మొసగు ధనవంతురాలైన కామాక్షిని భజించుచున్నాను. కళ్యాణి రాగ నామమును కూర్చిరి. కామక్షీ = అనగా కోర్కెలను తీర్చు అందమైన నేత్రములు గలది. చూపు మాత్రమున నే కోర్కెలు దీర్చు తల్లి. కామాక్షిని వర్ణించిరి. కల్యాణి రాగమున స్తుతించుట విశేషము.

## 95

## సుమద్యుతి రాగం రూపకం

59 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ కామాక్షీ, కామకోటి పీఠవాసిని । మామవ ॥

అ॥ కౌమారి కుసుమద్యుతి, హేమాభరణ భూషిణి ॥

మ॥సా॥ సమస్త సామ్రాజ్య దాయిని । సద్గురు గుహజనని ॥ కా ॥

చ॥ కమలేశ సోదరి । కమలాక్షీ, నారాయణి ।

నాదబిందు కళాస్వరూపిణి । కాత్యాయని ।

మ॥సా॥ కామకళా ప్రదర్శిని । కళ్యాణ గుణ శాలిని ॥కామాక్షీ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. సుమద్యుతి రాగమును సింహేంద్ర మధ్యమ రాగ మందురు. ఈకృతులలో సామాన్య పదజాలముచే రచించుట చేత ప్రతిపదార్థము వ్రాయునవసరము లేదని, సంగ్రహ ముగా వ్రాయుట జరిగినది. కామాక్షీ, కామకోటి పీఠవాసినీ! పుష్ప ములవంటి కాంతిగల, బంగారు ఆభరణములచే నలంకరింప బడిన,

విష్ణుమూర్తి సోదరీ! నారాయణీ! నాదబిందు కళాస్వరూపిణీ! గురుగుహజననీ నన్ను రక్షించుమని వర్ణించిరి. సుమద్యుతి రాగ నామమును కూర్చిరి.

## 96

## చామరం ఆదితాళము

56 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ ఏకామ్రేశ్వర నాయకీం । ఈశ్వరీం, భజ రేరే మానస ॥

అ॥ మూకముఖ్య వాక్ప్రదాయినీం । ముక్తిప్రద గురుగుహ పాలినీం॥

చ॥ కాంచీనగర నివాసినీం । కైవల్యప్రదాయినీం నళినీం ।
కలికల్మష నాశినీం । ప్రపంచ ప్రకాశినీం । భక్త విశ్వాసినీం ।
వాంఛిత ఫలప్రదాయినీం । సదానంద విలాసినీం ।
శంభు మోహినీం ।
పంచదశాక్షరీం । ప్రసిద్ధ కామేశ్వరీం । కంజలోచనీం
॥ ఏకామ్రేశ్వర ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. కంచిలో ఏకామ్రేశ్వరుని ఆలయమునకు, కామాక్షీ ఆలయములకు కొంత దూరముగనదు. వేరు వేరు ఆలయములు. అయినను ఆమె ఏకామ్రేశ్వరుని నాయకిగా, పత్నిగా ప్రసిద్ధిగాంచినది. ఏకామ్రేశ్వర నాయకిని, ఈశ్వరిని, కాంచీ నగర నివాసినిని, కైవల్య మొసగు నామెను, పద్మరూపిణిని, కలికల్మషముల హరించు నామెను, 15 అక్షరముల మంత్ర రాజస్వరూపిణిని, ఓ మానసమా! భజించుమని, మనస్సునకు, ఆమె గుణగణవిశేషములతో తెలియజేసిరి. రాగనామములేదు.

## 97

## శుద్ధదేశి రాగము రూపకం

20వ మేళకర్త జన్యము — స రి మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ కామాక్షీ, మాం పాహి । కరుణానిధే । శివే ॥

సమిష్టిచరణం॥ కామకోటి పీఠవాసిని । గురుగుహ విశ్వాసిని ।
కామిత ఫలప్రదే । విశుద్ధ చక్రస్థితే ।
అతిశుద్ధ దేశిరాగ నుతే । సకళే, సురవినుతే ।

వ్యా॥ సంబోధన. కామాక్షీ నన్ను రక్షించుము. షట్చక్రములలో నొకటియగు విశుద్ధ చక్రమందున్నదానా ! అతి శుద్ధ దేశి రాగముచే నుతింపబడుచు, అన్ని కళలతో కూడిన కామకోటి పీఠ వాసినీ ! నన్ను రక్షించుమని ప్రార్థించిరి.

## 98

## శుద్ధసావేరి రాగం రూపకం (దేవక్రియ)

29 వ మే. జన్యం. — స రి మ ప ద స
స ద ప మ రి స

ప॥ ఏకామ్రేశ నాయికే, శివే । శ్రీకామాక్షి, పాహిమాం ॥

అ॥ ఏకామ్రేశ గృహేశ్వరి, శంకరి, శాతోదరి, సద్భక్త వశంకరి ॥

చ॥ కామ జనక మోదిత పూర్ణఫలే। కామకళే, విమలే, కరకమలే,
పామర జనపాలిని, గురుగుహ జనని, శుద్ధసావేరి నుతా
నందిని ॥ ఏ ॥

వ్యా॥ సంబోధన. ఏకామ్రేశ నాయికయైన ఓ కామాక్షీ

నన్ను రక్షించుము. కావున జనకుడైన నారాయణునిచే సంతోషింప బడి సంపూర్ణ ఫలములిచ్చినదానా! శుద్ధసావేరి రాగముచే నుతింప బడి ఆనందించు గురుగుహుని తల్లీ ! రక్షించుమని కొనియాడిరి.

## 99

## సౌగంధినీ రాగం ఆదితాళం

37 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ కామకోటి పీఠవాసిని । సౌగంధిని ।
మామవ గురుగుహ జనని రంజని ॥

అ॥ సామగాన లోలే శ్రీజాలే । సద్గుణశీలే కృపాలవాలే ॥

మ॥సా॥ శ్యామలేఽతి కోమలేఽతి లలితే ।
సకల భువన జనని, దురిత భంజని ॥

వ్యా॥ సంబోధన. 37 వ మేళకర్త రాగముగు సౌగంధినీ రాగ మును సాలగమని యందురు. సుగంధము గలదియను భావముతో ఓ శ్యామలా! నన్ను రక్షించుమని ప్రార్థించిరి.

రెండు కళల చౌకం

ప॥ పా మ గ రి స సా । ని ధ ధ ధ । సా గ రి | గమ గ రి మ ద
కా మ కో - టి పీ ఠ వా - సి ని సౌ- | గం ధి ని మా-

ప మ గ గ । రి స ధ గ । రి గ మ ప ద మ ॥ సా సా ॥
మ వ గు రు గు హ జ న ని - రం జ ని ॥ - - ॥

అ॥ సా మ గ రి మ ప ద ప మ । పా ని ద । సాం సాం
సా మ గా - న లో - - - లే శ్రీ - బా లే

రీం గ రిం సాం నీ । ద పా మ । గా , రి సా
స ద్గు ణ శీ లే కృ పా ల వా - లే

మ॥సా॥ పా ద పా మ పా ద నీ ద ద ప సాం । సం ని ద ని ద ప ద ప।
శ్యామ లే తి కో మ లే తి ల లి తే స క ల భు వ న జ న

మ ప గ రి స రి గ మ
ని దు రి త భం జ ని ॥ కామ ॥

## 100

## రసమంజరి రాగం త్రిశ్ర ఏకతాళము

72 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ శృంగార రసమంజరీం । శ్రీ కామాక్షీం గౌరీం ।
శ్రితజన కల్పవల్లరీం, చింతయేఽహం ॥

అ॥ అంగారకాది గ్రహదోష నివారణ కరీం । అ
నంగ కుసుమాది శక్తి ప్రియకరీం । ద్విస ప్తతి । రా ।

మ॥సా॥ గాంగ రాగ మోదినీం । మ । తంగ భరత వేదినీం ।
మంగళ దాయినీం, రసిక । పుంగవ గురుగుహ జననీం ॥శృం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. శృంగార రస స్వరూపిణియైన కామాక్షిని, రసమంజరీరాగముతో చింతింతును. అంగారకుడు మొదలైన గ్రహములవలన కలుగు దోషములను నివారించు నామెను, అనంగ కుసుమాది = అనంగుడు మన్మథుడు, ఆయన బాణములు పుష్పములు. అరవిందం, అశోకం, చూతము, నవమల్లిక, నీలోత్పల

ములు. ఈపంచబాణముల శక్తిచే శివునికి ప్రేమను కలిగించి, పార్వతీ పరిణయ మొనర్చిన శృంగార మూర్తి మన్మథుడు. గాన అటువంటి శక్తిగల వానికి ప్రియము కలిగించు నామెను, ఇట ద్విసప్తతి రాగాంగ రాగమోదినీం = 72 రాగాంగ రాగములచే నానందించు నామెను, రాగము అనురాగము చేకూర్చునది. అనురాగము శృంగార రసమునకు ప్రధానమైనది. మతంగ, భరతాదులు తెలుసుకొనినది, మంగళ ప్రదురాలు రసిక పుంగవుడైన గురుగుహుని తల్లిని, నేను చింతించుచున్నాను. అని రసమంజరి రాగమున, నవరస మంజరి యైన, కామాక్షిని, శృంగార రసమంజరిగా చివరి మేళకర్త యగు 72 వ రాగాంగ రాగమున, రాగ స్వరూపిణి గా వర్ణించిరి. దీక్షితులు 72 వ మేళకర్త రాగములయందు కృతులు రచించిరి.

## 101

## కమలా మనోహరి రాగం ఆది తాళం

27వ మే. జన్యము — స గ మ ప ని స / స ని ద ప మ గ స

ప॥ కంజ దళాయతాక్షీ, కామాక్షి ।
కమలా మనోహరి త్రిపురసుందరి ॥

మ॥సా॥ కుంజర గమనే, మణిమండిత । మంజుల చరణే, మామవ శివ।
పంజరశుకి, పంకజముఖి, గురుగుహ । రంజని దురిత భంజని,
నిరంజని ॥ కంజ ॥

చ॥ రాకా శశివదనే, సురదనే । రక్షిత మదనే, రత్న సదనే ।
శ్రీ కాంచన వసనే, సురసనే । శృంగారాశ్రయ మందహాసనే ॥

మ॥సా॥ ఏకానేకాక్షరి, భువనేశ్వరి ।
ఏకానందాఽమృతఝరి, భాస్వరి ।

ఏకాగ్ర మనో లయకరి, శ్రీకరి ।
ఏకామ్రేశగృహేశ్వరి, శంకరి ॥ కంజ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. పద్మము రేకుల వంటి కన్నులుగల కామాక్షీ! లక్ష్మియొక్క మనస్సును హరించిన త్రిపురసుందరీ! గజగమనము గల, మణులతో ప్రకాశించు కోమల మైన పాదములు గల, శివుని బాహు పంజర మందున్న చిలుకవైన, పద్మమువంటి ముఖముగల, కామాక్షీ నన్ను రక్షించుము. ఏకాక్షర, అనేకాక్షర స్వరూపిణీ, ఏకానంద = ఒకటైన, అద్వైతానంద అమృత రస ప్రవాహినీ, నిశ్చలమైన మనస్సు నందుండు, ఏకామ్రనాథుని రాణి వైన శంకరీ నన్ను రక్షించుము. ఇందు "కమలామనోహరి" పదమున రాగ నామమును, అంత్యప్రాసాక్షర పదములు, శుకి, ముఖి, వదనే, రదనే, మదనే, సదనే, వసనే రసనే, హసనే మొదలగునవి గానము నకు యమకముగా, ఉత్సాహముగ నుండును. "ఏక" శబ్దమును నాలుగు వివిధ భావములలో కూర్చుట రచనా వైశిష్ట్యమును తెల్పు చున్నవి.

## రెండు కళల చౌకం

ప॥ సా స్స ని దా పా మ గ । గమగా సాస ని । సా గ మ ప ని ॥
కం జ - ద ళా యతా - - క్షీ - కా- - మా - - క్షీ

ని ద పా ద పదప గామప గమ । గా స్స ద ప ద మ ప ।
క - మ లా - - - మనో- - హ రి త్రి - పు - ర -

గ మ ప నీ స్స గా ॥ (2) సా స్స ని ... । మ ప గ మ గా సా ॥
సు ం - - ద రి ॥ కం జ - ... నో - - - హ రి ॥

అ॥ నీ స గ స గ గా మా గ మ పా ద ప । పా ద ప ని ని సా । 
కుంజ ర గ మ నే - మ ణి మం డి త మం జు ల చ ర ణే

సానిదపమగస | (2) నీ స గ స గ గా మా ... ని ని సా |
- -- -- - - | కుంజ ర గ మ నే - ... చ ర ణే |

సా నీ స గ స గ | గా మ గ స ని సా ని ద ప మ
- మామా వ శి వ | పం జ ర శు కి పం క జ ముఖి

గ మ ప ని । సా నిదప నిదప । దపమమగమపని ‖ కం ‖
గు రు గు హ రం జనిదు రితభం -జ ని ని ర ం జని ‖

చ॥ పా ద ప ద మ మాగమ గపమా । గాస ని । స గ గ గమ |
రా కా- - - శ శి- వ- ద నే- సు ర ద నే - - |

మాగమాగ స ని ధ ఫ నీ । ని సా గ । స గ గ మ పా |
- ర - క్షి త మ ద - నే - ర త్న స ద నే - - |

ప గ మా ప ని ని ద దా । పా ప గ । మ ప నీ | సా , గా
శ్రీ - కాం చ న వ - స నే - సు ర స నే | శృం గా

సా ని ద । పా ద ప దమమా । గా ప మ గ స ‖
రా - శ- య మం - - ద హా స - నే - ‖

మ॥సా॥ నీ సా ని ధ సా ని ని స స గా మ ప । పదప మమపమా ।
ఏ కా నే - కా క్షు రి భు వ నే శ్వ రి ఏ - కా - నం దా

గ మ గ స గ మప ప ‖ పదపా ని ని సా గ గ స గ
మృత ఝు రి భా - స్వ రి ‖ ఏ-కా గ్ర మ నో ల య క రి

సా స ని । సాని ద ప దపమ । గ మగ స గమపని ‖ కలి ‖
శ్రీ క రి ఏ కా- మే -శగృ హే- శ్వరి శం క రి ‖

# 102

## బిలహరి రాగము ఆది తాళము

29వ మే. జన్యం. స రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ కామాక్షి, వరలక్ష్మి, కమలాక్షి, జయలక్ష్మి । శ్రీ ॥కామాక్షి॥

అ॥ కామజనక పూర్ణఫలే, సకలే । కామితార్థ ప్రదాయిని, శ్రీఫలే॥

మ॥సా॥ కామకళే, విమలే, కరకమలే ।
కామకోటి బిలహరి నుత కమలే ॥ కా ॥

చ॥ దినకర కోటి ప్రకాశ కాయే । దేదీప్యమాన దివ్యచ్ఛాయే ।
వనజాసనాది వందిత పాయే । వామదేవ పరబ్రహ్మజాయే ॥

మ॥సా॥ మనన ధ్యాన ధ్యాతృ ధ్యేయ ।
మహనీయ సామ్రాజ్యప్రదాయే ।
సనక సనందనాది భిజ్ఞేయే ।
సదయే,సరస గురుగుహ సహాయే ॥ కా ॥

వ్యా॥ ఇది సంబోధన ప్రథమా విభక్తి. ఈకృతిని రెండు విధములుగ గానము చేయుచున్నారు. కంచి కామాక్షిపై రచించినదిగా కొందరు, లక్ష్మీదేవిపై రచించిన విధముగా కొందరు, పాడుచున్నారు. కామాక్షి= కంచి యందున్న పార్వతి, 2 కోర్కెలు దీర్చు నేత్రములు గల వరలక్ష్మి, జయలక్ష్మి యని, (1) కామజనకుడు విష్ణుమూర్తికి సంపూర్ణ ఫలమొసంగునది, పార్వతి, లక్ష్మి ఇరువురు కావచ్చును, శ్రీఫలే = సంపద, మంగళములు, శుభఫలము లొసగునది, కామకోటి బిలహరి నుత= బిలహరియుత, కమలే నుత అంటే పార్వతి, యుత అంటే లక్ష్మి. వామదేవ పరబ్రహ్మ జాయే = శివ పరబ్రహ్మకు భార్యయైన. (2) వా సు దే వ పరబ్రహ్మ జాయే =

వసుదేవుని కుమారుడు వాసుదేవుని భార్య లక్ష్మి. సరస గురుగుహ సహాయే=కుమార స్వామికి సహాయము మొనర్చి నది అని. గౌరి, లక్ష్మికి సంబంధించిన భావములతో పాడుట వినుచున్నాము. కామాక్షి యని లక్ష్మి అష్టోత్తర శత నామ స్తోత్రమున కలదు. "బిలహరియుత" వాసుదేవ పరబ్రహ్మ అని మార్చి పాడితే లక్ష్మిపరముగ, బిలహరి నుత, వామదేవ అంటే పార్వతీపరముగ అన్వయించును. గాన వారి వారి మనోగత భావముల ననుసరించి పాఠాంతర రూపమున గానము చేయుట సమంజసము. ఇందు క్రియా పదములేదు. ఇదియొక విచిత్ర రచన.

రెండు కళల చౌకం

ప॥ సా స నినిద పా పమగా । రిగప గరిసా । స ని ని ధ సా |
కా మా--- - క్షి- - --- వ-ర ల - - - క్ష్మి |

పమగ రి సరిగరి సా । స ని దప । మ గ గ పదరి || కామాక్షి ||
కమలా- - --- క్షి జ యల- క్ష్మి - శ్రీ- - - ||

అ॥ గామగరిగపా । ద ప దా , రి । స ని ద ప | దా స రి మగ రి ।
కామజనకపూ ర్ణ ఘ లే - స క లే - | కా మితా ర్థ - దా

స ని ద ప । ద మగా ప ద |
- - యిని శ్రీ- - ఫ లే

మ॥సా॥ సా ని దపా పమగా గరిస రి సా । సామగాపదప ।
కా మ క ళే విమ లే కరక మ లే కామకోటిబిల

ద రి స ని గ ప ద రి || కామాక్షి ||
హ రి ను త క మ లే - ||

చ॥ పద సనిదా పా పమగా । పమాగ । రి గమగ రీ | సా సని నిధ
దినక-ర కో టి- - ప్రకాశ కా- - - యే | దేదీ- - -

ప మ గ రి । ప మ గా । దా ద ని పా | మగప దసరీ గ ।
ప్యమా- న ది - వ్య చ్ఛా- - యే | వనజా - సనాది

సారిగ రిస । ని ప ద రి | సా రి స ని దపద । స ని పా మ గ
వం- ది- మా- యే- | వా మ దే- వపర - - బ్రహ్మా-

రి మ గ ప రీ ||
జా- - - యే ||

మ॥సా॥ మ గ గ రి స నినిధధ స రి గ గ ద పా ।
మ న న - ధ్యా - న - ధ్యా- తృ - ధ్యే - యే
మ గ పా ద సా గ । రి స ని ప దా రీ |
మ హా నీ య సాంమ్రా - జ్య - ప్ర దా యే |
స రి గ రి సా ని దా ప మ గ పా దా । స నిదాపమగగ ।
స న క స నం ద నా ది భి - జ్ఞే రే యే స దయేసర సగు
రి రి స స దా ద రి || కామాక్షి ||
రు గు హా స హా యే - ||

# 103

## హిందోళ రాగం రూపకం

20 వ మే. జన్యం. స గ మ ద ని స
స ని ద మ గ స

ప॥ నీరజాక్షి, కామాక్షి, నీరద చికురే త్రిపురే ॥

అ॥ శారదా, రమా నయనే । సారస చంద్రాననే ।

మ॥సా॥ వారిజపాదే, వరదే, తారయ మాం, తత్వపదే ॥నీర॥

చ॥ గౌరి హిందోళద్యుతి, హీర మణిమయాభరణే ।
శౌరి విరించి వినుత శివ శక్తిమయ నవా వరణే ॥

మ॥సా॥ నారీ మణ్యాద్యర్చిత, నవనాథాంతః కరణే ।
సూరిజన సంసేవిత, సుందర గురుగుహ కరణే ॥నీరజాక్షి॥

వ్యా॥ సంబోధన ప్రథమ. పద్మములవంటి, కోర్కెలు దీర్ఘ నేత్రములుగల, మేఘమువలె నల్లనైన కురులు గల త్రిపుర సుందరీ! సరస్వతి, లక్ష్మి ఇరువురు నేత్రములుగా గల, పద్మము, చంద్రునివంటి ముఖముగల, పద్మములవంటి పాదములుగల, వరము:లొసగు తత్వ పదరూపిణి యైన కామాక్షీ నన్ను తరింప జేయుము. గౌరి, హిందోళ కాంతిని ధిక్కరించు మణులతో గూడిన ఆభరణములు ధరించిన దానా, హరి, బ్రహ్మ హరుల శక్తులతో కూడిన నవావరణ రూపిణి! నారీమణులచే అర్చించబడి, నవనాథుల అంతః కరణమందున్న, బుద్ధి మంతులచే సేవింపబడుచున్న అందమైన గురుగుహుని జన్మను కలిగించిన కామాక్షీ నన్ను తరింప జేయుము. ఇందు నీరజ, నీరద, సారస, వారిజ అనుపదములు నేత్ర, ముఖ, పాదములకు విశేషణ పదములను వాడుట, ఆనంద. కరుణ, శాంత రస సూచకములు.

ఒక కళ చౌకం

ప॥ నీదమాగ । సా ని ధ నీ । నీ ధ ని స ని । సా గ గ మా, ని ||
నీరజా క్షి కా మా - క్షి నీ ర ద చికు రే త్రి పు రే - ||

అ॥ సా స్ల నీ ని । దా మ గ మా । నీ ని ద నీ । సా గ సా, |
శా ర దా ర మా న య నే సా ర స చం ద్రా న నే - |

మ॥సా॥ నీ సగ సానీ స్ననిదా । మానిద మాగా స గమా ॥
వా రి జ పాదే వరదే తా రయమాంత త్వ పదే ॥

చ॥ సా , గ సా । స్నీ ధా ని స । స్నీ సమగమ । గ సగగమా
గా రి హిం దో ళ ద్యుతి హీ రమణిమ యా - భరణే

దామమగా । సగమనినిద । మానిని ద మ । నీ దనిసా
శౌ రి వి రిం చివినుతశివ శ క్తిమయన వావర ణే

మ॥సా॥ నీ నీ స గ సా సా ని ద । మనిదా దామా నిదనీ
నారీ మ - ణ్యాద్య ర్చిత న వ నా ధాంతః కరణే

సా , స నిదమామాగస । స్నీ ధ ని స గ గ మ నిదమా ॥
సూ రి జన సం సే విత సుంద ర గు రు గుహా కర ణే ॥

చిట్ట॥ నీ , ని ద మ గ గ మ మ ని ద । మా , నిదమ గగమమగస ।
స్నీ , ధ ధ ని స స గ గ మ మ । నీ , ద ద స ని స గ గ సా ।
ని స మ గ గ స ని స గ సా ని । ని గ స ని సి ద మ ని ద మా గ ।
గసాన్నిసాగమనిదాని । సగసా , నిదమగగమమ ॥ నీర ॥

# 104

## దేవరంజి రాగం త్రిశ్రఏకతాళము

15వ మే. జన్యం.

స మ ప ద ని స
స ని ద ప మ స

ప॥ నమస్తే పరదేవతే । శివయువతే, కామాక్షీ । నమస్తే, నమస్తే ॥

అ॥ సమస్త విశ్వోదయ స్థితి లయ మూల ప్రకృతే ।
సాధుజన చిత్తవృత్తే । సంగీత శాస్త్రయుక్తే ।

మ॥సా॥ విమల గురుగుహోత్పత్తే । వినోదకర సంపత్తే ।

సమస్త దేవరంజిత । సచ్చిదానంద మూర్తే ॥ నమస్తే॥

వ్యా॥ సంబోధన ప్రథమ. ఓపరదేవతా! శివుని భార్యయైన, కామాక్షీ నమస్కారమని మూడు సార్లు నమస్కారమనినారు. పరదేవతకు, శివయువతికి, కామాక్షికి మూడు ప్రత్యేక నమస్కారములు. సమస్త ప్రపంచమును సృష్టిజేసి, పోషించి, లయింపజేయు మూలప్రకృతీ. సమస్త దేవతలను రంజింపజేయు సచ్చిదానందమూర్తీ! నీకు నమస్కారములు. సృష్టి, స్థితి, లయములు మూడు. సత్,చిత్, ఆనందములు మూడు. సంగీతశాస్త్రమున మంద్ర, మధ్య, తార స్థాయిలు మూడు. రాగము, స్వరము, తాళములు మూడు తౌర్యత్రికము, త్రిలోకములు, త్రిపుర సుందరి గాన, మూడు రూపములకు మూడుసార్లు నమస్తే అన్నారు.

రెండు కళల చౌకం

ప॥ సమామాప । మదాపనీ । సనిస దపా । పా మా సా |
నమస్తేప రదేవతే శివయువతే కామాక్షీ |

పనీ సా ప । మా సా సా ||
నమస్తేన మస్తే - ||

అ॥ పమామపా । పా, దపా । నిదదప పా । మా ప నిసా |
సమస్తవి శ్వోదయ స్థితిలయమూ ల ప్రకృతే |

మ॥సా॥ సా మ మ మ సా స పా నీ । సా పా ప మా మ సా సా ।
సా ధు జ న చి త్త వృ త్తే సం గీ త శా స్త్ర యు క్తే

| | | | |
|---|---|---|---|
| పమమ స ప ప దా పా నీ | స్ నీ దపమ సా పా సా | సమామ | |
| విమల గు రుగు హోత్పత్తే | వినోద కర సంప త్తే | సమ స్తే | |
| సా , స్ నీ ద ప | సా ప దా పా ప మా మా | నమ స్తే | |
| దే వ రం జిత | స చ్చిదా నం ద మూ ర్తే | | |

# 105

## సాళంగ నాట రాగము త్రిపుట తాళము

15వ మేళకర్త జన్యము — స రి ప మ ప ద స
స ద ప స ని స ద ప మ గ రి స

ప॥ అవ్యాజ కరుణా కటాక్షీ । అనిశం, మామవ కామాక్షీ ॥

అ॥ రవ్యాది నవగ్రహోదయే । రసాళంగ నాటక క్రియే ।
దివ్యాలంకృతాంగాశ్రయే । దీనావన గురుగుహ ప్రియే ।

మ॥సా॥ సవ్యాప సవ్య మార్గస్థే । సదా నమస్తే । శుకహ స్తే
॥ అవ్యాజ ॥

---

వ్యా॥ సంబోధన ప్రథమ. అపారమైన దయతో కరుణించు నేత్రములుగల కామాక్షీ ఎల్లప్పుడు నన్ను రక్షించుము సూర్యుడు మొదలైన నవగ్రహముల నుదయింపజేయుదానివి, రసముతో గూడిన అళంగ నాటక క్రియ జేయుదానివి. దివ్యమైన అలంకారములతో నొప్పుచున్న, దీనులను కాపాడు గురుగుహునకు ప్రియమైన, సవ్య, అపసవ్య మార్గముల నడుపు కామాక్షీ, చేతియందు చిలుకను ధరించిన దేవీ నీకు నమస్కారమని, సాళంగ నాట రాగమున వర్ణించిరి.

రెండు కళల చౌకం

ప॥ రీ . మా ప । ద ప మా । గ రీ స
అ వ్యా జ క రు ణా క టా క్షి

ధ స పా రి మ । గ రి రీ । రి స స ని
అ ని శం మా - మ వ కా మా - - క్షి

అ॥ ద మ పా ద ప । మా గ రి । రి స రీ । ధ సా రి మ గ ।
ర - వ్యా ది న వ గ్ర హో - ద యే ర సా ళం గ

రీ మ ప । ప ద పా । దా సా దా । రి సా ద । ద ద పా
నా ట క - క్రి యే ది వ్యా లం కృ తాం గా - శ్రి యే

మా గా రి స । ధ ప మ ప । ప ధ సా
దీ నా వ న గు రు గు హ - ప్రి యే

మ॥సా॥ సా ద ద ప పా ప మ గ రి స ।
స వ్యా - ప స వ్య మా - ర్గ -

రీ స ధా రి స ని । సా ద ప మ గ రి స
ధ స్థే స దా న మ - స్తే శు క హ - స్తే -

## 106

## కనకాంబరి రాగం త్రిశ్రఏకతాళము

1 వ మేళకర్త. సంపూర్ణము.

ప॥ కనకాంబరి కారుణ్యామృత లహరి ।
కామాక్షీ, మామవ, కామేశ్వరి ॥

అ॥ దినకర చంద్ర తేజః ప్రకాశకరి ।
దేవి, మహా త్రిపుర సుందరి, శంకరి ॥

చ॥ త్రైలోక్య మోహనాది చక్రేశ్వరి ।
త్రైపద పరబ్రహ్మ మహిషి, భాస్వరి ।
సాలోక్యాది ముక్తిప్రదానకరి ।
సదా శివకరి, గురుగుహోదయకరి ॥

మ॥సా॥ మూలాది నవాధారేశ్వరి, శుభకరి ।
నీలాలక కళాధరి । నిత్యానందకరి ।
లీలా విశ్వోత్పత్తి స్థితి లయకరి ।
బాల, పరమేశ్వరి, పంచదశాక్షరి ॥ కన ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. బంగారపు వస్త్రముగల, కరుణ యనే అమృతముతో గూడిన కామాక్షీ, కామేశ్వరీ నన్ను రక్షించుము. ఇందు త్రైలోక్య మోహనాది చక్రేశ్వరి మొదలైన పదముల అర్థము. కమలాంబా నవావరణ కృతులలో తెలియజేయ బడినది. కనకాంబరి, మొదటి రాగాంగ రాగము, కామాక్షియొక్క నిరాకార తత్వమును తెలియజేసిరి.

రేండు కళల చౌకం

ప॥ స రి మా ప మ । గా రీ సా । ని ధ ఫ ధ సా |
క న కాం బ రి కా రు ణ్యా మృ త ల హ రి |

రీమా,ప । దా ని ద పాదమ । గా రి సరి గ రి రీ ‖ కన ‖
కామాక్షీ మామవ కా- - మే - -- శ్వ - రి ‖

అ॥ పదనిదపా । మాగా గరి రిస । రీ , పమప | మా ప ద సా ।
దినకరచం ద్ర తే జః -ప్ర కాశ క రి | దే వి మ హా

ష రి గ రి సా । ని ద పాదపమా గ రి ‖ కన ‖
- త్రి పు ర సుం ద రి శం- - క రి ‖

చ॥ సా రీ ప మ । మమపా దప । గా గ రి రీ స రి | సా రి గ రి స ।
త్రైలోక్యమో - హనాదిచ - క్రే - - శ్వరి | త్రైపదపర

స నీ ధ ఫ ధ । స రీ, మ మ । పాదాని ని । ద పా దా స ।
- బ్రహ్మమహి షిభా స్వ రి సాలోక్యా- ది ము క్తి ప్ర

రీ , గ రి రి । స నీ దపద । ప ద ప మ గా । గారిగ రిస ‖
దా న క రి స దా శివక రి గు రు గు హా - దయకరి ‖

మ॥సా॥ సా నీ ధ ఫ ధా సా రీ । మ మ ప ప ద ప దా సా స స ।
మూలా ది న వా ధా రే శ్వ రి శు భ క రి సీ లా ల క

స స నీ దా పా , ద ద స | రీ సా నీ దా పా మా ।
ధ రి ని త్యా నం ద క రి | లీ లా వి శ్వో త్ప త్తి

ప ప మ గ రి స రీ మా ప ద ।
స్థి తి ల య క రి బ్రా లా ప ర

సా ని ద పా ద ప మా గ రి ‖ కన ‖
మే శ్వ రి పం చ ద శా క్ష రి ‖

# 107

## గమకక్రియ రాగం రూపకం

53 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ కామాక్షి, మాం పాహి । కరుణాకరి, శంకరి ॥

సమిష్టిచరణం॥ కామకోటి పీఠవాసిని । గురుగుహ విశ్వాసిని ।
కామిత ఫలదాయిని, కంజలోచని । ఏ ।
కామేశ మనోల్లాసిని, శ్రీపుర వాసిని, రంజని
॥ కామాక్షి ॥

వ్యా॥ ఇది ముత్తుస్వామి దీక్షితుల సోదరుని మునిమనుమడు, అంబిదీక్షితులు అను ముత్తుస్వామిచే రచించబడినది. ఈ యన గురుగుహ ముద్రతో 10 కృతులు రచించిరి. వానిలో ఇది ఒకటి.

# 108

## సరస్వతీ మనోహరి రాగం ఆది తాళం

28 వ మే. జన్యం. స రి గ మ ద స
స ద ని ప మ గ రి స

ప॥ సరస్వతీ మనోహరి, శంకరి । సదానంద లహరి, గౌరి, శంకరి ॥

అ॥ సరసీరుహాక్షి, సదాశివ సాక్షి ।
కరుణా కటాక్షి, పాహి కామాక్షి ॥

మ॥సా॥ మురహారిసోదరి, ముఖ్య కౌమారి ।
మూకవాక్ప్రదానకరి, మోదకరి ॥ సర ॥

చ॥ అకారాద్యక్షర స్వరూపిణి । అంతఃకరణ రూపేక్షు చాపిణి !
ప్రకాశ పరమాఽద్వైత రూపిణి । పరే, త్రిపుర సుందరి, తాపిని ॥

మ॥సా॥ ప్రకల్పిత ప్రపంచ ప్రకాశిని ।
ప్రసిద్ధ గురుగుహ జనని, పాలిని ।
వికల్ప జటిల విశ్వ విశ్వాసిని ।
విజయ కాంచీ నగర వాసిని ॥సరస్వతీ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. సరస్వతియొక్క మనస్సును హరించిన, శంకరి, ఎల్లప్పుడు ఆనందముతో నుండు, గౌరీ, పద్మములవంటి కన్నులు గల, సదాశివునికి సాక్షిగానున్న, కరుణతో గూడిన

చూపులుగల కామాక్షీ రక్షించుము. విశేషణ పదములు, మురహారి సోదరి. మూక వాక్ప్రదానకరి అని సగుణ రూపమును, అకారాది అక్షర స్వరూపిణి, అంతః కరణ రూపిణి మొదలైన పదములు నిర్గుణ నిరాకార రూపమును, కాంచీ నగరమందున్న ఏకామ్రేశ్వర నాయకి యైన కామాక్షీ దేవిని 14 కృతులలో వర్ణించి, గానమొనర్చిరి

## రెండు కళల చౌకం

ప॥ స నీ ద పా మగమా । ద ద రీ । స రి గ గా మ రీ ।
స ర స్వ తీ మ-నో హా రి శం - - - - క రి ।
స దా స ని పమగ గ మ । రీ స ధ రిసరీ । గమదదాదరీ ॥
స దా న ర ం - ద ల హా - రి గౌ - - -రి శం - - - క రి ॥

అ॥ సరిసాన్ని ధా రి । సరీ గ । మమాదప । మగ మాదదా స ని ।
సరసీ రు హాక్షి సదాశి వ సా-క్షి । క రు ణా కటా క్షి -
పా మ గ । గ మా రి ।
పా హి కా - మా క్షి ।
గ గమరిసాన్నిధ రీ రి గామారి । గా గ మా మ దా ।
మురహారసోదరిముఖ్యకౌమారి మూ క వా క్ప్ర దా
ద గ రి సా ని ద రి ॥ సరస్వతీ ॥
న క రి మోద క రి ॥

చ॥ స దా ద ని పా మా। ప మా ప । మ గ మ మ ।
అ కా రా - - ద్య క్ష ర స్వ రూ - పి ణీ ।
రీ గా గ మ రి రి । రి స న్ని ధ । గా గ మ రీ ।
అంతః క ర ణ రూ - పే - క్షు చా పి - ణి ।

స ప మ ప మ గ మా । దా ద స్ । ని ద పా
ప్రకా - శ ప ర మా ద్వై త రూ - పి ణి

ప మ గ గ మ రి స ని । ధ రి సా । ని ధ పా
ప రే - త్రి పు ర సుం ద రి తా - పి ని

మ॥సా॥ స నీ ధ పా ద పా మా ప గామరి । గ గామ ద ద స రి ।
ప్ర క ల్పి త ప్ర పం చ ప్ర కాశిని ప్ర సి ద్ధ గు రుగుహ

దస్సనిపామదా । రి రీ రి గ మ రి సా ని దా పా మ గ ।
జననిపాశి ని - వి క ల్ప జ టి ల వి శ్వ వి శ్వా సి ని

రి గ మ రీ , సా । రి గ మ ని దా ద రి ॥ సర ॥
వి జ యకాం చీ న గ ర ని వా సి ని

## నాదలక్షణము

శ్లో॥ నకారం ప్రాణనామానం । దకారమనలం విదుః
జాతః ప్రాణాగ్ని సంయోగాత్ । నాదఇత్యభిధీయతే ॥

(2) బ్రహ్మగ్రంథిస్థితో నాదః । క్రమాదుర్ధ్వపథేచరన్ ।
నాభిహృత్కంఠ మూర్ధాస్యేష్వావిర్భవతి సధ్వనిః ॥

(3) ననాదేన వినాగీతం । ననాదేన వినాస్వరః ।
ననాదేన వినారాగః । తస్మాన్నాదాత్మకంత్రయం ॥



# మధురాంబా మీనాక్షీ కృతులు

దక్షిణ దేశమున ప్రసిద్ధిగన్న క్షేత్రములలో మధుర ఒకటి. ఆ ప్రదేశమును కదంబ వన మందురు. అచట సోమ సుందరేశ్వరుడు మీనాక్షీ దేవితో వెలసియుండిరి. శ్రీ దీక్షితులవారు మధురను సందర్శించి, అందు కొంతకాలము నివసించిరి. ఆసమయమున మీనాక్షీ దేవిపై అనేక కృతులు, మధురాంబ యని, మీనాక్షి యని రచించిరి. సాధారణముగ, కంచి కామాక్షి, మధురమీనాక్షి, కాశీ విశాలాక్షి దేవతా మూర్తులను భక్తులు సందర్శింతురు. మధురలో రచించిన కృతులు మధురాంబా కృతులుగ పేరుగాంచినవి.

## 109

### కళ్యాణి రాగం జంపె తాళము

ప॥ శ్రీ మధురాంబికే శ్రీశివే, అవావ ॥

అ॥ సోమ సుందరేశ్వర హృదయ నివాసిని ।
కామగిరి పీఠాధి వాసిని, కళ్యాణి ॥

చ॥ కాది, హాది, సాది మంత్ర రూపిణి, కౌళిని ।
కైవల్య దాయిని, గురుగుహ జనని ।
కదంబ కానన విలాసిని, కాత్యాయని ।
మధురవాణి, శుకపాణి, అలివేణి ॥ శ్రీ ॥

వ్యా॥ సంబోధన మధుర యందున్న తల్లీ! మంగళప్రదురాలా నన్ను రక్షించుము. సోమ సుందరేశ్వరుని హృదయమందు నివసించిన

దానా! కామగిరి పీఠమందున్న దానా! కళ్యాణీ! శాక్తేయ సంప్రదాయములో దేవీ మంత్రరాజములో క కారము మొదలుకొని, హ కారము మొదలుకొని, స కారముతో కూడిన మంత్ర స్వరూపిణీ। కదంబ వనమున విలసిల్లు, కాత్యాయనీ నన్ను రక్షించుము. కళ్యాణి రాగనామమును కూర్చి రచించిరి.

## 110

## అఠాణా రాగం త్రిపుట తాళం

29 వ మేళకర్త జన్యం.

ప॥ శ్రీ మధురాంబికయా, రక్షితోఽహం। సదానందకర్యా॥

అ॥ సోమ సుందరేశ్వర మనోల్లాసకర్యా।
కామ సంజీవనౌషధ కర్యా। సామ గాన సుఖకర్యా॥శ్రీ॥

చ॥ నామ రూప వివర్జితయా। నామ పారాయణ ప్రియయా।
సమయాచార ప్రవృత్తయా। శంకర గురుగుహ
మోదితయా॥శ్రీ॥

వ్యా॥ తృతీయా విభక్తి. శ్రీమధురాంబికచేత రక్షింప బడితిని. ఎల్లప్పుడు ఆనంద మొసగు నామెచే, సోమ సుందరుని మనస్సునకు ఉల్లాసము కలిగించు నామెచే. కోర్కెను దీర్చుటలో సంజీవనౌషధి వంటిదైన, సామ గానముచే సుఖమును కలిగించు, సమయాచారము= అర్చనాదులచే ధ్యానించబడు నామెచే, శంకరునకు, కుమారస్వామికి ఆనందము కలిగించు మధురాంబిక చేత రక్షింప బడితిని.

# 154

## నభోమణి రాగం త్రిపుటతాళము

40వ మే. జన్యం. స రి గ రి మ ప స
స ని ద ప మ గ రి స

ప॥ నభోమణి చంద్రాగ్ని నయనం । నగజా సహిత బృహదీశ్వరం ।
నమామ్యహం సతతం । సతతం ॥నభోమణి॥

అ॥ శుభోదయ కరణ నిపుణాంఘ్రిం । శుద్ధ స్ఫటిక సంకాశం ।
శ । రథేంద్ర సంసేవిత చరణం । రాజశేఖరం, భయ హారణం ॥

మ॥సా। ఋభు ప్రభృతి ముని హృత్సదనం ।
త్రిభువన కరణ మదన మథనం ॥నభో॥

వ్యా॥ ద్వితీయావిభక్తి. నభోమణి రాగమున, నభోమణి = ఆకాశమునకు మణి. సూర్యుడు, దినమణి యందురు. సూర్య,చంద్ర అగ్నులు నేత్రములుగా గల, పార్వతితో గూడిన బృహదీశ్వరుని, ఎల్లప్పుడు నేను నమస్కరించు చున్నాను. (సూర్యోదయము, శుభోదయము) శుభమును కలిగించుట యందు నిపుణత్వముగల పాద యుగ్మముగల, పరిశుద్ధమైన స్ఫటికముతో సమానమైన కాంతిగల, ఋభు మొదలైన మునుల హృదయమే గృహముగాగల, మూడు లోకములను సృజియించు మన్మథుని సంహరించిన శంకరుని నమస్కరించు చున్నాను అని కొనియాడిరి.

॥ఒక కళ చౌకం

ప॥ గ రీ మ గ రి । సా ని ధ ని సా । ధ గ రీ స ప మ ।
నభో మ ణి చం ద్రాగ్ని న య నం న గ జా స హి త

ద మ పా మ గ రి | సమా గ రీ స । త దా స్ద ద ప మ ||
బృహ దీ శ్వ ర ం | నమామ్యహం స త తం స త త ం ||

అ॥ ప సా ని ధ ని స । నీ నిదపా మ ప ద ప । నీ సా గ గ రి ।
శుభ్రో ద య క ర ణ ని‐పు ణా ంఘ్రిం శుద్ధస్ఫ టి క

సా నీ దా ప | రి సా ని దా ప । ని ని స ని ద పా ।
సం కా శం శ | ర భేం ద్ర సం సే ‐ వి త చ ర ణం

పా మ గా రి స । స ని ధ ని ని సా ||
రా జ శే ఖ రం ‐ భ య హ ర ణం ||

మ॥సా॥ గ గ్రి ప మ ప ని ని దా ని ని సా |
ఋభుప్ర భృతి ము ని హృ త్స ద నం |

స ని ధ ని ధ ప ద ప ద మ గ గ గ రి || ||
త్రిభు వ న క ర ణ మద న మ థ న ం || నభో ||

# 155

## స్తవరాజ రాగం త్రిపుటతాళము

46 వ మే. జన్యం. స రి మ ప ద స
స ని ద మ గ స

ప॥ స్తవరాజాది నుత బృహదీశ । తారయాశు మాం । దయానిధే ॥

అ॥ భవపాశ మోచన నిపుణతర । పార్వతీశ, భక్తప్రియకర ॥

మ॥సా॥ భవ గురుగుహ జనక, త్రిపురహర ।
భక్తి ముక్తి వితరణ చతుర ॥ స్తవ ॥

వ్యా॥ సంబోధన. స్తోత్రము చేయు రాజులచే నుతింప బడు ఓ బృహదీశ్వరా, దయగల స్వామీ, నన్ను వేగమే తరింపజేయుము.

జన్మ సంసార పాశమును తొలగించువాడా, భక్తిని, ముక్తిని ఇచ్చుటలో చతురత్వము గల, త్రిపుర సంహారా, నన్ను కాపాడుము అని స్తోత్ర మొనర్చిరి.

ఒక కళ చాపు.

ప॥ ద మ గా సా ని | స ని ని ప ధా స |
స్తవ రా జా ది నుత బృహ దీ శ
పా ని దా ప మ | మా ద ప మా గ సా ||
తా ర యా శుమా ం ద - యా ని ధే ||

అ॥ ప మ పా ప మా | గ స ని ద మ గ స |
భ వ పా శ మో చ న ని పు ణ శం ర
పా ని దా రి స | స సా ని ద స స |
పా ర్వ తీ శ భ - క్త ప్రియక ర |

మ॥సా॥ రి మ గ స రి స ని ద ప ప స స ద మ |
భ వ గురు గుహజ న క త్రి పు ర హ ర
పా స నీ ద రి స ని ద స ని ద ప ||
భ క్తిము క్తివి త ర ణ చ - తు ర ||

## 156

## ధవళాంగి రాగం ఖండ జాతి త్రిశ ఏకతాళం

19 వ మేళకర్త. స రి గ మ ప ద స
స నీ ద ప మ గ రి

ప॥ శృంగారాది నవరసాంగీ, బృహదంబాలింగిత పుంగవ।
ధవళాంగ, శ్రియం దేహి ॥

అ॥ అంగారకాది వినుతాంగజ త్రిపురారే ॥
మ॥సా॥ గంగాధర, వృషభ తురంగ, సత్సంగ ।
భయభంగ, గురుగుహాంతరంగ, శ్రీ మహా లింగ ॥శృం॥

వ్యా॥ సంబోధన. శృంగార రసాది నవరస స్వరూపిణి యైన బృహదీశ్వరిని, ఆలింగన మొనర్చు పురుషుడవైన, తెల్లని శరీరము గల గంగాధరా మహాలింగా, బృహదీశ్వరా! ఐశ్వర్యము నిమ్ము. అని ధవళాంగి రాగమున వర్ణించిరి.

## 157

## వసంత రాగం చాపు తాళము

15వ మేళకర్త జన్యము స గ మ ద ని స
స ని ద మ గ మ ప మ గ రి స

ప॥ బృహదంబికాయై నమస్తే, నమస్తే ।
సమిష్టి చరణం॥ బృహదీశ మోహిత బ్రహ్మాండ స్వరూపాయై ।
బ్రాహ్మ్యాది శక్తి సంసేవిత వైభవాయై ॥
మ॥సా॥ బహువిధ నామ రూపాయై । బ్రహ్మాత్మైక్య స్వరూపాయై ।
భానుకోటి లావణ్యాయై । బాల గురుగుహ పూజితాయై
॥ బృ ॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. బృహదంబిక కొఱకు నమస్కారము. బృహదీశ్వరునిచే మోహింపబడిన బ్రహ్మాండ స్వరూపిణి కొఱకు, అనేక నామ రూపములతో నున్న కోటి సూర్యుల కాంతిగల, బ్రహ్మ, ఆత్మ స్వరూపిణి కొఱకు నమస్కారమని, తంజాపురిలోని, బృహదీశ్వరునిపైని, బృహదీశ్వరి, బృహన్నాయకి పైన 21 కృతులతో వర్ణించి స్తోత్ర మొనర్చిరి.



# శ్రీ లక్ష్మీ కృతులు

శ్రీ దీక్షితులవారు శ్రీరంగ క్షేత్ర సందర్శన సమయమున, శ్రీరంగధామేశ్వరి యైన లక్ష్మీదేవిపై, కృతులు రచించిరి. లక్ష్మీ పరమైన కృతులలో లక్ష్మీవిశేషణ పదములలో "లలితాం, గిరిజాం, కామాక్షీం" అని వాడిరి. శ్రీ చక్రవాసిని, త్రిపురసుందరి, రాజ రాజేశ్వరి యైన, లలిత, ఇందిర, సరస్వతి ఒకే మూర్తులుగా సిర్ణయించి నామ భేదమే కాని, రూప భేదము లేని, అద్వైత మూర్తులుగా భావించి రచించి యుందురు. అదేవిధముగా, కామాక్షీ, వరలక్ష్మీ, యను కృతిలో రెండు భావములు గోచరించు నట్లు రచించిరి గాన, ఆయా కృతులలోని భావములు గమనించ గలరు.

## 158

## మంగళ కైశికి రాగం మిశ్రజాతి ఏక తాళము

15వ మే. జన్యం. స మ గ మ ప మ ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ శ్రీ భార్గవీ భద్రం మే, దిశతు ।
శ్రీభార్గవీ, శ్రీరంగ ధామేశ్వరీ ॥

అ॥ సౌభాగ్యలక్ష్మీ, సతతం మామవతు ।
సకల లోక జననీ, విష్ణుమోహినీ ॥

చ॥ మదన గురుమానినీ, మమ మనసి తిష్ఠతు ।
మధుకర విజయ మంగళ కైశికా నివసతు ।
సదన మధ్యే మహాలక్ష్మి సదా విహరతు ।
సామజ హేమ కుంభ స్నాపితా విజయతు ॥

మ॥సా॥ పద, నయనానన, కర నళినీ ।
పరమ పురుష హరి ప్రణయినీ ॥
వదన కమల గురుగుహ ధరణీ ।
వరనుత । రంగ నాథ రమణీ ॥ శ్రీ॥

వ్యా॥ ప్రథమావిభక్తి. శ్రీభార్గవీ = భృగు వంశమున జన్మించిన ది గాన భార్గవి. శ్రీరంగ క్షేత్ర నాయకి యైన భార్గవి నాకు భద్రమును కలుగ జేయునుగాక. సౌభాగ్యము నొసగు లక్ష్మి ఎల్లప్పుడు నన్ను రక్షించుగాక. సకల లోకములకు తల్లి, విష్ణుని మోహించిన, మన్మథుని తండ్రియైన విష్ణుని భార్య, మంగళ కైశికా రాగరూపిణి, నామనస్సునందు కూర్చొని యుండుగాక. తుమ్మెదలను జయించిన, మంగళ ప్రదమైన కేశములు గల, లక్ష్మి నివసించుగాక, గృహము యొక్క మధ్య యందు, అనగా తనచే నిర్మించబడిన గృహమునందు అని, దేహమే గృహము. అందలి హృదయ మందు మహాలక్ష్మి ఎల్లప్పుడు విహరించుగాక. ఏనుగు యొక్క బంగారు కుంభ స్థలమున నున్న గజలక్ష్మి విజయము కలుగ జేయుగాక. పద పద్మము, పద్మ నయనము, పద్మ ముఖము, పద్మ కరములు గల, పరమ పురుషుడైన శ్రీహరి యొక్క ప్రణయ స్వరూపిణి, కమలము వంటి ముఖముగల, గురుగుహుని చేత, భూమి యందు శ్రేష్ఠులైన వారిచే, భూసురులచే నుతింపబడు శ్రీరంగ నాథుని భార్యయైన భార్గవి నాకు భద్రమును కలుగ జేయుగాత. అని భక్తితో, లక్ష్మి దేవిని, ఇంట, బయట, మనస్సు నందు అన్ని వేళల రక్షించు గాత !

యని ఆరు క్రియా పదములతో వర్ణించిరి. రాగ నామమును, మధుకర విజయ మంగళ కైశికా యను పదములో, కూర్చుట గమనించ దగినది. "నిత్యం సా పద్మ హస్తా మమ వసతు గృహే సర్వ మాంగళ్య యుక్తా" అను స్తోత్రమును గుర్తు చేయు నట్లు రచించిరి.

ఒక కళ చాపు

15 వ మే. జన్యం. మూ : స రి గ మ ప మ గ ప ద ని స
2 స రి మ గ ద ప స
స ని ద ప మ గ రి స

ప॥ మా, - మామా ।, మా - గమపమ గా ।, గా - మదపా ।
శ్రీ - భా గ్య వీ - - - - భ ద్రం మే
మగా - రీసా | పా, - రిమా, మా । మమా - గమపమ గా।
- ది శతు | శ్రీ - - భా - గ్య వీ - - - -
గగా - మ ద పా । మగా - రీ సా | ధా, - రీ రీ । గ రి గ -
- భ ద్రం మే - ది శతు | శ్రీ రంగ ధా - -
మపమగ । గ రి గ - రీరీ - సా, - సాసా ||
మే - - - - శ్వ - రీ - - - - - ||

అ॥ స రీ - మాగా । దని దా - పా పా । సని - దాపా ।
సౌ - భా గ్య ల - - క్ష్మీ - స త తం మా
పమా - గామా | ద పా - మాగా । గ రి గ - రీ స ని ।
- మ వ తు | స క ల లో - క - జ న -
నిసరిసరీ - , రిరిమ । గా రి - రి స రి మ ||
నీ - - - - వి - ష్ణు మోహి నీ - - - ||

చ॥ మదప - మగ ప మమా । గ రీ - రీ ప మ । గ రిగ-రీ రి స ।
మదన గురు మా- - ని నీ - మమ మనసి తిష్ఠతు

ని స - ధ రి - రి రి గ రి | మా , - గ రి స ని । స రీ -
మ - ధుక ర వి జయ | మం గ ళ కై- శి కా

నిసరిస । సరిమ - మగదా । ద పా - సా సా | సదా-రి రి రి రి ।
నివసతు సదన మ-ధ్యే మహా ల క్ష్మీ | సదా విహార తు

సా , - ని ద పా । మగా - రి సా । ధ రీ - మగ రి స |
సా మజ హే మకుం భ స్నా పి తా వి జ యతు |

మ॥సా॥ ధ ధ రి స రి - మగరిస - మమమా । పదప స ని స -
ప ద న యనా న నకర న ళి నీ పరమ పురుష

స రీ మ గ రి సా | సనిదనిద ప- మగ ద ప స స నీ ।
హరి ప్ర ణ యి నీ | వదనకమల గురుగుహ ధ ర ణి

ద ప మ గ రి ని - రి సా రి మ గ రి మ ||
వ ర ను త ర ం గ నా థ ర మ ణీ - ||

## 159

## లలిత రాగం రూపకం

15 వ మే జన్యం స రి గ మ ద ని స
స ని ద మ గ రి స

ప॥ హిరణ్మయీం లక్ష్మీం, హీన మానవాశ్రయం త్యజామి ॥

అ॥ చిరతర సంపత్ప్రదాం, క్షీరాంబుధి తనయాం ।

మ॥సా॥ హరి వక్షఃస్థలాలయాం, హరిణీం, చరణ కిసలయాం ।
కరకమల ధృత కువలయాం ।
మరకత మణిమయ వలయాం ॥హిర॥

చ॥ శ్వేత ద్వీప వాసినీం, శ్రీ కమలాంబికాం పరాం ।
భూత భవ్య విలాసినీం భూసుర పూజితాం, వరాం ।
మాతరమబ్జమాలినీం, మాణిక్యాభరణ ధరాం । సం
గీత వాద్య వినోదినీం, గిరిజాం, తాం, ఇందిరాం ।

మ॥సా॥ శీతకిరణ నిభ వదనాం । శ్రిత చింతామణి సదనాం ।
పీత వసనాం, గురుగుహ మాతుల కాంతాం ।
లలితాం ॥హిరణ్మయీం॥

వ్యా॥ ద్వితీయావిభక్తి. బంగారు మయమైన లక్ష్మిని ఆశ్రయింతును. అని చెప్పకుండగ, హీనులైన మానవులను ఆశ్రయించను. వారి ఆశ్రయమును విడిచి పెట్టుచున్నాను. "నీచాశ్రయో నకర్తవ్యః కర్తవ్యః మహదాశ్రయః" నీచాశ్రయమును విడిచి పెట్టుచున్నానని చెప్పిరి గాని, లక్ష్మిని ఆశ్రయించు చున్నానని తెలుపలేదు. "త్యజామి" క్రియాపదమే గాని, వేరు క్రియా పదము లేదు. సూర్యోదయమైనది యనిన, చీకటి పోయినదని చెప్ప నవరసము లేనట్లు, ఈకృతిలో "త్యజామి" అనగా, నిన్ను ఆశ్రయించితి నని చెప్పినట్టులే. మరి ఈకృతిలో, శాశ్వత సంపద నొసగు నామెను, పాల సముద్రుని కుమార్తెను, విష్ణుమూర్తి వక్షః స్థలమందున్న, బంగారు వన్నెగల, పాద పద్మములు గల, కమలముల వంటి చేతియందు పద్మమును ధరించిన, మరకత మణి కంకణములు కల, శ్వేత ద్వీపమందున్న, శ్రీ కమలాంబికను, పరాశక్తిని, సంగీత వాద్యములతో వినోదించు, గిరిజను, నిన్ను, ఇందిరను, చంద్రుని కాంతితో సమానమైన ముఖముగల, చింతామణి గృహమందున్న, పచ్చని వస్త్రము

ధరించిన, గురుగుహుడైన కుమార స్వామికి మేనమామ యైన నారాయణునికి భార్యయైన లక్ష్మిని, కోమలమైన లలితను, ఆశ్రయించితి నని తాత్పర్యము. ఈకృతి దీక్షితుల వారి చరిత్రలో గృహస్థ జీవిత మందలి ఒక సన్నివేశమును పురస్కరించుకొని రచించబడినది. లలిత యను పదముతో రాగ నామమును కూర్చిరి. ఇందు, గిరిజాం, లలితాం శబ్దములు పార్వతికి సంబంధించినవి. అయినను, లక్ష్మి నామములలో ఈనామము లుండుటచేత, ఏక భావనతో వర్ణించిరి. నొటేషన్‌లో "సదాభజామి" యని గలదు.

ఒక కళ చౌకం

ప॥ ద మ - మ గ రీ । సా - ధ̣ా , రి । సా రిససా - రి గామ |
హిర - ణ్మ యీం ల క్ష్మీం స దా --- భ జామి |

మ ద - మ గ రి స । ధ̣ా - ధ̣ా ధ̣ మ ధ̣ రి ।
హీ - న మా - న వా శ్ర యం - త్య

సా రి స ని̣ సా స రి గ మ ||
జా - - - మి - - - - ||

అ॥ ; మగ - గమ దా । దా - మద | మ గ । మా ద మ దా ||
చిర తర - సం - - | ప - త్ప్ర దాం - ||

నీ - ని ద ని ద - ద మ । ద ని - సా̇ సా̇ |
క్షీ రాం - - బు ధి త న యాం |

మ॥సా॥ రి̇ స̇ సా̇ నీ ని దా ద మా । మదమా గరిస ని̣ ధ̣ ని̣ సా |
హరి వ క్షస్థ లా ల యాం హరిణీం చరణ కి స లయాం |

రి స స ని ధ ఘ ధ ని స రి సా ।
క ర క మల ధృత కు వ ల యాం
మ గ రి స రి గ రి ని రి గ మా
మ ర క త మ ణి మయ వ ల యాం ॥ హిరణ్మయీం ॥

చ॥ రీ - సా సా రి స సా । ని స - రి స ధా । సీ - స రి సా ।
శ్వే త ద్వీ - - - ప వా - సి నీం శ్రీ క మలాం
రి గ - గ మ మా | దా - మ మా గ । రీగ రి - సనిసా రీ |
బికాం - ప రాం | భూ త భ వ్య విలా - --సి నీం |
సీ - స రిసని ధా । ఘ ధ - ధ రి రి స సా | సీ - సమమగ।
భూ సు-ర- పూ జి తా ం వ రాం- - | మా తర మ-
మమ - గమదా । నీ - నిదనిద మా । దని - సరిసా |
జ మా - లినీం మా ణి- -- క్యా భర ణ ధ రాం |
ని రి - స ని స ని । ద మ - మ ద నీ । దా ని ద - దమగా ।
గీ- త వా- ద్య వి నో - ది నీం గి రి - జాం తా
గ రి - స ని సా స స | (2) సనిసరి - స ని స ని । ద మ -
మిం ది - రాం స ం | గీ--- త వా - ద్య వి నో
మదనీ । దానిద - ద మగా । గ రి - స ని సా స స |
- దినీం గి రి- జా ం తా మి ం ది - రాం - |

మ॥సా॥ సాసరి - సనిధమ - ధనిసా । ని సరి గ - మాద మ దనిసా |
శీ తకి రణనిభ వదనాం శిత చిం తా మ ణి సదనాం |
ని స రి గ - రి సా , - రి స ని ద । మా మ ద -
పీ - త వ స నాం గు రుగు హ మా తు ల
మ గ మా ద ద నీ
కాం తాం ల లి తాం ॥ హిరణ్మయీం ॥

# 160

## సౌరాష్ట్రరాగము ఆదితాళం

17వ మే. జన్యం. స రి గ మ ప మ దా ని స
స ని దా ప మ గ మ రీ స

ప॥ వరలక్ష్మీం భజరే, మానస ।
వాంఛితార్థ ఫల ప్రదాం । వరదాం, వనజ పదాం ॥

అ॥ చరాచరాత్మక ప్రపంచ జననీం। సౌరాష్ట్ర దేశప తినుత ధనినీం॥
నిరామయ మహావిష్ణు మానినీం ।
నిరంజనీం, నిఖిలాఘ భంజనీం ॥

మ॥సా॥ సురార్చిత పదాంబుజ వికాసినీం ।
నిరాలంబ మానసోల్లాసినీం ।
మురారి వక్షఃస్థల నివాసినీం ।
పురారి, గురుగుహ చిద్విలాసినీం ॥

వ్యా॥ ద్వితీయావిభక్తి. ఓమానసమా, వరలక్ష్మిని భజించుము. కోరిన కోర్కెలు దీర్చు, పద్మముల వంటి పాదములుగల, ఈప్రపంచమునకు తల్లిని, సౌరాష్ట్ర దేశమును పాలించు ప్రభువులచే నుతింపబడు ఐశ్వర్య స్వరూపిణిని, మోక్ష ప్రదుడైన విష్ణుమూర్తి భార్యను, పాపములను పోగొట్టు, విష్ణు హృదయమందు నివసించిన వరలక్ష్మిని భజించు మని మనస్సుకు సంబోధించి వర్ణించిరి.

# 161

## శ్రీరాగం రూపకము

22 వ మే. జన్యము స రి మ ప ని స
స ని ప ద ని ప మ రి గ రి స

ప॥ శ్రీ వరలక్ష్మి నమస్తుభ్యం, వసుప్రదే ।
శ్రీ సారస పదే, రసపదే । సపదే, పదే పదే ॥ శ్రీ

అ॥ భావజ జనక ప్రాణ వల్లభే, సువర్ణాభే ।
భానుకోటి సమానప్రభే । భక్త సులభే ॥

మ॥సా॥ సేవక జన పాలిన్యై । శ్రిత పంకజ మాలిన్యై ।
కేవల గుణ శాలిన్యై । కేశవ హృత్ఖేలిన్యై ॥ శ్రీ ॥

చ॥ శ్రావణ పౌర్ణమీ పూర్వస్థ శుక్రవారే ।
చారుమతీ ప్రభృతిభిః పూజితాకారే ।
దేవాది నుత గురుగుహ సమర్పిత మణిమయ హారే ।
దీనజన సంరక్షణ నిపుణ కనక ధారే ॥

మ॥సా॥ భావనా భేద చతురే । భారతీ సన్నుత వరే ।
కైవల్య వితరణ పరే । కాంక్షిత ఫల ప్రదకరే ॥ శ్రీ ॥

వ్యా॥ ఇది సంబోధన, చతుర్థీ విభక్తిలో గూడిన రచన. ఓవరలక్ష్మీ నీకొఱకు నమస్కారము. బంగారము నొసగుదానా! శోభతో గూడిన, పద్మమువంటి పాదములు గలదానా! రసముతో గూడిన, శృంగార రసముతో గూడిన అందమైన పాదముగల, మోక్షప్రద పదముగల లక్ష్మీ, మాటి మాటికి నీకొఱకు నమస్కారము.

ఇది గోపుచ్ఛయతి. భావజుడు మన్మథుడు, ఆతని తండ్రి విష్ణుమూర్తి, ఆయన ప్రాణవల్లభి, భార్యవు. బంగారము వంటి కాంతి గల, కోటి సూర్యుల కాంతితో ప్రకాశించు దానా! భక్తులను తేలికగా అనుగ్రహించు దానా! సేవించు వారిని పాలించు నామె కొఱకు, ఆశ్రయించిన వారి హృదయ మందలి మాలిన్యమును పోగొట్టు నామె కొఱకు, మంచి గుణములతో నొప్పు నామెకొఱకు కేశవుని హృదయమందు నటనమాడు లక్ష్మి కొఱకు నమస్కారము. ఈ మధ్యమకాల సాహిత్యం చతుర్థీ విభక్తి. భక్తులు అనాదినుంచి, ప్రతి సంవత్సరము శ్రావణ మాసమున పూర్ణిమకు ముందువచ్చు శుక్రవారమున "వరలక్ష్మి వ్రతము" చేయుట ఆచారము. (ఆనాడు వ్రత మొనర్చి,) ఆవ్రతము చేయుటకు గల కారణమును తెలియజేయు కథ = చారుమతి యను నామెకు స్వప్నమున వరలక్ష్మి దర్శన మొసగి, కరుణించి, వ్రతము చేయు మనుట, ఆపట్టణవాసులు, ఆ సమయమున వ్రతమాచరించుట మొదలగు విషయములతో గూడిన పురాణ గాథను ఈకృతి చరణమున నుదహరించిరి. చారుమతీ మొదలైన స్త్రీలను కరుణించిన విధముగ, నిన్ను ఆశ్రయించిన వారికి సర్వ సౌభాగ్యములు చేకూర్చు, వరలక్ష్మి కొఱకు నమస్కారమని, శ్రీయనగా, సంపద, శుభము నొసగు రాగమైన శ్రీరాగమున ప్రార్థించుట ఎంతయో సముచితము. రాగము మంగళప్రదము, వరలక్ష్మి స్తుతి. సౌభాగ్యప్రదము. ఈ విధమైన రచన చేయుట దీక్షితుల వారి ప్రతిభయే. ఈకృతి యందు "సేవకజనపాలిని, శ్రితపంకజమాలిని, కేవలగుణశాలిని, కేశవహృత్కేళిని" అని పాడుటయు గలదు.

సంబోధనగాన, చివర దీర్ఘము లేకుండ పాడవలెను.

## 162

# మాధవ మనోహరి రాగం ఆదితాళము

22 వ మే. జన్యం, స గ రి గ మ ని ద ని స
స ని ద మ ప ద మ గ రి స

ప॥ మహాలక్ష్మి, కరుణారస లహరి ।
మామవ, మాధవ మనోహరి ॥ శ్రీ ॥

మ॥సా॥ మహావిష్ణు వక్షఃస్థల వాసిని ।
మహాదేవ గురుగుహ విశ్వాసిని ।
మహా పాప ప్రశమని, మనోన్మణి ।
మారజనని, మంగళ ప్రదాయిని ॥

చ॥ క్షీర సాగర సుతే, వేదను తే । క్షితీశాది మహి తే, సురహి తే ।
భారతీ, రతీ, శచీ పూజితే । భక్తి యుక్త మానసవి రాజితే ॥

మ॥సా॥ వారిజాసనా ద్యమరవంది తే । నారదాది మునిబృంద వంది తే।
నీరజాసనస్థే, సుమనఃస్థే । సారస హస్తే, సదా నమస్తే
॥ మహా ॥

వ్యా॥ సంబోధన. ఓమహాలక్ష్మి, కరుణారసముతో గూడిన దానా! మాధవుని మనస్సును హరించిన దానా! విష్ణు వక్షఃస్థల మందున్న దానా! మహా దేవునికి, కుమారస్వామికి, విశ్వాస పాత్రురాలైన, నమ్మకముగలదానా! మహాపాపములను పోగొట్టుదానా! మన్మథుని తల్లీ! మంగళములొసగు, పాల సముద్రుని కుమార్తెయైన, వేదములచే నుతింపబడుదానా! రాజులు మొదలగు వారిచే పూజింపబడినదానా! దేవతలకు హితముజేయుదానా! ఇచట, "శివసహితే" యను పాఠాంతరము గలదు. సరస్వతీ, రతీ, శచీ మొదలైన వారిచే పూజింపబడు దానా! భక్తి గలవారి మనసున ప్రకాశించు దానా!

బ్రహ్మాది దేవతలచే నారదాది ముని సంఘముచే నమస్కారములను గొనుదానా! పద్మమునందు నివసించినమంచి మనసు నందున్న, చేతి యందు పద్మమును ధరించిన, పద్మమువంటి చేతులుగల, ఓవరలక్ష్మి! నన్ను రక్షించుము. అని వర్ణించిరి. మహాలక్ష్మి మాధవుని హృదయపీఠ మందు నివసించిన దగుటచే, దీక్షితులవారు, "మాధవ మనోహరి" రాగమును ఎన్నుకొని, రాగ స్వరూపిణిగా నర్చించిరి.

### రెండు కళల చౌకం

ప॥ మపామా గ గరిగ మ । గ రిమగ రీ స ని । స గ రి గ |
మహాల క్ష్మీక-రు - ణా --- ర స - ల హ రి - |

మానిద మాగరి । స రి ని ధ నీనీ । సా ని గరిగ |
మామవ మాధవ మ- నో -- హ రి శ్రీ --- | మహా ||

అ॥ మగా గరి రిమరీ । మా మగమా । పామని |
మహా వి- -ష్ణువ క్ష స్థ - ల వాసి ని |

మగా గ రి రిగమప । ప ని దా । నీ సరి |
మహా దే- -వగురు గుహ వి శ్వా సి ని |

మ॥సా॥ సరీ పూ గ రి స ని ద ని స నీ ని ద ।
మహాపా ప - ప్ర శ మని మనో న్మ ని

మాపదమగరి మ । గరీ స ని స రి గ ||
మారజన నిమం గళ ప్రదా - యిని || మహా ||

చ॥ రీ గసాగరి స రి । నీ ని స ధ ని ధా । ని స రీ | గమాగారిమగ।
క్షీ రసాగర సు- తే -- వే -- ద ను తే | క్షితీ శాదిమహి

మాపద । మగరీ | ని స ని గరీ మ గా । మ నీ ద ।
తే శివ సహితే | భా- - ర తీ ర తీ శ చీ పూ

ద ని స రి | రి గ రి నీ ద మా । పా ప ద మా గ రి ।
- జి తే - | భ- క్తి యు క్త మా న స - వి రా -

మ గ గ రి సా ||
- - జి - తే || (సు ర హి తే)

మ॥సా॥ స్రి రి స్రి గ రీ మ గ మ పా ద మా । నీ ని దా ని స రి ।
వా రి జా స నా ద్య మ ర వం ది తే నా ర దా ది ముని

నీ గ రీ స సా | నీ ద మా ప ద మ గా రి మ గ రి సా ।
బృం ద నం ది తే | నీ ర జా స న - స్తే సు మ న - స్తే

సా ని ద నీ సా । స పా మ గా రి గ || మ ||
సా ర స హ స్తే స దా న మ స్తే - ||

## 163

## దేశిసింహారవ రాగం త్రిశ్రజాతి ఏకతాళము

58 వ మేళకర్త. స రి మ ప ని స
స ని ప మ రి గ రి స

ప॥ హరి యువతీం హైమవతీం । ఆరాధయామి సతతం ।
అఖిలలోక జననీం ॥ శ్రీ హరి యువతీం॥

అ॥ నరహరి హృదయ నివాసిని । నామ రూప ప్రకాశిని ॥

మ॥సా॥ గురుగుహ మానస రంజని । గుణిజన నుతే, నిరంజని ॥హరి॥

వ్యా॥ ఇది ద్వితీయ, సంబోధన, పదములతో గూడిన రచన. హరియువతిని, హైమవతిని ఎల్లప్పుడు నారాధించు చున్నాను. అఖిల లోకజనని అని, ఓ నరహరి యొక్క హృదయమందున్న, నామ రూపములతో ప్రకాశించు చున్న, కుమారస్వామి యొక్క మానస మందు ప్రకాశించుచున్న, గుణవంతులైన జనులచే నుతింపబడుచున్న ఓ హైమవతీ ! నిన్ను ఆరాధించు చున్నాను. ముందు పరోక్షముగ నిన్ను అని, అటుపైన ప్రత్యక్షముగ దర్శించి, పిలిచి, వర్ణించి, ప్రార్థించినట్లు తోచుచున్నది. ఇట్టివి అనుభూతితో రచించబడినవి.

## రెండు కళల చౌకం

ప॥ గ రి మ గ రీ । స్రీ ధ ని సా । సా పా ద ప । ప మ గ రి
హరి యు వ తీం హై మవ తీ మారా ధ యా - మి స త

గ రి సా ‖ గ రి స ధా ని । స రి సా ని స ‖
తం - ‖ అఖి ల లోక జ న నీం (శ్రీ) - ‖

అ॥ స రి గ రి గ స । రి ని సా స ని । పామదాప । ప స్స నీ ద ని
న ర హరి హృద యని వా సి స నామరూప - ప్ర కాశి ని

మ॥సా॥ స్స రి గ రి మా గ రి గా రి స ।
గురుగుహ మా న స రం జ ని

ని ని ద ద ప పా మ గ రి స ని ‖ హరి ‖
గు ణి జ న ను తే ని రం జ ని ‖





# శ్రీ చిదంబర నటరాజ శివకామ సుందరీ కృతులు

దక్షిణ దేశమందలి శైవక్షేత్రములలో చిదంబర మొకటి. అచట శంకరుడు నటరాజ మూర్తియై, శివకామ సుందరీ సమేతుడై, చిత్సభయందు నటనమాడు చుండును. ఆకాశ లింగరూపమున, మహామునులకు దర్శన మొసగు చుండును. అట్టి పవిత్ర క్షేత్రమును సందర్శించి, దీక్షితులవారు, పంచలింగ స్థల కృతులలో నొకటియగు, "ఆనంద నటన ప్రకాశం" అను కృతిని కేదార రాగమున రచించి, మరికొన్ని కృతులు నటరాజుపై, శివకామ సుందరిపై రచించిరి.

## 164

## తనుకీర్తి రాగం త్రిశ్రజాతి ఏకతాళము

6వ మే. జన్యం.   స రి మ ప ని స
స ని ద ని ప మ గ మ రి స

ప॥ చిదంబర నటరాజ మూర్తిం । చింతయామ్యతనుకీర్తిం ।

అ॥ మదంబా శివకామీ పతిం । మదన జనక మహిత పశుపతిం ।
వదన కమల గురుగుహ వినుతం ॥ చిదం ॥

వ్యా॥ ద్వితీయ చిదంబర నటరాజ మూర్తిని, శరీరము లేని వాడని, కీర్తి గలవానిని ఆకాశలింగరూపుని నాతల్లియైన శివకామేశ్వరీ పతిని, పశుపతిని, గురుగుహవినుతుని, చింతించు చున్నాను. "అతనుకీర్తిం" అని తనుకీర్తి రాగనామమును కూర్చి వర్ణించిరి.

ప॥ స రీ । మ ప రి మ । గా రి । సా స ని ధ ని ॥
చి దం బ ర న ట రా జ మూ ర్తిం - -

స ని ఫ - సా రి ప ॥ మ గా - రి రి సా ‖
చిం త యామ్యత ను కీ - - ర్తిం ‖

అ॥ ప నీ - పా స ని ॥ ద ని స - స రి సా |
మదం బా శివ కా - మీ - ప తిం |

మ గ రి గ రి స । ని రి స ని ద ని సా ।
మ ద న జ న క మ హిత ప శు ప తిం

స ని ప ని ప మ । గ రి రి ప స ని ధ ని ‖ చిదంబర ‖
వ ద న క మ ల గురుగుహ వి నుత ం ‖

చిట్ట : స రీ రి మా । రి ప మ మగగ రి రి ॥ స నీ ధ నీ ।

ఫ స ని ని స స రి రి ॥ స రీ మ గా । రి మ ప స ని స గ రి ॥

స సా ని ద ని । ప పా మ గ రి స ని ॥

## 165

## మాళవ శ్రీరాగం ఆది

22వ మే. జన్యం. స గ మ ప ని ద ని ప ద ని స
స ని ద ప మ గ స

ప॥ కనక సభాపతిం, భజరే మానస ।
కమనీయ చిదంబర పురీ విలసితం ॥

అ॥ సనక సనందనాది వినుత పదం ।
శివ కామేశ్వరీ మనోల్లాస కరం ।
దినకర చంద్రాగ్ని లోచనం ।
దీనార్తిహారం । గురుగుహ ముదితం ॥

వ్యా॥ ద్వితీయ. చిదంబరమునందు, చిత్సభ, కనక సభా మంటపము గలదు. అందు నాట్యము జేయు వాడుగాన, కనక సభా పతిని, అందమైన చిదంబర పురమున విలసిల్లిన, సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులచే నుతింపబడిన పదములు గల వానిని. శివకామేశ్వరి యొక్క మనస్సునకు ఆనందము కలుగ జేయువానిని, సూర్య, చంద్ర, అగ్నులు నేత్రములుగ గలవానిని, గురుగుహునకు ఆనందమును కలుగజేయు వానిని ఓమనసా! భజింపుము అని స్తోత్ర మొనర్చిరి.

## 166

## భిన్న షడ్జమ రాగము ఆది

9వ మేళకర్త. స రి గ రి ప మ ప ని స
స ద ప మ గ రి స

ప॥ చిదంబరేశ్వరం, చింతయామి । శ్రీ ।
శివానంద గంగాధరం, మృగధరం ॥

అ॥ చిదానంద నటన ప్రకాశం । శివకామ వల్లీ మనః ప్రియకరం ॥

చ॥ వాసుకి ప్రముఖాద్యుపాసితం । వాసుదేవ గురుగుహాది వందితం।
భాస్కర శశి శేఖరం, త్రినేత్రం ।
భిన్న షడ్జమ రాగనుత ప్రసిద్ధం ॥చి॥

వ్యా॥ ద్వితీయ. చిదంబరేశ్వరుని, మంగళప్రదమైన, ఆనంద మున గంగను, మృగము, లేడిని ధరించిన వానిని, భిన్నషడ్జమ రాగముతో నుతింపబడిన నటరాజును చింతించుచున్నాను. దీనిని ధునిభిన్నషడ్జమ రాగమందురు.

## 167

## కేదార రాగము ఆది

29వ మేళకర్త. స మ గ మ ప ని స
స ని ప మ గ రి స

ప॥ చిదంబర నటరాజ మాశ్రయేఽహం ।
శివకామాపతిం చిత్సభా పతిం ॥

సమిష్టిచరణం॥ చిదంబర విహారం, శంకరం ।
చిదానంద కరం, గురుగుహ వరం ।
కేదారేశ్వరం, విశ్వేశ్వరం ।
కమలాపతి నుత పదం, శశిధరం ॥

వ్యా॥ ద్వితీయ. చిదంబర నటరాజుని, శివ కామాపతిని, చిత్సభాపతిని, కేదారేశ్వరుని ఈపదమున, కేదార రాగ నామమును కూర్చి రచించిరి.

## 168

## నాటకురంజి రాగం ఆది

28వ మేళకర్త జన్యము స రి గ మ ద ని ప ద ని స
స ని ద మ గ స

ప॥ శివకామాపతిం చింతయామ్యహం ।
శ్రీ గురుగుహ పూజిత పదాంభోరుహం ॥

స॥చ॥ నవ కాళీజిత నందన ధీరం -

నాద బిందు కళా రూప మనిశమభి

నవ పురందరాది సనకాది సన్నుత

భాను కోటి సంకాశం॥ శివ ॥

వ్యా॥ ద్వితీయ, శివకామాపతియైన, గురుగుహునిచే పూజింపబడిన పాద పద్మములు గలవానిని, నవ శక్తులను జయించిన కుమారుని గన్న ధీరుని, నాద బిందు కళా స్వరూపుని, ఇంద్రాది దేవతలచే, సనకాది మునులచే నుతిగన్న కోటి సూర్యసమానుని ఎల్లప్పుడు నేను చింతించుచున్నాను. చిత్స్వరూపుడు గాన జ్ఞాన నేత్రమున గోచరించువాడుగాని, చర్మచక్షువులకు, అగోచరుడను భావమును వ్యక్తపరచిరి.

## 169

## కళ్యాణి రాగం ఆది

65 వ మేళకర్త. సంపూర్ణం

ప॥ శివ కామేశ్వరీం చింతయేఽహం ।

శృంగార రస సంపూర్ణ కరీం ॥

అ॥ శివ కామేశ్వర మనః ప్రియకరీం ।

శివానంద గురుగుహ వశంకరీం ।

చ॥ శాంత కళ్యాణ గుణ శాలినీం । శాంత్యతీత కళా స్వరూపిణీం ।

మాధుర్య గానామృత మోదినీం ।

మదాలసాం, హంసోల్లాసినీం ॥

మ॥సా॥ చిదంబర పురీశ్వరీం । చిదగ్ని కుండ సంభూత సకలేశ్వరీం ॥

వ్యా॥ ద్వితీయ. శివ కామేశ్వరిని, శృంగార రసముతో కూడిన, శివకామేశ్వరుని మనస్సునకు సంతోషమును కలిగించు,

శాంత కళ్యాణ గుణములు గల యని, "శాంత కళ్యాణి" రాగ నామ మును కూర్చిరి. చిదంబర పురీశ్వరిని, నేను చింతించు చున్నాను. లలితా నామములలో "చిదగ్ని కుండ సంభూతాయైనమః" యను నామముతో వర్ణించిరి.

## 170

## ఆరభి రాగం ఆది

29 వ మేళకర్త. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ శివకామేశ్వరం చింతయామ్యహం ।
చిదానందపూజితాంభోరుహం ॥

అ॥ శివకామేశ్వరీ మనోహరం । శ్రీ గురుగుహ భక్త వశంకరం ॥

చ॥ నాదబిందు కళా రూపమనిశం ।
నటేశ్వరం, భానుకోటి సదృశం ।
నంది తురగారోహితం, గురుగుహ మహితం ।
చిదంబర పురీ విలాసితం ॥

వ్యా॥ ద్వితీయ. శివకామేశ్వరుని, చిదానందునిచే పూజింపబడిన వానిని, నందిని గుఱ్ఱముగా ఎక్కిన వానిని, చిదంబర పురమున నున్న నటరాజును, నేను చింతించు చున్నానని, 7 కృతులలో శివకామేశ్వరిని, చిదంబర నటరాజును వర్ణించిరి.

శ్లో॥ నృత్తావసానే, నటరాజ రాజః
ననాద ఢక్కాం, నవ పంచవారమ్ ।
ఉద్ధర్తుకామస్సనకాది సిద్ధాన్
ఏతద్విమర్శే, శివ సూత్రజాలమ్ ॥

# చిదంబరమందలి గోవిందరాజ కృతులు

## 171

### ముఖారి రాగం త్రిపుటతాళము

22 వ మే. జన్యం. స రి మ ప ద ని ద స
స ని ద ప మ గ రి స

ప॥ గోవింద రాజ ముపాస్మహే, నిత్యం । (శ్రీ) ।
గురుగుహ వినోద చిదాకాశ గృహే ॥

అ॥ దేవరాజాది పూజిత దివ్య గాత్రం ।
దీనార్తిహార నిపుణతర క్షేత్రం ।
దేవకీ వసుదేవ పుత్రం, దేవ కనక సభేశ మిత్రం ।
దేశిక నుత రమా కళత్రం ॥

చ॥ నృగరాజస్య కృకలాస జన్మాపహం ।
నృపతిం, రుక్మిణీ సత్య భామాబ్జ మధులోలం ।
భగవంతం, భక్తకల్పక ధరణీరుహం ।
భద్ర పదాద్యక్త పాణి సరోరుహం । ఉ
రగ శయనం, అంఘ్రి సరసీరుహం, ఆనన జలరుహం ।
నగధరం, గోపికామోహం, నత భాగవతాది సమూహం ।
ఖగరాజ తురగారోహం । కరుణామృత రస ప్రవాహం
॥ గోవింద ॥

వ్యా॥ ద్వితీయ. చిదంబర క్షేత్రమందలి గోవింద రాజుపై రచించిరి. నిజమైన భక్తునకు, నిజ తత్వము తెలిసిన వారికి, నామ భేదమే గాని, భగవత్తత్వ మొక్కటేయను భావమునుగుర్తించి స్తోత్ర

మొనర్తురు. గోవిందరాజుని, కుమారస్వామితో వినోదించు, చిదాకాశ గృహ మందున్న, ఇంద్రాదులచే పూజింపబడు శరీరముగల, దీను లైన జనుల ఆర్తిని పోగొట్టు క్షేత్రమందున్న, దేవకీ వసుదేవుల పుత్రుని, కనక సభకు ప్రభువైన నటరాజుని మిత్రుని, నృగ మహా రాజునకు శాపముచే కలిగిన, ఊసరవెల్లి జన్మమును పోగొట్టిన వానిని, కృష్ణుని, విష్ణుని మొదలగు విశేషణ పదములతో రచించిరి. నిత్యము ఉపాసించు చున్నాను. ఇందు, అంత్య ప్రాసలు, ప్రాసాక్షరములు రచనకు, గానమునకు ఉత్సాహమును కలిగించు నవిగ కూర్చి గొప్పగా వర్ణించిరి.

## 172

## మేచ బౌళి రాగం రూపకం

15 వ మే జన్యం స రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ గోవింద రాజేన రక్షితోఽహం । సదా ॥

అ॥ గోవర్ధన గిరి ధరేణ । గోపస్త్రీ మోహితేన ॥

చ॥ వసుదేవ కుమారేణ । వాసవాది వందితేన ।
కౌస్తుభ మణి భూషితేన, కరుణా సాగర వరేణ ।
భాసమాన చిదంబర పురి విలసితేన, గురుగుహ మోదిత ।
మేచ బౌళి రాగేణ । సంతోషితేన ॥ గోవింద ॥

వ్యా॥ తృతీయా విభక్తి. గోవింద రాజునిచే, గోవర్ధన పర్వత మును ధరించిన వానిచే, వసుదేవ కుమారునిచే, కరుణా సముద్రునిచే మేచ బౌళి రాగముచే సంతోషించు వానిచే ఎల్లప్పుడు రక్షింప బడితిని యని సరస పద జాలముతో వర్ణించిరి.

## 173

## సురటి రాగము రూపకము

28 వ మేళకర్త. సరిమపనిస
సనిదపమగపమరిస

ప॥ గోవింద రాజాయ నమస్తే, నమస్తే । (శ్రీ) ॥గోవింద॥

అ॥ గోవర్ధన గిరి ధరాయ । గోపస్త్రీ మనోహరాయ ॥గో॥

చ॥ దేవకీ సుకుమారాయ । దీనార్తి భంజనాయ ।
దేవరాజ పూజితాయ । దేశిక నుత వరదాయ ॥
దేవ కనక సభేశ హితాయ । గురుగుహ నుతాయ ।
వాసవాది వందితాయ । వసుప్రద నిపుణ కరాయ ॥గో॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. గోవింద రాజుకై, గోవర్ధన ధరునకై చిదంబర నటరాజ హితునకై నమస్కారము. అని వర్ణించిరి.



శ్లో॥ గంగా తరంగ కమనీయ జటాకలాపమ్ ।
గౌరీ నిరంతర విభూషిత వామభాగమ్ ।
నారాయణప్రియ మనంగ మదాప హారమ్ ।
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥

# శ్రీ కాశీ విశ్వేశ్వర, విశాలాక్షి, అన్నపూర్ణ కృతులు

పవిత్ర కాశీ క్షేత్రమున దీక్షితులవారు 5, 6 సంవత్సరములు నివసించిరి. తరువాత దక్షిణ దేశము చేరిరి. దక్షిణ దేశమున, ప్రసిద్ధి గన్న కొన్ని క్షేత్రములను దక్షిణ కాశీ క్షేత్రము లందురు. కాశీ క్షేత్రము నంగువలె, ఆ యా క్షేత్రములలో, విశ్వేశ్వర, విశాలాక్షి, అన్నపూర్ణ, కాలభైరవ మూర్తులను ప్రతిష్ఠించిరి. అట్టి క్షేత్రములు ద్రాక్షారామము, శ్రీకాళహస్తి మొదలగునవి. అందులో "కులిక్కరై" అను క్షేత్ర మొకటి. అచటి మూర్తులను కాశీవిశ్వేశ్వర, అన్నపూర్ణ, విశాలాక్షులుగా కాశీ క్షేత్రముతో సమానముగ భావింతురు. ఆ క్షేత్రాధి దేవతలపై రచించిన కృతులు.

## 174

### కాంభోజి రాగం — అట తాళం

28వ మేళకర్త జన్యము — స రి గ మ ప ద స / స ని ద ప మ గ రి స

ప॥ కాశీ విశ్వేశ్వర ఏహి, మాం పాహి ।
కరుణానిధే, సన్నిధేహి, ముదం దేహి ॥

అ॥ కాశీక్షేత్ర సదృశాధిక ఫలద । గర్తతీర వాస, భక్త విశ్వాస ॥

మ॥సా॥ దేశిక కటాక్షేణ దర్శిత సార్వభౌమ, మహాదేవ ।
దేవదేవ, దేవనుత, రాజపూజిత దక్షిణ ॥కాశీ॥

చ॥ భవరోగ హర చతుర వైద్యలింగ విభో ।
భద్ర దాయకాంభోజ కర విభో ।
కువలయాది పంచ వదన స్వయంభో ।
కుష్ఠ రోగాపహ గర్త తీర్థ శంభో ।
రవి శశి వహ్ని నేత్ర చరిత్ర । విశాలాక్షీ కళత్ర ।
కవిజనాది సన్నుతి పాత్ర । కమనీయ గాత్ర, చిత్ర ॥

మ॥సా॥ భువన భరణ భూత గణపతే ।
భవహార నత విధి శ్రీపతే ।
శివ గురుగుహ జనక, పశుపతే ।
నవ మణి విలసిత చిత్సభాపతే ॥

వ్యా॥ సంబోధన. "కుళిక్కరై" క్షేత్ర మందలి కాశీ విశ్వేశ్వరా ! రమ్ము. నన్ను రక్షించుము. కరుణా సముద్రుడా ! దగ్గరకు రమ్ము. సంతోషము నిమ్ము. కాశీ క్షేత్రముతో సమానమైన దానికన్న, ఎక్కువ ఫలమొసగు, "గర్త"కోనేరు సమీపమున నున్న, భక్తులకు విశ్వాసము గల, యతీశ్వరులు, పీఠాధిపతుల కటాక్షము చేత, చూడబడిన చక్రవర్తి ! మహాదేవా! దక్షిణ కాశీ విశ్వేశ్వరా! సంసారమను రోగమును పోగొట్టు వైద్యుడవైన, వైద్యలింగేశ్వరా ! భద్రము నొసగు కర కమలము గలవాడా! ఈపదమున, "భద్ర దాయకాంభోజ కర విభో" అని కాంభోజి రాగ నామమునుగూర్చిరి. భూమండలమున తొలి శంకరుడవు. ఐదు ముఖములుగల స్వయంభూ లింగమూర్తే! కుష్ఠు రోగమును పోగొట్టు గర్త తీర్థమున నున్నవాడా! ఆ క్షేత్రమందలి, ఆ కోనేరున స్నానము చేసిన కుష్ఠురోగములు హరించునని ప్రతీతి. అట్టి క్షేత్రమున నున్న విశాలాక్షీ నాథా ! అని అనేక విశేషణములతో కాశీ విశ్వేశ్వరుని, ఊహించి, తాను కాశి యందుండి సేవించిన విధముగా "సన్నిధేహి, ముదందేహి" అని దగ్గరకు పిలుచుకొని మరి ధ్యానించిరి.

## 175

## నటాభరణము రూపకం

17వ మే. జన్యం. స రి గ మ ప ద ప ని స
స ని ద ప మ గ మ రి స

ప॥ విశ్వనాథం భజేఽహం, సతతం । విశాలాక్షీశం, పరమేశం ॥

అ॥ నశ్వర ప్రపంచాధిష్ఠానం । నంది తురంగ యాన మీశం ॥

మ॥సా॥ ఉచ్ఛ్వాసాఽజపా నటాభరణం ।
ఉత్తమ గురుగుహ పూజిత చరణం ॥

వ్యా॥ ద్వితీయ. విశ్వనాథుని, విశాలాక్షీ నాథుని, ఉచ్ఛ్వాస నిశ్వాసలచే అజపా నటనమే ఆభరణముగా గలవానిని అని రాగ నామమును "నటాభరణం" అని వర్ణించిరి.

## 176

## కానడ రాగము ఆది

ప॥ విశ్వేశ్వరో రక్షతు మాం ।
శ్రీ విధి గురుగుహాది పూజిత స్సతతం ॥

స॥చ॥ విశాలాక్షీ సహితానంద యుతో ।
వికల్పాది ప్రపంచోదితో ।
శశి రవి వహ్ని లోచనో । చతుర్విధ పురుషార్థ ప్రదాన
నిపుణో ॥

వ్యా॥ ప్రథమా విభక్తి. విశ్వేశ్వరుడు, బ్రహ్మ, గురుగుహాదులచే పూజింపబడు, విశాలాక్షితో ఆనందముగా నుండు, త్రినేత్రుడు నన్ను రక్షించుగాక, యని కొనియాడిరి.

# చతుర్దశ రాగమాలిక

## 177

## ఆరభి రాగము ఆది తాళం

29 వ మేళకర్త. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ శ్రీ విశ్వనాథం భజేఽహం । చతుర్దశ భువన రూప రాగ మాలికా భరణం ।
ధరణాంతః కరణం । శితజన సంసార భీత్యాపహం ।
ఆధ్యాత్మికాది తాపత్రయ మనో భీత్యాపహం ॥ శ్రీ ॥

అ॥ శ్రీ విశాలాక్షీ గౌరీశం । సకల నిష్కళ రూప సచ్చిదానంద మయ గౌరీశం ॥ చిత్ర విశ్వ నాటక ప్రకాశం । జగత్ప్రకాశ భాస్కర శశాంక కోటి కోటి ప్రకాశం ॥ గోవిందాది వినుత గాళాంగం । క్షీర కుందేందు కర్పూరాది విజయ భసితోద్ధూత గాళాంగం ॥ గురుగుహ సమ్మోహన కర లింగం । పంచీకృత పంచ మహాభూత ప్రపంచాతి మోహన కర లింగం ॥ విరించి విష్ణు రుద్ర మూర్తి మయం । విషయ పంచక రహిత మభయం ॥ నిరతిశయ సుఖద నిపుణం । నిగమ సారమీశ్వర మసురం ॥ స్మరహరం పరమ శివ మతులం । సరస సదయ హృదయ నిలయ మనిశం ॥ శ్రీ విశ్వనాథం ॥

చ॥ సదాశివం, సామ గాన వినుతం । ప్రకృత్యాది సప్త రూప సామ గాన వినుతం ॥ సన్మాత్రం, లలిత హృదయ విదితం । కామ క్రోధాది రహిత లలిత హృదయ విదితం ॥ చిదాకాశ భైరవం, పురహరం । విధి కపాల శూలధర భైరవం, పురహరం ॥ చిత్సభేశ్వరం, సారంగ ధరం । దారుకావన తపోధన కల్పిత

సారంగ ధరం ॥ సదాశ్రయామి శంకరాభరణం । చింతితార్థ వితరణ ధురీణ తర మాణిక్య మయ శంకరాభరణం ॥ సద్గతి దాయకాంభోజ చరణం । ధర్మార్థాది నిఖిల పురుషార్థప్రద సమస్త తరాంభోజ చరణం । వదాన్య దేవక్రియా ఖేలనం । సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహ కర క్రియా ఖేలనం ॥ వైద్యలింగ భూపాల పాల పాలనం । శ్రీపుర నిర్ బుతి భాగ గర్త తీర స్థిరతర భూపాల పాలనం ॥ గురు గణేశ, సుర నరేశ మనిశం । కుజ బుధాది గ్రహ గతి విహితం। వరద మనల, రవి, శశి నయనం। వనజ చంద్ర సన్నిభ వదనం । పరమ హంస మానంద నర్తనం । పతిత పావన కరణం, మద హరణం । పరతరం, పరమ మనోలయ జయం । పరాది వాక్ప్రకాశానందమయం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. రాగ మాలికారచన 17వ శతాబ్దిలో వ్యాప్తికి వచ్చినది. కొన్ని రాగములతో రచన చేసి, మాలికగా నిర్మించి, తమ రచనా వైశిష్ట్యమును, పాండితీ ప్రతిభను కనుపరచు వారు. ఇట్టి రచనలు రామస్వామి దీక్షితులు రచించిరి. 108 రాగముల మాలిక, 48 రాగముల మాలిక, నవరాగముల మాలిక, ఈవిధముగ రచించిరి. త్యాగయ్యగారు కూడ. "శత రాగరత్న మాలికచే రంజిల్లు నట హరి" అని రీతిగౌళ రాగములో వర్ణించిరి. అటులనే శ్రీ ముత్తుస్వామి దీక్షితులు 14 రాగములతో మాలికను గూర్చి, శ్రీ విశ్వనాధుని యలంకరించిరి. వెంట వెంటనే రాగములు మార్చి పాడుటకు సంగీతమునందు ప్రజ్ఞ కలిగి యుండవలెను. ఆయా రాగ ముల శ్రుతులు స్వాధీనమై, మనోధర్మము గలవారికే ఇట్టి రచనలు సాధ్యమగును. ఈ రాగమాలిక యందు, అర్థ యుక్తముగ, రాగ నామములను కూర్చుట గమనించదగినది. 1) సంసారభీత్యాపహం= సారభీ=ఆరభిని, 2) గౌరీశం=గౌరీరాగం, 3) విశ్వనాటక = నాట రాగమును, 4) గాళాంగం= గౌళరాగమును, 5) సమ్మోహనకర=

మోహన, 6) సామ గానవినుతం=సామరాగం, 7) లలితహృదయ=లలితరాగం, 8) చిదాకాశభైరవం=భైరవరాగం, 9) సారంగధరం=సారంగరాగము, 10) శంకరాభరణం, 11) సద్గతిదాయ కాంభోజ చరణం = కాంభోజి, 12) భూపాలపాలనం = భూపాల రాగము, 13) వదాన్యదేవక్రియాఖేలనం = దేవక్రియా రాగం, 14) చివరకు శ్రీరాగముతో కూర్చిరి. 14 లోకముల స్వరూపుని. "ఈశావాస్య మిదం సర్వం" 14 రాగములతో, సగుణ, నిర్గుణ స్వరూపునిగా వర్ణించిరి. మరియు శ్రీపురమునకు, (తిరువారూరునకు, నైరృతి దిక్కుగానున్న, గర్తతీరస్థిత=గుంట, కోనేటితీరమందున్న "కుళిక్కరై" క్షేత్ర నివాసియైన, శ్రీవిశ్వనాథుని, ఆ క్షేత్రమునకు, మిరాశీదారైన, వైద్యలింగ భూపాల పాలనం అని, పేరును, ప్రదేశమును తెలియజేసిరి. ఇటువంటి రాగమాలికలు గాన కచేరీల యందు గాయకుని ప్రతిభను తెలియజేయును. కచేరికి రక్తిని కలిగించును. ఇట్టి భావ, రాగ నామ కూర్పును ముద్రణాలంకారములందురు.

## 178

## సామంతం ఆది

30 వ మే. జన్యము స రి గ మ ప ద ని స
స ని ద ని ప మ గ రి స

ప॥ విశ్వనాథేన రక్షితోఽహం । విశాలాక్షీ సమేతేన ॥

అ॥ శాశ్వత గురుగుహ సంపూజితేన ।
సామంత పుష్ప మాలా ధరేణ ।
విశ్వోత్పత్తి స్థితి లయ కారణేన । గర్త తీర ప్రభావేన ॥

చ॥ కాశీ క్షేత్ర స్థిత ప్రసిద్ధేన । వసిష్ఠాది మునిగణ సన్నుతేన ।
వికల్ప రోగ వైద్య నిపుణేన । విమల గణికా నర్తన ప్రియేణ ।

ఆ(శిత జన మందారేణ । దేవాది నుత పద పంకజేన ।
సంగీత శాస్త్రాది సంయుతేన । సమస్త సామ్రాజ్య (ప్రద
శివేన ॥విశ్వ॥

వ్యా॥ తృతీయా విభక్తి. విశ్వనాథుని చేత రక్షింప బడితిని. అని సామంత పుష్ప మాలా ధరేణ = అను పమున, సామంత రాగ నామమును కూర్చిరి. ఇది "కుళిక్కరై"యను దక్షిణ కాశీ క్షేత్రమున రచింప బడినది. గణికుల నర్తనమున్న ఇష్టము గలవాని చేత, సంగీత శాస్త్రములతో కూడిన వానిచేత మొదలైన విశేషణ పదములతో కొనియాడిరి.

# 179

## పున్నాగవరాళి రాగం ఆది

8 వ మే. జన్యం. నిసరిగమపదని
నిదపమగరిసనిస

ప॥ ఏహి అన్నపూర్ణే, సన్నిధేహి । సదాపూర్ణే, సువర్ణే । మాం ॥

అ॥ పాహి పంచాశద్వర్ణే, మాం । పాహి, పంచాశద్వర్ణే ।
(శియం దేహి, రక్తవర్ణే, అపర్ణే ॥

చ॥ కాశీక్షేత్ర నివాసిని, కమల లోచన విశాలిని ।
విశ్వేశ మనోల్లాసిని, జగదీశ గురుగుహ పాలిని ।
విద్రుమపాశిని। పున్నాగ వరాళి (ప్రకాశిని ।
షట్త్రింశత్తత్వ వికాసిని । సువాసిని ।
భక్త విశ్వాసిని చిదానంద విలాసిని ॥

వ్యా॥ సంబోధన. "కుళిక్కరై" క్షేత్రమందున్న అన్నపూర్ణను

ఓ అన్నపూర్ణా ! రమ్ము, దగ్గరకురమ్ము. నన్ను నీసన్నిధికి జేర్చుము. యేబది బీజాక్షరములతో గూడిన, ఎఱ్ఱని రంగు గల ఓఅపర్ణా ! రక్షించుము. పున్నాగ వరాళి రాగముతో ప్రకాశించు దానా ! 36 తత్వములతో ప్రకాశించు దానా ! ఈకృతిని గమనించిన,

శ్లో॥ అన్నపూర్ణే, సదాపూర్ణే, శంకర ప్రాణ వల్లభే ।
జ్ఞాన వైరాగ్య సిధ్యర్థం । భిక్షాంమే దేహి పార్వతి ॥

యను శ్లోకమును గుర్తుచేయుచున్నది. సంపూర్ణ సగుణ, నిర్గుణ మూర్తిని భావించి, కీర్తించి, రచించి తరించిరి.

## రెండు కళల చౌకం

ప॥ గా రి పమ గ రి సా । రీ గమ గా । సస రీ ని̣ | నీ̣ ని̣ స ప
ఏ హి అ- - న్నపూ ర్ణే- - - - -స - న్ని | ధేహి స -

ప మగా రి ని̣ । సా , స । మా గగరిని̣ ‖ ఏహి ‖ మాం ‖
దా- - పూ - ర్ణే సు వ ర్ణే--- ‖ ‖ ‖

అ॥ గా , గ మా ప మగమ । పా మాపదపద । పమరీ రి స రిగ |
పా హి పం చా- - - శ ద్వ - - - - ర్ణే-- మాం -- |

ప మ గాగ మా ప మగమ । పా మాపదపద । పమగా రి ని̣ |
పా- - హి పం చా- - - శ ద్వ - - - - ర్ణే- - శ్రియం |

స రి గ మ ప ద దా దా , ప గరి । గా ప మ దా మ ద ।
దే- - - హి- ర - క్త వ- ర్ణే - - అ ప -

మ గా రి రి స రి ని̣ ‖
- - - - ర్ణే - - - ‖

చ॥ మగపమ పగారి స రిగా రీ స ని । పా , రి । గమగా గా ॥
కా-- - శీ - - తే - - త్ర స - వా సి ని - - - -

ని ని ని స సా పమగరి । ని స రిసరీ । సాసా ॥ (2) స సా , ॥
క మ లలో - చ- న- వి శా--లి - ని ॥ - వి

సా స ద పా ద ని దప । మపమద । పా , స ॥ పమ పా పమ ॥
శ్వే శ మ నో - - - - ల్లా- - సి - - ॥ ని- జ గ - ॥

గారిగమప ద ని - గా,మ దప- పమగరిసాపమ ॥ పమగరి సా రిని ॥
దీ -శ గురుగుహ పా - -లి - - ని-జ గ - ॥ వి - -- విద్రుమ ॥

మ॥సా॥ సారిగమాపా దనిదపామగ రి । గామపమా గా ।
పాశిని పున్నా గ-వరాళి -ప్ర కాశి ని ష ట్త్రిం

మదపదమపమగ । రీ సనిస రీ గామమ పని ద పా ।
శ త--త్వ- వి - । కాశిని సువా- సి ని భ-క్త వి

గా రి గ మ ప ద ప । గా ద ప మ గ రి ని ॥
శ్వాసి ని చి దా- - సం ద వి లా - సి ని ॥

## 180

## కర్ణాటక దేవగాంధార రాగం ఆది

22 వ మే. జన్యం, స రి స గ మ ప ద ప ని స
స ని ద ప మ గ రి స

ప॥ అన్నపూర్ణే, విశాలాక్షి । అఖిల భువన సాక్షి కటాక్షి ॥

అ॥ ఉన్నత గర్తా తీర విహారిణి । ఓంకారిణి దురితాపన్నివారిణి ॥

మ॥సా॥ పన్నగాభరణ రాజ్ఞి, పురాణి ।

పరమేశ్వరి విశ్వేశ్వరి భాస్వరి ॥

చ॥ పాయసాన్న పూరిత మాణిక్య ।

పాత్ర హేమ దర్వీ విధృత కరే ॥

కాయజాది రక్షణ నిపుణ తరే ।

కాంచన మయ భూషణాంబర ధరే ॥

మ॥సా॥ తోయజాసనాది సన్నుత పరే ।

తుంబుర నారదాది వినుత పరే ।

త్రయాతీత మోక్షప్రద చికురే ।

త్రిపద శోభిత గురుగుహ సాదరే ॥అన్న॥

వ్యా॥ సంబోధన. క్రియాపదము లేకుండ, అన్నపూర్ణను వర్ణించిరి. అన్నపూర్ణా! విశాలాక్షీ, గొప్పదైన గర్తా తీరమున విహరించు ఓంకార స్వరూపిణీ! అని ఆమె మూర్తిని ఇంకా ఈ విధంగా వర్ణించిరి. మాణిక్య మయమైన పాత్రలో దేవతా ప్రీతికర మైన పాయసము, బంగారపు గరిటెను ధరించిన దానా, బంగారు భూషణ, వస్త్రములు ధరించినదానా, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ఆధి దైవికాదులకు అతీతమైన మోక్షమొసగు తల్లీ! అని దేవగాంధార రాగమున రచింపబడినది గాని "సామ" రాగమున గానము చేయు చున్నారు. సర్వము ఆమెయే, ఆమె కన్న వేరు పదార్థము లేదను భావమున, క్రియాపదము లేకుండ వర్ణించిరి. సాక్షి. కటాక్షి, కటాక్షించు దానవు అనిఅర్థము.

# 181

## గమకక్రియ రాగం రూపకము

53 వ మే. జన్యం. స రి గ మ ప ద స
స ని ద ప మ గ మ రి స

ప॥ కాశీ విశాలాక్షీం, భజేఽహం ॥

అ॥ కాశీ విశ్వేశ్వర మనోల్లాస కారిణీం ।
కరుణారస లహరీం గురుగుహ విశ్వాసినీం ॥కాశీ॥

చ॥ కాశీపుర వాసినీం. కామిత ఫల ప్రదాయినీం ।
కలి కల్మష నాశినీం గాంధర్వ ఘోషిత గమక క్రియా మోదినీం ॥

మ॥సా॥ పాశ మోచనీం, కపాల శూలినీం పన్నగ వేణీం ।
దాస జన ముకుంద వర ప్రదాయినీం ॥కాశీ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "తిరునల్వేలి" క్షేత్ర మందున్న విశాలాక్షిపై రచించబడినది. కాని, దీక్షితులవారు కాశీ క్షేత్ర మందున్నప్పుడు రచించి యుండవచ్చునని తోచుచున్నది. లోక ప్రసిద్ధమైన మాట. కంచి కామాక్షి, కాశీ విశాలాక్షి, మధుర మీనాక్షి యని అందుకు. మరియు ఇందు కాశీ శబ్దమును మూడు పర్యాయములు వాడిరి. కాశీ విశాలాక్షి, కాశీ విశ్వేశ్వర మనోల్లాస కారిణి, కాశీపుర వాసిని, యనుటచే తాను, కాశియందున్నప్పుడు రచించి యుందురేమో ! నని తోచుట సహజము, ఇందు పైకృతుల వలె గర్తాతీర నివాసిని, శ్రీపుర నిరృతి ప్రదేశ మని గాని, తెలుప నందున కాశీలో రచించి యుండి రేమో ! లేదా, ఈక్షేత్రమును చూచి, కాశియందలి విశాలాక్షిని తలంచి అదే భావనతో రచించి రేమో ! పాఠకులు గమనించ గలరు. కాశీ విశాలాక్షిని నేను భజించు చున్నానని, కొనియాడిరి.

## 182

## పంతువరాళీ రాగం త్రిపుటతాళము

45 వ మేళకర్త.

ప॥ విశాలాక్షీం, విశ్వేశీం । భజరే మానస, సదా ॥

స॥చ॥ కాశీరాజ్ఞీం, కపాలినీం । వినోద జాలినీం, వారిణీం ।
పాశ మోచనీం, ప్రసిద్ధినీం । ఈశానీం, గురుగుహ జననీం ॥

వ్యా॥ ద్వితీయ. పంతు వరాళిలో రచించ బడిన ఈకృతి కాశీ క్షేత్రమున రచియించి యుండురని తోచుచున్నది. కె. ఆర్. రాజగోపాలన్ గారు, తమ పరిశోధన గ్రంథమున, దీక్షితులవారి కృతులు కొన్నింటికి స్థళ నిర్ణయము జేసిరి. ఈకృతికి స్థళ నిర్ణయము చేయనందున, కాశిలో నుండగా రచించి యుండురని భావన.

## 183

## భైరవ రాగం ఆది తాళము

| | |
|---|---|
| 17 వ మేళకర్త. | స రి గ మ ప ద ని స |
| | స ద ప మ గ రి స |

ప॥ కాల భైరవం భజేఽహ మనిశం ।
కాశీ పురవాసం । భూ తేశం ॥

అ॥ శూలచక్ర పాశ దండహస్తం ।
శోక మోహ వారణ ప్రశస్తం ॥

చ॥ నారదాది నుత శ్యామగాత్రం । నాగయజ్ఞసూత్రవిచిత్రం ।
క్రూరతర పాప దండన చతురం । గురుగుహ ప్రియకరం,
దిగంబరం ॥

మ॥సా॥ వారిజాసనాస్య కృంతనం । వాంఛితార్థ ఫలదాన చింతనం ।
ధీరతరం, విధి కపాల ధరణం । దేవరాజ సేవితాబ్జ చరణం॥

వ్యా॥ ద్వితీయ. కాశీ క్షేత్రమున, కాలభైరవుడు క్షేత్ర పాలకుడు. కాలభైరవ దర్శనంచేసి, కాశీయాత్ర చేసివచ్చిన వెంటనే కాలభైరవ సమారాధన చేయుట అనాది నుంచి ఆచారము. కాశీపుర వాసుని, కాలభైరవుని, భూతములకు ప్రభువును, శూల, చక్ర, పాశ, దండములు ధరించిన వానిని నేను ఎల్లప్పుడు భజింతును. ఈకృతి కాశీ క్షేత్రమందుగాని, దక్షిణ కాశీక్షేత్రమగు "కుళిక్కరై" యందలి మూర్తిపైకాని రచించియుందురు. ఏమైనను, దీక్షితుల వారి కాశీక్షేత్ర నివాసమును, గుర్తు చేయుచున్నవా యనునట్లు, విశ్వేశ్వర, విశాలాక్షి అన్నపూర్ణ, కాలభైరవులను ధ్యానించు నట్లు వర్ణించిరి. ఈకృతులు కాశీ సందర్శన భాగ్యమును కలుగజేయును. కాలభైరవుని భైరవ రాగముతో కొనియాడుట గమనించ దగినది.

## రెండు కళల చౌకం

ప॥ స ధ̣గరిసా ఫ̣ నిసరిస ధా̣ । ధ̣ ని సా రి । మపగమ రిగరిస |
కా‑ ‑‑ ల భై ‑‑‑ ర వం భ ‑ జే హ మ ‑ని ‑ శ ం ‑‑ |

గ మ గమపద ని స̇ ని గ̇రి̇ । సా̇ ద నిపద । మపమగ రిగరిస ||
కా ‑ శీ ‑‑‑ పు ర వా‑‑ సం భూ ‑‑‑ తే‑‑‑ శం‑‑ ||

అ॥ మ గమగరీ గామపా । మానిదనిదపా । మపదని సా̇ |
శూ‑ ‑ ‑ ల చ క్రపా శ దం ‑‑ డ హ‑‑‑ స్తం |

నీ గ̇రి̇రీ̇ నీ సా̇రి̇ స̇ గా । మద దనిపా । దమగా రిగరిస ||
శూ ‑‑క మో ‑ హ‑ వా రణ ‑‑ప్ర శ‑ ‑ స్తం‑‑ ||

చ॥ గా మ దా ప మ ప । ప గా మ । గా మ గ రీ
నా ర దా ది నుత - శ్యామ గా - - త్రం
ధ̣ా గ రీ స ని̣ స । గా , మ । పమదమ గా
నా గ యజ్ఞ సూ- త్ర వి చి- - - త్రం
రీ స̇ స̇ రి̇ సా̇ స̇ । దా గ̇ రి̇ సా̇ । ద ని సా̇
క్రూ ర తర పా ప దం డ - న చతు రం
ని గ̇ రి̇ సా̇ ద ప గ । మా దమగా । గ రి సా
గు రు గుహ ప్రియ క రం ది -గం బ ర ం

మ॥సా॥ స ని̣ రి సా స ధ̣ా ని̣ ధ̣ ని గ రి రి సా ।
వా - రి జా స నా స్య కృ ం - - త నం
గా రి గా మ గ మ । దా ప దా ని సా̇
వాంఛి తా ర్థ ఫ ల దా న చిం త నం
నీ గ̇ రి̇ సా̇ గ మ ప మా మ ద ని సా̇ ।
ధీ ర త రం వి ధి క పా ల ధ ర ణం
గ̇ రి̇ స̇ దా ని రి̇ ని । ద మ ప గ రి గ రి స
దే - వ రా జ సే - వి తా - బ్జ చ ర ణ ం ॥ కాల ॥

శ్లో॥ దేవరాజ సేవ్యమాన । పావనాంఘ్రి పంకజమ్ ।
వ్యాళయజ్ఞ సూత్రమిందు । శేఖరం కృపాకరమ్ ।
నారదాది యోగిబృంద । వందితం దిగంబరమ్ ।
కాశికా పురాధినాథ । కాలభైరవం భజే ॥



# నవగ్రహ కృతులు

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ।
గురు శుక్ర శని భ్యశ్చ రాహవే కేతవే నమః॥

ఆకాశమునకును, భూమికిని, అనుబంధము గలదు. సూర్య చంద్రాది గ్రహముల గమనము వలన, భూమి యందలి జీవ రాశులు సుఖ దుఃఖముల ననుభవింతురు. జన్మించి, పెరిగి, నశింతురు. జీవుల శక్తిని గ్రహించునవి గనుక గ్రహములని పేరిడిరి. ఆకాశమునందు అనేక కోట్ల నక్షత్రము లున్నను, 27 నక్షత్రములను, 9 గ్రహములను, వాటి గమనమును, వాటి శక్తిని, పూర్వ మహర్షులు పరిశోధనలు సలిపి, జ్యోతిష మను శాస్త్రమును రచించిరి. ముఖ్యముగ మానవుల జనన సమయ మందలి ఘడియలను, నక్షత్ర, తిథి, వార, వర్జ్య, యోగ కరణముల గమనించి, జాతక చక్ర నిర్మాణ మొనర్చి, 12 రాశులయందు ఆయా గ్రహముల ఉచ్ఛ, నీచ స్థితిని బట్టి శుభాశుభ ఫలముల నిర్ణయింతురు. ఆయా గ్రహముల యనుగ్రహము కోఅకు. ఆయా గ్రహముల సంబంధమైన మంత్ర జపములు, తర్పణములు, దానములు చేసి, గ్రహ శాంతిని జరిపి, శుభ ఫలములను పొందుట అనాది నుండి యాచారముగ నున్నది. శ్రీ దీక్షితులు, గానము సకలార్థ సాధకముగ గుర్తించి, మంత్రానుష్ఠాన ఫలమును గానము ద్వారా పొందవచ్చునని, మహిమాన్వితమైన జ్యోతిష శాస్త్ర విషయములను పొందుపరచి, ధ్యానించి సత్ఫల మందు విధముగా, తగిన రాగ తాళములలో నవ గ్రహ కృతులు రచించిరి. వీని మహిమము దీక్షితుల వారి చరిత్రలో గమనింప గలరు. వ్యాఖ్యానమున విశేషముల గమనించ గలరని ఆకాంక్ష.

# 184

## సౌరాష్ట్ర రాగం చ॥ ధ్రువ తాళం

17వ మే. జన్యం.
స రి గ మ ప మ దా ని స
స ని ధా ప మ గ మ రీ స

ప॥ సూర్యమూ ర్తే నమో౽స్తు తే । సుందరచ్ఛాయాధి పతే ॥

అ॥ కార్య కారణాత్మక జగ త్ప్రకాశ సింహ రాశ్యధిప తే ॥

సు॥సా॥ ఆర్యవినుత తేజ స్ఫూ ర్తే । ఆరోగ్యాది ఫలదకీ ర్తే ॥

చ॥ సారసమిత్ర, మిత్ర భానో । సహస్ర కిరణ కర్ణ సూనో ।
క్రూర పాపహర కృశానో । గురుగుహ మోదిత స్వభానో ।
సూరి జనేడిత సు దినమణే । సోమాది గ్రహ శిఖామణే ।
ధీరార్చిత కర్మ సాక్షిణే । దివ్యతర సప్తాశ్వ రథినే ॥

మ॥సా॥ సౌరాష్ట్రార్ణ మంత్రాత్మనే । సౌవర్ణ స్వరూపాత్మనే ।
భారతీశ హరి హరాత్మనే । భు క్తి, ము క్తి వితరణాత్మనే ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభ క్తి. సూర్య స్తుతి పరమైన కీ ర్తన. హే ! సూర్యమూ ర్తే ! ఓ సూర్యదేవుడా ! తే = నీకు, నమో౽స్తు = నమస్కారము. "నమస్కార ప్రియో భానుః" నమస్కారప్రియుడు సూర్యుడు. కనుకనే ఆరోగ్యాదుల కొఱకు సూర్య నమస్కారములు. అరుణము, త్రిచ విధానములతో చేయించుట వేదవిహిత ధర్మము. అందువలన ఈకృతిలో సూర్యదేవా రక్షించుము అని అనక "నమో౽స్తు" అనినారు. సుందర ఛ్ఛాయాధిపతే = అందమైన ఛాయకు అధిపతివి. సూర్యునకు, ఛాయా, సౌంజ్ఞ (ఉషా) అను ఇరువురు భార్యలు. ఛాయ, సౌంజ్ఞ యొక్క ప్రతిరూపము. కార్య కారణాత్మక = ఈప్రపంచము కార్య

కారణాత్మక మైనది. కారణము లేనిదే కార్యముండదు. "కారణం వినా న కార్యస్యోత్పత్తిః" ఈ సృష్టికి కారణము, దాని ప్రయోజన మున కాధార భూతు మైనవాడా ! అనగా, జగత్సృష్టి స్థితి లయాది కార్యములకు కారణ మైనవాడని, జగత్ప్రకాశ = ప్రపంచమునకు వెలుగు నొసంగువాడా ! సూర్యుడు లేనిదే వెలుగు లేదు. వెలుగు లేనిదే ప్రపంచము లేదు. సింహరాశ్యధిపతే = సింహస్యాధిపతి స్సూర్యః = అని జ్యోతిష శాస్త్రము. ద్వాదశ రాశులలో సింహ రాశికధిపతి సూర్యుడు. ఆర్యవినుత = ఆర్యులనగా పండితులు, వేదవిదులు, మహాత్ములు మొదలైన వారిచే నుతింపబడు వాడా ! తేజస్ఫూర్తే = తేజస్సును కలిగించు వాడా ! సూర్యుని గుఱించి

శ్లో॥ తేజో భూత మయాకారం । భాస్కరం, త్రి గుణాత్మకం ।
దివాకరం, సూర్యమూర్తిం । ప్రణమామి సదా హరిమ్ ॥

అని ఆర్యోక్తి. ఆతడు తేజోరూపుడు, తేజస్సును కలిగించువాడు, ఆరోగ్యాది ఫలద కీర్తే = ఆరోగ్యము నొసంగు వాడా! "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ " సర్వజీవులకు ఆరోగ్యము నొసంగు వా డు సూర్యుడు. సూర్యరశ్మి సోకనిదే, జీవులలో చైతన్యము, ఉత్సాహ ముండదు. కావున ఆరోగ్య ప్రదుడనిరి.

సారస మిత్ర = కమలములకు స్నేహితుడా! కమల బాంధవు డను విశేషణము సూర్యునకు గలదు. సూర్యోదయము అయిన వెంటనే కమలములు వికసించును. గాన మిత్రుడు. మిత్ర = లోకము నకు స్నేహితుడా ! సూర్యునకు 12 నామములు కలవు. 12 మంది సూర్యులు కలరు. ద్వాదశాదిత్యు లందురు. మిత్ర, రవి, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచి, ఆదిత్య, అర్క, సూర్య, సవితృ, భాస్కరేభ్యో నమః అను నామములు గలవు. భానో = "భ" అనగా కాంతి. కాంతి గలవాడా ! సహస్ర కిరణ = వెయ్యి కిరణములు గల

వాడా! ఇక్కడ సహస్ర మనగా అనంతమని అర్థము. సాధారణ
ముగా వెయ్యి సంఖ్య నందురు. పురుష సూక్తమున, సహస్రశీర్షా
పురుషః, సహస్రాక్షః, సహస్ర పాత్ ॥ ఇక్కడ విరాట్పురుషుడు
అనంత శిరములు, నేత్రములు, బాహువులు, పాదములు గలవాడని,
భగవద్గీతలో 'అనేక బాహూన్' అంటారు. కావున అనంత కిరణు
డను భావము. కర్ణసూనో = కర్ణుడు కుమారుడుగా గలవాడా!
సూర్య తేజస్సు వలన కుంతికి సహజ కవచ కుండల ములతో జన్మించి
దాన, శూర, కర్ణ అని ఖ్యాతినందిన కర్ణుడు సూర్యుని పుత్రుడు.
క్రూర పాప హర = ఘోరమైన పాపములను హరింప జేయువాడా!
కృశానో= తన వేడి కిరణములచే తపింప జేయు అగ్ని స్వరూపుడా!
గురుగుహ మోదిత స్వభానో = దీక్షితుల వారి రచనల యందలి
ముద్ర. గురుగుహ = సుబ్రహ్మణ్యేశ్వరున కానందమును గూర్చు
స్వప్రకాశము గలవాడా! సూరి జనేడిత = తత్త్వవిదులు, పండితు
లచే కొనియాడ బడువాడా! సుదినమణే = మంచి దినమునకు మణి
వంటి వాడా! "మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్" అని అమరము. ఏ
రోజున ఆకాశము మేఘములచే కప్పబడి సూర్య దర్శనము కాదో
ఆరోజును దుర్దిన మందురు. సకాలములో నుదయించి, కాలమును
తెలియ జేయు రోజునకు మంచి మణి లాగా ప్రకాశించువాడా!
ఇందు ఒకధ్వని, సకాలమున ను ద యి ం చి, అస్తమించువాడు
సూర్యుడు. కాలమును గుర్తించి క్రమబద్ధముగా జీవులు నడచి, మణి
వలె ప్రకాశించవలెనను సంకేతము. సోమాది గ్రహ శిఖామణే =
చంద్రుడు మొదలైన గ్రహములకు నాయక మణివి. "సౌర
కుటుంబము" గ్రహములన్నియు సూర్య మండలము నాధారము చేసి
కొని, సౌర శక్తిచే తిరుగుచుండును గాన గ్రహములకు శిఖామణి,
ధీరార్చిత కర్మ సాక్షిణే = ధీః యనగా బుద్ధి మంతులు అంతే కాదు.
ధీ యో యోనః = అను గాయత్రీ మంత్రానుష్ఠానమును ఎల్లప్పుడు

చేయు వారు ధీమంతులు. సంధ్యా వందనమందు సూర్యార్ఘ్యము, సూర్యోపస్థానమును చెప్పి, సవితృ మండలవాసిని యైన గాయత్రీ మంత్రోపాసన చేయు వారిచే నర్చింప బడు వాడా! జీవులు చేయు కర్మలకు సాక్షియైన వాడా! ఆగామి, సంచిత, ప్రారబ్ధ, కర్మలకు సాక్షి సూర్యుడు. అందుకే "కర్మసాక్షీ, జగచ్చక్షుః" అందురు. దివ్యతర సప్తాశ్వ రథినే = అతి దివ్య శక్తిగల ఏడు గుఱ్ఱములు పూన్చిన రథము నధిరోహించిన వాడా! సప్త ధాతువులే గుఱ్ఱములు. ధర్మ చక్రమే రథ చక్రమై, కాలచక్ర గమనమును కలిగించు వాడా! సౌరాష్ట్రార్ణ మంత్రాత్మనే= సౌర మనగా సూర్య సంబంధ మైన. అరుణ మంత్ర స్వరూపుడా! సౌరాష్ట్రి రాగ, మంత్ర స్వరూపుడ వని, ఈకృతిని సౌరాష్ట్రి రాగమున రచించుట ప్రత్యేకత. సౌవర్ణ స్వరూపాత్మనే = మంచి వర్ణము, రంగు. (2) సువర్ణ మనగా బంగారము. సువర్ణ మనగా మంచి అక్షరము. మంచి రంగు, బంగారము, మంచి అక్షర స్వరూపుడవు. అక్షర మనగా నశించని వాడు. సౌరాష్ట్రి దేశము కూడ. భారతీశ హరి హరాత్మనే = భారతీశ = బ్రహ్మ, విష్ణు, హర స్వరూపుడా! త్రిమూర్తి స్వరూపుడవు.

శ్లో॥ ఉదయం బ్రహ్మ స్వరూపో, మధ్యాహ్నేతు మహేశ్వరః ।
సాయంకాలే సదా విష్ణుః త్రిమూర్తిశ్చ దివాకరః ॥

కనుక మూర్తిత్రయ రూపుడవు. భుక్తి ముక్తి వితరణాత్మనే = జీవులకు ముందు కావలసినది ఆహారము. భుక్తి వేదమునందు ఇలా చెప్ప బడినది. ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటినుండి భూమి, భూమినుండి ఓషధులు, ఓషధుల వలన అన్నము, అన్నము వలన జీవులు పుట్టుచున్నవి. అన్నము వలన పెరుగుచున్నవి. అన్నమే మృత్యువు కలిగించును. సూర్య కిరణముల ద్వారా నీరు ఆవిరి అయి, అది మేఘముగ మారి, సకాలమున వర్షించి సస్య శ్యామల మొనర్చును. గాన, ఆహారము

సూర్యుని వలన కలుగును గాన, భుక్తిని, తదుపరి ముక్తిని యొసగు వాడా ! అని, సూర్యదేవా ! నిన్ను నమస్కరించిన వానికి ఇహ లోకమున ఆహారము, ఆరోగ్యము, ఆయువు, ఐశ్వర్యము నొసగి, పరమందు జన్మ రాహిత్యమగు మోక్షము నొసంగు విశాల హృదయము గలవాడా ! నీకు నమస్కారము. అని కృతిని రచించిరి ఈరచన యందలి యొక్కొక్క పదముల గూఢార్థములను గుర్తించి, రాగ తాళ భావములతో, మనసు లగ్న మొనర్చి, ఉపాసనగా గాన మొనర్చ వలెను. ఈకృతి చతురశ్ర జాతి ధృవ తాళమున రచించ బడినది. ధృవ తాళమునకు 14 క్రియలు. తాళము కృతి గమనమును నడిపించును. కాలచక్ర గమనమును కలిగించు వాడు సూర్యుడు. ధ్రువ మనగా నిశ్చయము. 14 క్రియలతో గూడిన ఈరచన ద్వారా 14 లోకములకు వెలుగు నిచ్చువాడు, ప్రపంచ కాల గమనమును చేయువాడను భావమును, నిశ్చయ మైనవాడని, రాగ, తాళ, భావము లను కూర్చి, జ్యోతిష, మంత్ర, సంగీత శాస్త్ర రహస్యములను చేర్చి రచించిరి. ఈకృతిని గాయకుడు ప్రతి ఆదివారము భక్తితో గాన మొనర్చిన సూర్య మంత్రోపాసనా ఫలము కలిగి, ఆరోగ్యాది ఫల ములు చేకూరును. ఈవిధముగా ప్రతి కృతియందలి గూఢార్థములను గమనింప గలరు.

ఒక కళ చౌకం

ప|| ప మ దప ప మ గ మ | గరి గరి | రి స సా స ని |
సూ- -- ర్య- మూ - - - -- ర్తే - న మో-

రిసని సా ద ప | ధ ని స రి స | రీ | గా మ పా మ |
--- స్తు తే - | సుం ద ర - - చ్ఛా యా - -

గ రి రీ స రి గ మ ||
ధి - ప తే - - - ||

అ॥ మా మ గ మ । గ రి స రి । మ గమప ప మ । పపా ప |
కా ర్య కా- - - ర - ణా - - - త్మ క జగ త్ర |

మగమ ప । , మ । దా , ప । పమగరి రీ |
కా-శ సిం హ రా శ్య ధి - ప- తే |

మధ్య॥ స ని ధ ని స రి గ మ । పమ ద ప । పా సా సా పా ।
ఆ - ర్యవి నుత తే- జ- స్ఫూ- ర్తే ఆ రో గ్యా

మ ద ప మ గ రి గ మ ||
ది ఫ ల ద కీ - ర్తే - ||

చ॥ సా ని సం । ద ద । ప ప మ దప ప మ । గ రి గ మపద |
సా ర స మి - త్ర మి - -- త్ర - భా - నో - -- |

(2) గ రి గ రి రీ || స ని దా ని ॥ సరి । గమగా రీ స రి ।
భా- నో - - || స - హ స్ర కిర ణా- క - ర్ణ -

గ మమ పా | గా మ ప । , ప ! మ గా గ । రీ సా |
సూ - - నో | క్రూ ర పా ప హ ర కృ శా నో |

స రి గ మ । పా , ద । నిద పా ప మ । గ రి గ మపా |
గు రుగు హ మో - ది- త స్వ - భా - నో - - |

ప మదప పమగరి । రీ రీ । గమప ద । ని స ని ద పా |
సూ- -- రి - జ- నే - డిత సుది న - మ - ణే |

గామా - గరి । గ మ ప ద । ద రి సా | రీ సా । రి సం ।
సోమా ది- గ్రహ శి ఖా - మ ణే | ధీ రా ర్చిత

దా రి సం । సా ని ద పా | ప మ ద ప ప మ గ రి । రి స ।
క ర్మసా - క్షి- ణే | ది - - - వ్య - త - ర స

స ధా ని । స రి గ మ గ రి |
- ప్తా శ్వ ర - థి - నే - |

మ॥సా॥ స ని ధా నీ స స । రి గ మ గ । రీ గ మ ప మ గరి ।
సా - రా ష్టా ) ర్ణ మం - (త్రా - త్మ నే సా - వ - ర్ణ -

గ మా పా ద పా | దా ని సాం రి స రి - గం రీ సం ।
స్వ రూ పా త్మ నే | భా ర తీ శ హా రి హ రా త్మ

దా దా ని స ద వ । మ ప ద మ గ రి గ మ ‖
నే భు క్తి ము - క్తి వి త ర ణా - త్మ నే - ‖

## 185

## అసావేరి రాగం చతురశ్ర జాతి మఠ్యతాళం

8వ మే. జన్యం. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ చంద్రం భజ మానస సాధు హృదయ సదృశం ॥

అ॥ ఇంద్రాది లోక పాలేడిత తారేశం ।
ఇందుం షోడశ కళాధరం , నిశాకరం ।
ఇందిరా సహోదరం । సుధాకర మనిశం ॥

చ॥ శంకర మౌళి విభూషణం । శీత కిరణం ।
చతుర్భుజం। మదన చ్ఛత్రం, క్షపాకరం ।
వేంకటేశ నయనం, విరాణ్మనో జననం ।
విధుం, కుముద మిత్రం, విధి గురుగుహ వక్త్రం । శ ।
శాంకం, గీష్పతి శాపానుగ్రహ పాత్రం ।
శరచ్చంద్రికా ధవళ ప్రకాశ గాత్రం ।
కంకణ కేయూర హార మకుటాది ధరం ।
పంకజ రిపుం । రోహిణీ ప్రియకరం, చతురం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఈకృతి యందు జ్యోతిష శాస్త్ర విషయమునకు ప్రాధాన్యత నీయక, పురాణ ప్రసిద్ధ చారిత్రక విశేషణ ములతో వర్ణించిరి. చంద్రం భజ మానస = ఓ మనసా ! చంద్రుని భజింపుము. అని మనస్సును సంబోధించిరి.

శ్లో॥ చంద్ర ధ్యానం ప్రవక్ష్యామి మనః పీడోప శాంతయే ॥

మనః కారకుడు చంద్రుడు. "చంద్రమా మనసో జాతః" శ్రుతి వాక్యం. మనస్సున కధిపతి. మానసిక రోగ కారకుడు. అందువలన మనస్సుతో చంద్రుని భజించుము అనిరి. సాధు హృదయ సదృశం= సాధువుల హృదయముతో సమానమైన వానిని, సాధువుల హృదయము నిర్మలము, నిశ్చలము, శాంతము, రాగద్వేషాది రహితము, ఆనందమయము గాన సాధు హృదయముతో పోల్చినారు. ఇంద్రాది లోకపాలేడిత తారేశం = ఇంద్రుడు, అగ్ని మొదలైన దిక్పాలురచే కొనియాడ బడు నక్షత్రములకు ప్రభువు. తారేశం = తారకు భర్త. తారా శశాంక గాథ నాధారము గాను, లేక తార లకు = నక్షత్రములకు భర్త యని. ఇందుం = ఇందు నామము గల వానిని, షోడశ కళాధరం = 16 కళలు గలవు. శుద్ధ పాడ్యమి నుండి పూర్ణిమ వరకు నొక్కొక్క కళ చొప్పున 15 కళలతో ప్రకాశించు వాడు. 16 వ కళను శివుడు ధరించెను, అందువలన షోడశ కళా ధరుని, నిశాకరం = నిశా=రాత్రిని, కరం=చేయు వానిని, ఇందిరా సహోదరం = లక్ష్మి దేవియొక్క సోదరుని, క్షీరసాగర మధనమున, లక్ష్మి, చంద్రుడు మొదలైన వారు జన్మించుటచే లక్ష్మికి సోదరుడు చంద్రుడు, శంకర మౌళి విభూషణం = శంకరుని జటాజూట మందు ఆభరణమువలె అలంకరించియున్న వానిని, శీత కిరణం=చల్లని కిరణ ములు గలవానిని, చంద్రుని అమృత కిరణుడు అనగా, చంద్ర కిరణము లచే ఓషధులు, వృక్ష జాలములు అభివృద్ధి జెందును. అందువలన చల్లని కిరణములు గలవానిని, చతుర్భుజం = నాలుగు భుజములు గల వానిని, మదన చ్ఛత్రం = మన్మధునకు గొడుగు వంటి వానిని,

తుషాకరం=వెన్నెలను కలుగజేయువానిని, వేంకటేశ నయనం=వేం=పాపములను, కటతీతి=ఖండించుట యందు, ఈశ=ప్రభువైన వాడు వేంకటేశ్వరుడు. ఆయన రెండు నేత్రములు: పగలు సూర్యుడు, రాత్రి చంద్రుడు, వీరిరువురు రెండు నేత్రముల వంటివారు. భగవంతుని, రవి శశి నేత్ర! అందురు. అందువలన వేంకటేశ్వరునకు నేత్రమైన వానిని, విరాణ్మనో జననం= విశేషముగా, అందమైన స్త్రీల మనస్సులనుండి పుట్టుచుండు వానిని, (విరహముతో గూడిన స్త్రీలు) విధుం = చంద్రునకు మరియొక నామము. కుముద మిత్రం = కలువలకు మిత్రుడు. చంద్రకిరణములు సోకగానే కలువలు వికసించును గాన వానికి మిత్రుని, కలువలను కుముదము లందురు. సూర్యుని పద్మ బాంధవు డందురు. విధి గురుగుహ వక్త్రైః = బ్రహ్మ, కుమారస్వాములే నోరుగా గలవానిని, అనగా, నిరంతరము బ్రహ్మ, గురుగుహులను స్మరించు వానిని, శశాంకం= లేడి చిహ్నముగా గలవానిని గీష్పతి శాపానుగ్రహ పాత్రం = బృహస్పతిచే శాపమును, అనుగ్రహమును పొందిన వానిని, శరచ్చంద్రికా ధవళ ప్రకాశ గాత్రం = ఈ విశేషణము చాల చిత్రమైనది. ఏదైనా తెల్లని వస్తువునకు శరత్కాల చంద్రుని కాంతివలె తెల్లనైనదని వర్ణింతురు. కాళిదాసు, శరచ్చంద్ర చంద్రికా ధవళం అన్నారు. శరదృతువున ఆకాశము స్వచ్ఛముగా నుండును, అందులో శశి శ్వేతః= తెల్లనివాడు, రాత్రి వేళ తన కాంతిచే ప్రకాశించు వానిని, కంకణ కేయూర హార మకుటం = హస్తముల యందు కంకణములు, శిరమునందు కిరీటముతో ప్రకాశించువానిని, చంద్రుడు రేయికి రాజు గాన ఈ భూషణములు గలవానిని, పంకజ రిపుం = చంద్రుని గాంచిన పద్మములు ముడుచు కొనును గాన, వానికి శత్రువని, రోహిణీ ప్రియకరం = చంద్రుడు దక్షప్రజాపతి కుమార్తెలు అశ్విని మొదలైన 27 మందిని వివాహమాడెను. వారిలో రోహిణి యందత్యంత ప్రేమతో నుండు

వానిని, మరియు "కర్కటస్య నిశాకరః" అని జ్యోతిశ్శాస్త్రము. కర్కాటక రాశికధిపతి చంద్రుడు. రోహిణీ నక్షత్రరాశి వృషభము. కర్కాటకమునకు ఏకాదశ రాశి, లాభస్థానము అగుటచే లాభదాయకుడని, చతురం = చతురత్వము గలవానిని, అను పురాణ ప్రసిద్ధ విశేషణములతో వర్ణించిరి. ఈకృతిని ప్రతి సోమవారము గానమొనర్చిన మానసికారోగ్యము చేకూరును. ఇందు రాగనామమును కూర్చలేదు.

ఒకకళ చాపు

ప॥ రీ గ రి - మా ప ని । ద ప । మ గ రి స ॥ స ధ ధ స -
చం - - ద్రం - - భ జ మా - న స సా - ధుహృ

రీ ప మ - మ గ గ రి స ॥ (2) రీ గ రి - మ ప - ద ప -
ద యా - స - దృ శం చం - ద్రం భ జ

మ గ రి స । రీ గ స రీ - స ని రీ - సా సా ॥
రే - రే - మా - - - న - - స -

అ॥ సా ద ప - ద మ ప - మ ద పా ।
ఇంద్రా - ది లో - - క పా

పా ద ప ద రి సా - రీ గ రి - రి స స ని సా ।
లే - - డి - త తా - - రే - - - శం

మ॥సా॥ స రి గ రి రి స ని రి - స స ని ద - ప మ ప దా స సా ॥
ఇం దుం షో - డ శ క ళా - ధ రం నిశా క రం

రీ స దా ప గా - రి సా ధ - సా రి స మ గ రి స ॥
ఇంది రా స హో ద రం స శా క ర మ ని శం ॥

చ॥ సా నిసఁ - ప ద - పదమ పమ । పదపా పమ -
శంకర షూ - ళి వి భూ - - షణం శీ -

పప - మగరిస ॥ సధా గ - రిస - ని స ధా ॥ సారిమ
తకి ర - ణం చతు ర్భు జం మ దన చ్ఛ - -

రిమ - దప - మదపా ॥ దపపమ పద - పద -
త్రం కు పా - కరం వేం - - క టే - శ

సఁసఁ సా ॥ దసా రిఁ - గఁ రీసఁ - నిసఁదా | పదా రిఁ - సఁరిఁ
నయనం వి రా ణ్మా నో - - జనసం | విధుంకు ముద

రిఁ సఁసఁ ని సా ॥ మమపద ని - దప - మామగ రి స ॥
మి - - - త్రం వి ధిగు రు - గుహ వ - - క్త్రం

(2) మపగా రీ , స ।
వ - - క్త్రం శ ।

మ॥సా॥ రి గా రి గా రి సరీ స్నీ - సా ని ధ - ప దపా ॥
శాం కం గి ష్పతి శాపా ను గ్రహ పా - త్రం

సరీ మా ప పా - దపదా - పమా ద పమ పా ॥
శ ర చ్చం ద్రి కా ధ వ ళ ప్ర కా శ గా - త్రం

పా దసఁ సా సా - రిఁ గా రిఁ - సఁసఁ నీ రిఁ ని సా ॥
కం క ణ కే యూ ర హా ర మ కుటా ది ధ రం

గా రిఁ సఁ రిఁ ని సా - పదమా - పనిదపమగరిస ॥
పం క జ రి పు రో హిణీ - ప్రియ కర చ తు రం ॥

**186**

## సురటి రాగము రూపకము

28 వ మేళకర్త. స రి మ ప ని స
స ని ద ప మ గ ప మ రీ స

ప॥ అంగారక మాశ్రయామ్యహం । వినతాశ్రితజన మందారం ।
మంగళవారం, భూమి కుమారం । వారం, వారం ॥

అ॥ శృంగారక మేష వృశ్చిక రాశ్యధిపతిం ।
రక్తాంగం , రక్తాంబరాది శక్తి శూలధరం ॥

మ॥సా॥ మంగళం, కంబుగళం । మంజులతర పద యుగళం ।
మంగళ దాయక మేష తురంగం । మకరోత్తుంగం ॥

చ॥ దానవ సుర సేవిత మందస్మిత విలసిత వక్త్రం ।
ధరణీ ప్రదం, భ్రాతృ కారకం । రక్త నేత్రం ।
దీనరక్షకం, పూజిత వైద్యనాధ క్షేత్రం ।
దివ్యౌఘాది గురుగుహ కటాక్షానుగ్రహ పాత్రం ॥

మ॥సా॥ భాను చంద్ర గురు మిత్రం । భాసమాన సుకళత్రం ।
జానుస్థ హస్త చిత్రం । చతుర్భుజ మతి విచిత్రం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. అంగారక = అంగారకుని, అహం, ఆశ్రయామి = నేను ఆశ్రయించు చున్నాను. ఆశ్రయామి అనుటలో కుజుడు భూ పుత్రుడు. భూ, గృహాదుల నొసగు వాడు. జమీందారుడు. ధనవంతుని ఆశ్రయించిన ఫలము కలుగును గాన ఆశ్రయించినారు. వినతాశ్రిత జన మందారం = వినయముతో ఆశ్రయించిన జనులకు మందారము వంటి వానిని, మందారము ఎఱుపు రంగుగా నుండును. ఎఱుపు రజోగుణ లక్షణము. రజోగుణము గలవాడు

కార్య దక్షత గలవాడగును. కోర్కెలు దీర్చు వాడని యర్థము. మంగళ వారమున జన్మించుట చేత మంగళ వారమును అంగారక వార మందురు. జయ వారమందురు. భూమి కుమారం = భూ పుత్రుని, వారం, వారం = మాటి మాటికి ఆశ్రయించు చున్నాను. శృంగారక మేష, వృశ్చిక రాశ్యధి పతిం = అందమైన వాడు "మేష వృశ్చికయో ర్భామః" రాశులు 12, మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము వీనిలో మేష, వృశ్చిక రాశుల కధిపతి కుజుడు. కు = భూమి, జ = పుట్టినవాడు, రక్తాంగం = ఎఱ్ఱని వస్త్రము, వర్ణము, పుష్పము గొడుగు అంతయు ఎఱుపు రంగుతో గూడిన ధరించిన ఎఱ్ఱని వానిని, మంగళము = శుభముల నొసగు వానిని, కంబుగళం = శంఖము వంటి కంఠము గలవానిని, మంజులతర పద యుగళం = మృదువైన, కోమలమైన రెండు పాదములు గల వానిని, మంగళ దాయక మేష తురంగం = శుభముల నొసగు మేకను గుఱ్ఱముగా చేసుకొన్న వానిని, మేష వాహనము గలవానిని, మకరోత్తుంగం = మొసలివలె ఎత్తైన భుజములు గల వానిని, ఎఱ్ఱని వానిని, బలమైన శరీరము గలవానిని, ధనవంతుని ఆశ్రయించు చున్నాను. దానవ సుర సేవిత మందస్మిత విలసిత వక్త్రిం = రాక్షసులు దేవతలచేత సేవింప బడువానిని, చిరునవ్వుతో ప్రకాశించు మోము గలవానిని, ధరణీ ప్రదం = భూమి నొసగు వానిని, భ్రాతృ కారకం = సోదరులు కలుగుటకు కారకుడైన వానిని, జ్యోతిష శాస్త్ర మందు అంగారకుడు, ఉచ్చ స్థానమున నున్న దశాంత ర్దశలలో భూ గృహ, సోదరుల నొసంగును. రక్త నేత్రం = ఎఱ్ఱని కన్నులు గల వానిని, దీనులను రక్షించు వానిని, వైద్యనాథ క్షేత్రమందు ప్రత్యేక ముగ పూజింప బడు వానిని, భారత దేశమందు నవగ్రహములకు ప్రత్యేక ఆలయములలో విశేష పూజలు జరుగును. కోణార్క

నందు = సూర్యునకు మందపల్లి యందు శనికి తైలాభిషేకాదులు, ఉజ్జయిని, వైద్యనాథ మందు అంగారకుని పూజింతురు. దేవతా బృందము గురుగుహ మూర్తియైన కుమారస్వామి యనుగ్రహమును బొందిన వానిని, గ్రహములో శత్రువులు, మిత్రు లుందురు. అంగారకునకు సూర్యుడు, చంద్రుడు, బృహస్పతులు మిత్రులు. వారికి మిత్రుడైన వానిని, జానుస్థ హస్త చిత్రం = మోకాలి వరకు పొడవైన, చిత్రమైన చేతులు గలవానిని, ఉత్తమ పురుష లక్షణం= ఆజాను బాహువు, సాముద్రిక శాస్త్రము, నాలుగు చేతులు గల వానిని, అతి విచిత్రమైన వానిని ఆశ్రయించు చున్నాను. ఈకృతి యందు వక్త్రం, నేత్రం, క్షేత్రం, పాత్రం, మిత్రం, కళత్రం, చిత్రం, విచిత్రం అను అంత్యప్రాస పదములు అలంకారములు. ఇందు రాగ నామము చేర్చలేదు. సురటి తెనుగు పదము. సురటి యనగా, వస్తువైన వింజామర. విసనకర్ర, ధనవంతుని, వింజామరమైన సురటి రాగముతో ఆశ్రయించిన, శుభ ఫలములు పొందుదురను భావన. ప్రతి మంగళ వారము ఈకృతిని గానమొనర్చిన, అంగారకుని యను గ్రహమున, రోగాది బాధలు లేక, సోదరులతో, భూ, గృహ, ధనాదులతో సుఖింతురు ఈవిధముగా సురటి రాగముతో సేవించిన, ఆయన దయగలుగును,ఉన్నవాడేమైన ఇవ్వగలడు. ఇట్టి విశేష భావార్థముల గమనించి గానమొనర్పవలెను

రెండు కళల చౌకం

ప॥ రి మ - పాదని ద ప । మాపమమా । గ రి గ రి గ స |
అం గా-- ర క మా--- శ్రీ యా --మ్య- |
రీ రీ ని ఫ । రి మ ప ని సం రి । సీ రి సం నీ ।
హం- వి న తా - శ్రిత జ న మందా - రం

సఁ నిరిఁ సఁ నీ దా ప మ ని ద । పా మా మగపమ రి మరిస ||
మం గ ళ వా రం భూ - మి కు మా రం వా-రం వా-రం

రి మ ప సఁ ని ద పా । పా ద ప మా గ రి గ రి సా |
అం గా - ర - క మా - - - (శ యా - - మ్య

రి రి సా ||
హం - -

అ॥ , స సా నిని । సాఁ ని సాఁ , । నీ సఁ రిఁ సాఁ , రిఁ సఁ ని నీ ।
శృంగా ర క మేష నృ శ్చిక - రా - - - శ్య

ద ప ద ప ద ప నిమపా | ని ప ని మ పప | ప మ ప మ -
ధి ప తిం - - - - - | తిం - - -ర | క్తాం - - -

పా ని సఁ రీఁ । రిఁ మఁ గఁ రిఁ గఁ రిఁ । సఁ రిఁ నీ - ద పా ద ।
గం - - ర క్తాం బ రా - ది ధ - రం - శ క్తి

మ పా మ ని ద ప మ రీ |
శూ- - ల - ధ - రం

మ॥సా॥ సా , స సా సాఁ ని సఁ సాఁ । నీ సఁ రిఁ గఁ రిఁ రిఁ సఁ ని ద పా ।
మం గ ళం కం బు గ ళం మంజుల త ర ప ద యుగ ళం

పా గఁ రిఁ రిఁ సఁ ని ద ప ద ప ద ।
మం గ ళ దా - య క మే - షతు

ప సఁ ని ద ప ద మ గ రి మ రి స |
రం గం మ క రో - త్తుం గం-

చ॥ దాస్ని దప మాపద । పా , ద మమమగ । పమాగ గ రిగరి రిస ।
దా-- నవ సు ర- సే - విత మం ద - - స్మి -త- విల

స ని సా రిమరిమ పా | పారిమ పమ నిద ప ద । మ గ
సి - త వ- -- క్షిం | - ధర ణి- -- ప్ర- దం

రి రిరిస । స ని సా రిసారి । రీ ని ద పమపమ మ గ రీ |
భా--తృ కా- - రకంర - క్త - నే- - - త్రం -

రినినినిద సం । నిద ప నిపని మప । సం ని సాం ని రీం , ।
-దీనర- క్షు కం పూ - -- జిత వై - - ద్యనా

సం ని సాం సాం | సం ని సం రిం గం రిం రిం సం ని ద । పమప సం
థ - క్షేత్రం | ది - - - వ్యా- - - ఘా - ది -గు -

ని ద ప ద మ గ । రి గారి మ పా మ ప దా ప ।
రు - గు - హాక టా - - క్షా - - ను - -

ని ద ప మ గ మ రీ |
గ్రహ పా - - - త్రం |

మ॥సా॥ సా రిం సం సం రిం ని సం నీ దా । పా ని ద ని ప మప నీ సాం |
భా నుచ ం ద్రగురు మిత్రం భా స మా- న సుక ళ త్రం |

నీ సాం రిం సాం ని దా పా ।
జా నుస్థ హ స్త చి త్రం

ప మా ని ద ప మ గ రి మ రి స ‖ అంగా ‖
చ తు ర్భు జ మ తి వి చి - త్రం ‖

# 187

## నాట కురంజి రాగం మిశ్ర జాతి జంపెతాళం

28వ మేళకర్త జన్యము　　స రి గ మ ద ని ప ద ని స
　　　　　　　　　　　　స ని ద మ గ స

ప॥ బుధ మాశ్రయామి సతతం ।
సుర వినుతం । చంద్ర తారా సుతం ॥

అ॥ బుధ జనై ర్వేదితం । భూసురై ర్మోదితం ।
మధుర కవితా ప్రదం । మహనీయ సంపదం ॥బుధ॥

చ॥ కుంకుమ సమద్యుతిం । గురుగుహ ముదాకృతిం ।
కుజ వైరిణం మణి మకుట హార కేయూర ।
కంకణాది ధరణం । కమనీయతర మిధున కన్యాధిపం ।
పుస్తక కరం । నపుంసకం ॥

మ॥సా॥ కింకర జన మహితం । కిల్బిషాది రహితం ।
శంకర భక్త హితం । సదానంద సహితం ॥ బుధ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. బుధుని ఆశ్రయించు చున్నాను. బుధుడు బుద్ధి పీడను పోగొట్టును. అంతః కరణ చతుష్టయములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. వీనిలో నొకటి బుద్ధి. సంకల్ప వికల్పములతో గూడినది మనస్సు. నిశ్చయాత్మక మైనది బుద్ధి. అటువంటి బుద్ధికి అధిపతియైన బుధుని ఆశ్రయించు చున్నాను. ఎల్లప్పుడు, దేవతలచే నుతింపబడు వానిని, తారా, చంద్రుల కుమారుని, ఇచట బృహస్పతి భార్య తారకు, చంద్రుని వలన కలిగిన కుమారుడని పురాణగాధ. తారలు నక్షత్రములు. నక్షత్రములకు నాయకుడు చంద్రుడు. చంద్ర తారకు కలిగన వాడని మరియొక భావము పండితులచే, వేద విదులచే తెలిసికొన బడిన వానిని, బ్రాహ్మణులచేత ఆనందింప బడువానిని, మధుర కవితా ప్రదం =

మధురమైన కవిత్వము నొసంగు వానిని, ఛందోబద్ధమైన కవిత్వము వ్రాయవచ్చును. గాని, పద లాలిత్యము, భావ స్ఫోరకముగా, వినువారి చిత్తమున కానందమును కలుగజేయు కవిత్వము నొసంగు వానిని, గొప్ప ఐశ్వర్యము నొసంగు వానిని, కుంకుమతో సమానమైన కాంతి గలవానిని, కుమార స్వామికి ఆనందమును కలిగించు ఆకారము గలవానిని, కుజవైరిణం = అంగారకునకు శత్రువైన వానిని, గ్రహములకు మిత్రులు, శత్రులు, సములు అని యుందురు. మిథున, కన్యా రాశికి అధిపతి బుధుడు. మిథునమునకు వృశ్చికము 6 వది. శత్రుస్థానము. కన్యకు మేషము, అష్టమ స్థానము. గాన వారి వారి స్థానములకు షష్ఠాష్టక ములుగాన శత్రుత్వ మనిరి. మణులతో కూడిన కిరీటము, భుజముల కేయూరములు, హస్తముల కంకణములు, మెడయందు హారములు ధరించిన వానిని, చేతియందు పుస్తకమును ధరించిన వానిని, "కన్యా మిథునయో ర్బుధః" మిథునము = దంపతులు, కన్య = కన్య. ఈ రెండును అందమైనవి గాన "కమనీయతర మిథున, కన్యాధిపం" నపుంసకం = గ్రహములలో స్త్రీ, పురుష, నపుంసక గ్రహములని మూడు విధములు. ఈనవ గ్రహములలో బుధ, శని కేతువులు నపుంసక గ్రహములు గాన, నపుంసకుని దోషములు లేనివానిని, శంకర భక్త హితం = శివ భక్తులకు శుభము కలిగించు వానిని, ఎల్లప్పుడు ఆనందముతో కూడిన వానిని, "సంతోషమే సగము బలము". ఆనందము దైవ స్వరూపము. దైవ బలము గలవాడు ఎల్లప్పుడు నానందముగా నుండును. ఆనందము గలవాడు ఆరోగ్య వంతుడగును. ఇవి అన్నియు బుద్ధి బలము ననుసరించి యుండును. గాన, బుధ వారమునాడు ఈ కృతిని గానమొనర్చిన, బుధుని యనుగ్రహమునపై సంపదలన్నియు కలుగును.

## రెండు కళల చౌకం

ప॥ మగమాప మ గమరి ।సా। ని ధ నీ । సా స ని స రి
బుధవరా శ్రయా - - - మి స - త । తం సుర వి ను

సా స ని స ని । ధ నీ స రి గ । మ గ మ మ ని పా
తం చం ద్రతా - రా సుత ం । బు ధ మా - - శ్ర

మ గ మ రి ।సా। ని ధ నీ । సా ॥
యా - - - మి స - త । తం ॥

అ॥ స స ని దా ద నిస ।ని। దనిదప । దా ని దని సా ।ని। సా ।
బుధ జ నై ర్వే -- ది తం- - । భూసు రై-ర్నో ది తం ।

ని సం ని గం రిం సా ని ద ద ని ద మా । గ సారిగా ॥
మధు ర క వి తా ప్రద ం మహ నీ య సంపదం ॥ బుధం ॥

చ॥ సా , రి గ మప మగమరి । స । నీ । ధ ని సా నీ సం ని
కుం - కు మస మ- - - ద్యు తిం । గు - రు గుహ -

ని ధ ధా । ని । సా । స స స ని రి సా । మ । గ మ
ము - దా కృ తిం । కు జ వై - రి ణం మ ణి మ ।

ని ద మా మ ప గ మ రీ । స ని । ధ ని సా ।
కు ట హా ర - కే - - యూ- - - ర ।

సా స సా ని ద ని ప । ద ని । సా । ని రిం సా సం ని సం ని దా
కం క ణా ది - ధ - ర - ణం । క - మ నీ - - - య

నిదనిప । ద । ని సం । సా రిం గం మం గం సా సం ని సం ని । దా ।
త- ర- మి థు న । క నా్య- - - ధి ప - తిం పు

నిపదా | ని సఀ నిద మనిదమగా స ని ధ ని । సగ । సా ||
- - స్త | క - క - రం- - న పుం - - స- కం ||

మ॥సా॥ సాఀ ని ద ని ప ద ని దా నీ సఀ ని । దని । సఀ గఀ సాఀ |
కిం క ర జ న మ హితం కి ల్బిషా - ది ర హితం |

సాఀ రిఀ గఀ సాఀ ని ద నీ సఀ ని ద ని । దమ । గ స రి గ ||
శం క ర భ క్త హితంస దా - న ం ద స హిత ం ||

## 188

## అఠాణా రాగం త్రిపుటతాళము

29 వ మే. జన్యం. స రి గ మ ప దా ని సా
స ని దా ప మ గా రి స

ప॥ బృహస్పతే, తారాపతే । బ్రహ్మాజాతే, నమోఽస్తు తే ।

అ॥ మహాబల విభో! గీష్పతే । మంజు ధనుర్మీనాధిపతే ।
మహేంద్రాద్యుపాసితాకృతే । మాధవాది వినుత ధీమతే ॥

చ॥ సురాచార్య వర్య! వజ్రధర! । శుభలక్షణ జగత్త్రియ గురో ।
జరాది వర్జితాఽక్రోధ కచ । జనకాశ్రిత జన కల్పతరో ।
పురారి గురుగుహ సమ్మోదిత పుత్ర కారక, దీన బంధో ।
పరాది చత్వారి వాక్స్వరూప ప్రకాశిక దయా సింధో ॥

మ॥సా॥ నిరామయాయ నీతికర్త్రే । నిరంకుశాయ విశ్వభర్త్రే ।
నిరంజనాయ భువన భోక్త్రే । నిరంశాయ మఖప్రదాత్రే ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. చరణము చివర మధ్యమకాల సాహిత్యము చతుర్థీ విభక్తిలో రచించిరి.

ఓ బృహస్పతీ! తారకు పతియైన వాడా, బ్రహ్మజాతే = బ్రహ్మ నుండి ఉద్భవించిన వాడా! నీకు నమస్కారము. నమోఽస్తు శబ్దము నుపయోగించుటలో అంతరార్థము బృహస్పతి దేవతల గురువు. బృహస్పతికి గురువను నామము గలదు. అందుకే బృహస్పతి వార మును గురు వార మందురు 33 కోట్ల దేవతలకు గురువైన కారణ మున గురువను నామము సార్థకమైనది. గురువునకు నమస్కారము చేయవలెను. జగద్గురువు శంకరాచార్యులు, దక్షిణామూర్తి స్తవములో "తస్మై శ్రీ గురుమూర్తయే నమఇదం శ్రీ దక్షిణా మూర్తయే" గాన ఈ "నమోఽస్తు" శబ్దమందు అంత గొప్పతనము గలదు. మహాబల విభో = దేహ బలముకన్న బుద్ధి బల మెక్కువ. బుద్ధిలో బృహస్పతి యంతవాడని యందురు. గాన బుద్ధిబలముతో ప్రకాశించువాడా! గీష్పతే = గీః= వాక్కులకు పతివి! బృహస్పతి వీక్షణమున్న, లగ్న మందున్న విద్య, మంచివాక్కు లభించును. మంజు ధనుర్మీనాధిపతే= అందమైన ధనస్సు, మీనరాశుల కధిపతివి, కవులు స్త్రీ అందమును వర్ణించుచు, ధనువువంటి కనుబొమలు, మీనలోచని యని వర్ణింతురు. గాన "మంజు" శబ్దము నుంచిరి. "కోదండ మీనయో ర్మంత్రీ" జ్యోతిషశాస్త్రము. ఈరాశులకు అధిపతీ! ఇంద్రాదులచేత నుపాసించ బడిన, సేవించబడిన యాకారము గలవాడా! లక్ష్మీపతి మొదలైన వారిచే బుద్ధిమంతుడవని కొనియాడ బడినవాడా! నీకు నమస్కారము.

చ॥ దేవతలకు శ్రేష్ఠమైన ఆచార్యుడా! ఆచరించువాడు ఆచార్యుడు వజ్రధర = వజ్రమును ధరించినవాడ! మూడు లోకములకు గురువుగానుండ దగిన లక్షణములు గలవాడా! మూడు లోకము లలో నీకన్న గురువు లేడని భావము. జరాది వర్జిత= ముసలి తనము లేనివాడా! అక్రోధ = కోపము లేనివాడా! కచ జనక = బృహస్పతి కుమారుడు కచుడు. అతనికి తండ్రియైన వాడా! బృహస్పతి కుమారుడైన కచుడు శుక్రునివద్ద మృత సంజీవనీ విద్యను

గ్రహించె. ఆశ్రయించిన వారి కోర్కెలు దీర్చు కల్పవృక్షము వంటి వాడా ! కల్పవృక్షము కోరిన కోర్కెలు దీర్చును. శంకరునకు, సుబ్రహ్మణ్యేశ్వరునకు మిక్కిలి సంతసమును కలిగించు వాడా ! పుత్ర కారకుడు బృహస్పతి. పుత్ర సంతానము గుర్వను గ్రహమున, ఆదశలో కలుగునని శాస్త్రము. "గురుధ్యానం ప్రవక్ష్యామి పుత్ర పీడోప శాంతయే" దీనులకు బంధువైన వాడా ! పరా, పశ్యంతి, మధ్యమ వైఖరీ యను నాలుగు విధములుగ, మూలాధారమునుండి ఉత్పన్నమై, నాభి, హృదయ, కంఠ, ముఖములనుండి వెలువడు శబ్దము అకారము మొదలు, క్షకారము వరకు, సందర్భాను సారముగా భావ రసయుతముగా, మృదువుగా, వాక్కురూపమున ప్రకాశింప జేయువాడా! దయా సముద్రుడా! నిరామయాయ = మనోవ్యాధిని పోగొట్టు వాడా ! నీతిని కలుగజేయువాడా! అంకుశమను ఆయుధము లేకుండ ప్రపంచమును భరించు వాని కొఱకు, మాటతోనే ప్రపంచ మును నడిపించగల సమర్థుని కొఱకు, నిరంజనాయ = అంజనః వరుణ దిగ్గజము, నల్ల తుమికి చెట్లు, దీపశిఖ, కాటుక యని నానార్థములు. కొడిగట్టని దీప శిఖవలె కాంతితో మూడు లోకములకు సుఖముల ననుభవింప జేయు వానికై, నిరంకుశాయ విశ్వ భర్త్రే = తనకు వేరొక నియామకుడు లేకుండ విశ్వమును పాలించువాడు. నిరంశాయ మఖ ప్రదాత్రే = సంపూర్ణముగా యజ్ఞఫలము నొసంగు వాని కొఱకు నమస్కారము. రాగనామము లేదు. బృహస్పతి యొక్క రూపమును, గురు శబ్దముతో జేర్చి వర్ణించుటచే, ఈకృతిని ప్రతి గురువారమున గాన మొనర్చిన, గురువనుగ్రహము, సర్వ దేవతాను గ్రహము లభించును.

## రెండు కళల చౌకం

ప॥ రి సా స రి స ని సా । పా ప ని పా ని స । నిపనిప దాపమ
బృహా స్ప- తే - - - తా - - రా - - - ప - తే - -

పా స దపమ ప దమప । మగ గగ గ మ । ప మ ప దని స
బ్రహ్మ - - - జా - - - తే - - న మో - - - స్తు తే - - -

(2) గ మ । పని పా ప మ రీ ; ; । సా
మో - - - స్తు తే - - - -

అ॥ మపానిసని । సా సనిదా । నిస నీ సా । ని స ని రి సా ।
మహాబలవి భో - - గీ - - ష్ప తే మం జు ధ ను

రి స రి ని స ని స ప । ని ప ని ప ద ప । మ ప మ గ మ రి ।
శ్మీ - - - నా - - - ధి - ప - తే - మ హేం ద్రా - ద్య

సా రి ని స । ని రి సా । సా రి స నీ ని స దా ద ద ।
పా సి తా - - కృ తే మా - - - ధ - వా - ది

ప ద ని స రి స ని ప । దా ప మ ప ద ని స ॥ బృహస్పతే ॥
వి - ను - త - ధీ - - మ - తే - - -

చ॥ స దా ద నిప । దనిసా నీ నిస । పాద ని పమ । పాపదదా పద
సురా చా - ర్య వ - - ర్యవ - - ప్ర జ- ధ ర శుభ - ల - -

ప మ । పాగమ గ మ । పా ని ప ద ప । మ పా ని సా ।
క్ష ణ జ గ - - త్ర య గు - రో - జ రా ది వ

ని రి రి స । స ని దా ని స । ని రి సా , రి ని స । ప ద
ర్జి తా ప్రో - - - ధ క చ । జ న కా - శ్రిత జ న

ని సఁ రిఁ సఁ । ని ప ని ప ని దసా | ని సారి మప । ని ద ని దసీ ।
క - - - ల్ప - త - కో - - | పురారి గురు గు - హ - స

ద ని పా ని సఁ | గా మఁ రిఁ సఁ ని సఁ । గఁ నీ ; సఁ రిఁ । నిపనిప
మ్మో - - దిత | పు త్ర - కా - ర క దీ న - బం - -

సఁ దపా | పమ రీ , మ రిఁ సా । రీ సఁ ని ప । ని రిఁ సా |
భో - - | ప - రా - దిచ త్వారి వా - - కప్వరూ |

సా రిఁ సఁ నీ ని స దా ద । ప ద ని సఁ రిఁ సఁ ని సఁ ।
ప - - - ప్ర - కా శ క ద - - యా - - -

ప ద మ ప రి మ రి స ||
సిం - - భో - - - ||

మ॥సా॥ ని సా రి మా ప ని పదమమ । దా ప దా ని సఁ రిఁ ।
ని రా మయాయ నీ - తిక - క్షే నిరం కు శా -

సఁ నీ సఁ పా సా | ని సా మఁ రీ సఁ రిఁ సఁ రిఁ ని సఁ ।
యవి శ్వ భ ర్త్రే | నిరం జ నా య భువ న భో -

సఁ రిఁ సఁ ని సఁ దా ద । ద దా ద ప ద ని సఁ || బృ ||
క్త్రే - నిరం శా య మఖ ప్రదా - ప్తే - ||

# 189

## ఘరజు రాగం ఖంటజాతి అటతాళం

15 వ మే జన్యం  స గా మ ప ద ని స
స ని ద ప మ ద ప మ గా రి స

ప॥ శ్రీ శుక్రం, భగవంతం । చింతయామి సతతం । సకల తత్వజ్ఞం।

అ॥ హే శుక్ర భగవన్, మామాశు పాలయ ।

వృష తులాధీశ, దైత్య హితోపదేశ ।

మ॥సా॥ కేశవ కటాక్షైక నేత్రం । కిరీట ధరం । ధవళ గాత్రం ॥ శ్రీ॥

చ॥ వింశతి వత్సరోడు దశ విభాగ మష్టవర్గ, కవిం కళత్ర కారకం ।

రవి, నిర్జర గురు వైరిణం, స । వాంశ హోర్యాద్రేక్కాణాది

వర్గోత్తమా ।

వసర సమయం, వక్రోచ్చ నీచ స్వక్షేత్ర వర కేంద్ర

మూల త్రికోణం ।

మ॥సా॥ త్రింశాంశ, షష్ట్యంశై రావతాంశ ।

పారిజాతాంశ, గోపురాంశ ।

రాజయోగ కారకం, రాజ్యప్రదం । గురుగుహ ముదం ॥ శ్రీ॥

వ్యా॥ ద్వితీయ. సంబోధనతో కూడిన రచన. శ్రీశుక్రం = లక్ష్మి ప్రదుడైన శుక్రుని, భగవంతుని, సకల తత్వములు తెలిసిన వానిని, ఎల్లప్పుడు చింతించు చున్నాను. భగవంతం = అనుటచే భగ శబ్దమునకు = శ్లో॥ ఉత్పత్తించ వినా శంచ, భూతానామాగతిం గతిం వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవానితి. షణ్ణాం భగ ఇతీరితః అందురు. ఉండుట, లేకుం డుట, అంతట నిండి యుండుట, నశించ కుండుట, పుట్టుక లేకుండుట, ముసలి తనము లేకుండుట. ఈ ఆరు లక్షణములు గల వానిని భగవంతుడందురు. ఇన్ని గుణములు గల వాడు గనుకనే, పూర్వ దేవతల లనబడు రాక్షసులకు గురువైనవాడు శుక్రుడు అనుపల్లవిలో, ఓ శుక్ర భగవంతుడా! నన్ను ఆశు = వేగ ముగా పాలించుము. వృషభ, తులా రాశులకు అధిపతీ. "తులా వృషభ యోర్భృగుః" రాక్షసులకు హితమును బోధించు, ఓ శుక్ర దేవా! పాలించుము. పల్లవిలో పరోక్ష మందున్న వానిని గాను,

అనుపల్లవిలో ఎదుట నున్న వానినిగా, సంబోధనతో ప్రత్యక్షముగా చూచి మాటలాడి నట్లు రచించిరి.

కేశవ కటాక్షైక నేత్రం= విష్ణుమూర్తి యనుగ్రహమున ఒక్క నేత్రము గలవానిని, బలిచక్రవర్తిని, బ్రహ్మచారియై విష్ణువు వామనుడై యాచించిన సమయమున, దానమీయ వద్దని శుక్రుడు ఎంత చెప్పినా వినలేదు. బలి దానమీయు సమయమున, కమండలము నుండి నీరు పడకుండ శుక్రాచార్యుడు ఆపగా, దర్భతో వామనుడు కమండలములో పొడువుగా, శుక్రుని కన్ను ఒకటి పోయినది. ఆగాధను సూచించిరి. కిరీటమును ధరించిన వానిని చింతింతును. శుక్రః శ్వేతః అని. చ॥ వింశతి వత్సరోడు దశ విభాగం = శుక్రుని మహర్దశా కాలము 20 సంవత్సరములు. రవిదశ 6, చంద్రుడు 10, కుజుడు 7, రాహువు 18, గురువు 16, శని 19, బుధుడు 17, కేతువు 7 సంవత్స రములు దశాకాలములు. ఈ చరణమున, గ్రహము యొక్క దశ, అంశలు, లక్షణములను తెలియజేసిరి. కవిని, కళత్ర కారకుని, శుక్ర దశాంతర్దశలలో వివాహమును చేయును. శుక్రుడు శత్రుస్థానాదుల యందున్న భార్యా భర్తలకు విరోధములు కలుగజేయును. శుక్రు నకు రవి, బృహస్పతి శత్రువులు. దేవ గురువు బృహస్పతి, దైత్య గురువు శుక్రుడు. దేవ దానవులకు, ఆజన్మ శత్రుత్వమున్నటులనే, గురు శుక్రులకు శత్రుత్వ మేర్పడినది. వీరిరువురి రాశులకు షష్టాష్టక ములగుటచే శత్రువు. జ్యోతిషమున, వీరి దశలలో నవాంశ, త్రింశాశ, హోర, ద్రేక్కాణము మొదలైనవి, వక్ర, ఉచ్ఛ, నీచ, కేంద్ర కోణాధి పత్యములను బట్టియు, అంశలలో ఐరావతాంశ, పారిజా తాంశ, గోపురాంశ మొదలైన అంశల యందున్న మహారాజ యోగములను, రాజ యోగముల నొసంగువాడు శుక్రుడు. కుమార స్వామికి ఆనందమును కలుగ జేయువానిని చింతించు చున్నాను. ఈకృతి యందు జ్యోతిష శాస్త్ర విషయములగు, దశ, ఉచ్ఛ, నీచ,

అంశ మొదలైన విషయములను కూర్చిరి. దంపతుల అనుకూల్యత, లలిత కళాకుశలత, రాజయోగాదులు శుక్రుని వలన కలుగును. నీచ శత్రు స్థానముల నున్న చెడు ఫలములొసగును. నవగ్రహ మహర్దశలలో, 20 సంవత్సరములు దశాకాలము గలవాడు శుక్రుడు ఒక్కడే గాన, మంచి వయస్సులో స్త్రీ పురుషాదులకు, శుక్రదశ వచ్చిన వారికి సర్వ సౌఖ్యములు కలుగజేయును గాన, ప్రతి శుక్రవారము శుక్రభగవానుని గాన మొనర్చిన పైన తెలుప బడిన ఫలములను పొందుదురు.

## ఒక కళ చౌకం

ప॥ స ని సా , రి సా రి స స్ని । ద ప ద స్ని ని దా । ప ద ప మ
శ్రీ - - - శు - - - క్ర - - - భ గ వం - -

గ రి గా | గగగమ ద స । దపమగరిస నిగ । గామద । దపమగ |
తం - | -చింత యా- - - - -మి- సం - త - తం- - - |

గరిగమ గరిస । పాదస నీపదమప । మ గమా । ప ద నీ || శ్రీ ||
--- - --- స క- లత- - - త్వ - - జ్ఞం - - ||

అ॥ పా , గ మగ మా । ప ప ద నినిదని । దా । పా |
హే - శు- - క్ర - భ గ- -- వ - న్నా |

సా , సా । స ని గ రి స ని । దా ని స । ని ద పా |
మా శు పా - ల - యవృ ష తు - లా - - |

ప గ మ ప ద । ని స స గ రి స । నిద । ప స |
ధి - శ దై - త్యహి తో - - ప దే- - శ |

ని స్స రి స ని దా ని స్ ని । దా పా ద పా మ గ మ ।
కే - శ వ క టా క్షై - క నే త్రం కి రీ ట ధ రం

మ గ రి స । గ మ ప ద ॥ (శ్రీ) ॥
- ధ వ ళ గా - త్రం

చ॥ పా , పప । పమద ప దపమ । గ రి । గా | గ మ మ గా ।
విం శతి వ -త్స రో - - - డుద శ | వి భా - గ

రి స ని స గా । మా । మాగమ | పాదని దా ద పా మ ।
మ - - ష్ట వ ర్గం - క - | విం- - క ళ - -

పమమగ గా పమ । గమగా । రిస నీ | స సా గ గ । స గ
త్రి- - - కా ర - కం - - - ర | వి ని ర్జ ర గురు

గ మదపపమ । గమగరి । స స | సా స సా । నీ రి స ని ।
నై - - - రి - ణం - - - న | వాంశ హో రా దే - క్కా

ని ద । ప ద స | నీదని ద ప ప ద । పా మ ప మగమ ।
- ణా - ది - | వ- - గ్గో - త్త - మా - - వ స ర

ప ద । ని స | నీ స రి రి స । ని ద ని స ని ద । పాపద ।
స మ యం - | వ క్రో - - చ్చ నీ - చ - - స్వ క్షే - -

పడమా | గ రి స రి గ గా । మా ద ప మాపమగా ।
- - త్ర | వ ర కే - - ద్ర మూ - - ల - - త్రి

రి గ మా । గ రీ స ॥
కో - - ణ ం -

మ॥సా॥ సా సా స । సాం సాం ని । సం గం రిం సం ని ద ప ప గ మ ।
త్రింశాంశ ష ష్ట్యంశై - రా - వ తాం శ పా - రి

ప ద పా । సం ని ద ప | ద పమమగమ ప ద ప సం ।
జా - తాం శ గో - పు | రాంశ తా - జ యో - - గ

నీ ద సం ని ద పా ద ప । మగ మప ద ప నీ ‖ శ్రీ ‖
కా ర కం రా - జ్య ప్ర దం - గు రుగుహ ముదం ‖

## 190

## యదుకుల కాంభోజి రాగము ఆది తాళం

28 వ మేళకర్త.
స రి మ ప ద స
స ని ద స మ గ రి స

ప॥ దివాకర తనూజం, శనైశ్చరం ।
ధీరతరం, సంతతం, చింతయేఽహం ॥

అ॥ భవాంబునిధౌ నిమగ్న జనానాం ।
భయంకరం, అతి క్రూరఫలదం ॥

మ॥సా॥ భవానీశ కటాక్షపాత్ర భూత భక్తి మతామతిశయ
శుభ ఫలదం ॥

చ॥ కాలాంజన కాంతియుక్త దేహం ।
కాల సహోదరం, కాకవాహం ।
నీలాంశుక పుష్పమాలావృతం ।
నీల రత్న భూషాలం కృతం ।
మాలినీ వినుత గురుగుహ ముదితం ।
మకర కుంభ రాశినాథం ।

తిలతైల మిశ్రితాన్న దీప ప్రియం ।
దయా సుధా సాగరం, నిర్భయం ॥

మ॥సా॥ కాలదండ పరిపీడిత జానుం ।
కామితార్థ ఫలద కామధేనుం ।
కాలచక్ర భేద చిత్రభానుం ।
కల్పిత ఛాయాదేవీ సూనుమ్ ॥దివా॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. దివాకరుడు సూర్యుడు. సూర్యుని కుమారుని, శనైశ్చరం = శనైః = మెల్లగా, చరం = నడచు వానిని, మెల్లగా నడచు వానిని = శనిని మందు డందురు. జ్యోతిష చక్రమందు ఒక్కొక్క రాశి యందు సంచరించు గ్రహములలో ఎక్కువకాలం ఉండువాడు శని యొక్కడే. "త్రింశన్మాసః శనైశ్చరః" ఒక్కొక్క రాశియందు 30 మాసము లుండును. రవి 1 నెల, చంద్రుడు 2¼ రోజులు, బృహస్పతి 1 సంవత్సరం, రాహు, కేతువులు 18 నెలలు సంచరింతురు. మిగిలిన కుజ, బుధ, శుక్రులు కొద్ది 2, 3 నెలలు సంచరించు చుందురు. గాన, శనిని "మందగామి" యందురు. ధైర్యవంతుని ఎల్లప్పుడు నేను చింతింతును. భవాంబునిధే = సంసార సముద్రమునందు నిమగ్న జనానాం = మునిగియున్న జనులకు, భయంకరుడైన వానిని, అతిక్రూర ఫలదం = గొప్ప కష్టముల నొసగు వానిని, భవా, నీశ కటాక్ష పాత్ర భూత భక్తిమతాం = శంకరుని అనుగ్రహమును పొందిన భక్తులకు, అతిశయ శుభ ఫలదం = గొప్ప శుభఫలముల నొసంగు వానిని చింతింతును. ఇట శనిని, మందేశ్వరు డందురు. శని చెడుస్థానముల నున్న కష్టములు కలుగ జేయును.

శ్లో॥ ద్వాదశాష్టమ జన్మస్థాః । శన్యర్కాంగారకో గురుః ।
కుర్వంతి ప్రాణ సందేహం । స్థానభ్రష్టం ధన క్షయం"

జ్యోతిష శాస్త్రమున ఇట్టి సమయముల శివారాధనము చేయింతురు.

శివ భక్తులకు శుభ ఫలమును, లౌకిక భోగములే శాశ్వతములని భావించు వారికి క్రూరమైన ఫలముల నొసగును. కాన, శివునకు, శనికి, తైలాభిషేకాదుల జేయుట ఆచారము. కాటుక వంటి నల్లని దేహకాంతి గలవానిని, కాల సహోదరం = కాలుడనగా యముడు. యముని సోదరుని, సూర్యునకు ఛాయాదేవివలన, యముడు, శని యను కుమారులు, యమున యను కన్యక కలిగిరి. గాన, యమునకు సోదరుడు శని. కాకవాహం = కాకి వాహనముగా గలవాడు. "చాపాసనో గృధ్రరథ స్సునీలః". గ్రద్ద రథముగా గలవాడు. రెండును పక్షి జాతికి చెందినవి. నీలాంశుక పుష్పమాలావృతం = నీలి రంగుగల వస్త్రము, నీల పుష్ప మాలను ధరించిన వానిని, నీలరత్న భూషాలంకృతం = నవరత్నములలో "నీలమణి" యొకటి. అటువంటి రత్నములతో పొదుగబడిన ఆభరణముల నలంకారము గలవానిని, మాలినీ వినుత గురుగుహ ముదితం = మాలినీ = గౌరీదేవి పార్వతిచే కొనియాడ బడు సుబ్రహ్మణ్యేశ్వరునికి ఆనందము కలిగించు వానిని, మకర కుంభరాశి నాథం = "నక్రకస్య కుంభరాశేశ్చ నాయక స్సూర్య నందనః" మకరము, కుంభము రాశులకు అధిపతియైన వానిని, తిల తైల మిశ్రితాన్న దీప ప్రియం = నువ్వులతో కలిసిన అన్నముపై నువ్వుల నూనెతో వెలిగించిన దీపము శనికి ఇష్టముగాన, నువ్వుల నూనెతో దీపము, అభిషేకము, నువ్వులు, బియ్యమును దానమీయు గురు. దయాసముద్రుని, భయము లేనివానిని, కాల దండ పరిపీడిత జానుం = తన చేతియందు కాలదండమును ధరించి యుండుటచే, ఆదండ స్పర్శచే, (బరిపిడిచే) పీడింప బడిన మోకాళ్లు గలవానిని, కామితార్థ ఫల కామధేనుం = కోరిన కోర్కెలు దీర్చు కామధేనువు వంటివానిని, కాలచక్ర భేద చిత్రభానుం = కాలచక్ర గమనమును కూడ భేదించి, విచిత్రముగా ప్రకాశించు వానిని, కల్పిత ఛాయాదేవీ సూనుం = సౌంజ్ఞా దేవి చేత కల్పించబడిన ఛాయాదేవి యొక్క కుమారుని, సంతతము చింతింతును. ఇందు శనియొక్క రూప, గుణ,

ఆధిపత్యమును, ఫలములను తెలియజేసిరి. ఈ కృతిని నియమముగా ప్రతి శనివారము గానమొనర్చిన, శని బాధలు తొలగి, అనుగ్రహామును పొందుదురు.

రెండు కళల చౌకం

ప॥ స్ దాద స్దనిప ప మదా । పా దపపాపమ । పమగా మగమరి
దివాకర- త- నూ - - జం - - శ నై- - - శ్చ ర ం - -

గరిగస సరిసా రిగసా సరిమగ । మపామపాదప । పమపమ గ గ
ధీ- - - ర-త ర ం- సం - - త - - తం- - చిం - త యే-

గరిమగ రీ సారిగ రీగరి రీ । సాసా । సాసా ‖
- - - - - హ ం- - - - - - - - - - - - - -

అ॥ దపా మ దపమ గమగ । మపగమ గ రి । రి సరిప మ పమా
భవాంబు ని-ధౌ - - ని మ- - - గ్నజ నా - - - నాం -

రీ గ రి రీ మగసా సధ్ధా । ధ సా రి । పమపా దా
భయం - క -రం అ - తి - క్రూ ర ఫ -ల దం

మ॥సా॥ మపాద స్నిస రి రి రి మ గ రి గ రి । సా రి స సా ని ద ।
భవానీ -శక టా-క్షపా - త్ర భూ-త భ క్తి మ తామ తి

ద ప మ గ రి మ గ స ‖ దివాకర ‖
శ య శు భ ఫ ల ద ం

చ॥ సారిస రీ పమ పాదస ని దనిప। పాప మ పమగా ।
కా- - లా ం - జ న- కాం - - తి యు- - - క్త

మగారిమగరీ | రి రి రి రి మ గా రి రిగరిస । స పా ద ।
దే - -హం- | కా- ల స హో - - ద-రం కా - క

స రిరిప మా | మగమా ప ద ని దనిని । ద పా మ గ । గ రి
వా- - - - హం | నీ -లాం శుక పు - - - ష్పమా లా - - -

మ ప ద | దపదసా స స ద స ని । దాప ని దపపమ ।
వృ త ం | నీ-ల ర త్న భూ - - - - షణా - - -లం

గా రి మ గస | పా ప ని దపా మగరి గసా। సారి మమగగ రి।
- కృ - - తం | మా లి నీ - - వి- ను- త గురు - గు -హా -

మాపద పా | పాపద ప సా స ని స రిగా । గ రి రీ రీ ।
ము ది- తం | మక- ర కుం భ - రా - - - - శి నా

స ని స స | రీ రి సా స నీ । ని దాప । మ ప దా |
ధ ం తి ల | తై ల మి శ్రి తా న్న దీ ప - ప్రి యం |

ప దా రి సా మపదస । నిద పా పమ । గారి మ గ స |
ద యా సు ధా సా- - - గ- రం ని - - ర్భ- యం |

మ॥సా॥ సారిమాగపద పాదపమగ రీ । మా ప దా ద ప ద ।
కాలదం డపరి పీ డితజా- నుం కా మి తా ర్ధ ఫ ల

స స ని స రీ రీ | రీ మ గా రి రి గ రి స ని స దాపా ।
ద కా- మ ధే నుం | కా ల చ క్ర భే - ద చి - త్ర భా నుం

పాద రి నీ దా । పామగ రి మగ స || ది ||
క ల్పిత ఛా యా దే వీ -సూ - నుం || ||

## 191

## రవమా మనోహరి రాగం రూపకం

27 వ మే. జన్యం. స గ మ ప ని స

స ని ద ప మ గ స రి స

52 వ మేళకర్త గాను గలదు. సంపూర్ణం.

ప॥ స్మరామ్యహం, సదా రాహుం ।
సూర్య చంద్ర వీక్ష్యం, వికృత దేహం ॥

అ॥ సురాసురం రోగ హరం, సర్పాది భీతిహరం ॥
శూర్పాసన సుఖకరం । శూలాయుధ ధరకరం ॥స్మరామి॥

చ॥ కరాళ వదనం । కఠినం, కయానార్ణ కరుణార్ద్రాప్రాంగం ।
చతుర్భుజం । ఖడ్గ ఖేటాది ధరణం చర్మాది నీలవస్త్రం ।
గోమేధికాభరణం, శని, శుక్ర మిత్ర గురుగుహ సంతోషకరం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. నేను ఎల్లప్పుడు సూర్య చంద్రులను చూచువానిని, వికారమైన దేహము గలవానిని, రాహువుని స్మరించు చున్నాను. సురాసురం = అమృతము త్రాగుటచే సురుడు, జన్మతః అసురుడగుటచే, సురుడు అసురుడైన వానిని, రోగములను పోగొట్టు వానిని, సర్పాది భీతి హరం = పాములు మొదలైన విష జంతు భయమును పోగొట్టు వానిని, రాహువునకు అధిదేవత గోవు, ప్రత్యధి దేవత సర్పమగుటచే విష బాధను పోగొట్టువాడు, శూర్పాసన సుఖకరం "చేట" ఆసనముగా గలిగి సుఖము లొసగువానిని, శూల మును ఆయుధముగా హస్తమునందు ధరించిన వానిని స్మరింతును. కరాళ వదనం = భయంకరమగు నోరు గలవానిని, కఠినమైన స్వభావము గలవానిని, "కయానార్ణ కరుణార్ద్రాప్రాంగం" = "కయానశ్చిత్ర ఆభువః" యను మంత్రమును జపించు వారిని దయతో

చూచువానిని, పైమంత్రము రాహుగ్రహ మంత్రము. నాలుగు చేతులుగల వానిని, శూలము, ఖడ్గము, ఖేటము మొదలైన ఆయుధములు ధరించిన వానిని, నల్లని చర్మమును వస్త్రముగా ధరించిన వానిని, గోమేధికము నవరత్నములలో నొకటి. అట్టి గోమేధికమును ధరించు వానిని, (రాహుప్రీతిగా గోమేధికమును ధరించవలెను.) శని, శుక్ర మిత్రం = శుక్రునకు, శనికి మిత్రుని, కుమారస్వామికి సంతోషమును కలిగించు వానిని, రాహువుని ఎల్లప్పుడు స్మరించు చున్నాను. ఇందు, ఆధిపత్యమునుగాని, రాగ నామమును గాని ఉదహరించలేదు. రాహుగ్రహ మంత్రమును, మిత్రులను మాత్రము సూచించిరి.

ఒక కళ చాపుం

ప॥ ప మ పాదప మగ మ సా ॥ నిదనిసా ని ని దపద ప మ |
స్మ- రా -- -- మ్యహం స-దా- - రా--- హు ం |

(2) ... పా ని దదా | (3) ని స రి సస ని దానిద ప మపా |
... మ్యహం-- | స - దా - - - రా-- హుం - |

(4) ప దప మ గమపా ని ద పమ । పదనిద ని రి । స నీద పమ |
స్మ -రా - --మ్య హం - - స-- దా - - రా -హుం - |

స రిగరిస ని రి స నిదప మ । గ రి గ మ పమ ప ద
సూ- - - ర్య - చం - -ద్ర- వీ - క్ష్యం - వికృత

దనిదా ప మ ‖ స్మ ‖
దే-- హుం

అ॥ స సా స ని ని ద దా । స ని స రి స ని దా నిద పమగిరి |
సు రా సు - రం - రో- - - గ - హ - - రం-- |

గమపదని ద నిస్ నిదప । మపదని సా రి స ని దనీసా
స - - -ర్వా - - - ది - - భీ - - - తి - - హా - రం

రీ సా , సిదప దని సా । నీ సా ని ద పమగరిగమ ||
శూర్వా సనసు ఖక రం శూలాయు ధ ధర - కరం

చ॥ గరి రీ సారిస ని ధ సీ । సని సా పమగరిసరి | గ మ పదప మ
క- రా ళ - - వ - ద సం - క - రి-సం | క యూ - - నా -

పాదప । నిస్ని ద ప మపా ద నిదా | ద ని స ని రీ స ని
- ర్ణ - క - రు - ణా - - ర్ద్రా - - | పాం - - - గం

సా రి స । రీ , గా , గమ గా , రి | గ రి గా ప మ గ రి
- చ - తు ర్భు జ ం - - | ఖ - - డ్గ - ఖే -

సా ని ద । పదపమ గమగరి సనిసా |
టా - - ది-ధ - ర - - - ణం-

మ॥సా॥ మాపా ద నీద పమపా । ద మపా , ని ద ని స ని సా |
చ ర్మా ది నీల వ- స్త్రం గో - మే ధి కా- భ ర ణం

రి స రీ , గ గ రి గ మ గ రి । స ని రి స ని ద
శ ని శు- క్ర ఖి - త్ర - గు రు గు హా స ం - తో

ప మ గ రి గ మ || స్మ ||
- ష క - ర ం

# 192

## చామరం రాగం రూపకతాళం

56వ మేళకర్త. షణ్ముఖప్రియ సంపూర్ణం.

ప॥ మహాసురం, కేతుమహం, భజామి ఛాయాగ్రహ వరం ॥

అ॥ మహావిచిత్ర మకుట ధరం । మంగళ వస్త్రాది ధరం ।
నర పీఠస్థితం, సుఖం । నవగ్రహ యుత సుఖం ॥మహా॥

చ॥ కేతుం కృణ్వన్మంత్రిణం । క్రోధ నిధి జైమినం ।
కుళుద్ధాది భక్షణం । కోణధ్వజ పతాకినం ।
గురుగుహ చామర భరణం । గుణదోష చిదాచరణం ।
గ్రహణాది కార్య కరణం । గ్రహాఽపసవ్య సంచారిణం ॥మహా॥

వ్యా॥ ద్వితీయా విభక్తి = నవగ్రహములలో రాహు కేతువులు ఛాయాగ్రహములు, మహాసురం = గొప్ప రాక్షసుని, ఛాయాగ్రహ శ్రేష్ఠుని, కేతువుని, నేను సేవించుచున్నాను. గొప్పది, విచిత్రమైన కిరీటమును ధరించిన వానిని, శుభప్రదమైన వస్త్రమును ధరించు వానిని, నరపీఠస్థితం = మనుష్యుని పీఠముగా చేసికొని యున్న వానిని, సుఖమైన వానిని, నవగ్రహయుత సుఖం = ఛాయా గ్రహమగుటచే, తాను యేగ్రహ రాశియందుగాని, యేగ్రహముతో చేరియున్నగాని, వీక్షణము గలిగి యున్నచో, వారితో సమానమైన సుఖమొసగు వానిని, భజింతును. కేతుం కృణ్వన్మంత్రిణం = "కేతుం కృణ్వన్న కేతవే పేశోమర్యా అపేశసే, శముషద్భి రజాయథాః" అను మంత్ర స్వరూపుని, క్రోధనిధి జైమినం = జైమిని మహర్షి కోపమునకు గుటి అయిన వానిని, కుళుద్ధాది భక్షణం = నవ ధాన్యములలో, "ఉలవలను" కుళుద్ధాను లందురు. ఉలవలను ఎక్కువగా తినువానిని, కేతు ప్రీతిగా ఉలవలను దానమిత్తురు. కోణ ధ్వజ పతాకినం = ఒక

మూల హెచ్చుగా గల పతాకము గలవానిని, "ధ్వజాసనో జైమిని గోత్రజః" గాన, జెండాగలవాడు. జైమిని గోత్రజుడు. గురుగుహ చామరాభరణం = కుమారస్వామి యొక్క చామరం = వింజామర మును భరించిన వానిని, సాధారణముగ, చమరీ మృగ వాలమును గాని, నెమలి పింఛమును గాని వింజామరముగా నుపయోగింతురు. సుబ్రహ్మణ్యేశ్వరుని వింజామరము నెమలి పించము. గాన కుమార స్వామి వింజామరమును భరించిన వానిని, ఇచట "చామర" మని రాగ నామమును కూర్చిరి. మరియు "చామర" రాగము ను "షణ్ముఖప్రియ" రాగ మందురు. కుమారస్వామికి ప్రియమైన, రాగ మును భరించిన వానిని, గుణదోష చిదాచరణం = గుణదోషము లను సూక్ష్మముగా నాలోచించి, ఆచరించు వానిని, గ్రహణాది కార్యకరణం = గ్రహములకు మూలకారణమైన వానిని, కేతుగ్రస్త సూర్యోప రాగమని, రాహుగ్రస్త సోమోప రాగమందురు. గాన, సూర్య, చంద్ర గ్రహణములకు కారణమైన ఛాయా గ్రహములు రాహు కేతువులు, గ్రహాపసవ్య సంచారిణం = 7 గ్రహములు సవ్య ముగా, మేషవృషభ, మిథునాది రాశులలో క్రమముగా సంచరింతురు. రాహు కేతువులు అప సవ్యముగా, మేష, మీన, కుంభాది రాశుల యందు సంచరింతురు. రాహు కేతువులు, అపసవ్యముగా, ఇరువురు ఒకేసారి, ఒకరికి మరొకరు 7వ రాశిలో నుండి సంచారము చేయు చుందురు.

ఈకృతియందు, జ్యోతిష శాస్త్ర విషయములను, ఛాయా గ్రహమని, మంత్రము, ధ్యానము, గ్రహణ విషయము, అపసవ్య సంచారము మొదలైన విషయములను, రాగ నామముతో పొందు పరచిరి. కేతువు వైరాగ్య కారకుడు, జ్ఞానము నొసగువాడు.

ఈ నవగ్రహ కృతులను ముఖ్యముగా సంగీత విద్యార్థులు, విద్వాంసులు అర్థములను గ్రహించి, ఒక్కొక్క కృతిని గురుముఖ

ముగా నభ్యసించి, మంత్రోపాసనా పద్ధతిలో, ఇందలి వ్యాఖ్యాన మర్మములను గ్రహించి గానమొనర్చిన, నవగ్రహ బాధలు లేక, సర్వ సుఖముల నందగలరు.

## రెండు కళల చౌకం

ప॥ ప మ గా గ రీ । రీ గ రి స ని స గ రీ |
మ - హా సు రం కే - - - - తుమహం |

రి గా మ పా । ప మ గా గ రి రి గ మ ప ||
భజా మి ఛా యా - - గ్ర హ వ - ర ం ||

అ॥ మ పా ద ని ద । ని ద ప మ ప ద |
మ హా వి చి - త్రమకు ట ధ రం |

మా ప ద స ని దా । దా ని ని సా |
మం గ ళ వ - - స్త్రాది ధ రం |

మ॥సా॥ ని స రీ గా మ గా రి సా । స రీ గ రి స
న ర పీ ఠ స్థి తం సు ఖం న వ గ్ర హాయు

ని ద ప మ గ మ || మహా ||
త సుఖ ం - -

చ॥ పా ప మగా రీ । సా స ని సీ స స | సా రి గ మ ప ।
కే తుం - - కృ ణ్వ న్నం - - త్రి ణం | క్రోధ ని ధి -

ప ద ని ద పా | ని నీ ని దదా ప మ । ప ద ని సా, ।
జై - - మి నం | కు ళు త్థా - - ది - భ - క్ష ణం

రీ గ రి ని ద । ప దా ని సా |
ణో ణ - ధ్వ జ ప తా కి నం |

ని స రి గ రీ గ మ గ రి సా । గ రి సా స ని దా ని ని సా |
గురు గుహా చా మ ర భ ర ణం గు ణ దో ష చి దా భ ర ణం |

రి గ ప మ గ రి గ రి స ని దా ।
గ్రహణా - ది కా - ర్య క ర ణం

ని దా ప పా మ ప ప మ గ మ ||
గ్ర హా ప స వ్య సంచా - రి ణం ||

---

# శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర కృతులు



ముత్తుస్వామి దీక్షితులవారి ఉపాస్యదైవం సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఆస్వామి యనుగ్రహ విశేషముచేతనే, మధుర, గంభీర, మనోహర దివ్యవాణి వెలువడినది. దక్షిణదేశమున, సుబ్రహ్మణ్యేశ్వర పవిత్ర క్షేత్రములెన్నో గలవు. అందు ప్రసిద్ధిగన్నవి తిరుత్తణి, తిరుప్పరం కుంద్రం, తిరుచ్చందూర్, పళని, స్వామిమలై, పళముదిచ్చోలై మొదలైనవి. ఆయా క్షేత్రములను సందర్శించిన సమయమున, భక్త్యావేశముతో, ఒక్కొక్క విభక్తిలో 3, 4 చొప్పున, 20 కృతులు రచియించిరి. ప్రాణవాయువు, పరమశివుడు. మూలాధారక్షేత్రం, పరాశక్తి అందు ప్రాణానల సంయోగము వలన బుట్టిన, ప్రణవ నాద స్వరూపుడు గణపతి. మూలాధారము నుండి, సహస్రారము వరకు, సంచార మొనర్చు కుండలినీ స్వరూపమే సుబ్రహ్మణ్యేశ్వరుడు సర్వాకారుడని వర్ణించిరి. షట్చక్రములలో సంచారము జేయువాడు, షణ్ముఖుడు. అను అంతరార్థముతో గూడిన భావముతో రచించిరి.

శ్లో॥ గౌరీ శంకర సంభూతం । షణ్ముఖం, సర్వ కామదం ।
సేనావల్లీశ్వరం, దేవం । సుబ్రహ్మణ్యం నమామ్యహమ్॥

శ్లో॥ ధ్యాయేదీప్సిత సిద్ధిదం, శివసుతం,
శ్రీ ద్వాదశాక్షం, గుహం ।
ఖేటం, కుక్కుట మంకుశం, చ వరదం, పాశం ధనుశ్చక్రకం।
వజ్రం, శక్తిమసించ శూలమభయం,
దోర్భిర్ధృతం షణ్ముఖం ।
ధ్యాయేచ్చిత్ర మయూర వాహన శుభం,
చిత్రాంబరాలంకృతం ॥

ఈ ధ్యానశ్లోక మండలి విషయములను, పురాణ విషయములతో, గూఢార్థములతో రచించిరి. వివరములు ఆయాకృతుల వ్యాఖ్యానముల గమనింపగలరు.

## 193

## తోడి రాగం ఆది తాళం

8 వ మే. జన్యము సంపూర్ణం.

ప॥ శ్రీ సుబ్రహ్మణ్యో మాం రక్షతు ।
షణ్ముఖావతార, శక్తిరూప ॥ శ్రీ ॥

అ॥ భాసమాన వల్లీ దేవసేనో । భారతీశాది తత్త్వ బోధనో ।
వాసవాది వందిత శుభ చరణో ।
పత్రవిభూతి ప్రదాన నిపుణః ॥ శ్రీ ॥

చ॥ శతకోటి భాస్కర శోభాకరః । శిష్ట శితికంఠాత్మజ శివకరః ।
ప్రతాప తారకాది హత ధీరః । ప్రబల గణేశానుజ షడక్షరః ॥

మ॥సా॥ శతాయుః ప్రద భక్త మందారః ।
శంఖాద్యభిషేకాద్యుపచారః ।
క్షితీశ పూజిత దివ్యాంబరః ।
నత వీరానంద వర గురుగుహః ॥ శ్రీ ॥

వ్యా॥ ప్రథమా విభక్తి. ఆరు ముఖములతో నవతరించిన, శక్తిస్వరూపుడైన సుబ్రహ్మణ్యేశ్వరుడు నన్ను రక్షించుగాక. వల్లీ, దేవసేనతో ప్రకాశించువాడు. భారతీశాది తత్త్వ బోధనో= బ్రహ్మ తత్త్వమును ప్రబోధించు వాడు. ఇంద్రాదులచేత నమస్కరింపబడు, శుభముతో గూడిన పాదములు గలవాడు. భక్తులకు, శుభపత్రమును, విభూతి నొసగువాడు. విభూతి యన, అష్టైశ్వర్యములు నూరుకోట్ల

సూర్యులవలె ప్రకాశించువాడు, శంకరుని కుమారుడు, శుభము లొసగువాడు, ప్రతాపముచే తారకాసురుడు మొదలైన వారిని చంపిన ధీరుడు, దక్షిణావృత శంఖముతో నభిషేకింప బడువాడు, నూరు సంవత్సరములు సంపూర్ణాయు నొసంగువాడు, రాజులచే పూజింప బడిన దివ్యమైన వస్త్రములు ధరించినవాడు, వీరులచే నమస్కరింప బడువాడు, అయిన గురుగుహమూర్తి "స్వామిమలై" యందు వెలసిన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు నన్ను రక్షించుగాక! యని వర్ణించిరి. తోడి తెనుగు పదముగాన రాగ నామములేదు.

## 194

## బిలహరి రాగం మిశ్రజాతి ఏకతాళం

29వ మేళకర్త జన్యము — స రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ శ్రీ బాల సుబ్రహ్మణ్యాగచ్ఛాగ్రగణ్య ।
శ్రీ చిదానంద నాథవరేణ్య ॥

అ॥ బాల గోపవిదిత దీనశరణ్య । ఆత్మప్రకాశ లావణ్య, కారుణ్య॥

చ॥ సనకాది సన్నుత స్వామినాథ । స్వామి శైలస్థిత సోమ తాత ।
కనకవల్లీ దేవసేనోపేత । కైవల్యదాత, సకృద్విభాత॥

మ॥సా॥ వనజ వదన, పద పంకేరుహ । వరదాశ్రిత కల్పమహీరుహ ।
మనసిజ జనకాది సేవిత, కుమార, ధీరతర హర గురుగుహ ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. స్వామిమలైపై వెలసిన బాల సుబ్రహ్మణ్యేశ్వరా! రమ్ము. సద్గురువైన చిదానందనాథుడవు, ముందు లెక్కించదగిన వాడవు, పసిపిల్లలు మొదలు సర్వులను, దీనులను

రక్షించువాడా! ఆత్మస్వరూపమును ప్రకాశింప జేయు కోమల స్వరూపా! కరుణాస్వరూపా! సనక సనంద నాథులచే నుతింపబడు స్వామినాథా! స్వామిమలై = సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వెలసిన ఆకొండను స్వామిమలై యందురు. మలై యంటే కొండ. బంగారు తీగవైన, అమృతవల్లీ, దేవసేనలను భార్యలతో గూడినవాడా! మోక్షము నొసగువాడా! సోమతాత = స = ఉమ = సోమః, ఉమతో గూడినవాడు శివుడు. తాత = తండ్రి. శంకరుడు తండ్రిగా గల వాడా! మొదలగు విశేషణములతో వర్ణించిరి. మరియు పద్మము వంటి ముఖము, పాదములు గలవాడా! ఆశ్రయించిన వారికి వరము లొసగు కల్పవృక్షము వంటివాడా! కుమారా! ఆగచ్ఛ = నన్ను రక్షింప రావలసినదని ఆహ్వానించిరి.

## ఒక కళ చౌకం

ప॥ సా , రీ గా । పా , దా ౕరీ । ౕసా , ౕస నిద నిద ।
శ్రీ బాల సు బ్రహ్మ ణ్య గ - చ్ఛా - -

పమ గరీ గా | పా , పాపమ । గ రిసరిపమగ । రి గరిసనినిధ ।
- గ్ర గ - ణ్య | శ్రీ - చి - దా - - నం - ద నా - - థ - వ -

సా, సరిగద | (2) ని ధ । సా , సాసా |
రే - - - ణ్య | వ - రే - ణ్య |

అ॥ గా, పాదా । ౕసా , ౕసనినిద । ౕరి ౕసా దాద ౕస । నిదాపా ని దదప |
ఆ బాల గో - - ప - వి ది త దీ - న శ ర ణ్య - - - |

గా - దపాదా | ౕగా ౕమ ౕరీ ౕసా । ౕస నిదదపద ౕరి । ౕసా , నిదనీ ।
- శర ణ్య | ఆ - త్మప్ర కా - - - శ - లా వ - ణ్య

పా , మ గ రి గ ‖ (శ్రీ) ‖
కా రు - ణ్య -

చ‖ మగా రీ మగ । రి సా ధీ ధా । సా , రీ గా । పా , పాపా |
స న కా ది - స - న్ను త స్వా - మి నా - థ |

ప గాపాదా । సం నీదా సా । నీ , సందపా । ప మగరీగా | నిదాపానిద ।
స్వా - మి శై - లస్థి త శో -- మ తా --- త | క న క ప -

మా , మగగా । ప దా సం నినిద । సా , సాసా |
ల్లీ దే - వ సే - నో --- పే - త |

సం ప ద ద రిం సం ని । ద పా పా ని ద । ప ద మాగ రి సా ।
కై - - వ - - ల్య దా - - - త స - - కృ - ద్వి

ని ధా సా సా |
భా - - త |

మ‖సా‖ సరిగపమగ ప ద పా మ గ రి స । స ని ధా స స సాప మ
వనజవదన ప ద పం కే - రు హ వ ర దా శ్రి త క ల్పమ

గా ద ప | మగ పద సం ని దా రిం సాం ని ద ప । మా గ రీ గ
హీ రు హ | మన సిజ జ న కా ది సే వి త కు మా ర ధీ ర

సం ని ద ప మ గ రి గ ‖ (శ్రీ) ‖
త ర హ ర గు రు గుహ

# 195

## నాగస్వరావళి రాగం చతురశ్రజాతి ఏకతాళం

28 వ మే జన్యం స గ మ ప ద స
స ద ప మ గ స

ప‖ శ్రీవల్లీపతే పాహిమాం । చింతితార్థ దాయక । శ్రీ ‖

అ॥ దేవసేనానాథ ! జగన్నాథ ! । దీనబంధో, దయాసింధో ॥

చ॥ వాగీశ గర్వహార । హరకుమార , యోగీశ మానసాగార ।

శ్రీగృధ్రాద్రి విహార , భోగీశ నుత , గురుగుహ కుమార ॥

వ్యా॥ సంబోధన. శ్రీవల్లీపతే ! నన్ను రక్షించుము. యోగీశ్వరుల మానసమందు నివసించు వాడా ! గ్రద్ద వాహనముగా గలిగి విహరించు వాడా ! బ్రహ్మ గర్వమును హరించిన వాడా ! భోగీశుడు = ఆదిశేషునిచే నుతింప బడువాడా ! అను విశేషణములతో కొనియాడిరి. కుమారస్వామి సర్పాకారుడుగాన, సర్పములకు నాగస్వర మనిన ప్రీతి గనుక. నాగస్వరావళి రాగమున ఈకృతిని రచించిరి.

# 196

## నాట రాగము ఆది తాళం

36 వ మేళకర్త. స రి గ మ ప ద ని స
స ని ప మ రి స

ప॥ స్వామి నాథ పరిపాలయాశు మాం । స్వ ప్రకాశ ।

వల్లీశ గురుగుహ, దేవసేనేశ ॥ స్వామినాథ ॥

అ॥ కామజనక, భారతీశ సేవిత । కార్తికేయ నారదాది భావిత ।

వామదేవ పార్వతీ సుకుమార । వారిజాస్త్ర సమ్మోహితాకార॥

మ॥సా॥ కామితార్థ వితరణ నిపుణ తరణ ।

కావ్య నాటకాలంకార భరణ ।

భూమిజలాగ్ని వాయు గగన కిరణ ।

బోధరూప నిత్యానంద కరణ ॥

వ్యా॥ సంబోధన. ఓస్వామినాథా! స్వయముగా ప్రకాశించు వాడా! వేగమే నన్ను పరిపాలించుము. వల్లీ, దేవసేనలకు ప్రభువైన గురుగుహ స్వరూపా! విష్ణువు, బ్రహ్మచేత సేవింపబడు కార్తికేయా! కృత్తికా నక్షత్రమున, షట్ కృత్తికలకు జన్మించుటచే కార్తికేయ నామము గలవాడా! శివ, పార్వతుల కుమారా! కావ్య, నాటక ములను అలంకారముగ భరించినవాడా! ఇందు "నాటకాలంకార" యని నాట రాగ నామమును కూర్చిరి. పంచభూత రూపమున ప్రకాశించు వాడా! మొదలగు విశేషణములతో వర్ణించిరి. ఇందు, వితరణ, భరణ, కిరణ, కరణ పదములు అంత్యప్రాసతో కూడిన పద ములు అలంకారములు. స్వామిమలై నివాసుని కీర్తనము.

## రెండు కళల చౌకం

ప॥ సా రి గా మపని । పామ మ । మ రి స ని̣
స్వా మినా థ పరి । పాల యా - శుమా ం
సా ప రీ సమమ । పా, ప ద ని స̇ ని । పాప మామరిస ॥
స్వ ప్రకాశ వ- ల్లీ శ గు రు గుహ । దేవ సే నే-శ ॥

అ॥ పామపమరి సా । నిపామ । రీ రిస । సా రి సా మ రీ ।
కామజ సకభా ర తీ శ సేవిత । కా ర్తి కేయనా
సపామ । నీ మప । గామమాపపా । ప స̇ాప । రి̇ స̇ాని ।
రదాది భా విత । వామ దేవపా ర్వ తీసు కుమార ।
స̇ా రి̇ స̇ా ని సా । నీ ప మ । పమరిస ॥
వా రి జా స్త్ర స । మ్మోహితా -కా-ర ॥

మ॥సా॥ నీ̣ ధ̣ మా̣ ధ̣ ధ̣ ని̣ స రి ని̣ స రి గ మ ప ।
కామి తా ర్థ వి త ర ణ నిపుణ చ ర ణ !

సా స పా ప సా । నీ రీ సస నిప |
కా వ్యనాట కా । లంకార భ ర ణ |

పా నిప రి రి సా నిప సస మ మ రి ।
భూ మి జ లాగ్ని వాయుగగ న కి ర ణ ।

రీ సి సా పనీ । పా మమరిససని ||
బోధరూ పని త్యా నం దకరణ || స్వామి ||

# 197

## హమీర్ కళ్యాణి రాగం ఆది

65 వ మే. జన్యం. స రి గ మ ప ద ని ప ద ప స
స ని ద ప గ మ గ రి స

ప॥ పురహార నందన, రిపుకుల భంజన ।
శిఖీంద్ర వాహన, వారిజ లోచన ॥

స॥చ॥ కరుణామృతరస సాగర । కరుణామృత శేఖర ।
సురవైరి, కాలరిపు వైరి పాల । గురుగుహ, సరసిజ కర,
స్కందలీల ॥

వ్యా॥ సంబోధన. క్రియాపదము లేనిరచన. హిందూస్థానీ రాగము. శంకరుని కుమారుడా! శత్రువులను హతమార్చువాడా, నెమలి వాహనముగా గలవాడా! పద్మములవంటి కన్నులు కలవాడా! దయయనే అమృతరస సముద్రుడా! దయామృతమును శిరమున ధరించిన వాడా! ఈరెండు విశేషణములచే, దయా స్వరూపుడా, సురరిపులు రాక్షసులు, యముని శత్రువు, శివుడు. శంకరుని వైరి మన్మథుని పాలించిన వాడా! మొదలగు పదములతో కొనియాడిరి.

# 198

## అసావేరి రాగం ఆదితాళం

8వ మేళకర్త. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ కుమార స్వామినం, గురుగుహం నమామి । పదసరోరుహ మహం

అ॥ హిమాద్రిజా సుతం, సురపతి నుతం ।
హిరణ్య మణి కుండలాలంకృతం ।

మ॥సా॥ భ్రమాత్మక విశ్వకరం, సురవరం ।
భ్రాంతిహర చతురతరం, శుభకరం ॥

చ॥ కార్తికేయం, బాహులేయం ।
కాంచనమయ దేహం, శిఖివాహం ।
కార్తస్వర హారం, శ్రుతిసారం । గర్విత శూరాది సంహారం ॥

మ॥సా॥ పూర్తి విద్యాప్రదం, తత్పదం ।
మూర్తికరం, మూలాజ్ఞాన హరం ।
కీర్తిశాలినం, వినత శూలినం ।
ఆర్తి భంజనమశేష రంజనం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. కుమార స్వామిని, గురుగుహుని, పద్మములవంటి పాదములు గలవానిని, నేను నమస్కరింతును. హిమవంతుని కుమార్తెయగు పార్వతి కుమారుని, ఇంద్రునిచే నుతింప బడు వానిని, బంగారము, మణులతో కూడిన కుండలములచే నలంకరింప బడినవానిని, భ్రమను కలిగించు ప్రపంచమును చేయువానిని, "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" నశించునది శాశ్వతమైనదిగా గోచరించుట భ్రమ. అట్టి భ్రమను తొలగించు వానిని, కార్తస్వరము, బంగారము హారముగా ధరించు వానిని, శూరుడు మొదలైన దుష్ట

లను సంహరించు వానిని, సంపూర్ణముగా విద్యనొసగు వానిని, అజ్ఞాన మును మొదలంట హరించు వానిని, మొదలగు విశేషణములతో కీర్తించిరి. కీర్తిగలవానిని నమస్కరించు చున్నాను. సావేరికి, అసావేరికి మూర్ఛన యొకటియే గాని, మేళకర్త భేదముచే, సావేరి కానిసావేరి అసావేరి రాగమున రచించిరి.

## రెండు కళల చౌకం

ప॥ రి మ రిమ పా , ద ప ద ని । ద ప ద ప । మా ప గ
కుమా -- ర స్వా - - - మి న ం - గు రు -

రి గ రి స | రిగస స రిని సా రిమపా ద ప । పదపా ద పద మ।
గు - హ ం | స-- మా-- మి పద స రో - -- రు హ - మ -

గ గ రి గ - రీ రి స || కుమార ||
హ ం - - శ్రీ - -

అ॥ ప మా ద మ పా ద స । స రి గ గ రి స । రీ స ని సా |
హిమా ద్రి - జా సుతం - సుర - ప - తి ను - తం |

రి గ గ రి రి గ రి స స రి గా । రీ స ని - సా ని స రి స।
హిర - - - ణ్య మ ణి కుం - డ - లా - లం - -

సా ని స దా || మ పా ద స రీ గ స రి స రి ని స ప ద ।
- కృ - తం || భ్ర మా త్మ క వి శ్వ క ర ం సు ర వ ర ం

సా ని ద మ గ రి స । ధ స రి ప మ గ రి స || కుమార ||
భ్రాంతి హ ర చ తు ర త ర ం శు భ క ర ం

చ॥ గా , రి గ గ రీ స గ రి ని । సా , స । ని స రి స దా |
కా ర్తి కే - - య ం - - బా హు లే - - - యం |

సా రి మమా మ ని ద ప మపామగా । గ రీ స ద ప ద మ।
కాంచ - న మ - య - దే - - - హ ం - శి - ఖి -

ప రిపమ పా | ప మ పా ద స గ్రీ గ రి । గ్రి స గ రి సా ।
వా - - - హం | కా - ర్త స్వ ర హా - - రం శ్రు - తి

స ని సా దా | గా రి గ రి స స రి ని స ప ద ప ద ।
సా - - రం | గ - - ర్వి త శూ - - - రా - - - -

మ ప ప ని ద ప । మ పామ గ రి సా ‖
ది సం - - - - - హా - - ర ం - ‖

మ॥సా॥ ని ద ప గా , రి రి గ రి గ స రి ని సా ।
పూ - ర్తి వి - ద్యా - ప్రద ం త - త్పదం

మ రి ప మ పా ప ద । ప ద మ ప మ ద పా |
మూ - ర్తి క రం మూ - లా - జ్ఞా - న హా రం |

పా ద సా రి గ రి స గ రి స ని రి సా ।
కీ ర్తి శా లి న ం వి న త శూ - లి నం

గ రి స ని దా పమ । ని దా ప మగరిస ‖ కుమార ‖
ఆ - ర్తి భ ం జన మ హే ష రంజనం ‖ ‖

## 199

# ఆనంద భైరవి రాగం రూపకం

22వ మే. జన్యం.

ప॥ దండాయుధ పాణిం । దండిత దైత్య శ్రేణిం ।
దయానిధిం భజరే । హృదయ సతతం, సురవినుతం ॥

అ॥ చండాంశు శతకోటి సంకాశం । జగదీశ మఖండ రూప ।
మండజ మణికుండల కుండలాది మండితాంగ సుకుమారం ।
ఖండిత తారక శూరం। పండితతర నవవీరం, చండికేశావ తారం॥

చ॥ మందస్మిత వదనార విందం । మాతుల గోవిందం।
శరణాగత సుర
బృందం, బహుమానిత మునిబృందం । పరిపాలిత ముచు
కుందం । ప్రణత విరించి ముకుందం । అధర మధుర మక
రందం । మృగుతర వచన మనంతం । మాయా మూలకందం ।
స్కందం । శం, దం, పృథివ్యాత్మక గంధం । గగనాత్మక సుమ
గంధం । వాయు మయ ధూప గంధం । వహ్నిమయ దీప
బృందం । అమృతాత్మక రసబృందం । శ్రీగురుగుహ మా

మ॥సా॥ నందం । సుందర కర చరణార విందం । రథ గజ తురగ
బృందం । సత్య జ్ఞానానంద మతిస్వచ్ఛందం
॥ దండాయుధ పాణిం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "పళని" క్షేత్రమందు వెలసియున్న దండాయుధ పాణిని, రాక్షస సమూహమును దండించిన వానిని, దయా సముద్రుని, భజించుము. ఓ హృదయమా ! ఎల్లప్పుడు భజింపుము. దేవతలచేత వినుతింప బడువానిని, నూరుకోట్ల

సూర్యుల కాంతితో ప్రకాశించు వానిని, జగదీశుని, అఖండ రూపుని, అండజ మణిమండల కుండలాది మండితాంగ సుకుమారం= అండజ= గ్రుడ్డువలన పుట్టునవి. పక్షిజాతి, పాము, తొండ, బల్లి, మొసలి మొదలగునవి. పక్షిరాజు గరుత్మంతుడుగాన, గ రు డ పచ్చలతో పొదిగిన కుండలాదులతో విరాజిల్లు అంగములుకల సుకుమారుని, శూర, తారకాసురులను ఖండించిన వానిని, పండిత శ్రేష్ఠుడైన నిత్య నూతన వీరుని, చండికకు ప్రభువైన అవతారుని, ఎల్లప్పుడు భజించుము. చిరునవ్వుతో గూడిన ముఖపద్మముగల వానిని, గోవిందుడు మేనమామగా గలవానిని, పార్వతి గోవిందుని సోదరి. గాన పార్వతీ తనయుడు కుమారస్వామిగాన, గోవిందుడు మేనమామ. శరణు బొందిన దేవతా బృందము గలవానిని, మునిబృందముచే కొనియాడబడువానిని, ముచుకుందుని పరిపాలించిన వానిని, బ్రహ్మ, ముకుందులచే నమస్కరింపబడు వానిని, పెదవియందు మధురమైన, గ్రూపమైన మకరంధము గలవానిని, మా య కు మూలస్థానమైన వానిని, స్కందుని, "శం" సుఖమును "దం" ఇచ్చు వానిని, భూమిరూపమైన గంధమును, ఆకాశమయ పుష్పగంధమును, వాయురూపమున ధూపగంధమును అగ్నిరూప దీపబృందమును, అమృతరస రూపము నొసగు పంచభూతాత్మకుని, గురుగుహుని, ఆనందుని, అందమైన కర చరణ పద్మములు గలవానిని, రథ, గజ, తురగము గలవానిని, నిర్మలమైన, సత్యమైన జ్ఞా నా నం ద మ యు ని భజించుము. అని సుబ్రహ్మణ్యేశ్వరుని, సంపూర్ణముగా వర్ణించిరి. ఆనంద భైరవీ రాగమున, ఆనందమయునిగా కొనియాడిరి. ఇందు మంద, అరవింద, గోవింద మొదలగు ప్రాస పదములను 18 టిని కూర్చుట విశేషము. ఇట్టి రచనలే సుందరములు. బిందుపూర్వక 'ద' కారము. దండ దండిత మొదలగునవి పదింటిని కూర్చుట ప్రాసాలంకారము.

## రెండు కళల చౌకం

ప॥ సా సా ని ద । పాపాపా | దపమగ మపామ । మ గపమ గ రి
దం డా యుధ పాణిం- | ఖండిత దై - - త్య- - - శ్రే -

సా , ని ‖ గ రి రి గ మా । ప ద పా , ద | ప స సా రి గ
ణి - ం ‖ ద యా- ని ధిం భ జ రే హృ | ద య స ర త -

రి స । రి స ని ద నీ ‖ దం ‖
తం సు ర వి ను తం ‖ ‖

అ॥ సా సా , స । పపపా , ప | నీ నీ నీ । స గ రీ గ రి స మ |
చం డాం శు శతకో టి | సంకా శం జ గ దీ - - శ మ |

గ రి స ని ద ప । రి స ని ద ప మ | స ని ద ప మ గ ।
ఖ ం డ రూ - ప మం డ జ మ ణి | మం డ ల మ య

మా ద ప మ గ రి స ‖
ళు ం - డ లా - ది ‖

మ॥సా॥ మాగ రి రి గ రి స స్ని సా । గా రిగ మాపగ మామా |
మ ం డి తాంగ సు కు మారం ఖండిత తా రక శూ రం |

ప స ని స్ని ని స గ రి సా నీ ।
పం డి త త ర స వ పీ రం

రి స ని ని ద ద ప మ ప స ని ని ‖ దం ‖
చం డి కే- శా - వ తా - ర ం ‖ ‖

చ॥ మా మా గ రి । సాపమ గ రిసని | సీ సాసా । సీ స గగ రి |
మం ద స్మి త వ ద- నా --ర | విం - దం మాతు లగో - |

గా మా గ రి । గా మ ద ప మ | గ రి సా స ప ద ।
విం దం శ ర ణా గ త సు ర | బృం దం బ హు-

మా పాపమ గ రి | గా మా ప ద । పా ని ద ద మ
మా ని త - ముని | బృం దం ప రి పా లి త ము చు |

మ గ మా ప మ । పా ప ని నీ స్ని | నీ స్సా ని ద ।
కుం దం ప్రణ త వి - రిం చి ము | కుం దం అ థ

ని స్ని స్ని ద | పా గా మ ద । ప ద మ ప గ మ |
ర మ ధు ర మ క | రం దం మృదు త ర వ చ న మ |

గ రి సా మా । గా రీ గ రి | స ని నీ నీ । సా ప మ గ రి
న ం తం మా యా మూ- ల | క ం - దం స్క- ం - - -

రి గ సా | గ రి గా , స । సా పా ప ప | పదపా మా గగ ।
ద ం - | శ ం దం పృ థి వ్యాత్మ క | గం - థం గగ

మాప మ గ రి | గా మా పా । ద ప మ మ గ రి |
నా త్మ క సు మ | గం థం వా యుమయ ధూ - ప |

గాపమ పాపా । ని ద ప మా ప | పా , ని నీ స్గ ।
గం-- థం వ హ్ని మయ దీ ప | బృ ం దంఅ మృ

రీ గ రి స ని స మ | గ రి సా పా । ద ప మ గ మ పామ |
తా- - త్మక ర స | బృం దం శ్రీ గు రు గు హ మా- - |

గ రి సా సా ||
న ం - దం ||

మ॥సా॥ సా గగ - రిగమప - సా , ని | స్నిదప పమగరి ని సా స |
సుందర కరచర ణా ర | విందం రథ గజ తురం గ |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ని | స | గ | గ | మ | మ | ప | ప | ని | ని | సా |
| బృం | ద | ం | స | - | త్యా | - | జ్ఞా | - | నా | |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నీ | స | మ | గ | రి | సా | స | రి | స | ని | |
| నం | ద | మ | తి | - | స్వ | చ్ఛాం | ద | ం | | దం |

## 200

## సౌరసేన రాగం ఆది

27 వ మే. జన్యం. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ సౌరసేనేశం, వల్లీశం । సుబ్రహ్మణ్యం, భజేఽహం ॥

అ॥ గౌరీశ సుతం, గజానన యుతం ।
గర్విత శూర హరం, సుకుమారం ॥

మ॥సా॥ నీరజపదం, నిరుపమానందం ।
వారిజ భవ వందిత గురుగుహం ॥

వ్యా॥ ద్వితీయ. సుబ్రహ్మణ్యేశ్వరునకు, శూరులైనసేనా పతి యను నామము గలదు. సురులయొక్క సేన = సౌరసేన. దానికి ఈశుడు కుమారస్వామిపై రచింప బడిన ఈకృతికి సౌరసేనలో రచించిరి. వల్లీశుని, గౌరీకుమారుని, గణపతితో గూడియున్నవానిని, నేను భజించుచున్నాను, అని సరసాంగికి బదులుగా సౌరసేన రాగమున రచించిరి. దీనిని "సురసేన" రాగమనియు అందురు.

రెండు కళల చౌకం

ప॥ సా , రి ప మమా మగగా । రీ రి గ । సా నీ
సౌ ర సే - - నే - - శం వ - ల్లీ శం

షా ధా నీ పా । ని దా ప మాగారిస నీ
సు బ్ర హ్మణ్యం భ జే హ ం - - - -

అ॥ గా రీ ప మ గా । మపాద । ప మ గా
గౌ రీ శ సు తం గ జా న న యు తం

మ ప గ మ రి గా మ । రి గ సా ని ధ । నీ సా
గ - ర్వి త శూ - ర హ - రం సు కు మా రం

మ॥సా॥ సా గ రి గ సా రి గ మ పా దా నీ ।
నీ ర జ ప దం ని రు ప మా నం దం

సా రి గ స రి స ని । ద ప మ గ రి గ స ని
వా రి జ భ వ వ ం ది త - గురు గుహ ం

## 201

## సురటి రాగం ఆది

28 వ మే. జన్యం. స రి మ ప ని స
స ని ద ప మ గ ప మ రి స

ప॥ బాల సుబ్రహ్మణ్యం, భజేఽహం ।
భక్త కల్పభూరుహం । (శ్రీ) ॥ బాల ॥

అ॥ నీలకంఠ హృదానంద కరం । నిత్య శుద్ధ బుద్ధ ముక్తాంబరం ॥

చ॥ వేలాయుధ ధరం, సుందరం। వేదాంతార్థ బోధ చతురం।
పాలాక్ష గురుగుహావతారం ।పరాశక్తి సుకుమారం, ధీరం॥

మ॥సా॥ పాలిత గీర్వాణాది సమూహం।
పంచభూత మయ మాయా మోహం।
నీలకంఠ వాహం, సుదేహం।
నిరతిశయానంద ప్రవాహం॥ బాల॥

వ్యా॥ ద్వితీయ. బాలసుబ్రహ్మణ్యేశ్వరుని, భక్తులకు కల్ప వృక్షము వంటివానిని, 'వేల' అను ఆయుధమును ధరించిన వానిని; నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తుడు అను నామములే వస్త్రముగా గలవానిని, నీలకంఠుడైన శంకరుని మనసునకు ఆనందము కలిగించు వానిని, నీలకంఠముగల నెమలి వాహనుని, పంచభూత స్వరూపుని, వేదాంతార్థములను బోధించు వానిని, పరాశక్తికుమారుని మొదలగు విశేషణ పదములతో వర్ణించిరి. ఇందు రాగనామమును కూర్చలేదు. తెనుగు పదముగాన.

రెండు కళల చౌకం

ప॥ ని స్ప నీదప మ ప దనిద । ప మ మగ మ । గమ ప మగమ
బా- -లసు - బ్ర- -- హ్మ- - ణ్యం -భ జే - - -
రీ , సా ని ధా । ద ని పా మ । రీ మ రి మ ప ॥
హం భ క్త క ల్ప- భూ రు హం - (శ్రీ) - ॥

అ॥ పా , స్ప స్ప ని నీ ద ప । మ ప నీ । స్ప ని సా
నీ ల కం - ఠ హృ దా - నం ద క రం
రీ స్ప నీ ద ని స్ప నీ । ద మా రి । రి మ పా , స్ప ॥
నిత్యశు ద్ధ బు - - ద్ధ ము క్తాం - బ ర ం ॥ (శ్రీ) ॥

చ॥ మా, రి మ రీ మ ప । ద ప మా మ । గ మ గ గ రీ |
వే లా - - యు ధ ధ - రం సుం - - ద - రం |

మరిమా రీ రి ని । సా రి మ రిమ । ప మ పా |
వే- - దాంతా - ర్థ బో - - ధ చ తు రం |

పా, స్ని ని ద మ ప । ని సా ని । సా సా |
ఫా లా - - క్షు గు రు గు హా వ తా రం |

స రి నీ దా ప ప ప । ప మ ప ద ని ద । పమగమ రీ |
ప - రా శ క్తి సు కు మా - రం - - ధీ - - - రం |

మ॥సా॥ పాపప రీ రి మ రీ స రి స్నీ సా । రీ మ పా మ ని ని ।
పాలిత గీ ర్వా - ణా ది స మూ హం పం చ భూ త మ య

నీ నీ దా పా | నీ స రీ రి రి మ రీ , రి స ని సా ।
మా యా మో హం | నీ ల కం ఠ వా - హం సు దే - హం

రి స ని ద పా మా । రీ , రి రి మ ప ని ‖ బాల ‖
ని ర తి శ యా నం ద ప్ర వా - హం

# 202
## రేగుప్తి రాగం రూపకం

15 వ మేళకర్త. స రి గ ప ద స
స ద ప గ రి స

ప॥ శరవణభవ గురుగుహం । షణ్ముఖం, భజేఽహం । (శ్రీ) ॥

అ॥ వరదాభయ కరం, శక్త్యాయుధ ధరకరం ।
పురుహూతాది సేవితం, భాగవతాది సన్నుతం ॥

చ॥ పార్వతీ కుమారం । నవ నందనాది యుత ధీరం ।
నాదాంత విహారం । నత భక్త జన మందారం ।
గర్విత శూరాది హరం । గణపతి సోదరం, వరం ।
వల్లీ దేవసేనా నంద కరం । చతురతరం ॥ శరవణభవ ॥

వ్యా॥ ద్వితీయ. శరవణ భవ = రెల్లు పొదలయందు జన్మించిన, ఆరు ముఖములు గలవానిని, వరము లు, అభయ మొసగు కరములు గలవానిని, శక్తి యను ఆయుధమును ధరించిన, పార్వతీ కుమారుని, నవ నందనులతో గూడిన ధీరుని, నాదాంతమందు విహరించు వానిని, వల్లీ దేవసేనా పతిని నేను సేవించు చున్నాను. అని వర్ణించిరి. ఈ రేగుప్తి రాగమును, రేవగుప్తి యనియు అందురు.

## 203

## యమునా కళ్యాణి ఆది

65 వ మేళకర్త. స రి గ ప మ ప ద స
స ద ప మ ప గ రి స

ప॥ పరశివాత్మజం, నమామి సతతం ।
పాలిత భక్తం, సదా భజేఽహం ॥

స॥చ॥ సురసైన్యనాథం, వల్లీసనాథం ।
వరశిఖి వాహనం, వారిజ లోచనం ।
శూర తారకాది హరం, శివకరం ।
క్రూర పాపహరం, కుమార గురుగుహం ॥

వ్యా॥ ద్వితీయ. పరశివుని కుమారుని, భక్తులను పాలించు వానిని, ఎల్లప్పుడు నేను సేవింతును, నమస్కరింతును. దేవసేనలకు

నాథుని, వల్లీనాథుని, నెమలి వాహనుని, పద్మములవంటి నేత్రములు గలవానిని, శూరుని, తారకాదులను సంచరించిన వానిని, మంగళములను కలుగ జేయువానిని, గొప్ప పాపములను హరించువానిని, కుమారుడైన గురుగుహుని సేవింతును. అని యమునా కళ్యాణి రాగమున వర్ణించిరి. ఈరాగము హిందుస్థానీ రాగము. యమన్ కళ్యాణి అందురు.

## 204

## నాట కురంజి రాగము రూపకం

28వ మేళకర్త జన్యము        స రి గ మ ద ని ప ద ని స
                                          స ని ద మ గ స

ప॥ పార్వతీ కుమారం, భావయే ।
సతతం, శరవణభవ గురుగుహం ॥

స॥చ॥ మార్గ సహాయ ప్రియ సుతం । మాధవాద్యమరాది నుతం ।
మాణిక్య మకుట శోభితం । మానిత గుణ వైభవం ॥

వ్యా॥ ద్వితీయ. పార్వతీ కుమారుని, శరవణభవుని, గురుగుహుని, ఎల్లప్పుడు భావించుదును. మార్గ సహాయ ప్రియ సుతం= ప్రయాణమున సహాయ మొనర్చు పార్వతీశ్వరుల ప్రేమపుత్రుని, దేవతలచే కొనియాడ బడువానిని, మాణిక్యములతో పొదిగిన కిరీటముచే ప్రకాశించు వానిని, కొనియాడబడు గుణములు గల వానిని భాసించుము. 'మార్గసహాయ' పదముచే పెద్దల సంప్రదాయము గుర్తు చేసిరి.

శ్లో॥ యశ్శివో నామ రూపాభ్యాం । యా దేవీ సర్వమంగళా ।
తయోస్సంస్మరణాత్ పుంసాం । సర్వతో జయ మంగళమ్ ॥

ఈ శ్లోకమును ప్రయాణ సమయమున పఠించుచు బయలు దేరిన, జయము, శుభము కలుగును గాన, మార్గసహాయ శబ్దముతో ఈవిషయమును సూచించిరి. మాధవాద్యమరాదినుతం= మాధవః= విష్ణువు. ఆద్యమరులు = రా క్ష సు లు. దేవదానవులచే నుతింప బడువాడు.

# 205

## శుద్ధ ధన్యాసి రాగము ఆది

22 వ మే. జన్యం. స గ మ ప ని ప స
స ని ప మ గ స

ప॥ సుబ్రహ్మణ్యేన రక్షితో౽హం అష్టాదశ లోచనా ఖండేన ॥

అ॥ ప్రబవామాది పూజిత పదేన। పురందర మనోల్లాస కరణేన ॥

చ॥ కంక శైల విహారేణ సుఖేన। వల్లీ దేవసేనా రమణేన।
అకార బృందేనానందేన। భోగ మోక్షదానేన, నిత్యేన।
వేంకటేశ్వర నామ రూపేణ। విచిత్ర విశాఖ మహోత్సవేన।
శుక రహస్య ప్రకాశ గురుగుహేన।
కృత్తికా సుత శుద్ధ ధన్యేన ॥ సు ॥

వ్యా॥ తృతీయావిభక్తి. "కళుగుమలై" యను, కంకశైల ముందున్న సుబ్రహ్మణ్యేశ్వరునిచే రక్షించ బడితిని. 18 ది నేత్రములు గలవానిచేత, అఖండునిచేత రక్షించబడితిని. 6 ము ఖ ము లు, ఒక్కొక్క ముఖమునకు 3 నేత్రములు. మొత్తం 18 నేత్రములు. శివునకు మూడు నేత్రములు. జ్ఞానులకు జ్ఞాననేత్రముండును. ప్రతి వానికి మూడవ నేత్రముండును. దానిని జ్ఞాననేత్రమందురు. ప్రత్యేక

ముగా బ్రహ్మాదులచే పూజింపబడు వానిచే, ఇంద్రునకు ఆనందము కలిగించు వానిచే, అకారము మొదలు, క్ష కారము వరకు గల వర్ణ బృందముచే నానందింప బడు వానిచే, నిత్యుడు, భోగ, మోక్షము లొసగు వానిచే, వేంకటేశ్వర నామ రూపేణ = వేం = పాపము లను, కటతీతి = ఖండించువాడు, పాపములను పోగొట్టు నామము, రూపము గలవానిచే, విశాఖా నక్షత్రమున ఉత్సవము జరిపించుకొను వానిచే, సుబ్రహ్మణ్య నామములలో, "విశాఖాయ నమః" అను నామము కలదు. షట్ కృత్తికల కుమారునిచే, శుద్ధుడు, ధన్యునిచే, శుద్ధ ధన్యాసి రాగరూపునిచే రక్షించ బడితిని యని కొనియాడిరి.

## 206

## బృందావని రాగం ఆది

22 వ మే. జన్యం. స గ రి మ ప ని స
స ని ప మ రి గ రి స

ప॥ స్వామినాథేన సంరక్షితోఽహం ।
సచ్చిదానంద నాథాత్మనా । శ్రీ ॥ స్వామి ॥

అ॥ సోమ తాతేన, వల్లీ దేవసేనోపేత వర గురుగుహేన ॥ స్వామి ॥

చ॥ ప్రణవార్థ తత్త్వోపదేశేన, మణి మంత్రౌషధ ప్రద నిపుణేన ।
సనకాది సన్నుత ప్రభావేన దినకర శశి తేజః ప్రకాశేన ॥

మ॥సా॥ మాణిక్య మకుట కుండల శోభిత మరకత మణిమయ
వజ్రాయుధేన ।
నవ నందాద్యుపాసిత శరవణ మంత్ర స్వరూపేణ,
వరేణ । శ్రీ ॥ స్వామి ॥

వ్యా॥ తృతీయా విభక్తి. స్వామి నాథునిచేత, సత్, చిత్, ఆనంద నాథుడైన, చిదానంద నాథుని ఆత్మ రూపునిచే, సోమ తా తేన = ఉమతో గూడిన శంకరుడు తండ్రియైన వానిచే, వల్లీ, దేవసేనులతో గూడిన గురుగుహునిచే, ఓంకారార్ధ తత్వమును ఉపదేశించు వానిచే, మణి, మంత్ర, ఔషధముల నొసగు వానిచే, నవ నందనాదులచే ఉపాసింపబడు "శరవణ" మంత్ర రూపునిచే నేను రక్షించబడితిని. మొదలగు విశేషణములతో కీర్తించిరి. ఈరాగమును బృందావన సారంగ రాగమని యందురు.

## 207

## కాంభోజి రాగం రూపక తాళము

28 వ మే. జన్యం. స రి గ మ ప ద స

స ని ద ప మ గ రి స

ప॥ శ్రీ సుబ్రహ్మణ్యాయ నమస్తే, నమస్తే । మనసిజ కోటికోటి,
లావణ్యాయ, దీన శరణ్యాయ ॥ శ్రీ ॥

అ॥ భూసురాది సమస్తజన పూజితాబ్జ చరణాయ ।
వాసుకి తక్షకాది సర్ప స్వరూప ధరణాయ ।
వాసనాది సకల దేవ వందితాయ, వరేణ్యాయ ।
దాస జనాభీష్టప్రద దక్షతరాగ్ర గణ్యాయ ॥ శ్రీ ॥

చ॥ తారక, సింహ, ముఖ శూర, పద్మాసుర, సంహర్త్రే ।
తాపత్రయ హరణ నిపుణ తత్వోపదేశ కర్త్రే ।
వీరనుత గురుగుహాయాజ్ఞాన ధ్వాంత సవిత్రే ।
విజయవల్లీ భర్త్రే, శక్త్యాయుధ ధర్త్రే ॥

మ॥సా॥ ధీరాయ నతవిధాత్రే । దేవరాజ జామాత్రే ।
భూరాది భువన భోక్త్రే । భోగ మోక్షప్రదాత్రే ॥ శ్రీ ॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. శ్రీ సుబ్రహ్మణ్యుని కొఱకు, కోటి కోటి మన్మథుల లావణ్యము గలవానికై, దీనులను రక్షించువానికై నమస్కరించుచున్నాను. బ్రాహ్మణులు మొదలు సర్వులచే పూజింప బడు పాదపద్మములు గలవానికై, సర్పములలో శ్రేష్టమైన వాసుకి, తక్షకుడు మొదలైన సర్పముల రూపమును ధరించిన వానికై, నాగేశ్వరుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు ఒకరే గనుక సర్ప రూపునికై, శూర, పద్మాసన, తారకాది రాక్షసులను సంహరించిన వానికై, దారేషణ, ధనేషణ, పుత్రేషణ ములను తాపత్రయములను బోగొట్టి నిజ తత్వోపదేశ మొసగు సుబ్రహ్మణ్యేశ్వరునికై నమస్కరించు చున్నాను. అని ఇంకా విశేషణములలో కొనియాడిరి. గాంభీర్యమైన రాగమగు కాంభోజి రాగమున వర్ణించిరి.

రెండు కళల చౌకం

ప॥ ధా - సా రీ । మ పమా గ రి స ని |
శ్రీ సుబ్ర హ్మా- - ణ్యా- య న |

ని ధ ధా - సా , స । సా । ని ధ ధా ||
మ- - స్తే న మ స్తే - - ||

(2) రి । గ మ । మ గ గమగ । రి స । పా మ ద | ద ప । ని ద
న మ- స్తే - - మన సి జ కోటి కో | - టి లా-

ద ని పా । ప దమా । గ గా రి | స రి సా । సా ని ధ
వ - - ణ్యా - - య దీ న | శ - ర - ణ్యా-

ని ధ | గా || (2) . . . మా । మ గగా మ గ । రి స పా ।
- య | శ్రీ || . . . మ స్తే - - మ న సి జ కో

మ దా ప ని ద ని ప । ద మ గ గ ।
టి కో టి లా - వ - ణ్యాయ దీ -

గ రి రి సా ని ధ ప ॥ శ్రీ ॥
- న శ ర ణ్యా - య

అ॥ మ గ - మ పా ద । పదమా - మాపమప మగమా ॥
భూ - సు రా ది స-మ - స్త - జ-న

పా దని - దా ప ద ప ద మా । మ గమా । పా , ప ॥
పూ - - జి తా - - - బ్జ చ - ర ణా య

దా - ని ద పా । మ గ - గ రి సా । పా - గ మా ప ।
వా సు కి త క్ష కా - ది స ర్వ స్వ రూ ప

ద ని - ని ద దా ద । సా - స నీ ద । ద ప - ద స రి గ ॥
ధ ర ణా - - య వా స వా ది స క ల దే - వ

సా రి గ - రీ స రి స ని । నీ ని ప - ద సా స ॥
వం ౦ - ది తా - - య వ రే - - ణ్యా య

దా - స ని దా । ని ద - పా ప మపా । దానిద - ని ప ద మ
దా స జ నా భీ - ష్ట ప్ర - ద ద - - - క్షి - త -

గా । రి స రి - సా ని ధ స ని పా ॥ శ్రీ ॥
రా గ్రగ - - ణ్యా - - - య

చ॥ సా - రిమగా । మ ప - మదా ప । పా - మ గ రి స ।
తా రక సిం హ ము ఖ శూ ర ప ద్మా - సు ర

ని ప - ధా సా । దా - పామ గ । మ ప - దానిని ద దపమ ।
సం ౦ హ ర్త్రే తా ప త్రయ హ ర ణ ని - పు - ణ -

దా - దా పమ । మమ - మగమప మా | మా - మగ మప ।
త త్త్వోపదే - శ శ - - - ర్త్రే) | వీ ర నుత గు

ద ని - దా పా । పా - దరి సా । రి స - నీ దా |
రుగు హ యా జ్ఞా న-ధ్యాం త స వి త్తే |

పద - మ గ రి । సా - స ని ధా ధ ని పా |
విజ యవ - ల్లీ భ - - ర్త్రే) - - |

మగ - ప ద ని ద । దపమగ - రి గ సా, ||
శ - క్త్యా-యు ధ ధ- - - ర్త్రే) - - ||

మ॥సా॥ రీ సా - ని ని ధ ప ధా పా । సామగ - గమప ద మాపా |
ధీ రా యన త వి భా త్తే దేవరా - జజా- మా త్తే |

దా ని ని - ద ప ద రి సా నీ ।
భూ శా - ది భు వ న భో క్త్రే)

పా ద ప - ప మ గ రి స ని ధ ప ||
భో గ మో - క్ష - ప్ర ద - త్తే - ||

# 208

## ఖమాస్ రాగం జంపె తాళం

28 వ మేళకర్త. స మ గ మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ (శ్రీ) స్వామి నాథాయ నమస్తే, నమస్తే ॥

అ॥ శాశ్వత శివ సుతాయ సర్వదేవ సహాయ ।
స్వామి శైల స్థితాయ వరదాయ ॥

చ॥ గజాంబా రమణాయ, గణపతి సోదరాయ ।
గుణ త్రయాతీతాయ, గుహ్యాకారాయ ।
అజేంద్ర పూజితాయాశ్రిత ఫలదాయ ।
వరశిఖి వాహనాయ, గురుగుహ స్వరూపాయ ॥ శ్రీ ॥

వ్యా॥ చతుర్థీవిభక్తి. "స్వామిమలై" "కుఱుగుమలై" కొండపై వెలసియున్న, గజాంబా రమణుడైన, శాశ్వతుడైన శివుని కుమారుడైన, సర్వదేవతలకు సహాయమొనర్చు వానికై నమస్కరించు చున్నాను. గణపతి సోదరుడు, నెమలి వాహనముగా గలవాడు మొదలైన, విశేషణములతో సుబ్రహ్మణ్యేశ్వరుని కొనియాడిరి.

## 209

## జంఝూటి రాగం త్రిపుటతాళము

28 వ మే జన్యం ద స రి గా మ ప ద ని
ద ప మ గ రి స ని ధ ఫ ధ స

ప॥ గజాంబా నాయకో రక్షతు । గుణిజనాది పూజితస్సతతం ॥

అ॥ అజేంద్రాద్యమరాది సుఝుం, ఝూటి రాగ పాన ।
సుందర గురుగుహ శ్శివ సూనుః ॥ గజాంబా ॥

వ్యా॥ ప్రథమావిభక్తి. గజాంబా నాయకుడు, గుణవంతులైన జనులచే నిరంతరము పూజింపబడువాడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలయందు, ఝుం, ఝుం అను రాగ పానము చేయు అందమైన గురుగుహస్వామి, శివకుమారుడు ఎల్లప్పుడు రక్షించుగాత అని స్వామి మలై నివాసుని ఝుంఝూటి రాగమున పొగడిరి.

# 210

## రమా మనోహరి జంపె

52 వ మే. జన్యం. స రి గ మ ప ద ని ద స
స ని ద ప మ గ రి స

ప॥ శృంగార శక్త్యాయుధ ధర । శరవణస్య దాసోఽహం ॥
అనిశం, ధనధాన్య ప్రదస్య ॥

అ॥ గంగామృత పూరిత ఘటాభిషేకస్య ।
గద్యపద్యాది నుత కోమలతర పదస్య ।
అంగారకాది నవగ్రహ వందితస్య ।
ఆది మధ్యాంత రహితా ప్రమేయ వరస్య ।
జగదంబికాది సకల దేవతా మోహిత ।
దీనజనాది ఖేద భంజన చతురస్య ।
నగరాజసుతా నందీశ నవనంద్యాది
భక్త జనాంతఃకరణానంద గురుగుహస్య ॥

వ్యా॥ షష్ఠీ విభక్తి. "సిక్కిల్" నగరమందున్న సుబ్రహ్మణ్యేశ్వరునిపై రచించబడినది అందమైన శక్తియను ఆయుధమును ధరించిన శరవణభవునకు నేను దాసుడను. ఎల్లప్పుడు ధనధాన్యముల నొసగు వానికి. గంగా జలముతో కూడిన కలశముతో అభిషేకము చేయబడువానికి, గద్యములచే, పద్యములచే, నుతింపబడువానికి, నవగ్రహములచే నమస్కరింపబడు వానికి, ఆది, మధ్య, అంతములేని పూర్ణ స్వరూపునికి, జగత్తునకు తల్లియైన దేవతామూర్తులను సేవించు భక్తుల దుఃఖములను నశింపజేయువానికి, పార్వతీపతికి ఆనందమును కలిగించు నవనందులను భక్తుల మనస్సున ఆనంద రూపుడైన గురుగుహునకు దాసుడనని కొనియాడిరి.

## 211

## ఖమాస్ రాగం ఆది తాళం

28 వ మే. జన్యం. స మ గ మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ షడాననే సకల మర్పయామి । సదా తత్పాద భక్తిం యామి ॥

అ॥ షడాధారాది శక్త్యాత్మకే। షట్త్రింశ త్తత్వ కళాత్మకే ।
షట్కోణ మధ్య స్థిత్యాత్మకే । ఈడ్యమానాది నాశాత్మికే ।

మ॥సా॥ ఈశ్వరాది నుత గురుగుహాత్మకే ।
ఢుండి గణేశానందాత్మకే ।
డమరు శూలాది ధర కరాత్మకే ॥షడాననే॥

వ్యా॥ సప్తమీ విభక్తి. ఆరు ముఖములుగల వానియందు, సమస్తమును అర్పించుచున్నాను. ఎల్లప్పుడు ఆయన పాదభక్తిని పొందుచున్నాను. షడాధారాది శక్త్యాత్మకే = ఆధార చక్రమగు, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆగ్నేయ ములను ఆరు చక్రములయందు శక్తిరూపమున నున్నవానియందు, 36 తత్వములయందు కళాస్వరూపుడైన వానియందు, ఆరు కోణము లతో గూడిన యంత్రమందున్న వానియందు, జీవుని బాధించు, బంధించు, ఈషణాత్రయములను నశింప జేయు వా ని య ం దు, ఈశ్వరాదులచే నుతింపబడు గురుగుహ స్వరూపుని యందు, ఢుండి గణపతికి ఆనందము కలిగించు వానియందు, డమరు, శూలము మొదలైన ఆయుధములు ధరించిన చేతులుకల వానియందు సర్వమును అర్పించుచున్నాను. అని సుబ్రహ్మణ్యేశ్వరుని యందు సర్వార్పణము చేసి, సగుణ, నిర్గుణ తత్వమును ఆరు ముఖములు, ఆరు చక్రములు, ఆరు కోణముల యంత్రము, 36 తత్వరూపుని, షడక్షర మంత్రమూర్తిని, ఈకృతి ద్వారా ఉపాసించిరి.

## 212

## కాశీ రామక్రియ ఆది

51 వ మేళకర్త. స గ రి గ మ ప ద స స
స ని ద ప మ గ రి స

ప॥ సేనాపతే పాలయ మాం । సన్మునిగణాది పూజితానందకర ॥

అ॥ కనకకుండల శోభిత । సుందర నవనందనాదియుత ధీర ।
ప్రణవోపదేశ గురుగుహాకార ।
మాణిక్య మకుటధర, కరుణాకర ।

చ॥ వల్లీ దేవసేనానందకర । వాంఛితార్థప్రద, చతురతర కర ।
వేలాయుధధర, కుక్కుటధ్వజ ధర, కాలహర, త్రిపురహర,
శంకర పుర ॥

తా॥ సంబోధన. ఓ సేనాపతీ, నన్ను రక్షించుము. ముని సమూహముచే పూజింపబడిన వాడా, బంగారు కుండలములతో శోభించువాడా, నవనందనాదులచే కూడిన ధీరా, ఓంకార తత్వము నుపదేశించు గురుగుహ స్వరూపుడా. కుక్కుట ధ్వజము గలవాడా, యముని నిర్జించిన, త్రిపురములు హరించిన, శంకరుని పురమగు కైలాసమున సేనలకు పతియైన ఓ స్వామీ నన్ను రక్షించుమని స్తోత్ర మొనర్చిరి.

## 213

## గీతప్రియ రాగము త్రిపుట

63 వ మే. జన్యం. స రి గ మ ప ద ని ప ద స
స ని ద ప మ రి గ రి స

ప॥ సాధుజన వినుతం, గురుగుహం । సంగీతప్రియం, భజేఽహం ।

స॥చ॥ మాధుర్య రసాది భక్షణం । మత్త శూరాది శిక్షణం ।
మాధవాది దేవ రక్షణం । మారకోటి విజయ లక్షణం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. సాధుజనులచే నుతింపబడు గురుగుహుని, సంగీతప్రియుని, నేను భజింతును. మధుర రసమును భక్షించువానిని, మదించిన శూరులను శిక్షించువానిని, దేవతలను రక్షించు వానిని సేవింతును. ఇందు సంగీతప్రియ యని, రాగనామమును కూర్చిరి.

ఒక కళ చాకం

ప॥ సా ధ ని స రి గ । మా ద ద ద పా ।
సా ధు జ న వి ను తం గు రు గు హం

సా దా ద ప మ గ । రీ ని స రి గా రి స ॥
సం గీ త - - ప్రి యం భ జే -- హం ॥

అ॥ మా గా రి గ స । స ని ధా ని సా ।
మా ధు ర్య ర సా - ది భ క్ష ణం
మా ని దా సా । రి గా రి సా ,
మ త్త శూ రా ది శి క్ష ణం

మ॥సా॥ నీ ద దా ప పా మ గా రి రీ ।
మా ధ వా ది దే వ ర క్ష ణం
సా రి గా గ స రి చ రి రి స ని ॥ సాధు ॥
మా ర కో టి వి జ య ల క్ష ణం

## 214

## ఆరభి రాగం ఆది

ప॥ గణపతి సోదరం, గురుగుహం భజే ।

గుప్తాగమార్థ తత్వ వేదినం ॥

స॥చ॥ మణిమకుట హారాలంకృత గాత్రం ।

గుణనిధిం, దివ్య మయూర వాహనం ।

అణిమాద్యష్టైశ్వర్యప్రదం । ఆనందవల్లీ దేవసేనా యుతం ॥

వ్యా॥ ఈకృతి, అంబి దీక్షితులను ముత్తుస్వామి దీక్షితులచే గురుగుహ ముద్రతో రచించబడినది. ఇటువంటివి కొన్ని గురుగుహ ముద్రతో రచించిరి.

---

శ్లో॥ పార్వతీశ్వరపుత్రాయ । భక్తాభీష్టప్రదాయనే ।

సేనావల్లీహృదీశాయ । సుబ్రహ్మణ్యాయ తేనమః ॥



# శ్రీ వైద్యనాధ, బాలాంబికా కృతులు

## 215

### అఠాణా రాగం ఆది

29 వ మే. జన్యం. స రి మ ప దా ని స
స ని దా ప మ ప గా రి స

ప॥ శ్రీ వైద్యనాథం భజామి, శ్రితజన వందిత బాలాంబికేశం ॥

అ॥ ధవళిత వైద్యనాథ క్షేత్రం । దయా సుధాసాగరం । త్రినేత్రం
అవినాశ కైవల్యాది ప్రద మానందకర మూలాది కందం ॥

చ॥ దేవరాజాది పూజిత పదం ।
దివ్యాంబర ధర గురుగుహ ముదం ।
కవిజనాది నుత సోమాస్కందం ।
కమనీయ నాద బిందు కళాస్పదం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. వైద్యనాధ క్షేత్రమందున్న స్వామిని సేవించు చున్నాను. అచటి దేవాలయమును, వైదీశ్వరన్ కోవెల యందురు. అమ్మవారు బాలాంబికాదేవి. ఈ క్షేత్రమందున్న స్వామిని, బాలాంబికను, ముద్దు కుమార స్వామిని, సేవించి, శ్రీ రామస్వామి దీక్షితులు సంతానమును బడసిరి. దయాసముద్రుని త్రినేత్రుని, బాలాంబికాపతిని, నశించని కైవల్యము నొసగువానిని, ఆనందమునకు మూలమైనవానిని, కవిజనులచే నుతింపబడువానిని, నాద, బిందు, కళా స్వరూపుని భజించుచున్నాను. అని స్వామిని కీర్తించిరి.

# 216

## మనోరంజని రాగం మఠ్య తాళం

5 వ మేళకర్త. | స రి మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ బాలాంబికే పాహి । భద్రం దేహి దేహి ॥

అ॥ సాలోకాది ముక్తి సామ్రాజ్య దాయిని ।
శంకర మనోరంజని, ధనిని ॥

మ॥సా॥ నీలకంఠ గురుగుహ నిత్య శుద్ధ విద్యే ॥

వ్యా॥ సంబోధన. ఓ బాలాంబికా, రక్షించుము. జాగరూకతను ఇమ్ము. సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్యములను చతుర్విధ ముక్తుల నొసగు దానివి, శంకరుని మనస్సును రజింప జేయు దానివి, నీలకంఠునకు, గురుగుహునకు, నిత్యమైన, శుద్ధమైన విద్యాస్వరూపిణి రక్షించుము. విద్య యనగా, తెలియని విషయమును తెలియ జేయునది. ఆత్మజ్ఞానమును విద్యయందురు. ఇందు మనోరంజని రాగనామమును కూర్చిరి. ఈ బాలాంబిక యనుగ్రహమున కలిగినందున శ్రీ రామస్వామి దీక్షితులు తన పెద్దకుమారునకు ముద్దుస్వామి, రెండవ కుమారునకు బాలస్వామి, మూడవ కుమారునకు చిన్నస్వామి యని పేర్లు పెట్టిరి. ఆడపిల్లకు "బాలాంబిక" యని నామకరణ మొనర్చిరి. అందువలన దీక్షితులవారు ప్రత్యేకమైన భక్తితో ఈ కృతులు రచించిరి. రాగములు కూడ తగినవి ఎన్నుకొని ఏర్చి కూర్చి రచించిరి.

ఒక కళ చాపు.

ప॥ సా నీ - స రి - రి పా ద |
బాలాం బి కే - పా హి |

పా మా - గ గ - రి స రి స ని స ||
భ ద్రం దే - హి దే - - - హి ||

అ॥ సా పా - దా - ప మా ప । సా నీ - స ద - ద ద స ని |
సా లో కా ది ము క్తి సా మ్రా జ్యదా - యి - ని |

సా మ గ - రీ - సా ని ద । మ దా ప - ప మ - ప రి మ ప
శం క ర నా రాయ ణ మ నో రం - జ నిధ ని ని

మ॥సా॥ దా ని సా రి గ గ । రి స నీ ।
నీ ల కం ఠ గురు గుహ ని

ద పా మ రి గ స రి || బాలాం ||
త్యశు ద్ధ వి - ద్యే- ||

## 217

## శాంత కళ్యాణి రాగం మిశ్రఏక తాళం

65 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ భజరే రే చిత్త బాలాంబికాం ।
భజరేరే చిత్త భక్త కల్పలతికాం ॥

అ॥ నిజరూప దాన దక్ష చరణాం ।
అపర్ణాం, నిత్యకళ్యాణీం, శర్వాణీం ॥

చ॥ వాగ్భవ కూటజాత చతుర్వేద స్వరూపిణీం ।
శృంగార కామరాజోద్భవ సకల విశ్వ వ్యాపినీం ।
దేవీం, శక్తి బీజోద్భవ మాతృకార్ణ శరీరిణీం ।
దేవనుత భవ రోగహర వైద్యపతి హృదయ విహారిణీం ॥

మ॥సా॥ భావ రాగ తాళ మోదినీం । భక్తాభీష్ట ప్రదాయినీం ।
సేవకజన పాలన గురుగుహ రూప ముద్దు కుమార జననీం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఓ చిత్తమా ! బాలాంబికను, భక్తులను కాపాడు కల్పలతను సేవించుమురా. కల్పవృక్షమని యనక, "కల్పలత" లతయన తీగె. లతలు స్త్రీలు, వృక్షము నాశ్రయించి, అల్లుకొని పెరుగును గాన, బాలాంబికను భక్తకల్ప లతిక యనిరి. నిజరూపముచే, వరదానము లొసగుటలో గొప్పవైన పాదములు గల నామెను, నిత్య కళ్యాణిని, శర్వాణిని, మంగళప్రదమగు వాక్కునుండి యుద్భవించిన నాలుగు వేదములగు, ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణవేద స్వరూపిణిని, శృంగార రసముచే, మన్మథునిచే, ఉద్భవించిన ఈ సర్వప్రపంచమును వ్యాపించిన నామెను, దేవిని, శక్తి బీజాక్షరములతో పుట్టిన, మాతృకా సమూహముతో కూడిన శరీరముగల నామెను, దేవతలచే నుతింపబడు, సంసారమందలి జనన, మరణ ప్రవాహ రూప భవ రోగమును హరింపజేయు వైద్యపతి, వైద్యనాథ స్వామి హృదయమందు విహరించు నామెను, భావము, రాగము, తాళముతో గూడిన గానముచే ఆనందించు నామెను, సేవించు భక్తులను పాలించు గురుగుహ రూపుడైన ముద్దుకుమారునకు తల్లియైన బాలాంబికను సేవించుమురా ! యని, తన చిత్తమునకు తెలియజేసిరి. ఇందు తాను ఏస్వామి, తల్లి యనుగ్రహముచే జన్మించెనో, ఏస్వామి పేరు తనకు పెద్దలు పెట్టిరో, ఏస్వామి కృపా

కటాక్షముచే "గురుగుహ" ముద్రతో రచించి, కీర్తించునో, ఆముద్దు కుమారస్వామి తల్లిని సేవించుమని, శాంత కళ్యాణి రాగమున రచించుట, దీక్షితులవారి భక్తిని సూచించుచున్నది.

## 218

## శ్రీరంజ రాగం ఏకతాళం

22 వ మే. జన్యం. స రి గ మ ద ని స
స ని ద మ గ రి స

ప॥ బాలాంబికయా కటాక్షితోஉహం।
బుధజనాది నుత త్రికూట వరయా ॥

స॥చ॥ నీలమేఘజిత వేణీ యుతయా।
నీలకంఠ గురుగుహ మోదితయా।
లీలయా భండ కుమార హరయా।
శూల చక్రాది శోభిత కరయా ॥ బా ॥

వ్యా॥ తృతీయా విభక్తి, బాలాంబికచే, బుధజనులచే నుతింపబడు, త్రికూట స్థానమందున్న శ్రేష్ఠురాలిచే, అనుగ్రహింప బడితిని. నల్లని మేఘమును జయించిన, జడగల నామెచే, నీలకంఠుడగు శంకరుని, గురుగుహుడగు కుమారస్వామిచే, ఆనందింప బడునామెచే, విలాసముగా భండాసురుని హరించిన నామెచే, శూలము, చక్రములచే శోభించు చేతులుగల బాలాంబికచేత నేను రక్షింప బడితిని అని కొనియాడిరి.

## 219

## నాటకురంజి రాగం రూపకం

28వ మేళకర్త జన్యము స రి గ మ ద ని ప ద ని స
స ని ద మ గ స

ప॥ బాలాంబికాయై నమస్తే, వరదాయై । శ్రీ ॥బాలాంబికాయై॥

అ॥ బాలాది నామ రూపాయై । భక్త చిత్త కేకి ఘనాఘనాయై ।
బాలచంద్ర సేవితాయై । భారతీశ పూజితాయై ॥బాలా॥

చ॥ హాటకాభరణాయై । హంస నాద ముదితాయై ।
హరిద్రాన్న రసికాయై । గురుగుహ స్వరూపాయై ।
నాటకురంజి రాగ ప్రియానంద కర్త్యై ।
నటేశ్వరాయై, వైద్యపతి మనోల్లాస కర్త్యై ॥బాలాంబికాయై॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. శ్రీ బాలాంబిక కొఱకు నమస్కారము దేవీ నామములలో, బాల, త్రిపురసుందరి, శ్యామల, కాళీ, రాజ రాజేశ్వరి మొదలగు నామములు గలనామెకై, భక్తుల చిత్తమను కేకి = నెమలికి, గొప్పదైన మేఘము వంటిది. మేఘమును చూచి నెమలి పురివిప్పి ఆనందముతో నాట్యమాడును. అటులనే నిన్ను చూచిన భక్తులు, నెమలివలె ఆనందముతో గంతులువైతురు. బంగారు ఆభరణములు ధరించిన, "సోఽహం" అను ప్రణవ నాదముతో సంతోషించు, హరిద్రాన్నం = పులిహోర, చిత్రాన్నమనిన ప్రీతి గల, నాట కురంజి రాగముచే ఆనందము కలుగజేయు వైద్యనాథ స్వామికి ఆనందమును కలిగించు బాలాంబికకై, నమస్కరించు చున్నాను. అని వర్ణించిరి.

అమ్మవారి నామములలో,"చిత్రాన్న ప్రీత మానసాయై నమః" అను నామముగలదు. ఆవిషయమును, నటేశ్వరాయై = నటరాజు

పత్ని నటేశ్వరి. లోకమును నటింప జేయునది నటేశ్వరి. సృష్టి, స్థితి, లయములతో సర్వముతానై, సర్వజీవులయందు, అంతశ్శక్తిరూపమున నటించునది ఆమెయే యను భావమును, ప్రపంచ నాటకమాడించు నటేశ్వరి యని ఒక్క పదములో ఎన్నో అర్థములతో వర్ణించిరి.

## 220

### కానడ రాగం ఆది తాళం

22వ మే. జన్యం. స రి గ మ ద ని స

స ని ప మ ప ద ని ద ప మ గా మ రి స

ప॥ బాలాంబికాయాః పరం నహి రేరే, చిత్త ।
భారతీ రమా సేవితాయాః ॥ (శ్రీ) ॥

అ॥ బాలేందు జిత ముఖ పంకజాయాః ।
భానుకోటి కోటి లావణ్యాయాః ॥

చ॥ భూసురాది త్రిసహస్ర మునీశ్వర పూజిత పర దేవతాయాః ।
భవరోగ హర వైద్యపతీశ్వర సుఖకర్యాః,
గురుగుహ జననాయ్యాః ।
భాసమాన వైద్య పురీశ్వర్యాః, వాంఛిత ఫలప్రదేశ వర్యాః ।
ఫుల్ల కల్హార మాలాది ధారిణ్యాః, నిరంజనాయ్యాః ॥బా॥

వ్యా॥ పంచమీ విభక్తి. (శ్రీ) బాలాంబిక కంటె వేరులేదని తన చిత్తమునకు తెలియజేసిరి. స్థిరమైన విషయము చిత్తమునకు చేరును. సరస్వతి, లక్ష్మి దేవతలచే సేవింపబడు నామెకన్న, బాల చంద్రుని జయించు ముఖ పద్మముగల, కోటికోటి సూర్యుల కాంతి

గల, బ్రాహ్మణులచే, మూడువేల మునీశ్వరులచే పూజింపబడు పర దేవతకన్న, జనన మరణాది సంసార రోగమును పోగొట్టు వైద్యుడైన, వైద్యనాథుని సతికన్న, వైద్యనాథ క్షేత్రమందున్న బాలాంబికకన్న వేరు లేదని, "రేరే" ఒరే, ఒరే అని చిత్తమును హెచ్చరించిరి. ఈ విధముగా వైద్యనాథ క్షేత్రమందున్న స్వామిని, బాలాంబికను వర్ణించిరి.

---



# శ్రీ రామచంద్రునిపై రచించిన కృతులు

## 221

### శ్రీరంజని రాగం త్రిపుట తాళం

22 వ మేళకర్త. స రి గ మ ద ని స
స ని ద మ గ రి స

ప॥ శ్రీరామ చంద్రో రక్షతు మాం।
రాక్షసాది హారో రఘువరః॥

అ॥ భరతాగ్రజో, కౌశిక యాగరక్షకో, తాటకాంతకః॥

చ॥ మిథిలానగర ప్రవేశ మహేశ్వర ధనుర్భేదకో ।
సీతాకళ్యాణ మహోత్సవ వైభవ యుత చిత్రవేషకో ।
మాధుర్య గానాఽమృత పాన ప్రియ గురుగుహ విశ్వాసో ।
మహాదేవీ భక్త పరశురామ గర్వహరోల్లాసః ॥శ్రీ॥

వ్యా॥ ప్రథమా విభక్తి. శ్రీరామచంద్రుడు నన్ను రక్షించుగాక. రాక్షసులను సంహరించువాడు, రఘువంశ శ్రేష్ఠుడు, భరతునకు అన్నయైనవాడు, విశ్వామిత్ర యాగసంరక్షకుడు తాటకను అంతమొనర్చినవాడు, మిథిలానగరమునకేగి, శివచాపమును విఱచి, సీతా కళ్యాణ మహోత్సవమున, కళ్యాణ రాముడైనవాడు, మాధుర్యమైన సంగీతామృత పానము చేయుటలో ప్రేమగల కుమారస్వామికి విశ్వాసముగలవాడు, మహాదేవీ భక్తుడైన పరశురాముని గర్వమును హరించిన వాడు, అయిన శ్రీరామచంద్రుడు నన్ను రక్షించుగాక యని వర్ణించిరి. ఇందు, రామజననము మొదలు, బాలకాండము నంతను సంగ్రహముగా ప్రథమా విభక్తిలో కళ్యాణరామునిగా, శ్రీ లక్ష్మిని రంజింప జేయు రాగము శ్రీరంజని రాగమున వర్ణించుట విశేషము. శ్రీత్యాగరాజు కూడ ఇటులనే, యదుకుల కాంభోజి రాగమున, "శ్రీరామ జయరామ" అను కృతిని బాలకాండమంతయు వర్ణించిరి. ఆకృతికి "కళ్యాణ రాఘవం" అందురు అటులనే దీక్షితుల వారు ప్రథమమున, ప్రథమావిభక్తిలో కళ్యాణరాముని కొనియాడిరి.

## 222

## మాహూరీ రాగం మిశ్రజాతి ఏక

28 వ మే జన్యం — స రి మ గ రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ మామవ, రఘువీర, మర్త్యావతార ।
మామవ, రఘువీర, మాధవ, ధీర ॥

అ॥ త్వా మహుఃరీశాదయ స్తత్త్వమితి, కరుణానిధే, ధీరం ॥మామవ॥

చ॥ మామక హృదయ నివాస, శ్రీనివాస ।
మారుతి ప్రభృతి దాస విశ్వాస ।
భూమిజా సహవాస, ఇహపర । భుక్తి ముక్తి వితరణ విలాస ॥

మ॥సా॥ కామజనక, కనకాంబర ధర, తామరసాక్ష వదన పదకర ।
పామర, పండిత పావనకర నామధేయ,
గురుగుహ నుత వర ॥మా॥

వ్యా॥ సంబోధన ప్రథమ. ఓ రఘువంశమున జన్మించిన, వీరుడా, మర్త్యావతారమును ధరించిన వాడా, శ్రీపతీ, నన్ను రక్షించుము. త్వాం=నిన్ను, అహుః=పిలిచి, ఈశాదులు=బ్రహ్మాది దేవతలు, నీవే భూలోకమున, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణము చేయు కరుణా సముద్రుడవని కోరగా, అవతరించిన వాడా, దీనుని నన్ను రక్షించుము. నాహృదయ మందు నివసించినవాడా, రము క్రీడాయాం= రమించువాడు. గాన, నాహృదయ మందు రమించువాడా, లక్ష్మీ నివాసుడా, ఆంజనేయుడు మొదలైన దాసులకు నమ్మిక గలవాడా, సీతతో కూడి యున్నవాడా, ఇహలోక, పరలోకముల, భుక్తిని, ముక్తిని యొసగువాడా! మన్మథుని తండ్రీ, బంగారు వస్త్రమును ధరించిన వాడా, పద్మములవంటి ముఖము, పాదములు, చేతులు, నేత్రములు గలవాడా, సర్వులను పవిత్రులను చేయు నామము గల వాడా! గురుగుహునిచే నుతింపబడు శ్రేష్ఠుడా, నన్ను రక్షించుము. ఇందు రామావతారమును, అవతార లక్ష్యమును, రామతత్త్వమును త్వాం అహుః = ఈశాదయః అను పదమున యమకముద్వారా రాగ నామమును కూర్చిరి. మాహుఃరీ రాగముతో, సగుణ, నిర్గుణమూర్తిగా వర్ణించిరి.

# 223

## మణిరంగు రాగం మిశ్రజాతి ఏకతాళం

22 వ మేళకర్త.　　　　స రి మ ప ని స
　　　　　　　　　　　స ని ప మ గ రి స

ప॥ మామవ పట్టాభిరామ, జయ ।
మారుతి సన్నుత నామ । రామ ॥మామవ॥

అ॥ కోమలతర పల్లవపద కోదండ రామ । ఘన,
శ్యామల విగ్రహాబ్జనయన, సంపూర్ణ కామ ॥ రఘు,
రామ, కళ్యాణ రామ, రామ ॥మామవ॥

చ॥ ఛత్ర చామర కరధృత భరత లక్ష్మణ ।
శత్రుఘ్న విభీషణ సుగ్రీవ ప్రముఖాది సేవిత ।
అత్రి వశిష్ఠాద్యనుగ్రహ పాత్ర । దశరథ,

మ॥సా॥ పుత్ర, మణిరంగవల్ల్యాలంకృత నవరత్న మంటపే । వి
చిత్ర మణిమయ సింహాసనే, సీతయా సహ సంస్థిత । సుచ
రిత్ర, పరమ పవిత్ర । గురుగుహమిత్ర । పంకజ,
మిత్రవంశ సుధాంబుధిచంద్ర। మేదినీపాల, రామచంద్ర
॥ మామవ ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. ఓ పట్టాభిరామా! నన్నురక్షించుము. అని శ్రీరాముని పట్టాభిషేక దృశ్యమును కనులకు కట్టినట్లు వర్ణించిరి.

శ్లో॥ వామే భూమిసుతా, పురస్తు హనుమాన్,
పశ్చాత్సుమిత్రా సుతః ।
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయ్వాదికోణేషుచ।

సు[గ్రీవశ్చ, విభీషణశ్చ, యువరాట్ తారాసుతో జాంబవాన్।
మధ్యే నీలసరోజ కోమల రుచిం, రామం భజే శ్యామలమ్॥

అను శ్లోకార్థ ప్రతిపాదితముగా, పట్టాభిరామా, కోదండరామా! కళ్యాణరామా! మేఘమువంటి నల్లని సుందర విగ్రహముగల, పద్మ నేత్ర! కోర్కెలను సంపూర్ణముగ దీర్చువాడా! రఘురామ, నన్ను రక్షించుము. ఛత్ర చామరములు ధరించిన భరత, లక్ష్మణ, శత్రుఘ్న విభీషణ, సుగ్రీవాదులు సేవింప, అత్రి, వశిష్టాది మహర్షుల యను గ్రహమును పొందిన దశరథపుత్ర! మణులతో వేసిన ముగ్గులచే నిండుగా నలంకరించబడిన, నవరత్న మంటపమునందు విచిత్రమైన, మణులతో కూడిన సింహాసనమున సీతతో కలసి కూర్చొనియున్న, మంచి చరిత్రగల, పవిత్రుడైన, గురుగుహునకు మిత్రుడైన, సూర్య వంశమను పాలసముద్రమునకు చంద్రుడనైన, భూమిని పాలించు రామచంద్రా, నన్ను రక్షించుమని కొనియాడిరి. ఈకృతి రచనకు ఒక చరిత్ర లోకమున వినబడుచున్నది. దీక్షితులవారు పంచనద క్షేత్రమగు తిరువయ్యారు వెడలి, పంచనదీశ్వరుని, ధర్మసంవర్ధనిని గాంచి, మధ్యమావతిలో, ధర్మ సంవర్ధనీ, దనుజ సమ్మర్దనీ" యని గానము చేయుచుండగా, శ్రీత్యాగయ్యగారి శిష్యులు అచటికేగి, వారి గానమునువిని, వారెవరో తెలుసుకొని, పరుగుపరుగున వెడలి గురువు గారితో ముత్తుస్వామి దీక్షితులవారు విచ్చేసిరని పలికిరి. అది విని వారిని తమ ఇంటికి ఆహ్వానించిరి. ఆనాడు శ్రీతాగయ్యగారింటిలో శ్రీరామచంద్ర పట్టాభిషేక మహోత్సవము జరుగుచుండెను. తాగయ్యగారు దీక్షితులవారిని గౌరవించి, తాను "కొలువమరెగద కొదండపాణి"అను కృతిని గానమొనర్చి, దీక్షితులవారిని మా రాముని గూర్చి గానము చేయుడనగా, ఈకృతిని రచించి గానము చేసినట్లు తెలియుచున్నది.

## రెండు కళల చౌకం

ప॥ నీ̇ , సా రీ । రీ , గ రి రి స | నీ̇ , రీసా । ని̇ స ని̇ ధా̇ ధా̇ |
మా మ వ ప ట్టా- - భి | రా -మ - - - జ య |

ధా̇ , నీ̇ సా । రీ , గ రిరిస | నీ̇ , స ని̇ ధా̇ । సా , గ రి రి స |
మా రు తి స న్ను--త | నా - - - మ రా - - మ |

అ॥ పా , ప ప నిప । మపమ గ రిసరి | నీ̇ , ని̇ సరిరి । రీ , గ రి రీ |
కో మల తర ప - - ల్లవపద | కో ద ం-డ రా మఘు న |

నీ̇ , రి రి రీ । స పామగ రి స | పా, ని పపమ । పా, నీ స ని |
శ్యామల వి గ్రహాబ్జ న యన | సం పూ - -ర్ణ కా మ ర ఘు |

పా ని పా ని ప । మగ రి రి గ రి స ||
రా మ క ళ్యా - ణరా - మ రా -మ ||

చ॥ రీ , పాపా । ని పామపమని | ప మాగారీ । ని̇ సా రీ రీ |
ఛ త్రచా మ ర క - ర - | ధృత భ ర త ల క్ష్మణ |

నీ̇ , రీ స ని̇ । రీ , రి రి రీ | పాపా ని ప । మపమ గ రిరి స |
శ త్రుఘ్న వి భీ షణసు | గ్రీవ ప్రముఖా- ది సే -వి త |

పా , రీ రీ । రీ , గ రిరి స | రీ , మామా । పాప పనిపమ |
అ త్రి వ సి ష్ఠా-- ద్య | ను గ్ర హ పా త్రదశరథ |

మ॥ సా॥ సా ని ప ని ప మ । ప ప మ గ రి సా | ని̇ రి సరి నీ̇ స ।
పు త్ర మ ణి ర ం గ వ - ల్యా - లం | కృత నవ ర త్న

పా , మ గరిస | సా స ప ప ప ప । పా ని ప మ మా |
మం ట పే-వి | చి త్రమ ణి మయ సింహా - స నే |

| | |
|---|---|
| ప ని ప ప మ గ రి । సా , ఫ రి ఫ రి | రీ రిసమగ రి । |
| సీ - త యా - స హ సం స్థి త సుచ | రి త్రపర మప |

| | | |
|---|---|---|
| సా స ప ని ప మ | పా ప ప గ రి రి । సా ని సీ ని ని | |
| వి త్ర గురు గు హ | మి త్ర ప ం క జ మి త్ర వంశ సు | |

| | | |
|---|---|---|
| నీ ని ని పా మ | పా స నిప ని ప। మగ రి రి గ రి స | మా |
| ధాంబు ధి చం ద్ర | మేది నీ- పా - ల రా- మచ ం ద్ర | |

## 224

## కోకిలారవ రాగం ఆది

11 వ మే. జన్యం. స రి గ రి మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ కోదండరామమనిశం, భజామి । కోకిలారవ జానకీ రమణం ॥

అ॥ పాదజ పాంశు పాలితాఽహల్యం ।
పరమేశ్వర గురుగుహ వాత్సల్యం ॥

మ॥సా॥ వేదాంత వేద్య మతి కౌశల్యం ।
విశ్వామిత్ర హిత మకౌటిల్యం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. కోదండ రాముని ఎల్లప్పుడు భజించు చున్నాను.

శ్లో॥ కూజంతం రామ రామేతి, మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితా శాఖాం, వందే వాల్మీకి కోకిలమ్ ॥

వాల్మీకి యను కోకిల, కవితా శాఖలపై నుండి మధురాక్షరములతో కూయుచున్నది. యన్నటుల, కోకిలారవ రాగముతో జానకీ రమణుని తన పాదరజముచే అహల్యను పాలించిన వానిని, శ్రీ శంకర కుమార

స్వాముల వాత్సల్యముగలవానిని, వేదాంతవాక్యములచే తెలియదగిన వానిని, బుద్ధికుశలత గలవానిని, విశ్వామిత్రునకు హితుడైన వానిని, కుటిలత్వము లేనివానిని సేవించు చున్నాను. అని ప్రార్థించిరి.

రెండు కళల చౌకం

ప॥ మాదా ద స్స నిదప మ । మామప గా । గాగ మ రి స |
కో దం డ రా - - - మ మ ని - శం భజా - - మి |

ధా ని సా గ గ గ । గమ రీ । గా రి గ రి స |
కో కి లా ర వ జా - న కీ ర మ - ణం |

అ॥ పాదమ పా , మ గ ప । పదనీ । సా సా |
పాదజ పాం - శుపా - లితా హ ల్యాం |
స మ గ గ రి స ని ద । ప మ గా । రి సా ||
ప ర మే - శ్వర గురు గుహ వా త్స ల్యాం ||

మ॥సా॥ సా గా రి మా గ మ ప దా నీ సా ।
వే దాంత వే ద్యమ తి కౌ శ ల్యాం
నీ దా పా మ ద । ప మ గా మ గ రి స ||
వి శ్వా మి త్ర హి త మ కౌ టి - ల్యాం ||

# 225

## వసంత రాగం రూపక తాళం

15 వ మే. జన్యం. స గ మ ద ని స
స ని ద మ గ మ ప మ గ రి స

ప॥ రామచంద్రం భావయామి । రఘుకుల తిలక ముపేంద్రం ॥

అ॥ భూమిజా నాయకం । భుక్తిముక్తి దాయకం ।
నామకీర్తన తారకం । నరవరం గత మాయికం ॥

చ॥ సాకేత నగరే నివసంతం । సామ్రాజ్యప్రద హనుమంతం ।
రాకేందువదనం భగవంతం । రమణీయ కళ్యాణ గుణావంతం ॥

మ॥సా॥ కాకుత్థ్సం, ధీమంతం । కమలాక్షం, శ్రీమంతం ।
సాకేశ నుతమసంతం । నర గురుగుహ విహరంతం ॥రామ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. రామచంద్రుని, రఘుకులమునకు తిలకుని, ఉపేంద్రుని భావించుచున్నాను. భూమియందు పుట్టిన జానకీ నాయకుని, భుక్తి ముక్తి నొసగు వానిని, నామసంకీర్తనముచే తరింపజేయు వానిని, నరశ్రేష్ఠులను మాయనుండి తొలగించువానిని, సాకేత నగరమున నివసించు వానిని, వసంత రాగ నామమును కూర్చిరి. రామచంద్రుని విశేషణములతో అంత్యప్రాసలతో సుందర పదజాలముతో కొనియాడిరి.

ఒక కళ చౌకం

ప॥ సా । , స గా । గ మ । ప మ గ మ గ । మ ద । ద ని సా ॥
రా మ చం ద్రం - - భా - వ యా - మి - -

(1) ని స । ని ద నీ ద ని । మ గ । మ ద ని స ॥
రఘు కు ల తి ల - క ము పే ం ద్రం

(2) ని స రి స । స ని దా ని ని ద ని । దా మ గ । మాప మమా
ర - ఘు- కు - ల తి - ల - క ము - పేం - - -

గ రి స ని ॥ రామ ॥
ద్రం - - -

అ॥ మా । మ మగమదా , । ని నిదా - ని సా , । సా । స సా స ॥
భూ మి జా - - - నా - - య కం భు క్తి ము క్తి

స ని స రి । స ని ద మ దమదని | గా । గ మ రీ స । ని ద ।
దా - - - య - కం - - - - | నా మ - కీ ర్త న తా

దని గ రి । సనిదా - స ని దమగ । పమగా । గా రి గరిస ని ॥
- ర కం న - ర ప - రం గ త - మా - యి - కం - - ॥

చ॥ సా । సమమమ । మమ । గామప మగ । మద । నినిదని సా ।
సా - కే - త న గ రే - - నివ సం తం - - -

సా । స నిదమ దనిసీ | మా । గాపమ గారిగ । రీ । సా సా ॥
సాం ప్రమా - - - - - - | జ్య ప్రద - హను - మం త ం

సా । , సా స । స సనీ స రి స ని ద మ | ద ని । సా సా ॥
రా కేందు వ ద నం - - భ - గ - | వ ం త ం

స ని । సా గ రి - స ని । దా । ద మ ద ని నీ ద మ ॥
ర మ ణీ - - - య క ళ్యా - - - - ణ - ॥

గా ప మ । గ రి సా ॥
గు ణ - వ ం తం ॥

మ॥సా॥ సా । సా సా । సా స స సా । స ని స రి స ని ద మ
శా కు త్సం ధీ మం త ం క మ లా - క్షం శ్రీ -

ద ని సా | స ని గ రి । స ని ద మ ద ని స రి ॥
మ ం తం | నా - కే - శ నుత మ న ం త ం ॥

స ని ద ని - ద మ గ మ గ రి స ని ॥ రామ ॥
న ర గు రు గుహ వి హ ర ం త ం ॥

# 226

## హిందోళ వసంత రాగం ఆది

20 వ మేళకర్త. స గ మ ప ద ని ద స

స ని ద ప మ ద మ గ స

ప॥ సంతాన రామస్వామినం । సగుణ నిర్గుణ స్వరూపం, భజరే ॥

అ॥ సంతతం యమునాంబాపుర నివసంతం ।

నత సంతం, హిందోళ వ,

మ॥సా॥ సంత మాధవం, జానకీధవం ।

సచ్చిదానంద వైభవం, శివం ॥ సం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "నీడామంగళం" అను క్షేత్రమందు వెలసియున్న సంతానరామస్వామిని, సగుణ, నిర్గుణ రూపుని భజించుమురా ! నిరంతరము యమునాంబా పుర మందు నివసించిన వానిని, సత్పురుషులచే నమస్కరింప బడువానిని, హిందోళ వసంత లక్ష్మీధవుని, జానకీధవుని, సచ్చిదానంద వైభవుని, మంగళప్రదుని భజించుము. ఇందు రాగనామమును, హిందోళ వసంత లక్ష్మీధవం= అని కూర్చిరి. గురుగుహ ముద్ర లేనందున దీక్షితులవారి రచన కాదని తలతు రేమో ! సచ్చిదానంద వైభవం అను పదములోనే గురుగుహ శబ్దము ఇమిడి యున్నదని భావించ వలెను.

---

# 227

## నారాయణ గౌళ రాగం ఆది

28 వ మే. జన్యం. స రి మ ప ని ద ని స

స ని ద ప మ గ రి గ రి స

ప॥ శ్రీరామం రవికులాబ్ధి సోమం। శ్రితకల్ప భూరుహం, భజేఽహం॥

అ॥ ధీరాగ్రగణ్యం, వరేణ్యం । దీనజనాధారం, రఘువీరం ॥

మ॥సా॥ నారదాది సన్నుత రామాయణ పారాయణ ముదిత
నారాయణం ॥

చ॥ దశరథాత్మజం, లక్ష్మణాగ్రజం । దానవకుల భీకరం, శ్రీకరం ।
కుశలవ తాతం, సీతోపేతం ।
కువలయ నయనం, సుదర్భ శయనం ॥

మ॥సా॥ సుశర చాప పాణిం । సుధీమణిం సూనృత భాషం,
గురుగుహ తోషం ।

దశవదన భంజనం, నిరంజనం । దానవిధిం, దయారస
జలనిధిం ॥ శ్రీ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. రామేశ్వర యాత్రకు దీక్షితుల వారు వెడలినప్పుడు, "దర్భశయన" మందున్న శ్రీరాముని దర్శించి వర్ణించిన కృతి. నారాయణుని, కుశలవుని తండ్రిని, దర్భశయన మందున్న వానిని మొదలగు విశేషణములతో, జలనిధి సమీప మందున్న రాముని, "దయారస జలనిధిం" అనుటలో గల ఔచిత్యము గమనింప దగినది.

రెండు కళల చౌకం

ప॥ రీ , మ మా మగమగ రీగరి । స ని ధ ఫ । స్రీ సా ।
శ్రీ - రా మం - - రవి- కులా - బ్ధి సోమం

సా రిమ మా మగమగ రీగరి । సా ని ని ధ ఫ । స్రీ సా
శ్రీ - - రా మం- - రవి- కు లా - - బ్ధి సోమం

సా ని సరీ మ పా నిద, మ పామ గగ । మగారి గ రిగస ||
- శ్రితకల్ప భూరు - హం - - -భ జే - - హం- - -

అ॥ దా, మా దప దామగ । రి గ రి మ । పా పా |
ధీ రా గ్ర - గ - - ణ్యం - వ రే ణ్యం |

దప దా దమ దపద మగా । రి గరిమ । పా పా |
ధీ - - రా - గ్ర - గ - - ణ్యం - వ రే ణ్యం |

పమపనిని దదా నీ । సా నిరి । నీ సా |
దీ - నజనా - - ధా రం ర ఘు వీ రం |

నీ గరీ గసరిని సరీ సా నిద । పాపా మ గ రి గ ।
నారదాదిస - న్నుత రామా యణ పారాయణ ముది

రిసా ని ధ ఫ ని స || శ్రీరామం ||
తనారా - యణం ||

చ॥ రి గ రి పా మ మ గ మ గ । రి గ రి స । స ని సా |
దశరథాత్మజం - - - ల - క్ష్మ ణా - గ్రజం |

నీ ధ ఫ ఫ ప ని ధ । ని సా రి । మ గ రి గ రీ |
దానవకులభీ - కరం శ్రీ - కరం - - |

రీ రి మ పనినీ సిదదా । దామప నీ దద । ని సరీ |
కుశ - లవతాతం - - సీ - - తో - - పే - తం |

రి మగా రిగ రీ సని దానిస । ని పామ । గా రి గ రి స |
కు - వల -యనయనం - - సుదర్భ శయ - నం - |

మ॥సా॥ మ రి మ పా పనీ నీ నిదాని సా । రీ రి ని సా సా ।
సుశర చాప పాణిం సుధీ మణిం సూ వృత భాషం

స̇ ని ద మ పా పా
గురు గు హ తో షం |

ప మ ప ని ద ని ని ద ని స̇ ని ద మ ప పా ।
ద శ వ ద న భ ం జ నం - ని రం జ న ం

మ నిదమపా ప మ మగరిగ రిసని̣స ‖ శ్రీరామం ‖
దా - నని ధినదయా - రసజ లనిధిం ‖

## 228

## దేవగాంధారి రాగం ఆది

ప॥ క్షితిజా రమణం, చింతయే శ్రీరామం, భవతరణం ॥

అ॥ క్షితిపతి నతచరణం । సేవిత విభీషణం ।
క్షితిభరణం, శ్రితచింతామణి మఘ హరణం ॥

చ॥ సకల సురమహిత సరసిజ పదయుగళం । శాంతం, అతికుశలం ।
వికసిత వదన కమల మతులిత మమలం । వీరనుత భుజబలం ।
శుక సనక ముని ముదిత గురుగుహ విదితం ।
శోభన గుణ సహితం ।
ప్రకటిత సరోజ నయనం । పాలిత భక్తం, భవపాశ హర
నిపుణం ॥ శ్రీ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. భూపుత్రికి భర్తయైన, భూమిని పాలించు రాజులచే నమస్కరింపబడు పాదములుగల వానిని, భూమిని భరించిన వానిని, యని మూడుసార్లు క్షితి శబ్దమును వాడుటలో "నావిష్ణుః పృథివీ పతిః" విష్ణుఅంశ లేనిదే రాజు కాలేడు గనుక, క్షితిభరణం = అనుటచే వరహావతారము ధ్వనించుచున్నది. మూడు

లోకములు, భూర్భువస్సువర్లోకములు అనియు, ఇందు మరియొక విశేషము. శ్రీరాముని గుణములను, రూప లావణ్యాగులను, అవయవములను వర్ణించిరి. మరియు సర్వలఘు పద సమాసములతో కూర్చుట గమనించ దగినవి. క్షితిపతి నతచరణం, సకల సురమహిత సరసిజ పద యుగళం ॥ మొదలగునవి రచనలోని విశిష్టతను తెలియ జేయుచున్నవి.

## 229

## మాంజి రాగం రూపకం

20వ మేళకర్త జన్యము — స రి గ మ ప ద ని స / స ని ద ప మ గ రి స

ప॥ రామచంద్రేణ సంరక్షితోఽహం, సీతా ।
రామచంద్రేణ సంరక్షితోఽహం ॥

అ॥ రమా, భారతీ, గౌరీ, రమణ స్వరూపేణ । శ్రీ ॥రామ॥

చ॥ కామకోటి సుందరేణ । కమనీయ కంధరేణ ।
కోమల ఘన శ్యామేన । కోదండ రామేణ ॥

మ॥సా॥ మామక హృదయ స్థితేన। మారుతి గీతామృతేన ।
మాంజీర, మణిమండిత । మద్గురు గుహ మానితేన ॥రామ॥

వ్యా॥ తృతీయా విభక్తి, రామచంద్రుని చేత నేను సంరక్షింప బడితిని. సీతారామచంద్రునిచే, లక్ష్మి, సరస్వతీ, గౌరీ రమణుల రూపునిచే, అనగా త్రిమూర్తి స్వరూపునిచే, కోటి మన్మథుల అందము గలవానిచే, మృదువైన మేఘమువంటి శ్యామల వర్ణముగల, కోదండ రామునిచే, నాహృదయమందున్న, హనుమంతునిచే స్తోత్రము చేయ

బడువానిచే, పాదములకు ధరించు మంజీర ఆభరణముచే ప్రకాశించు వానిచే, నాగురుగుహ స్వామిచేత కొనియాడ బడిన రామునిచేత రక్షింప బడితిని. ఇందు మంజీరమను ఆభరణ శబ్దముచే "మాంజీ" రాగ నామమును కూర్చిరి.

ఒక కళ చాపం

ప॥ రీ - రి రీ గ । గ మ పా - మపా ద ప । మగ - మా గ రి
రా మచం- ద్రే - - ణ సం - - ర - క్షి తో -

స ని । సా । సారిగమ గ రిస ‖ రీ - రి రీ గ । గ మపా -
- - హం - సీ - - తా -- ‖ రా మ చం ద్రే - -

మప నినిదప । గా - ప మ గ రి స ని । సా - సాసా ‖
ణ సం -- -- ర క్షి - తో - -- హం - - ‖

అ॥ స స - స సా స । రి స నీ - దాపమ । ప మ - దాని స రిస ।
ర మా - భా ర తీ - - గౌ రీ - ర మా - భా - - ర

రి స నీ - దాపమ | స ని - స ప ద మ । పా మ గ -
తీ - - గౌ రీ - | ర మ ణ - స్వ రూ - పే -

, ప మ గ గ రి రి స ‖ రామ ‖
- - ణ శ్రీ - - -

చ॥ గా - మపామ । గ మ పా - మగ రి స । గా - మపా మ ।
కా మకోటి సుం - ద రే - ణ । కా మకోటి

గ మపద - పమ గ రి స | గా- మపాగ । మా - రి రి మగసా ।
సుం -- ద - రే - ణ | కా మకోటి సుం ద రే - - ణ

ని స - రీ , గ । మ గ - ప మా మ | పా - ద ని స రి ।
క మ నీ య కం - ధ రే ణ | కో మ ల ఘ న

సా , ని - దాపమ । స ని - సపదప । మ గ - ప మగా రి స ||
శ్యా - మే-ణ కో- -దండ రా - మే - - - ణ ||

మ॥సా॥ సా స స - రి గ మా గ రీ స । సా స స - ని ని దా
మా మ క హృ ద య స్థి తే న మా రుతి గీ - తా

గ రీ స | నీ , స - స రి స రి నీ ద ప । మా ప ని -
మృ తే న | మాంజీ - ర మణి మండి త మ ద్గు రు

ద ప మ గ మ గ రి స || రామ ||
గుహ మా - ని తే - న ||

# 230

## తోడి రాగం త్రిపుట తాళం

ప॥ రామచంద్రాయ నమస్తే । రాజీవ లోచనాయ, వరాయ ॥

అ॥ సామగాన లోలాయ । సాధుజనాది పాలాయ ॥

కోమలతర గురుగుహ నుతాయ ।

కోటిమార లావణ్యాయ ॥రామ॥

చ॥ దశరధరాజ కుమారాయ । దండకారణ్య విహారాయ ।

కౌశికమఖ రక్షకాయ । కనక మణిమాలా ధరాయ ।

దశగ్రీవ ప్రాణ హరాయ । దాస విభీషణ పాలకాయ ।

కుశలవ సీతా సమేతాయ కపి బృందాది మనోహరాయ ॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. రామచంద్రుని కొఱకు, పద్మములవంటి నేత్రములు గలవానికై, శ్రేష్ఠునికై నమస్కారము. సంగీత లోలునికై సాధువులను పాలించువానికై, మృదువైన గురుగుహునిచే నుతింపబడువానికై, కోటిమన్మథుల అందముగలవానికై నమస్కారము. అని రాముని గుణ గణములను వర్ణించిరి. చరణమున సంగ్రహాముగ రామాయణము నంతను వర్ణించిరి. దశరథ కుమారుడు, కౌశికయాగ రక్షకుడు, దండకారణ్యమున విహరించిన వాడు, రావణాసురుని వధించిన వాడు, విభీషణుని రక్షించినవాడు, కుశలవులతో, సీతతో కూడి యున్న వాడు, వానరులతో కూడి యున్న రామచంద్రునికై నమస్కారము. ఇందు, "కుశలవ సీతా సమేతాయ" అను పదమున, కుశలవులతోటి, సీతతోటి కలిసియున్న వానికై, అని "తో, తోడి" తెలుగుపదము యొక్క అర్థముతో, తోడి రాగనామమును ధ్వనించు నటుల వర్ణించిరి.

## 231

## కళ్యాణి రాగం జంపె తాళం

65 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ రామచంద్రాదన్యం న జానేఽహం ।
శ్రీ హరిహరాత్మ రూపిణో ॥

స॥చ॥ కామ జనకాత్కళిన సుబాహు మారీచ ఖర దూషణాది ।
మద హరణోద్ధత రూపిణో । సమస్త సుర సన్నుత శరచాప ।
పాణినః । సరస గురుగుహ సంగీత తత్వ వేదినః ॥రామ॥

వ్యా॥ పంచమీ విభక్తి. రామచంద్రుని కంటె వేరు వస్తువు లేదు. హరిహర స్వరూపునికన్న, మన్మథుని తండ్రికన్న, సుబాహు,

మారీచ, ఖరదూషణుల గర్వమును హరించిన వానికన్న, సమస్త దేవతలచేత నుతింపబడు బాణ కోదండ పాణి కన్న, సరసుడైన గురుగుహ స్వామియొక్క సంగీత తత్వమును తెలిసిన వానికన్న వేరు లేదు. రామతత్వమును, అంతా రామమయముగా, రాముని కన్న వేరు పదార్థము లేదని సిద్ధాంతీకరించిరి.

## 232

## నామవతి రాగం ఆది తాళం

50 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ రామచంద్రస్య దాసోఽహం ।
శ్రీ సీతానాయకస్య, గురుగుహ హితస్య ॥

స॥చ॥ సామదాన భేదాది చతురస్య । సజ్జన పాలస్య, దుష్టహరస్య ॥
సమయాచార ప్రదాయకస్య ।
శబరీ మోక్ష ప్రదస్య, వరస్య ॥రామ॥

వ్యా॥ షష్ఠీ విభక్తి. రామచంద్రునకు, సీతానాయకునికి, గురుగుహునకు హితుడైన వానికి, శబరికి మోక్షమొసగినవానికి, దుష్టశిక్షకునకు, శిష్ట రక్షకునకు నేను దాసుడనని వర్ణించిరి.

## 233

## జ్యోతి రాగం జంపె తాళం

68 వ మేళకర్త.

ప॥ రామే భరత పాలిత రాజ్యమర్పయామి ।
రాజాధిరాజ పూజిత చరణం నమామి ॥

స॥చ॥ అమరేశాది సకల దేవతామోదనే ।
అంతరంగ గురుగుహాంశ మృదు గదనే ।
సమస్త మునిగణ సాధు జనాది వందనే ।
సానంద యుత సీతా మనోహర మదనే ॥

వ్యా॥ సప్తమీ విభక్తి. భరతునిచే పాలింపబడిన రాజ్యమును అర్పించుచున్నాను. రాజాధిరాజులచే పూజింపబడు పాదములను నమస్కరించుచున్నాను. అర్పయామి = ఉంచుచున్నాను. ఇందు రాగ నామము లేదు. మిగిలిన విశేషణ పదములతో కీర్తించిరి,

## 234

## రామకలి రాగం రూపకం

15 వ మేళకర్త. స రి గ మ గ రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ రామరామ, కలి కలుష విరామ ।
ధరాభృల్లలామ ॥ రామరామ ॥

అ॥ శ్రీమహిజాకామ, సుగుణధామ పరంధామ, శ్యామ ॥

మ॥సా॥ మామవ శివ గురుగుహ సుత్రామ విబుధ వినుత నామ ॥

వ్యా॥ సంబోధన ప్రథమా విభక్తి. ఓరామా, కలియుగ మందలి కలుషములను పోగొట్టువాడా, రాజోత్తమా ! లక్ష్మియైన సీతకు భర్తయైన వాడా నన్ను రక్షించుము. అని అంత్యప్రాస పద విశేషణములతో వర్ణించిరి. ఈవిధముగా రామచంద్రుని సగుణ, నిర్గుణ తత్వములతో రామాయణ గానమున సంగ్రహముగ రచించి, అన్ని విభక్తులతో కొనియాడిరి. 15 కృతులతో రాముని వర్ణించిరి.



# రామ భక్తుడైన ఆంజనేయుని పై రచించిన కృతులు

## 235

### నాట రాగం జంపె తాళం

ప॥ పవనాత్మజాగచ్ఛ పరిపూర్ణ స్వచ్ఛ । పరమాత్మ పుచ్ఛ ।
పాహిమాం జయజయ, నవ నవ నవ జయ జయ ॥

అ॥ నవవ్యాకరణ నిపుణ, నవ విధాంతః కరణ ।
శివ రామ హరికృష్ణ శ్రీగురుగుహ స్మరణ ॥

చ॥ కపట వానర వేష । కావ్య నాటక తోష ।
కపియూథ పరిపోష ।
కమనీయ భాష । అపగతాఖిలదోష । హతరాక్షసా శేష ।
ఉపనిషత్పద ఘోష । ఉదిత మిత్ర ద్వేష ॥

మ॥సా॥ అపురూప మణిభూష । రిపుజయ బలవి శేష ।
జప సమాద్యభిలాష । అపరిమిత సంతోష ॥ పవ ॥

వ్యా సంబోధన ప్రథమ. ఓ వాయు పుత్రుడా, రమ్ము. పరిపూర్ణమైనవాడా, స్వచ్ఛమైనవాడా, పరమాత్మకు తోకవంటి వాడా నన్ను రక్షించుము. జయమును చేకూర్చుము. మ రి యు జయము గలవాడా! "నవ, నవ, నవ, జయ జయ జయ" మూడు నవ శబ్దములను గూర్చుటలో మూడు భావములు గోచరించుచున్నవి. 1 నవ యన నిత్య నూతనుడవని, 2వ నవ యన తొమ్మిది అవతార

ములు దాల్చినవాడని, శ్లో॥ ఆద్యః ప్రసన్న హనుమాన్। ద్వితీయో వీరమారుతిః । తృతీయో వింశతి భుజః । చతుర్థః పంచవక్త్రకః । పంచమోఽష్టాదశ భుజః । శరణ్య స్సర్వదేహినాం । సువర్చలాపతి షష్ఠ । సప్తమస్తు చతుర్భుజః । అష్టమః కధితః శ్రీమాన్ । ద్వాత్రింశద్భుజ మండలః । నవమో వానరాకారః । ఇత్యేవం నవ రూప ధృత్ ॥ శివ నవకు నవ బ్రహ్మలలో నొకడను భావముతో మూడు నవ శబ్దములను వాడిరి. నవ వ్యాకరణములు తెలిసినవాడా! "శివ, రామ, హరి, కృష్ణ, గురుగుహులచే స్మరింప బడు వాడా" చరణమున పదములు మధురములు రమణీయములు. అంత్యప్రాసలు, పోష, తోష, వేష భాష, దోష, అశేష, ఘోష, ద్వేష, భూష, విశేష, అభిలాష, సంతోష మొదలైనవి. 12 విశేషణములు గమనించ దగినవి. కావ్య నాటక తోష యని నాట రాగమును కూర్చిరి. 12 విశేషణ పదములలో ఆంజనేయుని స్వరూప స్వభావములను వర్ణించిరి. ఒక్కొక్క పదమునకు ఒక్కొక్క చరిత్ర గోచరించుట గమనించ గలరు.

రెండు కళల చౌకం

ప॥ పమమాప స మ । రీ స | ధ రి నీ , స ని । సా । రి గమా |
పవ నాత్మజా - గచ్ఛ | ప రి పూ ర్ణ - స్వ - - చ్ఛ |

పప ని ని మాపమ । రీ స । ధా ధ ని స నిస రి గ।మ।రీ |
పర మా- - -త్మ పుచ్ఛ పా హిమాం జ- య - జయ |

సాసాస పమగస । ని ధ । ని స గ మ || పవనాత్మజ ||
ఆ -- నవనవ నవ జయ జ య ||

అ॥ స స సా రి స ప । మ । ని ప | ప స ని పా నీ । ప । ప ని |
న వ వ్యాక ర ణ ని పుణ | న వ వి ధాంతః క ర ణ |

ఁస ని సఁ రిఁ రిఁ సఁ రిఁ । సాఁ స | ప ని ప మ రి స్రీ । స రి । గ మ ||
శి వ రా - మహారి కృష్ణ | శ్రీ - గు రు గుహ స్మ - ర ణ ||

చ॥ స స మ పా మమ । రీ స | సా ని ఫా రి స । రీ రి |
క ప ట వా న ర వేష | కావ్య నా టక తోష |

స స మా మ ప ని । పా మ | ప మ నీ ని పా । మ । పా |
క పి యూ ధ ప రి పో ష | క మ నీ యభా - ష |

ని ప ప మా ప స । నీ స | ప ని పా రిఁ సాఁ । రిఁ సఁ । రిఁ రిఁ |
అ ప గ తా ఖి ల దో ష | హత రా క్షసా శే- - ష |

సఁ ఘ రిఁ సాఁ రిఁ సఁ । రిఁ సఁ । రిఁ రిఁ | సనీపమా గ గ ।మ । రిస ||
ఉ ప ని ష త్ప ద ఘో - - ష | ఉదితమి త - ద్వే -ష ||

మ॥సా॥ స స పా ప ద ని సఁ ని సఁ సఁ మఁ గఁ మఁ । రిఁ సఁ । రిఁ సాఁ ని |
అపు రూ ప మణి భూ - ష రి పు జ య బ ల వి శే ష |

సనిపమా ప మరీ స సపమని । ప స । ని పా ని ||
జపసమా ద్య భిలాష అపరిమి త స ం తో ష ||

# 236

## కానడ రాగం రూపకం

22 వ మే. జన్యం. స రి గ మ ద ని స
స ని ప మ ప ద ని ద ప మ గా మ రి స

ప॥ వీర హనుమ తే! నమోనమో, మారుత తనయ నమోనమో॥

అ॥ సరసీరుహ వదన । శ్రీ రామచంద్ర శరణ ॥ వీర ॥

చ॥ క్రూర రాక్షసాది హరణ । సర్వవిద్యా దాన నిపుణ ।
పరమంత్ర వినాశ కరణ । కపివినుత గురుగుహ స్మరణ ॥ వీర ॥

వ్యా॥ సంబోధన ప్రథమ. ఓ వీరాంజనేయా ! మారుతి తనయా నమస్కారము. పద్మము వంటి ముఖము గల వాడా, శ్రీరామచంద్రుని శరణు పొందిన వాడా, దుష్టులైన రాక్షసులను సంహరించినవాడా! అన్ని విద్యల నొసంగు వాడా! ఇతరులు ప్రయోగించిన మంత్రశక్తినుంచి, నిన్ను ధ్యానించు వారిని రక్షించుటకై, ఆమంత్ర శక్తిని నాశనము చేయువాడా, కపులచే వినుతింప బడు వాడా! గురుగుహునిచే స్మరింపబడు ఓవీర మారుతే ! నమస్కారమని కీర్తించిరి. ఇందు, హరణ, నిపుణ, శరణ, కరణ, స్మరణ మొదలగు పదములు, త్రిశగతికి సమములు. రంజక పదములు. ఈ కృతిని కాఫీ రాగమున కూడ పాడుచున్నారు.

## 237

## గేయ హెజ్జజ్జి ఆది

13 వ మే జన్యం

స రి మ గ మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ రామచంద్ర భక్తం భజ మానస ।
రాక్షసాంతకం, హనుమంతం ॥ శ్రీ ॥

అ॥ ఆమిషీకృత దివాకరం । గేయ హెజ్జజ్జి రాగ ప్రీతికరం ।

మ॥సా॥ సామదాన భేద దండ చతురం ।
సద్గురుగుహ మోదితం, వరం ॥ రామ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. ఓమనసా! రామచంద్రుని యొక్క భక్తుని, రాక్షసులను నాశనము చేయు వానిని, సూర్యుని మాంసపు ముద్దగా, అనగా ఆహారముగా, పసినాడు పండను భ్రాంతితో సూర్యుని మ్రింగిన వానిని, గేయ హెజ్జజ్జి రాగమనిన ప్రేమగల వానిని, సామ, దాన, భేద, దండములను నాలుగు ఉపాయములలో చతురత్వముగల వానిని, గురుగుహునిచే ఆనందించు వానిని, వరము లొసగు వానిని సేవించుము.

## రెండు కళల చౌకం

ప॥ పా ప మ గమపమ గ రి స ని ధా । సా రి స మ ।
రా మ - చం - - ద్ర - భ - - క్తంభ జ -

మా గ రి గమ | గా రి స ని ధ ఫా । స మ గా రి గ । రి స
మా న - స - | రా క్షసా ం త కం హను మ ం - తం

స మ గ మ ‖ రీ సా ‖
శ్రీ - - - ‖ తం - ‖

అ॥ దా ని దా, ప మ । ద మ । పా మ । గా మ గ |
ఆ మి షీ కృ త ది - వా క రం గే - |

మ పా దా ని దా । పా పా । ద ద సా |
యహె జ్జ జ్జి రా గ ప్రీ తి క రం |

మ॥సా॥ సా మ గా రి సా ని నీ ద ని ద పా । పా మ గ రి స సా ।
సా మ దా న భే ద దం డ చతు రం స ద్గు రు గు హా స

మా గ రీ మ గ మ ‖ రామ ‖
మ్మోది తం వ ర ం ‖

## 238

## శంకరాభరణం ఆది

29 వ మే. జన్యం. సంపూర్ణం.

ప॥ పవనాత్మజం భజరే, చిత్త ।
పరమ శాంతం, సుర గురుగుహ మహితం ॥

స॥చ॥ భువనత్రయ వ్యాపక మతి లలితం ।
భూసురాది సేవిత రామదూతం ।
శ్రవణ రామనామ ప్రభావం
శాశ్వత సంజీవ న్యౌషధ కరం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. వాయుదేవుని కుమారుని ఓ చిత్తమా! సేవించుము. శాంతస్వరూపుని, ప్రసన్నాంజనేయుని, దేవతలు, గురుగుహాలచే పూజింపబడిన వానిని, మూడులోకములు వ్యాపించిన వానిని, అనగా, విరాడ్రూపుని, అతి కోమలమైన వానిని. రామ నామము వినుటచేతనే ప్రభావముగల వానిని, శాశ్వతమైన సంజీవనీ ఔషధము (చే) ఆరోగ్యమును కలిగించు వానిని, రామ దూతను సేవించుము అని ప్రసన్నాంజనేయుని వర్ణించిరి.

---

శ్లో॥ హనుమానంజనాసూనుః ।వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గుణసఖః । పింగాక్షో౽మితవిక్రమః
ఉదధిక్రమణశ్చైవ । సీతా శోకవినాశకః
లక్ష్మణః ప్రాణదాతాచ । దశగ్రీవస్యదర్పహా
ఏతాని ద్వాదశనామాని । కపీంద్రస్యమహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం । యాత్రాకాలే విశేషతః
తస్య మృత్యుభయం నాస్తి । సర్వత్ర విజయీభవేత్ ॥



# శ్రీ వేంకటేశ్వరునిపై రచించిన కృతులు

## 239

## వాటీ వసంత భైరవి రాగం త్రిపుటతాళము

14 వ మేళకర్త. స రి గ మ ద ని స
స ని ద మ ప మ గ రి స

ప॥ ప్రసన్న వేంకటేశ్వరం భజరే ।
వాటీ వసంత భైరవీనుతం ॥ శ్రీ ॥

అ॥ ప్రసిద్ధ తంజనగర స్థితం । ప్రబల గురుగుహ వేద్య మాద్యం ॥

మ॥సా॥ వశిష్ఠ వామదేవ విదితం । వరాలమేలు మంగాశ్రితం ।
రసిక శేఖరం, కృపాకరం । రక్షిత భక్తానంద కరం
॥ ప్రసన్న ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. తంజావూరు నందు ప్రతిష్ఠింపబడిన ప్రసన్న వేంకటేశ్వరుని భజించుము. వాటీ వసంత భైరవీ రాగముచే నుతింపబడు వానిని, గురుగుహునిచే తెలియబడు వానిని, మొదటి వానిని, వశిష్ఠ వామదేవాదులచే తెలియదగిన వానిని, అలమేలు మంగతో కూడినవానిని, శృంగార రస శేఖరుని, దయగలవానిని, భక్తులను రక్షించి, ఆనందమును కలుగ జేయు వానిని భజించుమని కొనియాడిరి.

రెండు కళల చౌకం

ప॥ రి సా రి గ మా । మాగ మ ప మ । గ రి సా సా | ని స రి స
ప్రస న్న - వేం క టే - శ్వరం భ - జ రే | వా - - -
రి రి గ మ నీ । దామగ మపమగ । గ రి గ రి స ||
టీ - వ - సం త ఖై - ర - వీ - న త ం శ్రీ - ||

అ॥ మ గా మ నీ । ద మ ని ద । ద ని సా |
ప్ర సి ద్ధ తం జ న గ ర - స్థి తం |
సం సం ని ని ని ద । మ గ మ మ ప । మ గ రి స |
ప్రబ ల గు రుగు హ వే - ద్య - మా - ద్య ం |

మ॥సా॥ ని ధా ని సా ని రీ స రి గ । మా మ గా మ నీ ।
వ శి ష్ఠ వా మ దే వ వి ది తం వ రా ల మే
ద నీ సా రి సా | రి గ మ గా రి సా ని దా ద ।
లు మ ం గా ప్ర శి తం | ర శి క శే ఖ రం కృ పా క
నీ సా ని ద మా । గ మ ప మ గ రి స ని ||
రం ర క్షి త భ క్తా - నం ద క రం ||

# 240

## కాఫీ రాగం ఆది

22వ మే. జన్యం. స రి గా మ రి ప మ ప ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ వేంకటాచలపతే నిను నమ్మితి ।
వేగమే నను రక్షింపు మయ్య ॥

అ! పంకజాసన ప్రముఖాదివినుత । పదమునాశ్రయించినవారికెల్ల ।

మ॥సా॥ సంకటములు దీర్చి సంపదలిచ్చి మంగళం । పొరుందియ
పులివళత్తిర్వళంగుం ॥ వేంకటాచలపతే॥

చ॥ శ్రీనివాస, శేషాచలమునుంచి ।
శీఘ్రయ్ వందు, అంధుని కభీష్టదాన
మొసగి, గోకర్ణ క్షేత్రములో నెలకొని, మృకండు మునీశు
మొదలాన భక్తానాం । అభయ వరప్రదాన చతురం । మాపతే
దయానిధే ప్రత్యక్షముగా, నింద మానిలత్తిల్ ।
నిన్ మహిమైయనేకం ॥

మ॥సా॥ వాన వర్ణంగుం వాసుదేవనే ।
వాంచితార్థ ఫలమిచ్చు వరదనే ।
దీనరక్షక, పీతాంబరధర । దేవదేవ గురుగుహన్మానావ
॥ వేంకటా ॥

వ్యా॥ ఇది మణిప్రవాళ రచన. రెండు మూడు భాషలతో రచించ బడినదానిని మణిప్రవాళమందురు. తెనుగు, తమిళము, సంస్కృతము కలిపి రచించబడినది. ఈకృతి "పులివళన్" అను గ్రామమున నున్న శ్రీ వేంకటేశ్వరునిపై రచించిరి. "పులివళత్తిర్వళంగుం" పులివళన్ అను గ్రామమున నున్న వేంకటాచలపతే నిను నమ్మితిని వేగమే నన్ను రక్షింపుము. బ్రహ్మాది దేవతలచే వినుతింప బడువాడా నీపాదము నాశ్రయించినవారి సంకటములు దీర్చి, సంపదలనిచ్చి శుభముచే కూర్చు వాడా, ఓ శ్రీనివాసా, శేషాచలమునుండి, అసలు నివాసము శేషాచలము నుండి వేగమేవచ్చి, గ్రుడ్డివానికి కన్నుల నొసగిన వాడా, గోకర్ణ క్షేత్రములో నెలకొన్న మృకండు ముని మొదలైన వారికి కోరిన కోర్కెలు నొసంగిన వాడా, నీమహిమము అనంతము. అని వర్ణించిరి. ఈకృతి కాఫీ రాగమున రచించుటలో

నొక చమత్కారముగలదు. రసికులు గమనించ గలరు. కాఫీరాగము ఉత్తర, దక్షిణ భారతీయులకు ప్రీతికరమైన రాగము. ఇది ఖరహరప్రియ జన్యము. భాషాంగరాగము. ఈరాగమందు మూడు అన్యస్వరములు. అంతరగాంధారము, శుద్ధదైవతము, కాకలి నిషాదములు. శ్రీ వేంకటేశ్వరుడు సర్వప్రపంచమునకు ఆరాధ్యదైవమైననూ, ముఖ్యముగా ఆంధ్ర, తమిళ, కన్నడులకు దగ్గరవాడు. మరియు మనము త్రాగు కాఫీలో, పాలు, పంచదార, కాఫీపొడి మూడు కలిసియుండునుగాన, మూడు అన్యస్వరములుగల భాషాంగ రాగమును, మూడు భాషలు మాట్లాడువారికి దగ్గరవాడైన వేంకటేశ్వరుని, మూడు భాషలలో రచించి, మణిప్రవాళమున కీర్తించుట ఎంతయో మహిమాన్వితము. అయితే ఈమూడు భాషలలో కాఫీపొడి, పంచదార, పాలు ఏయే భాషలోనో రసికులే గమనించ గలరు. ఈవిధమైన అంతరార్ధముతో దీక్షితులవారు రచియించి యుండురని నాభావన !

రెండు కళల చౌకం

ప॥ దా స̇ ని పా ద ప మాపమ । గాగమ రి స । రిగమప
వేం క - టా చ - ల ప-   తే- - నిను న- - -
గ మ రి స | రీ గ మ ప మ గ మ గ గ మ రీ । స ని̣ సా
మ్మి - తి - | వేగ మే - న - ను - ర - - క్షిం - ఓ -
రి మ గ మ । గ మ రీ సా ‖
చు - మ - యూ్య - - - ‖

అ॥ పా మ ప మా ద ప దా । ప ద నీ । సా స̇ రి̇ రి̇ స̇ |
పం క - జా స - న ప్రముఖా ది వి - నుత |

స ని స రి స స స రి ని స దా । ప మ దా । ని పా ప
ప - ద - మునా - - శ్రీ- యిం చి న వా రి కె ల్ల

మ॥సా॥ సా ని స రి రి గ మ రి స స ప ద ని ప ద ।
సం క ట ములుదీ - ర్చి సం ప ద లి - చ్చి

మ ప ద ని స ని ప మ । గ మ రి స రి ప మ ప ‖
మంగ ళ ం పొ రుంది య పు లి వ త్తి- ర్వి ళం గుం ‖

చ॥ రీ ప మా ప రి గ । మపగమ రి స । స రీ ని |
శ్రీ ని వా స శే- షా- - - చల మునుం చి |

గా గ మ రీ స ని స । స రి గ మ । ప ద ని స |
శ్రీ ఘ్రయ్ - వ ం దు అ ం ధు ని క భీ - ష్ట |

దా స ని పా మ ప మా పా । మ ప మా । రీ స స |
దా న - మొ స - గి గో క - ర్ణ క్షే త్రము |

సా , రి గా మ పా ద ప । ప ద ప ని । స స ద ప మ |
లో నె ల కొ ని మృ క ం డు మునీ - - శు మొ ద |

దా ద నీ స ని స । స రి స రి । ని సా ని | సా స ని ద నిపద ।
లా న భ క్తా - నా - మ భయ వ ర ప్ర | దానచ తుః రతర

ద ప మా ద ప । దా , స |
ర - మా ప - తే ద |

ని స నీ రి స రి గ గ మ । రీ స ని స రీ , । సా ని రి |
యా - - ని - ధే - ప్ర - త్యక్ష - ము గా- నిం - ద |

సా ని స దా ప ప మ ప ద । స ని ప ద ప । గ గ గమరీ ‖
మా ని - ల త్తి ల్ నిన్ - మహి మై య- నే - కం ‖

మ॥సా॥ స ని స రీ ప మ ప మా ప దా ని సా । నీ సరీసరిస ।
వాం - న వ ర్వాణంగుం వా సు దే వ నే వాంఛి తార్థ ఫ ల

నీ స దదపదా | దానిపామపా గా గా రి ప మ ప ।
మిచ్చువరదనే | దీ నర క్షక పీ తాంబ ర ధ ర

గా మ రీ స స రి । ని స రీ గ మా ప || వేంకటా ||
దే వ దేవ గురు గుహా న్మామ నా వ

## 241

## సురటి రాగం ఆది తాళం

28 వ మే. జన్యం. స రి మ ప ని స
స ని ద ప మ గ ప మ రీ స

ప॥ శ్రీ వేంకట గిరీశ మాలోకయే । వినాయక తురగా రూఢం ॥

అ॥ దేవేశ పూజిత భగవంతం । దినకర కోటి ప్రకాశవంతం ॥

మ॥సా॥ గోవిందం, నత భూసుర బృందం ।
గురుగుహానందం । ముకుందం ॥

చ॥ అలమేలు మంగాసమేతం । అనంత పద్మనాభ మతీతం ।
కలియుగ ప్రత్యక్ష విభాతం । కంజజాది దేవోపేతం ॥

మ॥సా॥ జలధర సన్నిభ సుందర గాత్రం ।
జలరుహ మిత్రాబ్జ శత్రునేత్రం ।
కలుషాపహ గోకర్ణ క్షేత్రం ।
కరుణారస పాత్రం । చిన్మాత్రం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. దక్షిణదేశమున, గోకర్ణ క్షేత్రమని ప్రసిద్ధిగన్న "పులివళత్తిళ్" అను గ్రామమున వసియించిన వేంకటేశ్వరునిపై రచించబడినది. శ్రీ వేంకటేశ్వరుడు ఎచట వెలసి

యున్నను, అది వేంకటాచలమే, శేషాచలమే, వినాయకుని వాహనముగా గల వేంకటగిరీశుని చూడుము. గోకర్ణ క్షేత్రమందున్నవానిని కలియుగ ప్రత్యక్ష దైవమును, అలమేలు మంగతో కూడిన వానిని, అనంతపద్మ నాభుని, సూర్యచంద్ర నేత్రుని మొదలగు విశేషణములతో వర్ణించిరి, సురటి తెలుగు పదముగాన రాగనామము లేదు.

# 242

## ధాళివరాళి రాగం - మిశ్రఏక తాళం

39 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ శేషాచల నాయకం భజామి । వి । శేష ఫల ప్రదాయకం ॥

అ॥ భాషారమణ ప్రభృత్య శేషామర నుత కౌస్తుభ ।
భూషాలంకృత బహుతర వేషాత్మక విగ్రహం ॥

చ॥ మందహాస వదనం । స్వ । చ్ఛంద హృదయ సదనం ।
సుందరజిత మదనం । ము । కుందం, మధుసూదనం । అర
విందపత్రనయనం । గో । విందమురగ శయనం । సుర
బృంద సత్కృతాధ్యయనం । నంద నారాయణం ॥ పు ।

మ॥సా॥ రందరాది దిక్పాల స । నంద నాది మునివరాళి ।
వందిత మభినవ గురుగుహ । వందిత మనంత కీర్తిం ॥ శే ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. శేషాచల నాయకుని, విశేష ఫలము లొసగు వానిని సేవించు చున్నాను. భాషారమణుడు = బ్రహ్మ మొదలైన దేవతలచే నుతింపబడు వానిని, కౌస్తుభమును ధరించిన వానిని, అనేక వేషములతో కూడిన వానిని భజించు చున్నాను. చరణమందు ప్రాసలు గమనించదగినవి, మంద, స్వచ్ఛంద, సుందర

మొదలగునవి 12 ప్రాసలతో కూర్చిరి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను ద్వాదశాక్షరమూర్తిని. ద్వాదశ ప్రాసలతో కూడిన విశేషణములతో కొనియాడుట విశేషము. "మునివరాళి వందిత" వరాళి = సమూహముగా, వర్ణించుచు, రాగనామమును కూర్చిరి. ఇది ముద్రాలంకారము.

# 243

## పూర్ణచంద్రిక రాగం రూపకం

29 వ మేళకర్త. స రి గ మ ప ద ప స
స ని ప ద ప మ గ మ రి స

ప॥ శంఖ చక్ర గదాపాణి మహం వందే । శ్రీ ।
శార్ఙ్గ నందక, కౌస్తుభ ధారిణం । వందే ॥

అ॥ పంకేరుహ చరణం । పద్మావతీ రమణం ।
సంకటాప హరణం । సదాభక్త భరణం ॥

మ॥పా॥ కుంకుమ పంకిల గాత్రం । పంకజ విశాల నేత్రం ।
శంకర సన్నుతి పాత్రం । వేంకట వరద క్షేత్రం ॥

చ॥ గజేంద్ర సంరక్షణం । గరుడవాహ విచక్షణం ।
అజేంద్రాది విలక్షణం । అమృత సార భక్షణం ।
అజామిళ ప్రభృత్యనేక దాసాళి సంతరణం ।
భజే పూర్ణ చంద్రికాంగ గురుగుహాంతః కరణం ॥

మ॥సా॥ కుజాది గ్రహ విదితం । వి । రజా నదీతట స్థితం ।
సజాతీయాది రహితం । నిజానంద బోధహితం ॥ శంఖ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. విరజా నదీ తీరమందున్న

శ్రీ వేంకటేశ్వరుని, శంఖము, చక్రము, గదను, శార్ఙమును ధరించిన వానిని నమస్కరించు చున్నాను. పద్మావతీ రమణుని, వేంకట వరద క్షేత్రమందున్న వానిని, అని అనేక విశేషణములతో, పూర్ణచంద్రి కాంగ యని రాగనామమును కూర్చిరి. చతుర్భుజుడైన విష్ణుస్వరూపుని గాను, గజేంద్రరక్షకుని, గరుడవాహనుని మొదలగు పదములచే శ్రీమన్నారాయణుని వర్ణించిరి.

ఒక కళ చాకం

ప॥ పా - ప ద ద ప మ గ । రి గ - మ ప పమగా । రి గమరి -
శం ఖ చ - - క్ర - గదా - పా - - ణి మ - - -

రి స స ని ని ధ । ధా రి స - రీ స రి గ మ ‖
హం - - - - - వం - - దే శ్రీ - - - ‖

(2) రీ సా | సా - స ని స ని । పమ - పా మ మ । రీ - గమరీ సని ।
దే శ్రీ | శా ర్ఙ నం - - ద క కౌ స్తు భ ధా రి - ణ ం -

ధా రి స - రీ సా ‖
వ ం - దే - ‖

అ॥ పా - పామ రి । గ మ - రీ రీ । సా - ని ధా ధ । రీ - గమ రీ |
పం కే రు హ చ ర ణ ం ప ద్మా - వ తీ రమ ణం |

సా - స పా ప । ద ప - సా సా | స ని - ని పా మ । గమ - రీ రీ ‖
సం క టా ప హా ర ణ ం | స దా - భ క్త భ ర ణం ‖

మ॥సా॥ సా స స - సా రి రి రీ సా । రీ రి గ - మ రీ స ని రి సా |
కుంకుమ పం కి ల గా త్రం పంక జ వి శా ల నే - త్రం |

రీ సఀ ని - ప ని ప మ రి గ మ రి ।
శంకర స - న్నుతిపా - త్రం

సా ని ధ - రి ని సా స రి గ మ ॥ శంఖ ॥
వేంకట వరద క్షే - త్రం

చ॥ గ గ - మ రి సా । ని ఫ - ధ రీ , । గమ - రి సా స । రి గ-
గజేంద్ర సంర - క్షణం గరుడవాహ విచ

గ మ పా | స స - స పా ప । ద ప - ప ప సా | ని సఀ -
- క్షణం | అజేంద్రాది విల - క్షణం | అమృ

ని పా మ । రి గ - మ రీ , | స స - స ప పా । ద ప -
తనార భ - క్షణం | అజా - మిళ ప్రభృ

ప సఀ సా । సఀ ని - ని పా మ । రీ - గ మ రీ | సఀ సఀ - సఀ ని
- త్యనేకదా - సాళి సంతరణం | భజే - పూ

సఀ ని । ప ని - ప మ గ మ । రి గ - మ పా , । మరి - గమరీ |
- ర్ణ చంద్రికాంగ గురుగుహాంతః కరణం |

మ॥సా॥ స ని ఫ ధ - ధ రి రి గ మ రీ గ । మపాద- పామగామరీ |
కుజా - ది గ్రహ విదితం వి రజాన దీతటస్థితం |

స సా స - ప పా ప ప సఀ సా । ని పా మ - గ మ రీ
సజాతీ - యాదిరహితం నిజానందబో

స రి గ మ ॥ శంఖ ॥
ధహితం

## 244

# కళ్యాణ వసంత రాగం ఆది

21వ మే. జన్యము స గ మ ద ని స
స ని ద ప మ గ రి స

ప॥ శ్రీ వేంకటేశం భజామి । సతతం,
శ్రితజన పరిపాలం । గానలోలం ॥

అ॥ శ్రీ భూమిజా రమణం, భవతరణం ।
నామతీర్థ రూపం భూవైకుంఠపతిం ॥

చ॥ చంద్రపుష్కరిణీ తీర విహారం । ఇంద్రాది దేవ పాదపూజితం ।
శ్రీ భూ దేవీ సహిత నిత్యకళ్యాణ వసంతోత్సవ ప్రియకరం ॥

మ॥సా॥ శంఖ చక్రధరం । శంఖనాద ప్రియకరం ।
గోవిందం, విధి గురుగుహాది
పూజితాత్మపదం । కలియుగ ప్రసన్నం ॥ శ్రీ వేంకటేశం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. కలియుగ దైవమైన శ్రీ వేంకటేశుని, ఆశ్రయించిన వారిని పాలించు వానిని, గానలోలుని ఎల్లప్పుడు సేవించుచున్నాను. లక్ష్మి, భూమిజ, సీతా రమణుని రాముని, శ్రీ దేవీ, భూదేవీ సహితుడై నిత్యకళ్యాణ వసంతోత్సవముల ప్రేమ గలవానిని, చంద్ర పుష్కరిణీ తీరమందున్న వానిని సేవించుచున్నాను. ఇందు నిత్య కళ్యాణవసంతోత్సవ ప్రియకరం అని, కళ్యాణ వసంత రాగ నామమును కూర్చిరి. ఈవిధముగా, తిరుపతి వేంకటరమణుని మనస్సున నుంచుకొని, ప్రాంతము, ప్రదేశ మేదియైనను, ఆస్వామిపై 6 కృతులతో వర్ణించిరి. అద్వితీయుడైన స్వామిని ద్వితీయా విభక్తిలో రచించుట విశేషము.





# శ్రీరంగ క్షేత్రమందున్న రంగనాథ కృతులు

## 245

### నాయకి రాగం ఆది

22 వ మే. జన్యం. స రి మ ప ద నీ ద ప స
స నీ ద ప మ గా రి స

ప॥ రంగనాయకం భావయే । శ్రీరంగ నాయకీ సమేతం ॥శ్రీ॥

అ॥ అంగజ తాత మనంతమతీతం ।
అజేంద్రాద్యమర నుతం, సతతం ॥

మ॥సా॥ ఉ । త్తుంగ విహంగ తురంగం ।
కృపాపాంగం । రమాంతరంగం ॥శ్రీ॥

చ॥ ప్రణవాకార దివ్య విమానం । ప్రహ్లాదాది భక్తాభిమానం ।
గణపతి సమాన విష్వక్సేనం । గజతురగ పదాతి సేన । దిన
మణి కుల, భవ రాఘవారాధనం ।
మామక విదేహ ముక్తి సాధనం ।

మ॥సా॥ మణిమయ సదనం శశివదనం ।
ఫణిపతి శయనం, పద్మనయనం ।
అ । గణిత సుగుణ గణ నతవిభీషణం ।
ఘనతర కౌస్తుభమణి విభూషణం ।
గుణిజన కృత వేదపారాయణం ।
గురుగుహ ముదిత నారాయణం ॥శ్రీ॥

# శ్రీ దీక్షితులవారు తాము సందర్శించిన శివక్షేత్రములందున్న మూర్తులను వర్ణించిన శివపరమైన కృతులు

## 288

### శంకరాభరణం మిశ్రఏక

29 వ మే. జన్యం. సంపూర్ణం.

ప॥ అక్షయ లింగవిభో, స్వయంభో ।
అఖిలాండకోటి ప్రభో, పాహి శంభో ॥

అ॥ అక్షరస్వరూప, అమితప్రతాప ।
ఆరూఢ వృషవాహ, జగన్మోహ ॥

మ॥సా॥ దక్షశిక్షణ దక్షతర, సురరక్షణ, విధివిలక్షణ, లక్ష్య
లక్షణ, బహువిచక్షణ, సుధాభక్షణ గురుకటాక్ష వీక్షణ ॥

చ॥ బదరీవన, మూలనాయికా సహిత । భద్రకాళీశ, భక్తవిహిత ।
మదనజనకాది దేవమహిత । మాయాకార్య కలనా రహిత ।
సదయ, గురుగుహతాత, గుణాతీత ।
సాధుజనోపేత, శంకర నవనీత ।
హృదయ విభాత, తుంబురు సంగీత ।
హ్రీంకార సంభూత, హేమగిరినాథ ॥

మ॥సా॥ సదాశ్రితకల్పక మహీరుహ పదాంబుజయుగ రథ గజ తురగ।
పదాతి సంయుత చైత్రోత్సవ । సదాశివ,
సచ్చిదానంద మయ ॥అక్షయ॥

వ్యా॥ సంబోధన. "కీవళూరు" క్షేత్రమందున్న స్వయంభూ లింగమును గాంచి రచించి గాన మొనర్చబడినది. ఈకృతితో దీక్షితుల వారి జీవిత చరిత్రలోగల విచిత్రము చరిత్రలో గాంచగలరు. శంకరాభరణంలో, "క్ష"కార ప్రాసతో 13 అనుప్రాసలతో రచించిరి. నశించనివాడుగాన అక్షర స్వరూపునిగా 11 క్షకారములతో ఏకాదశ రుద్రమూర్తులను, హ్రీంకార బీజమంత్రాక్షరరూపునిగా నుపాసించిరి. ఇది శివపంచాక్షరీ మంత్రానుష్ఠానముతో సమాన మహిమగల కృతి.

ఒక కళ చౌకం

ప॥ . పామగమా । పా , మపదని । సా , స ని దప స ।
అక్ష -య లిం గ -వి- భో - - - - స్వ

పామ మ గపమ గరి ॥ (2) పా , మగపమ గమ |
యం భో --- - -- ॥ యం భో-- - - - |

రిప మగరీ గమగమరీ । గ రి ని స రిగమ ద ప । రీ , సాపా ।
అఖిలాం- - - - -డ కో- - టి -- - - ప్ర భో - పా

మ గ రి స ని స రి గ మ | పా ||
- హి - శ ం భో- - - || అ ||

అ॥ , పాదా దపమా । ప మ గ మాపా । పదద సనిపా ।
అ క్ష ర- - స్వ - రూ - ప -అమిత-ప్ర

ద నిసనీస దనిసని సా | స ని స రీ గ రి । స సా నీ రిస సనిదద।
తా---- - ---- - ప | ఆ- - హా - థ వృష వా-- - - - -

నీ స సనిదా పప । దనిసరిసని పా , గ రి స |
హా- - - - - జ- గ- --- - నో - హా - |

మ॥సా॥ సారి సన్ని స రి । సామ గమగరి స న్ని । సాప గమరి గ ।
దక్షి శి- క్షణ దక్ష త - ర- సుర ర క్ష ణవిధి వి

సాద మపగమ | పాద ని స ని స । స ని స రి స ని స ।
ల క్షణ ల-క్ష్య | ల క్షణ బ హువి చ - క్షణ సుధా -

పా రి ని స ద ప । సాద పా గ మ రీ ‖ అక్ష ‖
భ క్షణ గురు క టాక్ష వీ క్ష - ణ

చ॥ , గమపామా । పా , పా , మ । దా , పామా । పదపదమా
బద రీ వ న మూ ల నా యికా -- -- స

గామప గరి | గా , గా మపా , । గామగరీ సాన్నీ । న్నిసాసా గరి ।
హి-- -త | భ - ద్ర- కా- -- లీ శ భ- - క్త-

స న్నీ స రి గా | గమపమగరీ । గాగ మరీ సాన్నీ । సా,సాదప ।
వి - హి-- త | - మదన -జ న కా- - - ది దే - వ-

మగ రి గమపా | పమాగా మా । పా, నిదసీ । సదపప మదప ।
మ- హి- - -త | మా-యా - కా --ర్య కల- నా- - -

పమగ రిగసా | సనిద దపప మ । ద పామగరి గ । సా,మాగమ ।
-ర హి-- త | సదయ--గు - రు - గు- హ- తాత గు-

పా , దనిసా | సస సా నీ సా । రీ , సా నీ । నిసా రిగసా సా ।
ణా తీ-త | సా- ఘు జ నో పే త శం క- - ర

సరిసనిదా నీసా | స స రి గ రి రీ । సారిరీరీ । మ గ రి సా సని ।
స-వ- - నీత | హృద - య- వి భా--త తు ం బు రు సం

దపాదనిసా | స పా సాసా । నీ స నిదా పా మా। పా, సదదప ।
- -గీ -త | హ్రీం కా ర స ం - - భూ త హేమ- గి-

మగ మపాగ రీ స |
రి - - - - నాథ |

మ॥సా॥ సదాప మగా । మమప గ మరి స । ని ధా ని స మ గ ।
సదా౹శ్రిత క ల్పక మహీ - రుహ పదాంబు జయు గ

రి స ని స రి గ మ | పదా ని సా రి । గ రి స ని ద ని స ।
ర థ గ జ తుర గ | పదాతి సంయు త చై - త్రో - త్సవ

సా స నిదా పమ మగరీ । స స్థి స మ గ మ || ఆక్షియ ||
స దా - - శి వ స - - చ్చిదానం ద మయ ||

# 289

## లలిత రాగం త్రిపుట తాళం

15 వ మేళక ర్త. స రి గ మ ద ని స
స ని ద మ గ రి స

ప॥ అగ స్త్రీశ్వరం, ఆరాధయేఽహం । హరం, సచ్చిదానంద వల్లీశం॥

అ॥ జగజ్జీవేశాకారం । జనన విలయకరం ।
నగజ హ్లాదకరం నందీశం । శంకరం ॥

చ॥ జలనిధి పాణ్యస్థ కలశజార్చితం । జలజనాభాది నుతం ।
జాహ్నవీ ధరం, సతతం । కలికల్మషాపహం,కమనీయ విగ్రహం ।
సులలిత గురుగుహ జనకం, రక్షిత ధనికం ॥

మ॥సా॥ జలరుహా స్త చంద్రాగ్ని నేత్రం । జటాజూట మీశాద్రీశం ।
బలరిపు వందిత జగదీశం । వాంఛితార్థ దాయక మహేశం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. అగస్త్యునిచే ప్రతిష్ఠింపబడి, ఆరాధింప బడిన మూర్తిగనుక అగస్త్రీశ్వర నామముకలిగిన లింగమును, ఆనంద

వల్లీశుని ఆరాధించుచున్నాను. జగజ్జీవేశాకారం = ప్రపంచమున జీవకోట్లలో జీవుడు, లేక ప్రాణస్వరూపుడుగా నున్నవానిని, ఇచట శివతత్వమును తెలియజేసిరి. శివమనగా మంగళప్రదుడు. శరీరమున ప్రాణమున్నంతవరకు ఈ దేహము శివం, ప్రాణము పోయిన శవం అగును. గాన, శ్లో॥ వాయుభూతం, ప్రాణరూపం, శబ్దస్పర్శ గుణాన్వితం, రుద్రంహరం, మహాదేవం పూజయామి సదాశివం॥ వాయుస్వరూపమే ప్రాణము. ప్రాణవాయువు శివం. పంచప్రాణములు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు. పంచముఖములు, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష. ఈశానములు. ప్రాణములవలన చైతన్యము కలుగునుగాన, ఇంద్రియముల ద్వారా శివుని పూజించవలెను. దీనినే పోతనగారు "చేతులారంగ శివుని పూజింపడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని" యనిరి. ఆకాశ స్వరూపుడు విష్ణువు. ఆకాశ గుణము శబ్దముగాన, సంకీర్తనచేయమని శివకేశవతత్వము. అందువలన జీవేశాకారం అనిరి. "జలనిధి పాణ్యర్ఘ కలశజార్చితం" సముద్రమును, ఆపోసన పట్టినవాడు అగస్త్యుడు. "అగస్త్యః కుంభ సంభవః" కనుక కలశజునిచే అర్చింపబడిన వాడు. ఇక గంగాధరుడు మొదలగు శివుని విశేషణములతో వర్ణించిరి. మరియు సులలిత గురుగుహ జనకం = అని లలిత రాగమును కూర్చిరి. కొన్ని కృతులతో ఇదే విధముగా మూలతత్వమును ఒక్కొక్క పదముద్వారా, ఉపాసనా విధానమున తెలియజేయుటయే దీక్షితులవారి కృతులలోని ప్రత్యేకత.

## 290
## కుముదక్రియ రూపకం

51 వ మే. జన్యం. స రి గ మ ద స
స ని ద మ గ రి స

ప॥ అర్ధనారీశ్వర మారాధయామి । సతతం ।
అత్రి భృగు వశిష్ఠాది మునిబృంద వందితం ॥శ్రీ॥

అ॥ అర్ధవామాలంకార విశేష ప్రభావం,
అర్ధనారీశ్వరీ ప్రియకరం । అభయకరం, శివం ॥

చ॥ నాగేంద్ర మణిభూషితం । నంది తురగారోహితం ।
శ్రీగురుగుహ పూజితం । కుముదక్రియ రాగనుతం ॥

మ॥సా॥ ఆగమాది సన్నుతం । అనంతవేద ఘోషితం ।
అమరేశాది సేవితం । ఆర్ద్రావర్ణ శోభితం ॥అర్ధ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. అర్ధనారీశ్వరుని ఎల్లప్పుడు ఆరాధించు చున్నాను. అత్రి, భృగు, వశిష్ఠాది ముని సమూహముచేత నమస్కరింపబడు వానిని, ఎడమ వైపుననున్న పార్వతీ అలంకారములతో శోభించువానిని, కుముదక్రియా రాగముచే నుతింపబడువానిని, వేద ఘోషతో కూడినవానిని ఆరాధించు చున్నానని పొగడిరి. సగము శివుడు, సగము పార్వతితో గూడి యున్న అర్ధనారీశ్వరమూర్తిని వర్ణించిరి.

## 291

## ఆరభి రాగం ఆది

29 వ మే. జన్యం. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ ఆదిపురీశ్వరం సదా భజేఽహం । త్రిపురసుందరీ సమేతం ।
వర గురుగుహ జనకం । వందిత ముని సమూహం ॥

అ॥ విధిహరి పూజిత త్యాగరాజాంగం ।
ఆదిత్య కోటి ప్రకాశ లింగం ।
నంది పూజిత స్వయంభూ లింగం ।
నాగ కవచ ధర సైకత లింగం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. తిరువారూరు సమీపమున సప్త విడంగ త్యాగరాజ క్షేత్రములలో "తిరునళ్లూరు" అనుక్షేత్ర మొకటి. ఆక్షేత్రమును ఆదిపురి యందురు. అందు వెలసియున్న ఆదిపురీశ్వరుని, త్రిపురసుందరీ సమేతుని, గురుగుహుని తండ్రిని, విధి,హరి పూజిత త్యాగరాజరూపుని, కోటిసూర్య ప్రకాశలింగ రూపుని, స్వయంభూ లింగరూపుని, నాగాభరణముచే అలంకరింపబడిన సైకత లింగరూపుని ఎల్లప్పుడు నేను భజించు చున్నాను. ఆప్రాంతమును దర్భారణ్యమందురు. ఈసప్తవిడంగ క్షేత్ర విషయమును త్యాగరాజుపై రచించిన కృతులలో గమనింపదగును.

## 292

## శ్రీరాగం ఆది

22 వ మే. జన్యం.          స రి మ ప ని స
                    స ని ప ద ని ప మ రి గ రి స

ప॥ కామేశ్వరేణ సంరక్షితోఽహం ।
గణపతి, గురుగుహాది కారణేన ॥

అ॥ కమలేశ కృత కన్యకా దానేన । కరుణామృత రస ప్రవాహేణ ।
కామేశ్వరీ పాణి గ్రహణేన ।
కామాది ప్రముఖాది కరణ శంకరేణ ॥

చ॥ అరుణకిరణ కోటి ప్రకాశేన । అణిమాద్యష్టైశ్వర్య ప్రదేన ।
భేరీ వీణాది గానలోలేన । భాగవత ప్రముఖాది నుతేన ॥
వర లాజహోమాది ప్రదక్షిణ । వసుమిశ్రిత పుష్ప వర్షేణ ।
పురాణ పురుష పురుహూతాది । పూజిత పద్మ మంటప స్థితేన ॥

వ్యా॥ తృతీయా విభక్తి. కోర్కెలకు ఈశ్వరుడు కామేశ్వరుడు. అమ్మవారు కామేశ్వరి. ఈకృతిలో మన్మథుని జయించిన, భస్మముచేసిన శంకరుడు, కామేశ్వరునిగా వెలసిన మూర్తిని వర్ణించిరి. కామేశ్వరిని వివాహమాడుటచే కామేశ్వరుడైనాడు. నిష్కాముడు సకాముడగుటచేత గణపతి, గురుగుహుల జననమునకు కారణమైనాడు. బ్రహ్మ చేత కన్యాదానము నందిన వానిచేత, సంరక్షింప బడితివి. కోటి సూర్య కిరణ కాంతిగలవానిచేత, అణిమ మహిమ మొదలైన అష్టైశ్వర్యముల నొసగువానిచే, భేరీ, వీణ, మొదలైన వాద్యలోలునిచే, భాగవతులలో ప్రముఖులైన, ప్రహ్లాద, నారదాదులచే నుతింపబడు వానిచే, వివాహముల లాజహోమములు చేసి అగ్నిసాక్షిగా దంపతులు ప్రదక్షిణమాచరింతురు. ఇందు వివాహ సంబంధ విషయ్య విశేషణములను కూర్చి, ధర్మార్థకామమోక్ష సాధనకు ఆధారమై, కోర్కెలను దీర్చు గృహస్థధర్మములతో గూడి, సర్వకోర్కెలు దీర్చుమూర్తిగా సగుణ, సరాగ మూర్తిగా వర్ణించిరి.

## 293

## కుసుమాకర రాగం త్రిశ్రవిక

71 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ కుసుమాకర శోభిత శ్రీపుర గేహం ।
కుంభజ గురుగుహ నతం, భావయేఽహం ॥

అ॥ హాసనజిత, త్రిపురమవసత మురిహరం ।
అబ్జశేఖరం, కరుణాకరం, హరం ॥

మ॥సా॥ భసితోద్ధూళన భరణం । పన్నగ వలయాభరణం ।
అసమాస్త్ర గర్వహరణం । అగరాజ సుతా రమణం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. శ్రీపురగేహం = శ్రీపురమనగా తిరువారూరునందున్న శివుని, పుష్పములతో శోభించు శ్రీపురము గృహముగా గలవానిని, త్రిపురాసురుని సంహరించుటకై బ్రహ్మను ధనువుగా, మురహరుని బాణముగా చేసినవానిని భావించుచున్నాను. అని కొనియాడిరి.

రెండు కళల చౌకం

ప॥ ప ప మాదప । స్ం నిదప ప మ । ద పగమపా |
కుసుమాకర శో - భిత శ్రీ - పురగే- హం |

దా ప మ రి గ । స స న్ి ధా ప । ప ద రీ సా ||
కుంభజ గురు గుహనతం భా - వయేహం ||

అ॥ స్ం స్ం దపమా । రి గ ప మ ప ద । ద ద ప ని దా ।
హాస నజి త త్రిపుర మ వ న త మురహ రం

పా స్ం రీ రి | సా ని ద పా । ప మా రి గ సా ||
అ బ్జ శేఖ | రంకరుణా క రం హ- రం ||

చ॥సా॥ ప పసా రి గమగ పమపా । పామగ మపదా స్ం స్ం నీ |
భసితోద్ధూ -ళ న భరణం పన్నగ వ లయాభ రణం |

రి ప మా రి గా స ని ద సా ।
అస మా స్త్రగ ర్వ హర ణం

రి గ సా ని ద మా ప మ రి గ || కుసు ||
అగ రా జ సు తా ర మ ణం ||

## 294

## కళ్యాణి త్రిపుట

65వ మే జన్యము. సంపూర్ణం.

ప॥ కుంభేశ్వరాయ నమస్తే । శ్రీమంగళాంబా సమేతాయ నమస్తే॥

అ॥ తుంబురు నారద సన్నుత చరణాయ । ఉ
త్తుంగ కమనీయ వృషభారోహితాయ ।
అంబుధి కావేరీ తీరస్థిత సుఖకరాయ ।
శంకరాయ ॥కుంభేశ్వరాయ॥

చ॥ కుమార గురుగుహ పూజితాయ ।
ఉమా రమణాయ మహేశ్వరాయ ।
హేమగిరి పీఠస్థితాయ, చర్మాంబర శశి శేఖరాయ ।
నిర్మల హృదయ విలసితాయ । నిత్య బుద్ధ ముక్తాయ,
నిత్యోత్సవ నిరంజనాయ ॥కుం॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. "కుంభకోణ" క్షేత్రమందున్న, మంగళాంబా సమేతుడైన కుంభేశ్వరుని సందర్శించి, కుంభేశ్వరుని కొఱకు నమస్కారము. తుంబుర, నారదులచే సన్నుతింప బడిన పాదములు గలవానికై, నందివాహనారూఢునికై, సముద్ర సమీపమున, కావేరీ తీరమందున్నవానికై నమస్కారమని కొనియాడిరి.

## 295

## కాంభోజి రాగం త్రిపుట తాళం

28 వ మే. జన్యం. స రి గ మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ కైలాసనాథేన సంరక్షితోఽహం ।
కైవల్యప్రద నిపుణతరేణ । శ్రీ ॥

అ॥ కైలాసగిరి విహారేణ । శైలరాజాత్మజా మోహాకారేణ ॥ కై॥

చ॥ సద్గతిదాయకాంభోజ చరణేన । చారు శరచ్చంద్ర కళాధరేణ ।
సద్గురుగుహ సన్నుత పదేన । సత్యజ్ఞానానందేన ॥

మ॥సా॥ సనకాది సంశయ హరేణ । చిదానంద హృదయస్థితేన ॥కై॥

వ్యా॥ తృతీయావిభక్తి "తిరునల్వేలి" క్షేత్రమందున్న కైలాసనాథ స్వామిచేత సంరక్షింప బడితిని. కైవల్యము నొసగు వానిచే, కైలాస పర్వతముపై విహరించువానిచే, పర్వతరాజ కుమారి పార్వతిచే మోహింపబడు ఆకారముగల వానిచే, ఉత్తమగతినొసగు పద్మములవంటి చరణములు గలవానిచేత, ఈపదమునందు రాగనామ మును కూర్చిరి. దాయకాంభోజ చరణేన=సద్గతిప్రదాయక, అంభోజ చరణేన. ఈసమాస పదమున రాగనామమును చేర్చిరి.

# 296

## సౌరాష్ట్రరాగం ఆది

17 వ మే. జన్యం. స రి గ మ ప మ దా ని స
స ని దా ప మ గ మ రీ స

ప॥ గోకర్ణేశ్వర పాహి, పాహిమాం ।
గోత్రభిదాది పూజిత మూర్తే । సుకీర్తే ॥

అ॥ శ్రీకంఠ హేమగిరి కార్ముకధర ।
శ్రీపతి, శర, ధరణీధర, పురహర ।
శోకహర, హర, శుభనికరాకర । కోకనద పద గురుగుహాగ్ర ॥

చ॥ ఫాలమండల తీర్థతీరవాస । భారతీశనుత, భక్తవిశ్వాస ।
నీలలోహిత విశ్వవిలాస । నిత్యానందవల్లీ మనోల్లాస । పాం

చాల, సౌరాష్ట్ర, చోళ దేశపాలక సేవితపాద, మృకండు,
బాల దీర్ఘాయురారోగ్యప్రద । బాలశశిధర, వరద, దక్షిణ ॥గో॥

వ్యా॥ సంబోధన. దక్షిణ గోకర్ణేశ్వరమని ప్రసిద్ధిగాంచిన క్షేత్రము "పులివళత్తిళ్" అను క్షేత్రము. అందు వెలసియున్న గోకర్ణేశ్వర! నన్ను రక్షించుము. త్రిపురములను జయించు సమయమున, మేరు పర్వతము ధనువుగా, విష్ణువు బాణముగా ధరించిన ఓ పురహర! ఇందు త్రిపురసంహార రూపవిశేషములను వర్ణించిరి. అగ్నితీర్థ సమీప మందున్న వాడా! పాంచాల, సౌరాష్ట్ర, చోళ దేశాధిపతులచే సేవింప బడు వానిని, మార్కండేయునకు దీర్ఘాయువొసంగిన శంకర, శుభకర నన్ను పాలించుము. అని కొనియాడిరి. ఇందు రాగ నామము ను కూర్చిరి. గోత్రభిదాది పూజిత = ఇంద్రాది పూజితుడు.

## 297

## ఆరభి త్రిపుట

29 వ మే జన్యం సరిమపదస
సనిదపమగరిస

ప॥ గౌరీశాయ నమస్తే । గురుగుహాది సన్నుత వరాయ ॥

అ॥ శౌరి విధీంద్ర నుతాయ । శంకరీ ప్రాణనాథాయ ॥
సూరిజనోపాసితాయ । శూలాయుధధర శోభితకరాయ ॥

చ॥ శుకసనకాది దేవహితాయ । సుందర మాయూర నాథాయ ।
నిర్మల హృదయ విహారాయ । నిత్యశుద్ధబుద్ధ ముక్తాయ ।
సకల నిష్కళ రూపాయ । చర్మాంబరధర, శశిశేఖరాయ ।
సుఖతర ప్రవర్తకాయ । శుద్ధ చక్రనిలయాయ, నిత్యాయ ॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. "మాయవర" క్షేత్రమందున్న మాయూరనాథస్వామి కొఱకు, గౌరీశునకై, శుద్ధచక్ర నిలయునికై, నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడనె ముక్తియొసంగువానికై నమస్కరించుచున్నాను. అని అనేక విశేషణ పదములతో ప్రార్థించిరి.

## 298
## మార్గహిందోళం ఆది

20 వ మే. జన్యం. స రి గ మ ప ద ని స
స ని ద మ ప మ గ స రి స

ప॥ చంద్రశేఖరం సదా భజేఽహం ।
శాంభవీ మనోహరం శంకరం ॥

అ॥ ఇంద్రాది దేవ సన్నుత పదం ।
భిందిత ఫలప్రద గురుగుహనుతం ॥

చ॥ అష్టాదశ వాద్యాది ప్రియం । అతిశుద్ధ మర్దళవాద్య ప్రియం ।
సంగీత శాస్త్రాది సంయుతం । సన్మార్గహిందోళ రాగనుతం ॥

మ॥సా॥ అష్టసిద్ధి దాయకముకుందం । అష్టపాశ హర తీర్థవైభవం ।
ఆనందకందం, సోమాస్కందం ।
అజపా నటనానంద వైభవం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. చంద్రశేఖరుని ఎల్లప్పుడు సేవించుచున్నాను. చరణమందు అష్టాదశ (18) వాద్యములయందు ప్రియముగలవానిని అని దేవాలయములలో, ఆగమ శాస్త్రానుసారము ఆయా సమయములలో వాయించబడు వాద్యములు శంఖ, భేరీ, పటహ, కాహళ, నాదస్వర, తాళ, మృదంగ, వీణ, డోలు, బాకా, తూతూ,

కంజరి, రుంజ, రండోలు మొదలగునవి. 18 వాద్యములను అందు, చర్మవాద్యములలో శ్రుతిబద్ధమైన వాద్యము, మర్దళ, మృదంగమును, ఏయే దేవతల ప్రీతికై ఏయే రాగములను వాయించవలెనో, ఆ సంగీత శాస్త్రమును, నటనలలో అజపానటనము, హంస నటనము, మయూర నటనము మొదలగు నటనలచే ఆనందించువానిని యని, సంగీత, నృత్య, వాద్య విశేషణములతో కీర్తించిరి.

## 299

## ఘరజు రాగం ఆది

15 వ మే. జన్యం.

స గా మ ప ద స స
స ని ద ప మ ద ప మ గా రి స

ప॥ చింతయే మహాలింగమూర్తిం । చిద్రూపస్ఫూర్తిం, సుకీర్తిం ॥

అ॥ సంతతం మధ్యార్జున పురవాసం ।
బృహత్కుచాంబా సహవాసం ।
అంతరంగ భక్తజనానామతి సమీప ఋజుమార్గ దర్శితం ॥

మ॥సా॥ అంతకాంతం, ఆదితారకం ।
హత్యాది పాపహరం, పురహరం ॥

చ॥ పాకశాసనాది దేవబృందం । పాలిత దాసజనాది ముకుందం ।
శోకాది హరణ పదారవిందం । శుభకరం । కరుణారస కందం ॥

మ॥సా॥ శ్రీకమలాపుర సోమాస్కందం ।
చిదంబరేశ్వర నటనానందం ।
శ్రీకాళీశ భైరవ స్పందం ।
శివస్వామిశైల గురుగుహాస్కందం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "తిరువడైమరుద్" అను మధ్యార్జున క్షేత్రమున వెలసియున్న బృహత్కుచాంబా సమేతుడైన మహాలింగేశ్వరుని చింతించు చున్నాను. శ్రీకమలాపుర సోమాస్కందుని చిదంబర నటరాజానందుని, శ్రీకాళీశ భైరవుని, శివస్వామిశైల గురుగుహాస్కందుని అని, కమలాపురమందున్న శివుడు, చిదంబర నటరాజు, స్వామిమలైలో నున్నస్వామి ఒక్కరే నను భావమున కీర్తించిరి.

## రెండు కళల చౌకం

ప॥ పానిస్స నిదపమ గా । గరిగ మ । దదపమ గా | రిసరి ని
చిం- త యే- మ హా లింగ మూ -- -- ర్తిం | చి - - -

స దపా ద పదమ । గా గ మపద । నిస్సనిద పమగమ ||
ద్రా-ప స్వా- - - ర్తిం సు - కీ - - - - - ర్తిం - - ||

అ॥ సా గరి గా, మా । దా ప మ । గ మ దా | సా ని స ని
సం త- తం మ ధ్యార్జు న పు ర వా | సం బృహ -

ద ప మ । గ రిసగ । మదపా | పా ద పా గమా । పాదని
త్కుచాం బా-సహ వా-సం | అంత రం గ భ క్త జ -

దా । పాపా | మగమపా పమ గ । మాగమ । పద ని స ||
నా నా- | మత సమీపబుజు మార్గద - ర్శితం ||

మ॥సా॥ గ రి స ని ద స నీ నిదప గ మ గ మ ప ।
అ ం త కాం త కంఆ-ది తా - రకం

పామా మపాప । మగారి గమగమ ||
హత్యాది పాప హరంపురహారం ||

చ॥ పామగ రిసరీ । గమాప । మపమా గా | పాగమ దాసని ।
పాశ శా-సనా ది దేవ బృం - దం | పాలిత దాస జ

ద దపమ । గమగా | రీ గామగ మద । పదాస । నిసనీ దా |
నా-దిము కుం దం | శోకాది హరణ పదార విం - దం |

గ రి స నీ దని ద ప । పమగగ । గరిగమ గా |
శుభ క రం క- రు ణా -ర సకం ---- - దం |

మ॥సా॥ ద ప గ మ ప ద ప మ ప గ మా గ రి గా ।
శ్రీ- క మ లా- పు ర సో - మా స్కందం
స రీ గ మాగ మ । ద ద ని స గ రి సా |
చి దంబ రే శ్వర న ట నా - నం దం |
ని గ రీ సా ని రి స ని దా స ని దా ।
శ్రీ- కా ళీ శ భై- ర వ స్వం దం
గ రీ సా ని ద ద । ద ప ద మ గ మపద || చిం ||
శి వ స్వామిశైల గు రుగు హ స్కందం ||

# 300

## శంకరాభరణం ఆది

29 వ మేళకర్త.

ప॥ తారకేశ్వర దయానిధే, మాం । తారయాశు కరుణానిధే ।

అ॥ తారానాయక శేఖర, శంకర । నారాయణనుత,
నాదాంతసార । శృం
గార శివావతార, గురుగుహ తారోపదేశ ప్రకాశిత ॥

చ॥ సూర్యకోటి సంకాశ శరీర । సోమసుందర హసిత శూర ।
కార్యకారణ విశ్వాధార । కనకాంగద కేయూర హార ॥

మ॥సా॥ చర్యాది చతుష్టయ । చాతుర్యహృదయ
విదార్యాశ్రిత మందార ।

తురీయాతీత చిదానంద ॥తారకేశ్వర॥

వ్యా॥ సంబోధన ప్రథమ. ఓతారకేశ్వర! దయానిధే నన్ను వేగమే (తరింపజేయుము) రక్షించుము. తారానాయకుడైన చంద్రుని ధరించినవాడా! అని శివసంబంధ విశేషణములతో పొగడిరి. చివరిలో తురీయాతీత చిదానంద = చివరిదైన బ్రహ్మానందమునకన్న ఎక్కువైన చిదానందరూపా! అని వర్ణించిరి. శాశ్వతానంద రూపునిగా భావించిరి.

## 301

## శంకరాభరణం ఆది

29వ మే. జన్యం.

ప॥ నాగలింగం భజేఽహం, అ ।
నాది లింగం । వ్రజేఽహం । శ్రీ ॥నాగ॥

అ॥ నాగవల్లీ ప్రసంగం । నగజార్ధాంగం, నందితురంగం
ఆగమశాస్త్ర పురాణ ప్రసంగం ।
అవిద్యా భంగం, అతి ధవళాంగం ॥

చ॥ స్థూల సూక్ష్మ కారణాత్మ లింగం ।
సుఖప్రదాయక సుందరలింగం ।
మూలభూత మప్రాకృతలింగం । మునిగణాష్ట నాగార్చిత లింగం॥

మ॥సా॥ నీలకంఠ గురుగుహాంతరంగం । నిత్యశుద్ధ కరవిధృత కురంగం।
కాలహరం, శిరోవిధృతగంగం।కరుణాపాంగం, విజితానంగం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. స్థూల, సూక్ష్మ కారణ దేహముల కతీతమైన ప్రాణలింగ, ఆత్మలింగ రూపుడైన నాగలింగమును భజించు చున్నాను. ప్రకృతి సంబంధము కానిలింగమును, అనాదిలింగమును పొందెదను అని కీర్తించిరి.

## 302

## నిషధ రాగం త్రిపుట (నీతిమతి)

60 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ నిషధాది దేశాధిపతి నుత । నీలకంఠేశ, పాలయ మాం ।

అ॥ వృషభవాహన । విశ్వమోహన ॥

మ॥సా॥ విషయవాసనాది విదారణ । వీర గురుగుహోదయ కారణ ॥

వ్యా॥ సంబోధన. నిషధాది దేశాధిపతులచే నుతింపబడు ఓనీలకంఠ ! నన్నురక్షించుము. వృషభవాహన ! లౌకిక విషయ వాసనలను తొలగించువాడా ! వీరుడైన కుమారస్వామి జన్మకు కారణమైన వాడా ! అని నిషధరాగము యొక్క నామమును కూర్చి రచించిరి. ఈరాగమును నీతిమతి యందురు.

ఒక కళ చౌకం

ప॥ ని ధ నీ సా రి గ రి గ స । రీ స ప మ గ రి |
ని - ష ధా ది దే - - - శా ధి ప తి ను త |

నీ ధ ని సా స ని పా । మాపా , మ గ గ రి రి సా ||
నీ ల - కం ఠే - - శ పా - ల - య - మాం ||

అ॥ గ గ మ గా గ రి । పా ని సా నిప మా |
వృష భ వా హన వి శ్వమో హ- న |

మ॥సా॥ ప ప మ పా స గా గ రి రి రి స । సా గ రి స ని
వి ష యవా స నా ది విదార ణ వీ ర గు రు గు

స ని ప మ గ రి గ స ‖ నిషధాది ‖
హో - ద యకా - ర ణ ‖ ‖

# 303

## కేదారగౌళ రూపకం

28 వ మే. జన్యం. స రి మ ప ని స
స ని ద ప మ గ రి స

ప॥ నీలకంఠం భజేఽహం । సతతం । నీలజాసనాది నుతం ॥ నీ ॥

అ॥ బాల కుచాంబా సహితం ॥ బాలచంద్ర సేవితం ।
శీల గురుగుహ పూజితం । శ్రీ కదంబవన నాథం ॥ నీ ॥

చ॥ అక్షయ హ్యాపాఖండ కావేరీ తీరోత్తరాభిముఖం । పంచముఖం ॥
రక్షిత భక్తప్రముఖం । నక్షత్రేశ శేఖరం ।
నామరూప విచిత్రతర ।
దక్షతరమీశ్వరం । కేదారగౌళ ప్రియకరం ॥

మ॥సా॥ దక్షిణ కాశీపురం । దండిత కామత్రిపురం ।
దక్షాధ్వర హారం । దయాకరం కమలకరం ॥ నీల ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. దక్షిణ కాశీక్షేత్ర మనిప్రసిద్ధి గాంచిన క్షేత్రము "కుళిత్తలై". ఆగ్రామమున బాలకుచాంబా సమేతుడైన నీలకంఠేశ్వరుని, బ్రహ్మాది దేవతలతో నుతింపబడు

వానిని ఎల్లప్పుడు సేవించుచున్నాను. కదంబవనమునకు నాథుడైన వానిని, కావేరీ తీరమున, ఉత్తరాభిముఖముగా, ఐదు ముఖములు గలవానిని, దక్షిణ కాశీపురవాసుని, మన్మథుని, త్రిపురాసురుని దండించిన వానిని, దక్షయాగమును హరించిన హరుని, దయకు ఆకారమైన వానిని, కేదారగౌళ రాగప్రియకరుని నేను సేవించుచున్నాను అని ప్రార్థించిరి.

ఒక కళ చౌకం

ప॥ ని స్స నీ - దపమగ । రిగ - రి స ని స రీ । సా - నిధపా ।
నీ - - లక ం - ఠం భ జే - - - హం సతతం
నీ - స రి మ గ । రీ - మప నీ ‖ (2) సారిసనీ - దపమగ ।
నీ ర జా - స నా ది నుతం ‖ నీ - - - లకం -
రి గ - రి ని స రీ । సా - సా సా ‖
ఠ ం భ జే - - హం - - ‖

అ॥ మా - మగ స రి । మ ప - మప పా । మా - ప ని ద ప ।
బా లకు చాం బా - సహితం బా ల చం ద్ర
ని సం - ని సా , | ని ని - ని సం రి గ రీ । సం సం - సం ని ద ప ।
సే - వి తం | శ్రీ - అ గు రు - గు హపూ - జి త ం
సా - ని ద ద ప । మగ - రీ పమ పని ‖ సారిసనీ ‖
(శ్రీ) క దం బ వన నా - - థం ‖ నీ - - - ‖

చ॥ రీ - గా రి మ పా । ప మ - గ రి గ రి । స్రీ - సా రీ ।
అ క్ష య - రూ పా - - ఖ ం డ కా వే రీ

సా - స ని ధ ప | నీ - స రి రీ | రి మ - గ స రీ |
తీ రో - - త్త | శా భిముఖం ప ం చముఖం

ని ద - ప మగా | గా - రి మ గ స | సమ - మాగ స |
ర - క్షిత భ క్త ప్రముఖ ం | న - క్ష త్రే -

రి మ - పమపా | ప మ - పా స ని దప | నిస - స ని స రి |
శ శే - ఖరం నా - మ రూ - - ప విచి - త్రత ర

నీ - స రి రి రి | మగ - రీ సా | సా - ని ని ద ప |
ద క్షతర మీా - శ్వ రం కే దా ర గౌ - శ

ప మ - గారి క రిస ||
- ప్రి యక - రం ||

మ॥సా॥ రీ ప మ - గారి గరిమపా | మాపప - నీ ద ప ని ని సా |
దక్షిణ కాశీ - - పురం దం డిత కామ - త్రిపు రం |

నీ సా - గ రి స సా ని ద ప | స సా ని -
ద క్షా ధ్వర హరంహ ర ం ద యాక

ద ప మ గ రి మ ప ని || నీల ||
ర ం క మ ల క ర ం

చి॥ సా ని ద - పా మ గ రిగరిస | నీ ధ ఫ - ఘ ఫ ని స రిమగరి |

మాపని - దప మపని సరిరి | మగగరి - సనిదప నినిసా |

నీ స రి - మాగరి గారిస | నిసరిగ - రిససరి సనిదప |

రిసాని - దపమగాగరిస | నిసారి - మపనిసారిగరి ॥సారిసనీ॥

## 304

## నాదనామక్రియ త్రిపుట

15 వ మేళకర్త. స రి మ గ మ ప ద ని
ని ద ప మ గ రి స

ప॥ నీలకంఠాయ నమోనమస్తే । నిఖిలాగమ సన్నుత వరాయ ।
నీరజాసనాది పూజితాయ ॥

అ॥ పాలిత దాసజన ముకుందాయ । పన్నగ భూషణాయ ॥

చ॥ బాలార్క శశి వహ్ని నేత్ర ధరాయ ।
బాల గురుగుహ సేవితాయ ।
బాలకుచాంబా సహవాసాయ ।
బాల గీర్వాణ కీర్తన నామక్రియ మోదితాయ ।
శ్రీనాథ చిదానంద సహితాయ । దక్షిణ కాశీ స్థితాయ ॥నీల॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. ఇది దక్షిణ కాశీక్షేత్రమగు 'కుళిత్తలై' యందలి, నీలకంఠుని కొఱకు నమస్కారము. బాలకుచాంబా సహవాసునికై మొదలగు విశేషణములతో కీర్తించిరి.

## 305

## శంకరాభరణం ఝంపె

29 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ దక్షిణామూర్తే, విదళిత దాసార్తే ।
శ్రీచిదానంద మూర్తే, సదా మానికీర్తే ॥

అ॥ అక్షయ సువర్ణ వట మూలస్థితే । రక్షమాం ।
సనకాది రాజయోగిస్తుతే ॥

మ॥సా॥ రక్షిత సద్భక్తే । శిక్షిత దుర్యుక్తే ।
అక్షరాసుర క్తే । అవిద్యా విర క్తే ।

చ॥ నిఖిల సంశయ హరణ నిపుణతర యుక్తే ।
నిర్వికల్ప సమాధి నిద్రా ప్రసక్తే ।
అఖండైకరస పూర్ణారూఢ శక్తే ।
అపరోక్ష నిత్య బోధానంద ముక్తే ।

మ॥సా॥ సుఖతర ప్రవృత్తే । స్వాజ్ఞాన నివృత్తే ।
స్వ గురుగుహోత్పత్తే । స్వానుభోగ తృప్తే ॥దక్షిణా॥

వ్యా॥ సంబోధన ప్రథమ. తిరువారూరు నందలి దక్షిణా మూర్తీ! దాసుల ఆర్తిని పోగొట్టువాడా! చిదానందమూర్తీ! అక్షయమైన బంగారు వటవృక్ష మూలయందున్న వాడా! నన్ను రక్షించుము. ఈకృతియందు అంత్యప్రాసలు, భక్తే, యుక్తే, రక్తే, విరక్తే మొదలగునవి రక్తిని కలిగించునవి. మరియు శంకరాచార్య విరచిత "విశ్వందర్పణ దృశ్యమాన నగరీ" స్తోత్రమందలి దక్షిణా మూర్తి ఈ రూపమున గోచరించునట్లు వర్ణించిరి.

# 306

## సుమద్యుతి ఆది

57వ మే. జన్యము. సంపూర్ణం.

ప॥ నీలాచల నాయకం భజేஉహం । నిఖిలలోక జగత్ప్రసిద్ధేశ్వరం ॥

అ॥ నీలాంబికా మనోల్లాసకరం। నిరంతరం, భక్త వశంకరం ॥

చ॥ ఇంద్రనీల పర్వతస్థిత ప్రసిద్ధం । ఇంద్రాది పూజిత వరప్రదం ।
మాధవాద్యమర బృంద సన్నుతం ।
మానిత గురుగుహ వందిత వరదం ॥

మ॥సా॥ చంద్రశేఖరం, కృపాకరం । గంగాధరం, శూలాది ధరం ।
అర్జున తపోమహిత పాశుపతాస్త్ర ప్రదం ।
త్రిపురాంతకాది హరం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. నీలాచల నాయకుని, అన్ని లోకములయందు ప్రసిద్ధిగన్న ఈశ్వరుని, నీలాంబికకు ఆనందము కలిగించువానిని, ఇంద్రనీల పర్వతమున ఉన్నవానిని, అర్జునుని తపోమహిమచే పాశుపతాస్త్రము నొసగిన వానిని, నేను భజించుచున్నాను. నీలాచలము, నీలగిరి, ఇంద్రనీల పర్వతము, ఇంద్రకీలాద్రి పర్వతము. ఇంద్రకీలాద్రి విజయవాడలో కృష్ణానదీ తీరమునగలదు. ఆపర్వతముపై అర్జునుడు తపముచేసి పాశుపతాస్త్రసిద్ధి గాంచినట్లు స్థలపురాణమున గోచరించుచున్నది, సుమద్యుతిని, సింహేంద్ర మధ్యమ మందురు.

## 307

### కిరణావళి ఖండజాతి ఏకతాళం

21 వ మే. జన్యం. స రి గ మ ప ద ని స
స ప మ గ రి స

ప॥ పంచభూత కిరణావళిం । చంద్రమౌళిం, భావయామి ।
గురుగుహ తాతం । సతతం ॥

అ॥ పంచీకృత. పంచాతీత, మగణితం ।
ఫణిరాజాభరణం । పల్లవ జయచరణం ॥

మ॥సా॥ వాంఛిత ఫలప్రదం । బృహన్నాయకీశం ।
బృహదీశం, జగదీశం । స్వయంప్రకాశం ॥

వ్యా॥ ద్వితీయ. తంజావూరునందలి బృహదీశునిపై, పంచభూత కిరణావళిని, చంద్రమౌళిని, గురుగుహుని తండ్రిని ఎల్లప్పుడు

భావించుచున్నాను. బృహన్నాయకీశుని, పంచీకృతమనగా, పంచ భూతములు, తద్గుణములు, వానికై ఏర్పరచబడిన ఇంద్రియాదులు మొదలైన శివాది 36 తత్వస్వరూపుని, అని పంచముఖములుగల పరమేశ్వరుని, పంచాతీత శక్తిమయుని వర్ణించిరి. కిరణావళి రాగనామమును కూర్చిరి.

## రెండు కళల చౌకం

ప॥ పా ద పా మ మపగరి గా । రి సా సా ద పమ ప గ రి స ।
పంచ భూ త కి -ర- ణా వళిం. చంద్ర- మా- - ళిం
ధాధ నీ స గ గ గ రి । సా స్రీ సా నిి సా, ॥
భావయామి గురు గుహ తాతం స త తం

అ॥ ప మ పా గ రీ స పా । దా ప ద మ మప గ రి సా ।
పం చీ కృత ప్రపం చాతీ - త మ- గ ణి తం
ప ద నీ సా గ గ రీ । స నిి ప ద మ ప గ రి సా ॥
ఫ ణిరా జా భ రణం ప - ల్లవ జ యచ రణం

మ॥సా॥ సా నిి స ప మాప దా ని సా రీ గ రి రి సా ।
వాంఛి త ఫ ల ప్రదం బృహన్నాయకీ - శం
ప ద పా మా ప గ రీ సా నిి సా రి మాప మ ॥ పంచ ॥
బృహదీ శం జ గ దీశం స్వయంప్రకా శ ం

## 308

## పూర్వవరాళి రూపకం

ప॥ పరమేశ్వరేణ పాలితోఽస్మ్యహం ।

ప॥చ॥ పరమదయాకర గురుగుహ వరేణ ।
పార్వతీ మనోల్లాస కరణేన ।
పరమ శాంతస్వరూపాత్మేన ।
పూర్వవరాళి రాగనుతేన ॥

వ్యా॥ తృతీయా విభక్తి. పరమేశ్వరునిచేత పాలింప బడితిని, పరమదయగల గురుగుహశ్రేష్ఠునిచేత, పార్వతీ మనస్సునకు ఆనందము కలిగించువానిచేత, పరమశాంత స్వరూపునిచేత, పూర్వ వ రాళి రాగముచే నుతింపబడువానిచేత పాలింపబడితిని ఈపూర్వవరాళి రాగమును పండితులు గమనించగలరు

## 309

## నాట రాగం ఆది

36 వ మే. జన్యం. స రి గ మ ప ద ని స
స ని ప మ రి స

ప॥ పరమేశ్వర, జగదీశ్వర ,శంకర ।
పాహిమాం ప్రణతార్తిహర ॥ శ్రీ ॥

అ॥ పురహర, మృగధర, సుందరేశ్వర । ధర్మసంవర్ధనీ మనోహర ।

చ॥ పంచనదీశ్వర, గంగాధరేశ్వర ।పన్నగాభరణ, భక్తజనావన ।
పంచ బ్రహ్మహత్యాది పాపహర ।
పరశివ తత్వార్థ బోధిత చతుర ।

పంచనద క్షేత్రప్రభాకర । పాలితగురుగుహ, భవభయహర ॥
పంచక్షేత్రపాలవినుత చరణ ।
విచిత్ర యమ భయాది నివారణ ॥

వ్యా॥ సంబోధన. పంచనదక్షేత్ర మని ప్రసిద్ధిగాంచిన, "తిరువయ్యారు" క్షేత్రమందున్న, ధర్మసంవర్ధనీ సమేతుడైన, ఓపంచ నదీశ్వర! పరమేశ్వర! నన్నురక్షించుము. పంచబ్రహ్మహత్యలు, సురాపాన, సువర్ణస్తేయ, గురుతల్పగ, గోహత్యలు 4. వీరితో స్నేహ మొనర్చువారు 5వ పాపులు. ఈపాపములను హరించువాడా! రక్షించు మని కొనియాడిరి.

## 310

### శివపంతువరాళి ఆది

45వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ పశుపతీశ్వరం, ప్రణౌమి సతతం ।
పాలితభక్తం, సదా భజేఽహం ॥
అ॥ పశ్చిమ కాశ్మీర రాజవినుతం । పన్నగాభరణధరం, సుశోభితం ।
చ॥ పాకశాసనాది దేవబృందం । పంచాననం, ప్రణత మునిబృందం ।
పరశివ తత్వబోధితానందం ।
వర గురుగుహనుతం, సోమాస్కందం
శోకహరం, శుభఫలప్రదకరం ।
పరశు మృగధరం, శూలాదిధరం ।
శుకశౌనకాది పోషితం । శివపంతువరాళి
రాగప్రియ మతిచతురం ।

వ్యా॥ ద్వితీయా విభక్తి. పశుపతీశ్వరుని ఎల్లప్పుడు నమస్కరింతును. భక్తులను పాలించువానిని ఎల్లప్పుడు సేవింతును. పశ్చిమ

కాశ్మీరరాజవినుతుని, "నేపాల్" లో పశుపతీశ్వరాలయము ప్రసిద్ధము. కాశీలో విశ్వేశుడు ప్రసిద్ధుడు. ఆపేరుతో ప్రతిష్ఠింపబడిన క్షేత్రములకు, ఆయా క్షేత్రనామములు కలుగుట సహజము. దక్షిణకాశి, దక్షిణకాశ్మీరము, దక్షిణగోకర్ణము మొదలైన నామములు. అటులనే ఈకృతిని రచించియుందురు. పశ్చిమ దిక్కునగల కాశ్మీరరాజుచే వినుతిగన్న వానినియని, ఐదు ముఖములు గలవానిని, శివపంతువరాళి రాగము ప్రియమైనవానిని సేవింతును అని కొనియాడిరి.

## 311

## మంఖారి రాగం ఆది

22 వ మే. జన్యం. స రి మ ప ద ని ద స

స ని ద ప మ గ రి స

ప॥ పాహిమాం, రత్నాచలనాయక । భక్తజన శుభప్రదాయక ॥

అ॥ మోహజాలార్ణ రాళ కేళీ వరభవ ।
ముక్తిప్రద, నతవిరించి, మాధవ ॥

మ॥సా॥ రోహిణీశ, రవి, వహ్నినయన, భవ రోగ హరణ ।
నిపుణతర చరణ , పాహి శివ ॥పాహిమాం॥

చ॥ సద్యోజాతాది పంచముఖారిషడ్వర్గ రహిత హృత్సంచార ।
విద్యోదయ, వియదాది ప్రపంచ । వికల్పాతీత తత్త్వవిచార। అ
విద్యాత్మక శ్రీచక్రాకార । విచిత్ర నవరత్న గిరివిహార ।
గద్యానువిద్ధ పద్యాది వినుత । గంగాధరాగమసార ॥

మ॥సా॥ అద్యాప్యార్యవంశ జాత । తుర్యజాతి భృతాఖండ కావేరీ ।
నద్యుదకాభిషిక్త శరీరనాది గురుగుహ కుమార మారహర॥

వ్యా॥ సంబోధన. "కుళిత్తలై" క్షేత్రము కావేరీ తీరమున, రత్నాచల సమీపమున గలదు. ఓరత్నాచల నాయకా! భక్తజనులకు శుభములనొసంగువాడా! నన్ను రక్షించుము. మోహాసమూహాముల తుమ్మెదలవలె నల్లనైన వెండ్రుకలుగల పార్వతీపతీ! బ్రహ్మ, విష్ణువులచే నమస్కరింపబడువాడా! రోహిణీశుడు, చంద్రుడు, సూర్య, అగ్నులే నేత్రములుగా గలవాడా! సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానాది ఐదుముఖములు గలవాడా! కామక్రోధాది అరిషడ్వర్గములు లేనివారి హృదయమందు సంచరించువాడా! జ్ఞానమొసగువాడా! ఆకాశాది పంచభూతములచే నిర్మించబడిన ప్రపంచాతీతమైన తత్వవిచారా! అని అనేక అద్వైత, తత్వవిశేషణములతో కొనియాడిరి. ముఖారిషడ్వర్గ అని రాగనామమును కూర్చిరి. మరియు అజ్ఞానరూపమైన శ్రీచక్రస్వరూప! నవరత్నగిరిపై విహరించువాడా! గద్య, పద్యములచే వినుతింపబడు గంగాధరా! అనాదినుండి ఆర్యులచే, చివరిజాతివరకు అందరిని పోషించే అఖండ కావేరీనదియొక్క ఉదకములచేత అభిషేకించబడిన శరీరముగలవాడా! అని కొనియాడిరి.

రెండు కళల చౌకం

ప॥ పా,ని ద ప మ పమగరీ సనినిధ । సా రి మ । పా, మ ని దనీ
పా -హి - మాం - -- ర- -- త్నాచల నా - య- క

దపదస నినిదప మగరిస ని నిధధ । స రిప మ గ రి । రిగ ససా
భ--- క్త- జ- న --- శు-భ- ప్ర-దా- - య క- --

అ॥ పా దని ద పా మ గ గ రిమా । పా పనిదద । సస సస
మో-- హజా లా - రా- ళ కే శీ- -- వరభవ

సా రి గ రీ స నిదా పనిదమ । పనీ ద । దా , స స స
ము - - క్షి ప్ర- ద న-త - విరించి మా - ధ వ

మ॥సా॥ ని ద స రీ మ గ రి రి రి స ని ద ప ద రి ।
రో-హిణీ శ ర వి వ -హ్ని న యన భ వ

సా ని ని ద ప ని ద । ప మ గ రి గ స రి మ ॥
రో గ హ ర ణ ని పు ణ త ర చ ర ణ శి వ ॥

చ॥ రి రి పా మ గ రి గ । సరిమమ । మాగమ గరి । రి రి మా ప
స- ద్యో జా - తా- దిపం చ ముఖా- -రి । ష - డ్వ ర్గ

నిదని ద నీ । దా స్సని దా , ప । మ పమద పా । పప ప మపా
ర-హి - త హృ-- త్సం - చా- - - ర । వి- ద్యో -- -

ద ప పమమా । ద పదద పా । మపమగ రిస । రినిదా ధ సా రి
దయ వి- య దా- - - ది ప్ర-పం -చ । వి-క - ల్పాతీ

రిగసా । రిమ ప నిదప । మ పదప పమగరి । ససనా ని దనిద నీ ।
-- త త- త్వా- వి- చా- -- ర- -- । అవిద్యా త్మ-క- శ్రీ

దాస్సని దా , ప । మ పమద పా । మపాస సనిదా మా ।
చ -- క్రా - కా - -- ర । వి చిత్ర న- వ ర

మ ని నిదదా । సా , స । స ద సా రి గరిగగరీ । సా ని దదా ।
త్నగి రి - వి హా ర । గ - ద్యాను వి-- -ద్ధ ప ద్యా- -

పమప ద రి । సా , ని ని దప ప మపని । ద ప మపమగ ।
దివిను త - । గం గా - -ధ రా- -- గ మపా- - -

రీ రి గ సా ।
ర - - - ।

మ॥సా॥ సాసా పా , ప గా రిమాపనీ । ద సాం రి రి నీ ద ।
అద్యావ్యా ర్య వంశజా తతు ర్యజా తిభృతాఖం

పమప దసారీ | మాగా రి సాని దపదమపదసస ।
-డ కా-వే రీ | న ద్యోద కాభి షి- - క్తశరీ-ర

పా నిద ప మగ రి । సా స మ రిమప ని || పాహి ||
నా దిగురుగుహ కు మార మా- రహ ర ||

# 312

## హంసధ్వని ఆది

29 వ మే జన్యం — స రి గ ప ని స / స ని ప గ రి స

ప॥ పార్వతీపతిం ప్రణౌమి, సతతం ।
ఆశ్రితజన మందారం, శశిధరం ॥

స॥చ॥ పర్వతరాజనుత పదాంబుజం । భద్రపద కైలాస విరాజం ।
గర్వితత్రిపురాది హరచతురం ।గురుగుహవర్ధిత శివశంకరం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. పార్వతీపతిని, ఆశ్రిత జనుల కోర్కెలు దీర్చు మందారుని, చంద్రుని ధరించినవానిని, ఎల్లప్పుడు నమస్కరింతును. పర్వతరాజైన హిమవంతునిచే నుతింపబడిన పాద పద్మములుగలవానిని, త్రిపురాసురాదులను హరించినవానిని నమస్కరించుచున్నాను.

# 313

## భూషావతి ఆది

64 వ మే. జన్యం. స రి గ మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ పార్వతీశ్వరేణ రక్షితోఽహం । పరమార్థ తత్వబోధిత శివేన ॥

అ॥ పర్వతరాజాత్మజా రమణేన । భక్తజనావన గురుగుహనుతేన ॥

చ॥ గంగాధరేశ్వరేణ, వరేణ । గాంధర్వ సేవిత పదాంబుజేన ।
సూర్యచంద్రాగ్నినయన విలాసేన ।
కార్యకారణాత్మక ప్రవృత్తేన ।
పంకజాసనాద్యర్చిత పదేన । పరమశాంత స్వరూపాత్మకేన ।
సంకటహరణేన, సదాశివేన । నిత్యశుద్ధబుద్ధ ముక్తేన ॥పా॥

వ్యా॥ తృతీయా విభక్తి. పార్వతీశ్వరునిచేత రక్షింపబడితిని. పరమార్థతత్వమును బోధించిన శివునిచేత, గంగాధరునిచే, పార్వతీ రమణునిచే గురుగుహ నుతునిచే మొదలగు విశేషణములచే కీర్తించిరి. ఈకృతి రాగమును భూషావళి యనికూడ అందురు.

# 314

## కన్నడ రూపకం

29 వ మేళకర్త. స గా మ ద ని స
స దా ప మ గ మ రి స

ప॥ పాలయమాం పార్వతీశ । భక్తజనావన, జగదీశ ॥

అ॥ మలయధ్వజ పాండ్యరాజ పూజిత పంకజ చరణ ।
వల్లభేశ, గురుగుహ శివసూనో । భవరుహర నిపుణ ॥

చ॥ గానామృత రసపాన । కలికల్మష వినాశన ।
సనకాది ముదిత శంభో । సదానంద, స్వయంభో ॥

వ్యా॥ సంబోధన. పార్వతీపతే! నన్ను రక్షించుము. పాండ్య దేశమును పాలించిన మలయధ్వజునిచేత పూజింపబడిన పాదపద్మము గలవాడా! వల్లభేశ = గణపతి, గురుగుహ = కుమారస్వాములు కుమారులుగా గలవాడా! మొదలగు విశేషణములతో వర్ణించిరి.

## 315
## నాయకి ఆది

22వ మేళకర్త. స రి మ ప ద నీ ద ప స
స నీ ద ప మ గా రి స

ప॥ ప్రణతార్తిహరం, నమామి, సతతం ।
పంచనద క్షేత్ర ప్రకాశితం ॥

అ॥ గణనాయకాది సకల సురనుతం ।
గీతవాద్యాది ముదిత మనంతం ॥

చ॥ వసంతఋతు మేష మాసోత్సవం । వీరక్షేత్రపాల ప్రభావం ।
వాసుదేవ నత సప్తస్థావం । విచిత్ర యమ భయాది నివారణం ।
వాసుకి కర్కోటకాది ధారిణం । వర ధర్మసంవర్ధనీ రమణం ।
దాసజనాది ధనధాన్యప్రదం । ధీరతర గురుగుహ పూజితపదం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. నమస్కరించిన వారి ఆర్తినిహరించు వానిని, పంచనద క్షేత్రమందున్న వానిని, పంచనదక్షేత్రము = తిరువయ్యారు, వసంతఋతువున, మేషమాసమున ఉత్సవము జరిపించుకొను వానిని, వీరభద్రుడు క్షేత్రపాలకుడుగా నున్న వానిని, వాసుదేవుడు = శ్రీకృష్ణునిచే నమస్కరింపబడిన "సప్తవిడంగత్యాగర్"

క్షేత్రములలో నొకటైన స్థానమందున్నవానిని, వాసుకి, కర్కోటకుడు మొదలగు ఉత్తమ సర్పరాజములను ధరించినవానిని, ధర్మసంవర్ధనీ రమణుడైన పంచనదీశ్వరుని ఎల్లప్పుడు నమస్కరించుచున్నాను. గణనాయకాది = యని రాగనామమును కూర్చిరి.

## 316

### వసంత రాగం ఆది

ప॥ మరకత లింగం చింతయేఽహం ।
మాణిక్యవల్ల్యంబా సమేతం ॥

అ॥ గౌరీ వల్లభ గణేశ సన్నుతం ।
గురుగుహ పూజిత వృషారోహితం ॥

చ॥ మహాబిల్వవన మధ్యవిహారం । మాలాకపాల శూలాది ధరం ।
మహనీయ సామ్రాజ్యాది ప్రదం ।
మానిత వైశ్రవణాది వరదం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. మరకతలింగ రూపుని, మాణిక్యవల్లీ సమేతుని, గొప్పదైన బిల్వవన మధ్యయందు విహరించు వానిని, కపాలమాలను, శూలము మొదలైన ఆయుధములు ధరించిన వానిని, చింతించు చున్నాను.

## 317

### ఫరజు రాగం ఆది

15 వ మే. జన్యం. స గా మ ప ద స స
స ని ద ప మ ద ప మ గా రి స

ప॥ మహాలింగేశ్వరం । మధ్యార్జున మహాలింగేశ్వరం నమామి ॥

స॥చ॥ మహా బ్రహ్మహత్యాది పాపహరం ।
కాలహరం, పురహరం, శంకరం ।
బృహత్కుచాంబా రమణం, గురుగుహాంతఃకరణం ।
భవభయ హర నిపుణం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. మధ్యార్జున క్షేత్రమందున్న మహా లింగేశ్వరుని, గొప్పదైన బ్రహ్మహత్యాది పాతకములను హరించు వానిని, బృహత్కుచాంబా రమణుని నమస్కరించుచున్నానని కొనియాడిరి.

## 318
## దేవమనోహరి ఆది

22వ మే. జన్యం. స రి గ మ రి మ ప ద ని స
స ని ద ని ప మ రి స

ప॥ మహాదేవేన పాలితోఽస్మ్యహం ।
మహనీయ సామ్రాజ్యప్రదేన ॥

అ॥ మహా కైలాసగిరి విహారేణ ।
మానిత గురుగుహ సన్నుత పదేన ॥

చ॥ పంచాక్షర మంత్ర స్వరూపేణ । పార్వతీ మనోల్లాస కరణేన ।
పరశివ తత్త్వబోధన నిపుణేన । పరమ శాంత స్వరూపాత్మకేన ।
పంచభూత ప్రపంచాత్మకేన । వాంఛిత ఫలప్రద చతుర తరేణ ।
పంచ మహాపాపోపశమనేన । పంకజాసన నుత గంగాధరేణ ॥

వ్యా॥ తృతీయా విభక్తి. మహాదేవుని చేత నేను పాలింపబడితిని, కైలాసగిరి యందు విహరించువానిచేత, నమశ్శివాయ యను

పంచాక్షర మంత్రరూపునిచేత, పంచభూతమయమైన ప్రపంచరూపుని చేత, పంచ మహాపాతకములు పోగొట్టు వానిచేత పాలింపబడితిని. మహాదేవుడను నామం ఒక్క శంకరునకు గలదు.

## 319

### కాశీరామక్రియ త్రిపుట

51 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ మార్గ సహాయేశ్వరం, భజేఽహం ।
మరకతవల్లీ మనోల్లాస కరం ॥

స॥చ॥ దుర్గా లక్ష్మీ భారతీభిః పూజితం ।
దీనజనాది బృంద సేవితం ।
దీర్ఘాయుష్ప్రద కృపాలవాలం । నిర్గుణరస పూర్ణశరీరం ।
నిత్య గురుగుహానంద వరం । విరించి పుర మధ్యవిహారం,
వీరసింహోప తీర్ధకరం ॥మా॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. మధ్యార్జున మండలి విరించిపురమందున్న మార్గసహాయేశ్వరుని, మరకతవల్లీ, మనోల్లాస కరుని నేను సేవించుచున్నాను. దీర్ఘాయువు నొసంగువానిని, దుర్గ, లక్ష్మీ, సరస్వతులచేత పూజింపబడు వానిని సేవించు చున్నాను. అని వర్ణించిరి. కాశీరామక్రియ = కామవర్ధని రాగము ఒక్కటే.

## 320

### ఆరభి రాగం జంపెతాళం

29 వ మే. జన్యం. స రి మ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ మారకోటి కోటి లావణ్య, మాం పాలయ ।
ధీరాగ్రగణ్య, వాసుకీవలయ ॥

అ॥ దారుకావన తపోధన తరుణీ మోహాకార భిక్షాటన
వేషధర, శంకర ॥మా॥

చ॥ విరక్తానాం, విదేహ కైవల్యదాన।
విచక్షణ భక్తానామభయప్రదాన।
విరించ్యాది సకల దేవోపాస్యమాన।
విభూతి రుద్రాక్షాభిమాన!

మ॥సా॥ పరశు, మృగాగ్ని, కపాల, డమరుకం దధాన।
పరమాద్వైత తాత్పర్యానుసంధాన।
పరవామదేవాద సకల విరాజమాన।
పరమేశ్వర గురుగుహ సమాన ॥మారకోటి॥

వ్యా॥ సంబోధన. కోటికోటి మన్మథుల లావణ్యము గలవాడా! నన్ను పాలించుము. దారుకావనమున మునులను, స్త్రీలను మోహింపజేయు ఆకారముతో భిక్షుకవేషమును ధరించిన వాడా! విరక్తులకు దేహము ఉండగనే కైవల్యముక్తి నొసగువాడా! శంకరా! నన్ను పాలించుము. ఇందు "మోహాకారభిక్షాటన" అని ఆరభి రాగనామమును కూర్చిరి.

## 321

## గుండక్రియ రాగం త్రిపుట

15వ మేళకర్త. స రి గ రి మ ప ని స
స ని ప ద ప మ గ రి స

ప॥ రాజరాజేంద్ర చోళ ప్రతిష్ఠితం। బృహదీశ్వరం, భజరే॥

అ॥ రాజాధిరాజ సమర్చితం। రమణీయ హృదయ విరాజితం।
రాజీవలోచన గురుగుహ రంజిత గుండక్రియా ప్రియం॥

మ॥సా॥ రాజరాజేంద్ర చోళధరం । రాజధరం, బృహదీశ్వరం ॥భజ॥

వ్యా ద్వితీయా విభక్తి. తంజాపూరునందలి బృహదీశ్వరుని, రాజరాజేంద్రచోళ భూపతిచే ప్రతిష్ఠింప బడినవానిని, భజించుము. గుండక్రియారాగప్రియుని, రాజధరం = చంద్రుని ధరించిన వానిని భజించుమని కొనియాడిరి.

ఒక కళ చౌకం

ప॥ పాప - ప మాగ గ గ । రి స ధ - రీ గరిమగమా ।
రాజ రా- జేంద్ర చో- ళ ప్రతి-ష్ఠి- తం

ద ప మ - గరి గా । మరిస - సస స రిగమ |
బృహదీ -శ్వరం భజరే -- శ్రీ- - -

అ॥ రీ గ - గమద ప। మగరి - రిగ మా । పద స ని - పమ రి గ।
రాజా -ధి రా- జ సమ -ర్చితం రమ ణీ- -యహృద

మ దప - మగరీ | సారి - రిమగా । మదప - స ని ప మ ।
య విరా - జితం| రాజీ -వ లో చ నగు రుగుహ ర

రిగమ - ద పమగ । రి సా - సాద ప మా |
ంజిత కుండ- క్రియా - ప్రి- యం |

మ॥సా॥ పాపమాగ - గగ రీ సధ రీ । గారిమగా -
రాజరా జే ంద్రచోళధ రం రాజధరం

గ మ ద ప మ గ రి స ||
బృహ దీ - శ్వరం భజ || రాజ ||

# 322

## కాశీరామక్రియ రూపకం

51 వ మే. జన్యం.

ప॥ రామనాథం భజేఽహం । రామచంద్ర పూజితం ॥

అ॥ కామితఫలప్రదదేవం । కోటితీర్థప్రభావం ।
కుమారగురుగుహ మహితం । కపి బృందాది సన్నుతం ॥

చ॥ సేతుమధ్య గంధమాదన పర్వత విహారం ।
సదా పర్వతవర్ధనీ మనోల్లాసకరం ।
హస్తామలకనతవరం । హాటకమయహార ధరం ।
హత్యాది పాపహరం । హంసస్సోహాకారం ॥రామ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. రామేశ్వర క్షేత్రమందున్న రామనాథస్వామిని, రామచంద్రునిచే పూజింపబడిన వానిని, సేతు మధ్యయందు, గంధమాదన పర్వతవిహారుని, పర్వతవర్ధనికి ఆనందము కలుగజేయువానిని, నమస్కరించినవారికి అరచేతిలోని ఉసరిక ఫలము వలె వరములిచ్చువాడు, బంగారు హారములు ధరించినవానిని, బ్రహ్మ హత్యాది పాపములు హరించువానిని సేవించుచున్నాను. హంసస్సోహా కారుని = అనగా మహన్యాసమందు శ్లో॥ గమాగమస్థంగగనాది శూన్యం । చిద్రూప దీపం, తిమిరాపహారం । పశ్యామి తే సర్వజనాంత రస్థం । నమామిహంసం, పరమాత్మరూపం ॥ అనినవిధముగా, అసలు శివమనగా, మంగళప్రదము. ప్రపంచమున ప్రాణమున్న ప్రతివస్తువు శివము, ప్రాణములేనిది శవము. గాన ప్రాణవాయు స్వరూపుడు శంకరుడు. మనము పీల్చుగాలి "సో", విడుచుగా లి "హం" మరియు సః = అహం = సోఽహం. ప్రపంచమునకు ఆధారమైన పదార్థము, సృష్టి, స్థితి, లయలు చేయునది యెవరో, అదే ! ఆ వస్తువే నేను.

అద్వైత సిద్ధాంతము. దీనిని శివతత్త్వమునుగూర్చి ఇలా వర్ణించారు.

శ్లో॥ వాయుభూతం, ప్రాణరూపం । శబ్దస్పర్శ గుణాన్వితం ।
రుద్రం, హరం, మహాదేవం । పూజయామి సదాశివమ్ ॥

ఈవిధముగా రామనాథేశ్వని సగుణ, నిర్గుణ తత్వమును వర్ణించిరి.

## 323

## రుద్రప్రియ రాగం రూపకం

22 వ మే. జన్యం. స రి గ మ ని స
స ని ప మ గా రి స

ప॥ రుద్రకోపజాత వీరభద్రమాశ్రయే । సదా హృదయే ॥

అ॥ భద్రకాళీరమణం । భవహరణం ।
భద్రప్రదాన నిపుణ చరణం ॥

మ॥సా॥ రుద్రాక్షమాలికాభరణం ।
క్షుద్రాది నివారణం । భక్తభరణం ॥ శ్రీ ॥

చ॥ విజితవిధి, హరి, హరిహయం । వీరాధివీర మభయం ।
రజత పర్వతాశ్రయం । రవి, విధు తేజోమయం ॥

మ॥సా॥ గజముఖ గణేశ రక్షం । అజవదన దక్ష శిక్షం ।
నిజరూప దానదక్షం । నిజ గురుగుహ స్వపక్షం ॥రుద్ర॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "తిరువేంగాడు" పట్టణమందున్న రుద్రుని కోపమునందుద్భవించిన వీరభద్రుని, ఎల్లప్పుడు నాహృదయమందు ఆశ్రయించితిని. భద్రకాళీ భర్తను, బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులను జయించినవానిని, మేకముఖము కలుగునట్లు దక్షుని శిక్షించిన

హానిని, ఆశ్రయించితిని. ఇందు దాక్షాయణి, దక్షప్రజాపతి చేయు రుద్రరహిత యాగమున, శరీరము చాలించగా, అదివినిన రుద్రుడు కోపముతో ఒక జటను పెరికి నేలపై కొట్టగా, ఉద్భవించినవాడు వీరభద్రుడు. గాన, ఈచరిత్రనంతను సంగ్రహముగా ధ్వనించునట్లు విశేషణములతో, రుద్రునకు ప్రియమైన వీరభద్రుని, రుద్రప్రియ రాగమున కొనియాడిరి.

ఒక కళ చౌకం

ప॥ సా- నీ ని స ని ప । మగ- రిగమగ రిమ । పా- స ని ప మ గ ।
రు ద్రకో- -ప జా- త-వీ - -ర భ ద్ర- మా- శ్రి

గ రిరీ - సా సస | గ గస - గా రి మ ప ద నీ |
యే-- - -స | దా-- హృద - యే - - |

అ॥ పా - మ ని ని గా । రిగ మపమా పా । పద - ద ని పమా ।
భ ద్ర కా- - ళీ- ర -మ ణం భవ హ- ర ణం

పద - ని స ని ప | స ని- గ రి స ని ప మ । పద- నీ సా ||
భ- ద్ర- - ప్ర | దా- న - ని - పుణ చర ణం ||

మ॥సా॥ సా ని ని - నిప మా,నిగా । మగమా । మాగారినిగా ।
రుద్రా- -క్షమా లికా భరణం క్షుద్రాదినివా

రిమాప - పమపదని స గ రి |
రణం భ - క్తభరణ ం శ్రీ- |

చ॥ మగ- రిగమగ । రి ని - రిగ మా । గా- గ రిరీ ని స ।
విజి తవిధిహ రి హ రిహయం వీ రా-- ధి వీ

ని ఫ- మపని స । రిగ- మపదని । పా- నిస్ రీ ।
- ర మభయం రజ త ప-ర్వ తా శ్ర- యం

మగ- రి ని సా । ద నిపా- మగ రిస |
రవి వి ధు తే జో- - మయం- |

మ॥సా॥ గ రి ని స- గరీ గ మామా । పమపద- ని సారి మాగ రి ॥
గ జముఖ గణేశ ర క్షం అజ వద న దక్ష శి క్షం

ని స్ నీ - పమాగగరిసా । నిసగ రి - మగా ని పాగరి ॥
ని జ రూ పదా నద-క్షం నిజగు రు గుహ స్వపక్షం ॥

## 324

# మేఘరంజని రాగం రూపకం

15 వ మే. జన్యం. స రి గ మ ని స
స ని మ గ రి స

ప॥ వేంకటేశ్వర యెట్టెప్ప భూపతిమాశ్రయేऽహం ।
విశ్వ వికల్పాపహం । విద్వజ్జన కల్పభూరుహం,
వదన సరసీరుహం ॥

అ॥ కంకశైల మధ్యస్థిత । కార్తికేయ, శివ, గురుగుహ
కరుణా కటాక్షపాత్రం ।
కంజదళాయత నేత్రం । కంకణ హార కిరీటాలంకృత
సుందరగాత్రం ।
కాంచన వృష్టిప్రద మేఘరంజిత బహుక్షేత్రం ॥

మ॥సా॥ పంకజభవ, ముఖ సురకృత సకల నిష్కళస్తోత్రం ।
సంకల్ప వికల్ప రహిత । సచ్చిదానంద మాత్రం ॥ వేం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. దీక్షితులవారిని, వారివంశీకులను, రాచమర్యాదలతో గౌరవించి పోషించిన భక్తుడు - పండితుడైన యెట్టెయపుర పాలకులైన శ్రీ వేంకటేశ్వర యెట్టెప్పమహారాజుని ఆశ్రయించితిని. ఆ మహారాజు గుణగణములు వితరణములను వర్ణించిరి. పండితులపాలిటి కల్పవృక్షముగ, కంకశైలమందున్న కుమారస్వామి, శివుల అనుగ్రహమును పొందినవానినిగ, రూపవైభవమును, బంగారు వర్షమునుకురిపించు మేఘములచే ప్రకాశించు క్షేత్రమందున్న వానినిగా వర్ణించుచూ, రాగనామమును కూర్చిరి. మరియు ఈమహారాజుచే కనకాభిషేకముల నందినవారు దీక్షితులు. గాన ఆమహారాజుని పొగడిరి. ఈకృతివలన దీక్షితులవారు, రాజపోషణ, సన్మానాదులు పొందినట్లు తెలియుచున్నది. "నిరాశ్రయానశోభంతే పండితా వనితా, లతా".

## 325

## తోడి రాగం ఆది

8వ మే. జన్యము. సంపూర్ణం.

ప॥ వేదారణ్యేశ్వరాయ నమస్తే ।
వీణావాదన విదుష్యంబికా సమేతాయ ॥

అ॥ వేదాగమవినుత వైభవాయ ।
వేదాంతార్థ తత్వబోధితాయ ॥ వేదా॥

చ॥ సురాసుర సేవిత విశ్వేశాయ ।
సుందర గురుగుహ సుపూజితాయ ।
సూర్యచంద్రాగ్ని లోచనాయ ।
పరవాసుదేవాది వందిత పదాయ ॥

మ॥సా॥ మురారిప్రభృతి దేవసమూహాయ ।
మూలకందాయ, ముక్తిప్రదాయ !
చరాచరాత్మక ప్రపంచకాయ, శంకరాయ ।
చతురతర వరాయ ॥వేదా॥

వ్యా॥ చతుర్థీ విభక్తి. నాగపట్టణమున వెలసిన, వేదారణ్యేశ్వరుని కొరకు నమస్కారము. వీణావాదనయందు ప్రజ్ఞగల, అంబికా దేవితో కూడిన వానికై, వేదాంత తత్వమును బోధించువానికై, నమస్కారమని అనేక విశేషణములతో కొనియాడిరి. ఇందు స్వామి పేరు వేదారణ్యేశ్వరుడుగాన, మూడు వేదశబ్దములు, ఒకటి వాదన శబ్దమును జేరి, నాలుగు వేదములయందు తెలియబడు వానినిగా వర్ణించిరి. 1) ఋగ్వేదము, 2) వీణావాదనవిదుషియని సామవేదమును 3) వేదాగమములని యజుర్వేదమును, 4) వేదాంత అను శబ్దము ద్వారా అథర్వణ వేదములు ధ్వనించునట్లు రచించుట గమనించదగినది.

## 326

## శంకరాభరణం ఆది

29 వ మేళకర్త.

ప॥ శం॥రాచార్యం । శ్రీమచ్ఛంకరాచార్యం ।
భక్తమనో వశంకరాచార్యం । స్మరామ్యహం ॥

(2) శ్రీశంకరాచార్యం స్మరామ్యహం ।
పంకజాత భవవేద్యం । హృద్యం,
పంకజాత భవరోగ వైద్యమాద్యం ।
శంకరాచార్యం స్మరామ్యహం ।
సద్గుణసాంద్రం । శ్రీమహాదేవ సరస్వతీ సంయమీంద్ర
చంద్రం ॥శ్రీ॥

అ॥ శంకర భగవచ్చరణాపరవర్యాం । శంకర కృపయా వర్ధిత వీర్యం॥

మ॥సా॥ శంకరాగణిత యశోధుర్యమనిశం ।
కరాబ్జ మవార్య తపశ్శౌర్యం ॥

చ॥ పరమజ్ఞాన లతాలవాలం । భవ్యతర సుమనోజాలం ।
పరమత ఖండన చండిమ శీలం । పరమాద్వైత స్థాపనలీలం ॥

మ॥సా॥ కరకలిత దండకమండలుం ।
కాషాయధరం, వినత మునిమండలం ।
వరమతి విజిత హారకుండలం ।
శుభవరదం, నత ధరాఖండలం ॥ శ్రీ ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. శైవ, వైష్ణవ, సౌర, గాణాపత్య, శాక్తేయ, అద్వైతములను షణ్మతములను స్థాపించిన షణ్మతస్థాపనాచార్యులు, పరమహంస పరివ్రాజకాచార్యులునగు ఆదిశంకరాచార్యుని గురించి, వారుచేసిన ప్రబోధములను గురించి, రూప,గుణ, గణములను శంకరాభరణ రాగమున వర్ణించిరి.

## 327
## కమలామనోహరి త్రిశ్రఏక

27 వ మే. జన్యం.
స గ మ ప ని స
స ని ద ప మ గ స

ప॥ శంకరమభిరామ మనోహరం ।
శశిధర మమృతఘటేశ్వరం, భజేఽహం ॥

మ॥సా॥ శంఖాభిషేక గాత్రం । సచ్చిదానంద మాత్రం ॥

అ॥ పంకజాసనాది పూజితాబ్జపదం ।

భక్త మార్కండేయాయుష్ప్రదం । భ

మ॥సా॥ యంకర ఘోర రూపతర యమనిగ్రహానుగ్రహం ।

పంకజముఖ గురుగుహ పరిపాలం, కృపాలవాలం ॥శంకరం॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "తిరుక్కడవూర్" నందున్న శంకరుని నేను భజించుచున్నాను. శంఖోదకముచే అభిషేకించ బడిన గాత్రము గలవానిని, మార్కండేయునకు దీర్ఘాయువొసంగిన వానిని, దయకు ఆలవాలమైన వానిని సేవించుచున్నాను అని కొనియాడిరి.

## 328

## దేవగాంధారి ఆది

29 వ మే. జన్యం. స రి మ ప ద స
స ని దా ప మా గ రీ స

ప॥ శాలివాడీశ్వరం, భజేऽహం । శాలివాడి నగర విహారం ॥శ్రీ॥

స॥చ॥ శైలసుతా కాంతిమతిలోలం ।

శోకహరధీరం, సురముని పాలం ।

వాలిపూజిత కృష్ణం, మహోత్సవం ।

విధీంద్రాది గురుగుహనుత వైభవం॥

వ్యా॥ ద్వితీయ. "తిరునల్వేలి" నగరమును "శాలివాడి"నగరమని యందురు. ఆనగరమందు, కాంతిమతీ దేవితో వెలసిన, శాలివాడీశ్వరుని నేను సేవించుచున్నాను. వానిచేత పూజింపబడిన నల్లనివానిని, అనగా నల్లని లింగరూపుని, బ్రహ్మ, ఇంద్రాదులచే పూజింపబడువానిని యని కొనియాడిరి.

# 329

## బౌళి రాగం ఆది

15 వ మేళకర్త.　　స రి గ ప ద స
　　స ని ద ప గ రి స

ప॥ శ్రీపార్వతీపరమేశ్వరౌ వందే, చిద్బింబౌ ।
లీలావిగ్రహౌ, మమాభీష్టసిద్ధయే ॥శ్రీ॥

అ॥ ఆపాద మస్తకాలంకారౌ । ఆదిమధ్యాంత రహితాకారౌ ।
సోపానమార్గ ముఖ్యాధారౌ । సుఖప్రదౌ, గంధ రసాధారౌ ॥

మ॥సా॥ లోపాముద్రేశార్చిత చరణౌ । లోభమోహాది వారణకరణౌ॥
పాపాపహ పండితతర గురుగుహ కరణౌ ।
భయహరణౌ, భవతరణౌ ॥

వ్యా॥ సంబోధన ద్వివచనము. ఓపార్వతీపరమేశ్వరులారా! చిత్ బింబాకారులారా ! లీలావిగ్రహ స్వరూపులారా ! నాయొక్క అభీష్టసిద్ధికొఱకు నమస్కరించుచున్నాను. అగస్త్యునిచే అర్చించబడిన పాదములు గలవారా ! అని "వేదారణ్య" క్షేత్రమందున్న పార్వతీ పరమేశ్వరులను వర్ణించిరి.

రెండు కళల చౌకం

ప॥ దా పా ప గా పద । గ రీ స । స ని̣ధ̣ా పద ‖
శ్రీపా ర్వ తీ ప- ర మేశ్వ రౌ- - వం ‖

సా, రీ గా పాదాసా । నీ ద పా ద గా । గారిగారిగ ప ‖
దే చి ద్బింబాలీలా వి గ్రహౌమమా భీష్ట సిద్ధయే- ‖

అ॥ గాపారిదాప । గారీ । స రి గా ॥ రీ గరీ రి స ని । సరి గా ॥
ఆపాదమ స్త కాలం కా- లా ఆ దిమధ్యాం త రహి తా

పా పా | సాధాగ రీ గ । ర్రీ సా । దాదా ॥ ప దాని దాపా ॥
కా రా | సోపానమార్గ ముఖ్యా ధారా సుఖ ప్రదాగం

ద ప గా । రీ సా ||
ధ ర సా ధారా ||

మ॥సా॥ దాపాదా రి రిసారి గపగపా । దాపదా గాప । దారి రి
లోపాముద్రే-శార్చితచరణా లోభ మోహాది వార ణ

స ని సా | పాపాపద పా గ రి స ని ద ప ద స ।
క ర ణా | పాపాపహాపం డి త త ర గురు గుహా

నిదపా ద ప గ రి । సా ధ స రి గ ద ప || శ్రీ ||
కరణా భ యహర ణా భ వ త ర ణా- || ||

# 330

## అఠాణా రాగం జంపెతాళం

29 వ మే. జన్యం. స రి మ ప దా ని స
స ని దా ప మ ప గా రి స

ప॥ శ్రీదక్షిణామూర్తిం సదాచింతయేఽహం ।
సదానంద విద్యాప్రద గురుగుహకీర్తిం ॥

అ॥ వేదాంతబోధకం, విజయచిన్ముద్రాంకం ।
నాదాంతవేదితం, నిజసనకాదినుతం ॥

మ॥సా॥ వదనారవింద వహ్నిరవి శశిలోచనం ।
వాసుదేవ కుమార మారహర నందనం ॥

వ్యా॥ ద్వితీయ. దాక్షాయణి, దక్షయజ్ఞమున తనువుచాలించిన వెనుక, శివుడు ఒంటరిగా "దక్షిణామూర్తి" రూపమున తపము చేసెను. అట్టి దక్షిణామూర్తి ఆలయము "తిరునల్వేలి" యందుగలదు. ఆ మూర్తిని ఎల్లప్పుడు ఆనంద విద్యాప్రదుడైన గురుగుహకీర్తి గల వానిని, వేదాంత బోధజేయువానివి, చిన్ముద్రను ధరించినవానిని ప్రార్థించిరి. ఎల్లవేళల చింతించెదను. ఈకృతిని చూడగా, శంకరాచార్యవిరచిత దక్షిణామూర్తి స్తోత్రం గోచరించును.

"విశ్వందర్పణ దృశ్యమాననగరీ" "వ్యాఖ్యానవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్వం యువానం" "తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే" మొదలగు స్తోత్రమూర్తిగా తెలియజేసిరి.

## 331

## దేవక్రియ రాగం మిశ్రఏక

22 వ మే. జన్యం.

స రి గ మ ని ద ని
ప ద మ గ రి స ని

ప॥ శ్రీవటుకనాథ, శివసంజాత । జీవదయాకర, డమరు భాస్వర ॥

అ॥ దేవదేవక్రియాశక్తి సహిత । భక్తవిహిత ।
భూవలయ రక్షణ, విచక్షణ । భూతభేతాళాది రక్షణ ॥శ్రీ॥

చ॥ కాలకాలభైరవ బ్రహ్మకపాల । శూలధర ఫాలనయనక్షేత్ర
పాల, సద్గుణశీల, భయంకర, జ్వాలాముఖ ।
హాలాహల మూలాశన, కోలాహల ॥

మ॥సా॥ నీలకంఠ సుబాల, గురుగుహలోల ।
లీలాజాల । పాలయ ॥శ్రీ॥

వ్యా॥ సంబోధన. శివతేజోద్భవుడైన వటుకనాథా! దేవ దేవక్రియాశక్తితో కూడినవాడా! శివక్షేత్రమునకు క్షేత్రపాలకుడా! పాలించుము. అని వటుకనాథుని, ఆకార గుణలక్షణములను వర్ణించిరి.

## 332

## కన్నడ విుశ్రివిక

29 వ మేళకర్త. స గా మ ద ని స
స దా ప మ గ మ రి స

ప॥ శ్రీమాతృభూతం త్రిశిర గిరినాథం। హృది చింతయే।
సుగంధి కుంతలాంబా సమేతం ॥శ్రీ॥

అ॥ సోమసఖం, నత శుకసనకన్నళ కామాది విజయ కమనీయాంగం।
సోమం। శిరోధృత సూర్యగంగం। కోమల కరధృత కురంగం।
గురుగుహాంతరంగ లింగం ॥శ్రీ॥

చ॥ వాసవాదిదేవ వందిత చరణం। వైశ్యజాతి స్త్రీవేషధరణం।
వాసుదేవ మహితం, భవతరణం।
వాసనాది రహితాంతఃకరణం। దర
హాస త్రిపురాది హరణం। వాసుకి ప్రముఖాభరణం।
భాసమాన నవావరణం। దాసజన సంతోష కరణం॥

మ॥సా॥ వాసిత నవ జవంతి పుష్పవికాస ప్రియహృదయం, సదయం।
మాసవర్ష పక్షోత్సవ విభవం। సదాశివం, పరమశివం ॥శ్రీ॥

వ్యా॥ ద్వితీయ. తిరుచునాపల్లి "తిరుచ్చి" నగరమందున్న మాతృభూతలింగమూర్తిని, సుగంధి కుంతలాంబా సమేతుని, త్రిశిర గిరికి నాథుని, శుక, సనకాదులచే నమస్కరింప బడువానిని, నళ,

కామాదులను జయించిన శరీరముగల వానిని, గంగను ధరించిన వానిని, వైశ్యజాతి స్త్రీవేష ధరణం = వైశ్యస్త్రీవేషమును ధరించిన వానిని, దీనికి స్థలచరిత్ర యుండియుండును. నవావరణముతో భాసించు వానిని హృదయమునందు చింతించుచున్నాను.

శివనవావరణలు : 1) పంచముఖ, 2)పంచభూత, 3)పంచేంద్రియ 4) సంపుటీకరణ, 5) దశాంగరాద్రీకరణ, 6)షోడశాంగరాంద్రీకరణ, 7) స్థూల, 8) సూక్ష్మ, 9) కారణాది, దేహములపైనగల ప్రాణలింగ దేహమున భాసించువానిని యని, మహాన్యాసమున, ఈవిషయమును గమనించదగును. నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్స రోత్సవ వైభవము గలవానిని చింతించుచున్నాను అని ప్రార్థించిరి. "సనకన్నళ" అను పదమున, "కన్నడ" రాగనామమును స్ఫురింప జేసిరి. "లడయోరభేదః".

రెండు కళల చాపు

ప॥ గా , మాదా । ప ద మపగమరి స । సా,రి నిసనిధని ।
శ్రీ మాతృ భూ- - - తం త్రి- శి - ర- గిరి-

సా, గరి గ గ | గగా మాపా।పసాగామా। దా ద ని సః దప మ।
నా థం హృది | -చిం త యే -సుగం ధి కుంత లాం -బా-

ద ప మ ప గమ రిస ||
స మే - త ం- -- ||

అ॥ , దాదాదా । నిస దనిపామా । మద నిసాసా । నిస దనిపామా |
సో మ స ఖం -- న త - శుక స న క- - -న ళ |

మగామాదప । గమారీసా । సనిస గారిగ । మ మాపామా |
- కామా-ది వి - జయ -కమ నీ -- యాం ం గ ం |

మదాదాదా । ని దనిపామా । మదా నిసా, నీ । సా,సాసా |
- సోమం శి రో- -ధృ త - సూ - - ర్య గం గ ం

దా నిసరిగమ । రి స రి నీ సా । ద ని స రి ని స దనిప ।
కో - మలకర ధృతకురంగం గురు గు - హాం - -త

గమ ద ప గ మ రి స || శ్రీ ||
రం గ - లి ం గ ం

చ॥ , గామాపా । పమాగమరీ । సా , సీ రీ । సీ రిససా ధాధా |
వా స వా - ది దే- వ వం దిత చ ర- - ణ ం

ధ నీ సాగా । గగాగా రిగ । మా,పామా । పపాపాపా |
- నైశ్యజా -తి స్త్రీ -- వే - ష ధ ర ణ ం

పదాదానిస । దదనిపామా । పా,మాపా । మగామామా |
- వాసు దే- -వ- మహి తం భ వ త ర ణ ం

మదానీసా । సనిసదాప మ । పా, మాపా । గగమరి ససస |
- వాసనా -ది- ర హి - తాం - తః కర - ణందర

దా,దనిప మ । పాపమగమా। దాని సారి గ మ। గ మరిసరిసా |
హా స-త్రిపు రాదిహరణం వాసుకి ప్రము- ఖా- -భరణం

సాస ని స దపమ । పా , గమరిస । ధా ని స రి సా ।
భాస మా- -న న వా వరణం దా స జ న సం

మ గ మ ద ప గ మా స |
తో- ష క ర ణ ం సు

మ॥సా॥ గా గ గ మ గ స గా మ పా ప మ । దాదా ద ద
వా సి త న వ జ వం తి పు ష్పవి కా స ప్రియ

ద నిస్ద ప మ పా | మ పమదాద నీ సా రి గమరి ।
హృ ద యం స ద యం | మా-స వ ర్ష ప క్షో త్సవ విభ

సా స దా ప మా మ ద ప మ రి స ॥ శ్రీ ॥
వం స దా శి వం ప ర మ శి వ ం

## 333

## సురటి రాగం ఆది

28 వ మే. జన్యం. స రి మ ప ని స

స ని ద ప మ గ ప మరీ స

ప॥ శ్రీవాంఛనాథం, భజేఽహం । శ్రీమంగళాంబా సమేతం ॥శ్రీ॥

అ॥ శ్రీవాణీశాది పూజితపదం । శ్రీకర కాశ్యాధిక ఫలప్రదం ॥

మ॥సా॥ జీవేశ జగద్భేదాపహం । జీవన్ముక్తిదం ।

చ॥ శీతకిరణ రవిపావక నేత్రం । శ్రీగంధారణ్య క్షేత్రం । వి
భూతి రుద్రాక్షాభరణగాత్రం । భూకైలాస స్థితిపాత్రం । ని
ర్ధూత పాపాసీన భైరవం । ధూర్జటిమాదిత్య వారోత్సవం ।
వీతిహోత్ర మృగధరం, పరశివం ।
విఘ్నేశ్వర గురుగుహ సముద్భవం ॥

మ॥సా॥ భూతపతిం, భవసాగరనావం । భూసురటీకాదీపిత భావం ।
పాతకహరణ నిపుణ మునితీర్థ ప్రభావం ।
ప్రకృతి స్వభావం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తి. "శ్రీవాంఛియం" అను పుణ్య క్షేత్రము భూకైలాసమని ప్రసిద్ధిగాంచినది. శ్రీగంధారణ్యక్షేత్రమున, మంగళాంబా సమేతుని, శ్రీవాంఛనాథుని నేను సేవించుచున్నాను.

బ్రహ్మాదులచే పూజింపబడువానిని, కాశీక్షేత్రముకన్న అధికమైన ఫలమునొసంగువానిని, జీవుడు. ఈశ్వరుడు, జగము వేరు అను భేద భావమును పోగొట్టువానిని, ఆలోచించగా జగము, జీవుడు, ఈశుడు ఒక్కడే. దీపమునుండి వచ్చిన వేరువేరు దీపములు వేరుగానటుల, రూప, గుణ భేదములేగాని వస్తువొక్కటేయను విధమును సూచించు వానిని, దేహముండగనే ముక్తియొసంగువానిని, ప్రతి ఆదివారము ఉత్సవము జరుపుకొనువానిని, భూసురసమూహమును రక్షించు వానిని అనుపదమున 'సురటి' రాగనామమును గూర్చిరి. ఆస్వామి యాకార, అర్చనాదులతో కొనియాడిరి.

## 334

## బిలహరి రాగం ఆది

29 వ మే. జన్యం. స రి గ ప ద స
స ని ద ప మ గ రి స

ప॥ శ్రీసాంబశివం, చింతయామ్యహం ।
గణేశవర గురుగుహాది వందిత ॥

స॥చ॥ భూసురాది పూజిత మృదుచరణం ।
భాగవతప్రముఖాది వందిత ॥

వసుప్రదం, వరదాభయ నిపుణం ।
వాసుదేవ కుబేరాది భరణం ॥

వ్యా॥ ద్వితీయ. సాంబశివుని, గణపతి, కుమారస్వాములచే నమస్కరింపబడువానిని చింతించుచున్నాను. అని విశేషణ పదములతో వర్ణించిరి.

# 335

## శంకరాభరణం ఆది

29 వ మేళకర్త. సంపూర్ణం.

ప॥ సదాశివ ముపాస్మహే । శం, ముదా ।
చిదానందరూపం । సదా । ముదా ॥

అ॥ సదాఘ దత్తాత్రేయ, కపిల, వామదేవ । వ్యాస, శుకాది వందిత
పదాంభోజయుగళం । వరాభయప్రదాన కుశలం ।
భక్తవత్సలం ॥సదా॥

చ॥ చరాచరాత్మక ప్రపంచ గేహం ।
సురాసుర సేవిత వృషభవాహం ।
మురారిప్రభృతి దేవసమూహం ।
పరాశక్తి సమ్మేళన మోహం ॥

మ॥సా॥ పురాణపురుషం, పురాంతకం ।
శంకరాభరణ సమాన దేహం ।
నిరామయం, నిఖిలశోకాపహం ।
పరాత్పరం, పరమ గురుగుహం ॥

వ్యా॥ ద్వితీయ. సదాశివుని, శం, సుఖమునొసగు చిదానంద రూపుని,ఎల్లప్పుడు సంతోషముతో ఉపాసించుచున్నాను. దత్తాత్రేయ కపిల, వామదేవ, వ్యాస, శుకాదులచే నమస్కరింపబడు పాదపద్మములుగల వానిని, శంకరాభరణముతో ప్రకాశించుదేహుని అనేక విశేషణములతో ప్రార్థించిరి.

## రెండు కళల చౌకం

ప॥ స్ని దా పమగ మ ప మ గ రిస । మ గా మ । మమ పా
స-దా - శివ ము - పా- -- స్మ హేశం - ముదా

రి స ద పామ పమ గ రి స ని స రి గ మ । పా , పమ ।
చి - దా - - నం - - ద - రూ- - - పం స -

గ రి స మ పా ద ని ॥ సదా ॥
దా- - ము దా - -

అ॥ పాప మగరి సామగ మపా । ద నిసనిసదని ప । మపదని సా
ని దా- -- ఘద - - త్రా ౹ తే ------ య క - పి- ల

స ని స రి స ని స రి స నీ । ద ద స ని దా । పమగ మప
వా- మ దే - వ వ్యా- - స శుకా - - ది వం ది త -

మపమా గ మ ప ప ద ని । సా ప ని ద । ని స స ని ద ప
ప -దా ం భో - జ యు గ ళం వ రా - - భ య - - -

ద ని సా స రి సని పా । మగగరి స మ। గమ ప దని ॥ సదా ॥
ప్ర- దాన కు శ- లం భ --- క్త వ - త్స - లం

చ॥ స పా మ గ రి స రి మ గ । రీ గరి సధ । నీ సా
చ రా చ రా - త్మ- క - ప్రపం -చ గేహం

స సా మ మ గ ప గ మ రి । గ మ ప గ మ । పా పా
సురా సు ర సే - - వి - త వృ ష భ - వాహం

స సా రీ రీ గ రి సా । ని స రి స రి స నిద । నీ సా
మురా రి ప్రభృ - తి దే - - - వ - స- మూహం

ప సా నిదస్సని పమప । స్సా దప । మ దపాగ మరిస ||
ప రా శ--- క్తిస- మ్మేళన మో-- హం -- ||

మ॥సా॥ స సా స స స సా స సా స సా స ని । స రి స స ని స రి ।
పురా ణ పురుషం పురాంత కం శ ం క రాభ ర ణ భా -

ని స ద ప ద ని సా | స రి మ గ రి రి గ రి
స మా- న దే- హం | ని రామ యం ని ఖ ల

సా ని ద ని సా । ప సా ని పా మ రి ।
శో కా- ప హం ప రా త్పరం ప ర

స మ గ మ ప ద నీ || సదా ||
మ గు రు గు - - హం || ||

# 336

## సింధు రామక్రియ రాగం ఆది

15 వ మే. జన్యం. స గ మ ప ద ని స
స ని ప ద ప మ గ స

ప॥ సదాశివేన, శంకరేణ । సంరక్షితోఽహం ।
హరిబ్రహ్మేంద్రాది పూజితేన ॥

అ॥ సదాచార ప్రవృత్తాత్మకేన ।
సనకాది సంశయ హరణేన । శ్రీ ॥సదా॥

చ॥ హిమాద్రి రాజాత్మజా రమణేన । హిరణ్య కుండలాలంకృతేన ।
హీనజాతి కిరాత పూజితేన । హంసోల్లాసానంద నటనేన ॥

మ॥సా॥ కామితఫలద గురుగుహాత్మజేన ।
కలశోద్భవ మునిబృందనుతేన ॥
సద్యోజాతాది పంచముఖేన ।
సింధురామక్రియారాగనుతేన ॥సదా॥

వ్యా॥ తృతీయా విభక్తి. సదాశివునిచే, శంకరునిచే, పార్వతీ రమణునిచే, కిరాతుడైన, కన్నప్పచే పూజింపబడినవానిచే మొదలైన విశేషణ పదములచే సింధురామక్రియరాగముచే నుతింపబడినవానిచే సంరక్షింపబడితిని అని కీర్తించిరి.

## 337

## పూర్ణ పంచమ రాగం త్రిపుట

15 వ మే. జన్యం. స రి గ మ ప ద స
స ద ప మ గ రి స

ప॥ సాధుజనచిత్తసరసిజోదయం । సకలం బ్రహ్మమయం ॥

అ॥ బోధం, శివసంకల్పవికల్పం । బుద్ధశుద్ధ నిత్య నిర్వికల్పం ॥

చ॥ సకల నిష్కళ రూపమాద్యం । సచ్చిదానంద మనాద్యం ।
సగుణ నిర్గుణ వేద్యమనాద్యం । సంసారరోగ మాద్యమక్లేద్యం॥
ప్రకట మాయావిచిత్ర చోద్యం । ప్రసిద్ధామ్నాయాంత వేద్యం ।
శుక రహస్య ప్రతిపాద్యం । శుభకరం, హరిహరారాధ్యం ।

మ॥సా॥ స్వకల్పిత విద్యాऽవిద్యం । సురుచిర భేదాభేద్యం ।
శుక వామదేవాది, చింత్యం ।
సుఖతరం । గురుగుహముచింత్యం ॥

వ్యా॥ ద్వితీయా విభక్తిలో క్రియాపద రహిత రచన. సాధుజనుల చిత్తసరసిజమున ఉదయించునది సర్వము బ్రహ్మమయమైనది.

